Approved for Public and School Libraries by the
Director of Libraries (Andhra Pradesh)
Dis. No. 4010/54 dated 22-11-54.

---

# యాత్రా మార్గదర్శి

[ దక్షిణభారత – మలబార్, కేరళ,
మైసూరు, కూర్గు ప్రాంతములు ]

## PILGRIM & TOURIST GUIDE

[ REVISED & ENLARGED EDITION ]

రచయిత:

రాగం వెంకటేశ్వర్లు



ప్రకాశకులు:

శ్రీసీతారామ నామసంకీర్తన సంఘము (రిజిష్టర్డు)

శ్రీరామనామక్షేత్రము, గుంటూరు

1957

గ్లేజుకాగితము, అట్టబైండు – వెల : రూ. 4/–లు
పోస్టేజి ప్రత్యేకము



ప్రథమముద్రణము డిశంబరు 1953
ద్వితీయముద్రణము మార్చి 1957



దుర్ముఖిసంవత్సరము
ఫాల్గునము



గుంటూరు
శాన్తిశ్రీ ముద్రాక్షరశాలయందు
ముద్రితము

ఓమ్

# అక్షరకృతి

# సమర్పణము



శిష్టజనోద్ధారకుఁడును, దుష్టజనసంహారకుఁడును, ధర్మసంస్థాపకుఁడును, భక్తజనవరదుఁడును, గరుణాసముద్రుఁడును, జగద్రక్షకుఁడును, ప్రేమమూర్తియునై, సర్వమునకుఁ దల్లియు,దండ్రియునై, సర్వదా సర్వప్రాణియోగక్షేమములను వహించుచు శ్రీరామనామక్షేత్రమున వేంచేసి యున్న శ్రీ కోదండరామ మహాప్రభువువారి సామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవసందర్భమునఁ దత్కోమల మృదులపాదారవిందములయం దీచిన్ని పొత్తమును (19–12–53) సప్రశ్రయప్రణామ సహస్రముతోఁ గానుక పెట్టుచున్నాము.

ఇట్లు,

శ్రీ సీతారామనామసంకీర్తనసంఘసోదరులు.

# SRI RAMA NAMA KSHETRAM

## GUNTUR



శ్రీ కోదండరామప్రభువు

శ్రీ రామనామక్షేత్రము — గుంటూరు

# మనవి

(ప్రథమముద్రణసందర్భము)

భారతదేశమున నడుగడుగున బుణ్యక్షేత్రము లున్నవనియు, నంతర్ముఖు లగుసాధువులు నిరంతర మాయాక్షేత్రముల దర్శించుచు జీవితముల గడుపుచుందు రనియు, విని, ప్రత్యేకదృష్టితో, నట్టిమహనీయులకొఱ కన్వేషించుచు, భాగ్యవశమున నట్టివారిదర్శన మైనప్పుడెల్ల మహానందముతో వారి నాశ్రయించుచు, ఆయాక్షేత్రములమహిమలను వానిరహస్యములను, వానిమార్గములను. దీసికొని వెళ్లఁదగుసామానులను, వానియుపయోగావశ్యకతలను ఇంకెన్నో విషయములను వారి నుండి అడిగి తెలిసికొనుచు నొకపుస్తకమున గుర్తు వ్రాసియుంచుకొనుట నా కలవాటయ్యెను. అట్లే తీర్థయాత్రలు సేవించివచ్చినవారి నడిగి, వారియనుభవములను దెలిసికొని వ్రాసియుంచుకొనుచుండెడివాడను. యాత్రాగ్రంథములను, బలువిధము లగురైల్వేమార్గముల జూపుపటములను బరిశీలించుచుండెడివాడను.

పైరీతిగ నాకు దీర్ఘయాత్రలయం దపరిమితశ్రద్ధాదరములు కలిగెను. ఆయాక్షేత్రములను దర్శింప బయలుదేరి దక్షిణభారతమున గలక్షేత్రములనెల్ల దర్శించి యందలి వివరములను గుర్తించుకొనుచు, ననేకక్షేత్రముల ఫోటోలను స్వయముగ దీసికొనుచు యాత్ర గావించితిని.

మిత్రు లనేకులు తాము తీర్థయాత్ర చేయుతలంపు గలదనియు సక్రమమైనమార్గమును వ్రాసి యిమ్మనియు గోరు

చుండ నట్లే వ్రాసియిచ్చుట జరుగుచుండెను. క్రమముగ నిది నా కసాధ్యమైనపనిగ దోచినది. అందుచే నేను వ్రాసికొనిన తీర్థయాత్రలగూర్చిన వివిధాంశములను విశేషములతో నొక గ్రంథముగ సంతరించి ముద్రించిన నా శ్రమ తగ్గుటయేగాక లోకోపకారముగూడ నగునని తలచి యొక యేకాంతప్రదేశమున వసించి గ్రంథరచనము ముగింపుగావించితిని. ఈ వ్రాతప్రతి ననుసరించి పూజ్యచరణులు, మా జ్యేష్ఠసోదరులు 'సమర్థ' శ్రీ రాగం ఆంజనేయులుగారును, భక్తవతంసులు, శ్రీ వాసిరెడ్డి సూర్యనారాయణగారు మొదలగు మిత్రులును గలిసి, యాత్రలు గావించి, తాము చూచిన విశేషములను, ప్రత్యక్షముగ నా గ్రంథమున జేర్చుచు నా లోటుపాట్లను సవరించిరి. ఏతన్నిమిత్తమున వారి కే నెంతయు గృతజ్ఞుడను. ఈ గ్రంథమునందు నేను చేసినయాత్రలను వర్ణించుటేగాక యాత్రికులకు మార్గమున నెట్టికష్టమును గలుగకుండ సుఖప్రయాణము చేయుటకొఱ కుపకరించు సర్వవిషయములను వ్రాసితిని

పై రీతిగ సంస్కరింపబడిన గ్రంథమునకే 'యాత్రా మార్గదర్శి' యని పేరు. ఇయ్యది మూడు భాగములుగ మాసంఘపక్షమున ప్రకటింపదలచితిమి. 1. 'దక్షిణదేశ యాత్రామార్గదర్శి'; 2. 'ఉత్తరదేశయాత్రామార్గదర్శి'; 3. 'హిమాలయ యాత్రామార్గదర్శి.' అందు ప్రథమమున గుంటూరునుండి మద్రాసుకు దిగువను గలక్షేత్రము లగు రామేశ్వరము, కన్యాకుమారివరకును, మంగుళూరు, ఉడిపి, గోక

ష్ణము, మైసూరు, బెంగుళూరుమీదుగా గుంటకల్, అహో
బిలము, శ్రీశైలము, గుంటూరువరకు స్వప్రదక్షిణముగ వ్రాసి
కొనివచ్చి నిలిపితిని. ఆంధ్ర దేశమున గలమిగిలిన క్షేత్రములు
'హిమాలయయాత్రామార్గదర్శి' నుండి వచ్చునప్పుడు వ్రాయ
బడును.

ఈగ్రంథమును దయారుచేయుటలో రైల్వేవారు ప్రచురించిన గైడ్లును, సంహితలును, క్షేత్రమాహాత్మ్యాదిగ్రంథములును, సహాయపడినవి. ఈగ్రంథము నచ్చువేసిన యాత్రికులకు చాలసహాయకరముగ నుండు ననుతలంపులో సంఘపక్షమున ముద్రణమునకు దలపెట్టగనే మిత్రు లనేకులు ధనసాహాయ్యము గావించిరి. అట్టివదాన్యుల కెల్లరకు మాసంఘపక్షమున కృతజ్ఞతాభివందనముల గావించుచున్నాను. గ్రంథరచనమునకు ముఖ్యముగ భాషయు, భావము ప్రధానములు. ముద్రణమున, నక్షరపరిశోధనాదులు ప్రధానములు. ఏతదుభయమునను నాయసమర్థత బయటబడకుండ నుభయభారమును దామే భరించి గ్రంథమునకు విశిష్టత, శోభ, ఆకర్షకత గలుగునట్లు నా కనేకవిధముల దోడ్పడిన శ్రీచతుర్వేది అమరేశ్వర శాస్త్రులుగారికి బునఃపునః ప్రణామము లాచరించుచున్నాను. ఈగ్రంథమునకు ముఖచిత్రమును, దక్షిణభారత పటములను మహాశ్రద్ధాభిమానములతో జిత్రించిన శ్రీపుప్పాల రాజసింహముగారికిని, శ్రీమట్టిగుంట సత్యనారాయణగారికిని, ఇంగ్లీషునుండి తర్జుమా గావించిన (శ్రీ) చారాల నరసింహమూర్తిగారికిని, గోరినంతనే యనేక దేవాలయములనుండి దేవ

స్థానములయొగ్గిస్ట్రేటిన్ ఆఫీసర్లు ముఖ్యాంశములను శోధించి వ్రాసిపంపినందులకు వారికిని; స్కాందపురాణాదిగ్రంథముల నెల్ల బరిశోధించి క్షేత్రములమహిమల క్రోడీకరించి వివరించిన శ్రీరామశరణ్ శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారికిని నాహృదయపూర్వకధన్యవాదములు.

ఈగ్రంథమును వాత్సల్యముంచి, మిక్కిలి యోపికతో బరిశీలించి గుణదోషముల వివరించి తమయక్షరాభిప్రాయమును బ్రసాదించుడని కోరినంతనే పరమానందమున నన్ను మన్నించి, తమయమూల్యాభిప్రాయముల బ్రసాదించిన 1. మహామహోపాధ్యాయ, అవధానిశిరోమణి, మధ్వ శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు, 2. 'ఆర్షవిద్యాభూషణ' శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం.ఏ, 3. శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు M.A., B.L. 4 శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు నాకు నిరంతరము పరమసంభావ్యులు.

ఇట్టియుపకారక మైనగ్రంథము నాంధ్రలోకము సమాదరించి, త్వరితముగ మిగిలినభాగములనుగూడ ముద్రింపజేయ సహాయపడునుగాక యని ప్రార్థించుచున్నాను. అనుభవజ్ఞులీప్రథమభాగమున సవరణలు సలహాలు సూచించిన కృతజ్ఞతతో స్వీకరించి మరుముద్రణమునందు వాని ననుసరింతును.

శ్రీ సీతారామనామ సంకీర్తనసంఘము, (రిజిష్టర్డు)
గుంటూరు.
1953

ఇట్లు,
విన్నవించు విధేయుడు,
రా గం వెం క టే శ్వ ర్లు,
రచయిత.

# వినతి

(ద్వితీయముద్రణసందర్భము)

ఏతద్గ్రంథావిష్కరణావసర మంతయు బ్రథమముద్రణ సందర్భమున నా రచించిన 'మనవి' వలన నభిజ్ఞు లెఱిగియే యున్నారు. 1953 డిసెంబరులో గుంటూరు శ్రీరామనామ క్షేత్రమున జరిగిన శ్రీ సీతారామ సామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవవైభవమును దర్శింప నాంధ్రదేశము నలుమూలల నుండి విచ్చేసిన యాంధ్రసోదరీసోదరభక్తమణులకు బ్రథమముగ గరావలంబన మొసగి, ఆశీరభినందనమై, తదాది, వారు కావించెడి యెల్ల యాత్రలలో మార్గదర్శియై, యత్యంతము సాయపడుటచే నాబాలగోపాల మాదరపాత్రమై, తన నామమును సార్థకపఱచుకొనినది ఈ 'యాత్రామార్గదర్శి'.- దీనిసాహాయ్యమును బడసినవారు దీని సాటిలేని తోడ్పాటు అడుగడుగున నపేక్షణీయమని తమ బంధుమిత్రాదులకు నుద్బోధించుటచే గాబోలు దూరదూరదేశస్థు లగు నాంధ్రసోదరు లనేకు లీ 'మార్గదర్శి' నపేక్షించుచు వచ్చిరి. అనేక ప్రతిరూపములతో నొకేసమయమున నల్లే యొంటఱికో తోడ్పడుచున్నను, ఈ నడుమ నాల్గుమాసములనుండి కొంత విశ్రాంతి గొనకతప్పినదిగాదు కాని, నిరంతరము భక్తమహాజనచరణసేవయే ముఖ్యవ్రతముగా గంకణము కట్టుకొనిన దగుటచే నిప్పుడు మరల సుపుష్టస్థితిం బడసి, ఎంద ఱపేక్షించినను, ఉపే

క్షించక వీలగుచో మఱునాటికే వారిసముఖమున సాక్షాత్క రింప సిద్ధముగ నడుముగట్టుకొని యెదురుచూచుచున్నది.

అనేకాంధ్రాంగ్ల దిన, వార, పక్ష, మాస పత్రికలు, అనేక ప్రముఖవ్యక్తులు, ఆల్ ఇండియా రేడియోవారు, విద్యాధికారులు, డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీస్ (ఆంధ్ర), మంత్రులు, గవర్నర్లవంటి యున్నతాధికారులు — మున్నగువారిచే 'ఇట్టి గ్రంథము ఆంధ్రములో నేటివఱకు బ్రచురింపబడలే' దనియు, 'ఇది బహుజనోపకారకమైన' దనియు, వేనోళ్ళ బ్రశంసింపబడుటచే (శ్రీ) కోదండరామ పదాంకితముగ నాకావించిన ఈసాధు కైంకర్యకృషి సఫలమైనదని యానందించుచున్నాను. మూడు సంవత్సరములైన ముగియకమునుపే దీని కింతటి వ్యాప్తి ప్రశస్తి కలుగుట యెంతయు భాగ్యము. అందుననే ప్రకాశక సోదరులు గ్రంథపుటసంఖ్య పెరిగినను దీని నీసారి మంచి గ్లేజుకాగితముపై ముద్రింపించి మఱింత యాకర్షకముగ బ్రకటించుటచే వారి నెంతయు నభినందించుచున్నాను.

తొలుతటి నా 'మనవి'లో నే నభ్యర్థించినట్లు అనుభవజ్ఞులగు మహనీయు లనేకు లిందు గావింపదగు కొన్ని సవరణలను, సలహాలను, క్షేత్రనదీమాహాత్మ్యవిశేషములను మహాదయతో నా కెఱిగించుటచే వారి కెంతయు గృతజ్ఞుడను. గ్రంథవిస్తరభీతిచే వానినెల్ల సాంతముగ గాకున్నను గొంత కొంత ముఖ్యాంశముల వఱకైన నిందు బొందుపఱచితిని.

మొదట నీగ్రంథమును మూడుభాగములుగ ముద్రింపదలచి నట్లు నా మనవిలో సూచించినను, విశేషానుభవజ్ఞుల యాదేశ మును శిరసావహించి, రెండుభాగములుగనే సమకూర్చితిని. "ఉత్తరభారత-హిమాచలప్రాంతములు" అను పేర యాత్రా మార్గదర్శి ద్వితీయభాగమునుగూడ బహు మనోహరముగ ముద్రింపించి, నా మిత్రులు, ప్రకాశకసోదరులు 1955 డిశం బరులో జరిగిన 23వ శ్రీరామకోటి మహోత్సవసందర్భమున బదివేల మహాభక్తజనసభారంగమున ప్రకటించి, నా సేవకు మఱికొంత సార్థకత గూర్చి, నన్ను ధన్యుని గావించిరి. ఏత ద్భాగద్వయరూప యాత్రామార్గదర్శి మూలమున నాకావించు కైంకర్యమును నిర్వ్యాజకరుణతో స్వీకరించి, శ్రీకోదండరామ ప్రభువు మమ్మెల్లర సర్వదా కటాక్షించుగాకయని పదింబదిగ సాష్టాంగప్రణామసహస్రము లాచరించుచున్నాను.

శ్రీరామనామక్షేత్రము,
గుంటూరు.
25-2-1957

ఇట్లు
విన్నవించు విధేయుడు,
రాగం వెంకటేశ్వర్లు



# ప్రకాశకుల ప్రస్తావము

"హరే రామ హరే రామ । రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ । కృష్ణ కృష్ణ హరే హరే
ఇతి షోడశకం నామ్నాం । కలికల్మష నాశనమ్"—

"శ్రీరామ జయ రామ । జయ జయ రామ"—

"శ్రీరామ రామ రామేతి । రమే రామే మనోరమే
సహస్రనామత స్తుల్యం । రామ నామ వరాననే !
నాతః పరతరోపాయ । స్సర్వవేదేషు దృశ్యతే"—

"ధ్యాయన్ కృతే, యజన్ యజ్ఞై । స్త్రేతాయాం, ద్వాపరేఽర్చయన్,
య దాప్నోతి తదా ప్నోతి । కలౌ సంకీర్త్య కేశవమ్"
"...భక్త్యా త్వనన్యయా లభ్య ॥ అహ మేవంవిధోఽర్జున!_"

ఇత్యాది బహుశ్రుతిస్మృతిపురాణసంహితా ప్రసూక్తుల రహస్య మెఱిఁగి, సద్గురుచరణోపదేశానుసారము భగవన్నామ సంకీర్తనమే తప్ప నీకరాళకలికాలమున సార్వజనీనసులభతరణోపాయము వేఱొండు లేదని దృఢముగ నిర్ణయించుకొని మిత్రులము కొందఱము 1926సం॥న నొకసంఘముగ నేర్పడి, నిత్యము సాయంసమయములను విశ్రాంతిసమయములను భగవన్నామ సంకీర్తనము గావింప మొదలిడితిమి. ఇట్లు కొలదిసంవత్సరములు గడుచునంతలో నింక ననేకమిత్రులును దోడగుట మా సంఘము మఱింత బలిష్ఠ మయ్యెను నియమబద్ధముగ నొక నిర్ణీతకార్యక్రమమును నడుపుచుండుమహోద్దేశముతో 1944

సం॥న మా సంఘము రిజిష్టరు చేయబడెను. అస్మత్సాంఘికు లెల్లరు నిత్యము భగవన్నామసంకీర్తనాదులు గావించుచుండుట యట్లుండ ఆబాలగోపాలము స్వనగరమున నేగాక పల్లీగ్రామ పత్తనములందా సేతుశీతాచలము భారతదేశమందెల్లెడల భగవ న్నామప్రబోధ ప్రచారముల గావించి సర్వత్ర భగవన్నామము మారుమ్రోగునట్లు చేయవలెనని యాసించితిమి ఏతదర్థసిద్ధికై యెన్నెన్నియో సులభోపాయముల నన్వేషించుచుంటిమి. పెద్ద పెద్దలసన్నిధి జేరి వారిని సేవించి వారిసలహాలను జేకొంటిమి. క్రమముగ మాసంఘకల్పమునకు సాధనశాఖ, ప్రచారశాఖ, పరిచరణశాఖ మున్నగు బహుశాఖ లుదయించి, విస్తరింప దొడగెను. సమస్తజగత్కల్యాణసిద్ధికొఱకును, సుస్థిరప్రశాంతి ప్రాప్తికొఱకును బహుగ్రామపత్తనములందు సంకీర్తనసంఘ ముల నెలకొల్పితిమి. అందందు గల సోదరభక్తసంఘముల బ్రోత్సహించి వారితో మాసోదరభావమును విస్తారపఱచు చుంటిమి.

జనసామాన్యచిత్తములందు భగవద్భక్తిని దృఢము గను, శాశ్వతముగను బెంపొందించుకొఱకు దొలుదొల్త 'భగవన్నామసంకీర్తన' మను చిన్నిపొత్తమును దొట్టి, శ్రీరామ పూజ, భక్తజీవన, చైతన్యచరితావళీ భాగవతకథాదులవఱకు నిప్పటి కెన్నియో యుద్గ్రంథములుగూడ బ్రకటింపగలిగితిమి. ఏత న్మాలమునను, 'మోక్షసాధని' అనెడి మాసపత్రికామూలము నను భక్తిపరిచారమును సాగించుచుంటిమి.

భగవద్భక్తులు, మహాత్ములు నివసించి పవిత్రీకరించిన దివ్య దేశములును, భగవత్సాన్నిధ్యము విశేషముగ నెలయు పావనభూములును స్వతస్సిద్ధముగ భక్తి నుద్భావింపజేయు నను రహస్యమును గుర్తించియే యుగాంతరములనుండియు మహర్షికల్పు లగుపుణ్యాత్ము లనేకులు మహీమహీధరారణ్యా నదీనదద్వీపాదులయందు మహాకర్షకము లగు దేవాలయ చైత్య విహారాదుల నిర్మించుచు వచ్చిరి. యావద్భారతమున నట్టి వసంఖ్యాకములుగ నున్నవి. మహానదీనదములు, సరోవరా దులు సహజపావనము లగుట నట్టిపట్లు నవి విశేషముగ గాన్పించును. ఉత్తరభారతమునకంటె దక్షిణభారతమునను, దక్షిణభారతమునకంటె నుత్తరభారతమునను ఈ రెంటియందు కంటె హిమాచలసానుగుహాశిఖరాగ్రములను మతియు హెచ్చుగ జూపట్టును. ఆయాతీర్థక్షేత్రమాహాత్మ్యముల వివ రించుపుస్తకము లెన్నో యున్నవిగాని, వానిని సందర్శించుటకు సూటియగు దగ్గరమార్గము లెవ్వియో, అవి యేయేదిక్కుల నెం తెంతదూరమున నున్నవో, వ్యయప్రయాసము లెంతెంత భరింపదగియుండునో, అయ్యాయి స్థలముల వసతు లెట్లుండునో తెలియజేయు సమగ్రగ్రంథ మొక్కటియు గానరాదు. ఈ లోటును గుర్తించి, మా సంఘసోదరులు స్వాభీష్టసిద్ధి కుపష్టంభ కముగా నుండ నొకగ్రంథమును సిద్ధపఱచి ప్రకటింప సంక ల్పించిరి. కాని యీపనికి బూనుకొని సమర్థతతో నిర్విఘ్న పరిసమాప్తి నొందింపజేయుదక్షు డెవరు? కథావస్తుసంగ్ర హణమాత్రమున కావ్యరచన గావింప నగునేమో కాని,

యీ రచన యట్టిది గాదు. ఇట్టి సుకృతికి బూనుకొనదలచు సుకృతి ధీరతతో నడుముగట్టి యెండ యనక, వాన యనక, రాత్రియనక పగలనక, కష్టమనక, నిష్ఠురమనక యారోగ్యమును గాపాడుకొనుచు, రైళ్లు, బస్సులు, బండ్లు, రిక్షాలు మున్నగువానిలోనో కాలినడకనో భారతదేశము నలువంకల గలపుణ్యక్షేత్రముల నెల్ల మెట్టి, ఉచితసమయముల దర్శించి, అచటి విశేషముల నెల్ల దత్తత్స్థలజ్ఞులవలన దెలిసికొని, విసుగక వ్రాసికొని పాఠకులకాకర్షకముగ నుండునట్లు రచనము సాగింపవలసి యుండునుగదా! ఇంతటి శ్రమదాయకము, అసాధ్యము నగు నిప్పని మనలో నేయొక్కరము నిర్వహింప జాలమని నిర్వేదపడి మిన్నకుంటిమి.

కాలము కొంత యట్లే గతించెను. ఇంతలో భగవత్ప్రేరితుడై మాసంఘస్థాపకసభ్యులలో నొకరును, మామందిర మూలస్తంభము, కార్యదర్శియు నగు సమర్థ శ్రీ రాగం ఆంజనేయులుగారి యనుజన్ముడు నగు శ్రీ వెంకటేశ్వర్లుగారు మా కెఱుగరాకుండగనే తాము యాత్రాప్రత్యేకదృష్టితో దక్షిణభారత తీర్థక్షేత్రముల నెల్ల సేవించి, యందలి విశేషముల నెల్ల దేటతెల్లముగ సంగ్రహించి, సుఖముగ దిరిగివచ్చి, దానిని మాకు వినిపించి, నామమాత్రావశిష్టముగ జిక్కిపోయిన మామనోరథాంకురము నుజ్జీవింపజేసిరి. అంత మేము నూతనోత్సాహముతో సమాలోచించి సంఘపక్షమున దానిని బ్రకటించుట కనుమతింపగోరగా వారును బ్రీతితో సమ్మతించిరి. దాని నంత 1953 డిసెంబరులో శ్రీరామసామ్రాజ్య

పట్టాభిషేకమహోత్సవ సందర్భమున 'దక్షిణయాత్రామార్గ దర్శి' యనుపేర బ్రథమభాగముగ ముద్రించి శ్రీ కోదండ రామాంకితము గావించి, ప్రకటించితిమి.

ఇంతటితో మామనోరథము పూర్తి కాకపోగా వృద్ధి యయ్యెను. ఉత్తరభారతక్షేత్రములను, హిమాచలక్షేత్రములను వివరించుగ్రంథములనుగూడ శ్రీ వెంకటేశ్వర్లుగారిచేతనే సిద్ధపఱపింప దలచి, వారిని బ్రోత్సహించితిమి. వారును శిథిలారోగ్యులయ్యు నీగొప్పపని నెట్లయిన బూర్తిగావించి తమ నిష్కామసేవకు బుష్కలత గూర్పదలచిరి. కాని స్వయముగ నయ్యయి తీర్థక్షేత్రముల దర్శించి విశేషానుభవమును గడింపనిది యిట్టి బాధ్యత గలరచనకు గడగుట యనుచిత మగుటచే మా సంఘసోదరులు గడచిన మేనెలలో వారికి వలయు సాహాయ్యసంపత్తిని సమకూర్చిరి. అంత వారును వెంటనే పయనించి నాలుగైదుమాసములు బహుశ్రమల కోర్చి, మాఱుమూలల దూరదూరముల నుండు నానాపుణ్యస్థలముల దర్శించి, మే మాసించినదానికంటె పెక్కురెట్లు హెచ్చుగ నెన్నియో విశేషముల సంగ్రహించుకొని, శ్రీ కోదండ రామానుగ్రహమున సుఖముగ దిరిగివచ్చి, తాము సమకూర్చిన గ్రంథమునంతయు మాచేతులలో బెట్టిరి. ప్రథమ భాగముద్రణావసరమునవలెనే, యీ ద్వితీయభాగ (ఉత్తర భారత – హిమాచలప్రాంతము) ముద్రణావసరమునగూడ అస్మత్పరమాప్తులగు బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రి గారు దయతో సముచితముద్రణభారమంతయు వహించి

ముద్రింపించి సర్వాంగసుందరముగ వెలయింపజేసి, 1953 డిసెంబరు నెలలో జరిగిన శ్రీ సీతారామసామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవసందర్భమున దానిని శ్రీ కోదండరామాంకితము గావించుభాగ్యమును గలిగింపజేయుటచే శ్రీశాస్త్రిగారికిని, ఇట్టి యపూర్వామూల్యగ్రంథమును స్వార్థాపేక్షారహితముగను, భక్తిశ్రద్ధాపురస్సరముగను, ఆంతరంగిక కైంకర్యప్రధానము గను, సర్వస్వామ్యపరిత్యాగపూర్వకముగను మా సంఘము నకు గట్టిపెట్టినందులకు రచయిత, శ్రీ రాగం వెంకటేశ్వర్లు గారికిని మాకృతజ్ఞతాభివందనములు.

భక్తయాత్రికుల కత్యంతసాహాయ్యకరముగ నుండునను తలంపుతో సంఘపక్షమున నీగ్రంథముద్రణమునకు దలపెట్టితి మని సూచించినంతనే మిత్రు లనేకులు ధనసాహాయ్యము గావించిరి. అట్టివదాన్యుల కెల్లరకు మా సంఘపక్షమున గృతజ్ఞతాభివందనముల గావించుచున్నాము.

యాత్రికులకు, వినోదప్రయాణోత్సాహులకు, వ్యాపార పరులకు నత్యంతోపకారమై, పిన్నపెద్దలచేతను, బత్రికాధి పతులచేతను, బ్రభుత్వప్రధానోద్యోగులచేతను బహుముఖ ముల గొనియాడబడి యావదాంధ్రసోదరుల మన్ననలకు నిదాన మగుటచే నచిరముననే యీ ప్రథమభాగము ద్వితీయముద్ర ణము గావించుభాగ్యము ఘటించినది. గ్రంథకర్త యిం దం దందు బెక్కు విశేషాంశములను, నూతనచిత్రపటములను జేర్పించుటచే గ్రంథపుటసంఖ్య మఱికొంత హెచ్చగుటకు

దోడు, ధరలు హెచ్చిపోయినను మంచి గ్లేజుకాగితమునే యుపయోగించి సర్వాంగసుందరముగను, సర్వాదరణీయము గను వెలయింపజేయదలచుటచే దీనివెల నొకింత పెంచక తప్పనందులకు విచారపడుచున్నాము. కాని, యభిజ్ఞులీయం శము నంతగ బాటింపరనియే మానమ్మకము.

పరసాహాయ్యాపేక్ష లేకుండ భారతదేశమున దశదిశల నెసగుసమస్తతీర్థయాత్రలు గావింప నత్యంతోపకారక మగు ఈ భాగధ్వాయమును, ఆంధ్రదేశీయ సోదరీసోదరమహోదయు మణు లెల్లరు మిక్కిలి యాదరించి, యింటింట, నొకటి యుండునట్లు వెంటనే స్వీకరించి, తాము కావించుయాత్ర లలో మాసేవను స్మరించుచు, మమ్ము మఱింత ప్రోత్సహింప వలెనని యెంతయు విన్నవించుచున్నాము.

శ్రీరామనామక్షేత్రము,
గుంటూరు.
25-2-1957

విధేయులు,
శ్రీ సీతారామనామసంకీర్తనసంఘసోదరులు

# యాత్రాభిజ్ఞ పండితాభిప్రాయములు

౧

శ్రీ "యాత్రామార్గదర్శి" అను నీయమూల్యగ్రంథమును సావధానముగ నామూలాగ్రముగఁ జూచితిని. ఇది ప్రతిపత్రరసోదయముగ నున్నది. ఇంతవఱకును ఇంతమహోపకారకమగు గ్రంథమును (తీర్థయాత్రలనుగుఱించి) కని విని యెఱుఁగను ఇది గుంటూరు శ్రీ సీతారామనామసంకీర్తన సంఘము వారిప్రకటనలలో సత్యుత్తమము. యాత్రికులకుమాత్రమే గాక ప్రతి ఆంధ్రభారతీయ కుటుంబమునకును ఐహికాముష్మికానందదాయక మయి, చదువఁజదువ మనశ్శ్రోత్రనేత్రములను సుఖమయముల నొనర్చి, మహాపుణ్య విజ్ఞానప్రదాయకమయి సర్వక్లేశముల నీగ్రంథము పరిహరింపఁగలదు. ప్రస్తుత విద్యావిధానములోని నిష్ఫలములయిన భూగోళ, దేశచరిత్రలకన్న నీ'యాత్రామార్గదర్శిని' ప్రతిభారతీయవిద్యార్థియుఁ జదువుకొనినయెడల అమూల్యజ్ఞానవిజ్ఞానముల నార్జింపఁగలఁడని నావిశ్వాసము. కావునఁ బ్రతిపాఠశాలయందును ఈగ్రంథము, పాఠ్యగ్రంథములలో విధింపఁబడిన సత్యుత్తమము. ఈ గ్రంథమును జేఁబూని పుణ్యదేశాటనమునకు బయలుదేరిన ప్రతిఆంధ్రభారతీయుఁడును, ఈగ్రంథమున వ్రాయఁబడినసర్వపుణ్యక్షేత్ర,తీర్థములలోనిసర్వవిషయములను తు–చ, తప్పకుండ స్వయముగనె తెలిసికొని, మహానంద పుణ్యముల

నార్జించికొనఁగలఁడు. మఱియు. నాయాస్థానికభాషను దెలిసికొని, అచ్చటి తనయవసర మగుసర్వకార్యములను నెఱవేర్చికొనఁగలఁడు. మహానవ్రితము గలవారుగూడఁ దమవ్రతమునకు భంగము లేకుండఁ దీర్థయాత్రలను అనాయాసముగఁ జేసికొని, పుణ్య, ఆనందభారములతో నిలు చేరవచ్చును. ఆయాక్షేత్రములందుఁ జేయవలసినతీర్థవిధులు, తర్పణములు, క్షేత్రవాసులు పండాలు మున్నగువారి చర్యలు, రైయినులు, బస్సులు, ప్రయాణపుఖర్చులు మొదలగు నశేషవిశేషములును ఈ గ్రంథమువలన సులభముగఁ దెలిసికొని, అశేషాంధ్రభారతీయులును, దీర్థయాత్రాఫలమును బూర్తిగ సంపాదించుకొందురుగాక! మఱియు, పుణ్యక్షేత్రములం గల, దేవాలయములయు, నదీనదములయు, ఇతర విచిత్రవిశేషదృశ్యములయు ఛాయాపటములుగూడ నీగ్రంథమం దుండుటచే స్వల్పభేదముతో సర్వవిషయములను గనులారఁ గన్గొనిన ఆనందము గూడ యాత్ర చేయలేనివారలకును గలుగును. కాన యాత్ర చేయ నవకాశము లేని యేయాంధ్రుఁడయినను, నిత్యము నీ గ్రంథమును జదువుకొనుచు, దీర్థయాత్రాఫలమును సంపాదించికొని ఇహపరసుఖముల నందుఁగాక.

గుంటూరు,
16_11_53

ఇట్లు,
కాశీ కృష్ణాచార్య

దృశ్యప్రపంచముకంటె అదృశ్యప్రపంచము పలురెట్లు పెద్దది. బాణముకొన మోపదగినంతతక్కువస్థలములో లెక్క లేనన్ని భూతము లుండునని వేదములలో చెప్పబడినది. మానవునిమనస్సుపైని మంచిగనో చెడ్డగనో ప్రభావమును గన్పఱుపగల్గినశక్తు లదృశ్యములై జగత్తున వ్యాపించియున్నవి. సత్త్వగుణమూర్తి యైనమహానుభావునిచెంత సాత్త్వికతరంగములు వ్యాపించి సామాన్యమానవులలోగూడ శాంత్యానందాద్యనుభవములను గల్గజేయుచుండును. ఇట్టి యాధ్యాత్మిక వాతావరణ మేర్పడుటకు కారణము లెన్నియో కలవు. అదృశ్యరూపములో నున్నఋషులయొక్కయు, దేవతలయొక్కయు ప్రభావమువలనగాని, పురాతనసంఘటనలప్రభావమువలనగాని, వాతావరణ విశేషములవలనగాని యిది యేర్పడవచ్చును. ఇటీవల హిమాలయపర్వతసంచారము చేసి తమయనుభవములను గ్రంథస్థముచేసిన శ్రీప్రణవానంద స్వాములవారు, కలకత్తా విశ్వవిద్యాలయముచే ప్రచురింపబడిన తమగ్రంథమునందు హిమాలయములలో కొన్నిచోట్లకు వెళ్లినప్పటికి మనస్సు బాహ్యప్రసారమును విడిచి యంతర్ముఖ మగుటకు సహజముగనే శక్తిమంత మగునని వ్రాసియున్నారు. "పుణ్యక్షేత్రములలో నేమున్నది? అంతయు మనమనస్సులోనే యున్నది" అనునాస్తికులును, మెట్టవేదాంతులును ఇట్టి యంశములను గుర్తింపదగును. ఎందరో సాధ

కులు ఆయా క్షేత్రములలో సాధనములను చేసి త్వరలో సిద్ధిని పొందుటయు మనము చూచుచున్నాము.

పుణ్యక్షేత్రసంసేవనప్రభావము హిందూమతగ్రంథము లలో మిక్కిలి నొక్కి చెప్పబడినయంశములలో నొకటి. తీర్థస్నానమహిమ వేదములలోనే పలుతావుల పేర్కొనబడినది. నదులు సుదీర్ఘములుగా నున్నను అందు తీర్థప్రదేశములలో స్నానముచేయుటలో పుణ్యవిశేష మున్నదని తైత్తిరీయసంహిత చెప్పుచున్నది. ఇతరప్రదేశములకంటె తీర్థ మేరీతిగా మిన్నయై యున్నదో యట్లే, తీర్థములో స్నానముచేయువాడు సాటిమానవులలో గొప్పవా డగునని యందు చెప్పబడినది. "యో తీర్థే స్నాతి స తీర్థమేవ సమానానాం భవతి."

ఇట్లుండ హిందూమతమునుగూర్చి పరిణామసిద్ధాంత ముల నల్లువారు తీర్థయాత్రాపద్ధతి మొన్న మొన్న వచ్చిన దనుట తద్‌జ్ఞులకు హాస్యాస్పదముగా గనుపట్టును. సనాతన మైన యీతీర్థసేవాపద్ధతి నైతిహాసికప్రథితపురుషు లెల్లరు సేవించిరి. శ్రీరామచంద్రుడు తీర్థములను సేవించెను; అర్జునుడు సేవించెను; పురాణవాఙ్మయ మంతయు తీర్థమహిమలను వేనోళ్ళ చాటుచున్నది.

మంత్రప్రయోగవిధానముచే దేవతా సాన్నిధ్యము గల్పింపబడిన దేవాలయములు పుణ్యక్షేత్రములలో ముఖ్యకేంద్రములై యున్నవి. ఈ విధానము వేదములలో సార్వత్రికముగ గోచరించుచున్నది. ఆంజనేయుడు సీతను వెదకుటలో "దేవతాయతనేషు చ" దేవాలయములనుగూడ గాలించి

నాడని రామాయణములో చెప్పబడినది. రుక్మిణీదేవి వివాహ మునకు ముందు ఊరిబయట నున్న దేవాలయములో పూజ చేయుటకు వెడలెనని భాగవతములో నున్నది ఇట్లు దేవా లయవిధానముకూడ సనాతనమై యలరారుచున్నది.

లౌకికదృష్టితో చూచినను కాశీరామేశ్వరాదిపుణ్య క్షేత్రయాత్ర ప్రముఖస్థానము నాక్రమించుచున్నది. ప్రాంత భాషాప్రయుక్తభేదములను విస్మరించి యేకదేశీయులమని భారతీయులెల్లరు భావించుటకు గావలసినజాతీయదృష్టి దీని వలన నేర్పడినంతగా మరిదేనివలనను ఏర్పడలేదు. విశాల దృష్టి, బహువిషయపరిజ్ఞానము మున్నగునవాంతరఫలములు తీర్థయాత్రల కున్నను ముఖ్యఫలము ధార్మికము, ఆధ్యాత్మి కము అని మఱవరాదు. జన్మయెత్తినతర్వాత చేయవలసిన ముఖ్యకృత్యములలో అఖిలభారతీయతీర్థయాత్ర యొకటి,యని మనవారు మొదటినుండియు భావించుచున్నారు.

ఇట్టి అత్యుత్తమవిషయమును తీసికొని భక్తశిఖామణులు శ్రీరాగం వేంకటేశ్వర్లుగారు సుబోధముగాను, సకలజనచేతో మోదకరముగాను ఈగ్రంథమును రచించి పుణ్యతీర్థజిగమి షువులకు మార్గప్రదర్శనమును గావించి, తటస్థులకు తీర్థజిగ మిషను గల్గించుచున్నారు. ప్రయాణములలో కావలసిన లౌకిక జ్ఞానము మొదలు ఆయాతీర్థముల పౌరాణికప్రాశస్త్యమువరకు సమస్తవిషయములను వీరీగ్రంథమున నెల్లడించి "తీర్థ యాత్రాకల్పతరువు" అని పేరిడదగిన యీ యుత్తమగ్రంథ మునకు, వినయశీలురగుటచే "యాత్రామార్గదర్శి" అను

నిరాడంబరమైన పేరు నిడిరని గ్రహింపవలయును. యాత్రలకు వెళ్ళనివారుకూడ నింటియొద్ద కూర్చుండి యీ గ్రంథమును పఠించుచో యాత్రాఫలములో నొకయంశమును పొందగల రని నేను హృదయపూర్వకముగ విశ్వసించుచున్నాను. రచనా పద్ధతికూడ ఎట్టివారికిని చవులూరున ట్లున్నది.

కల్లకపటములు లేక ఆబాల్యము పరమేశ్వరచరణా రవిందసేవాసంసక్తచిత్తులై సంస్కృతాంతఃకరణులై నందు వనే శ్రీ వెంకటేశ్వరులుగారి కిట్టిపవిత్రరచనయందు బుద్ధి ప్రస రించుటయు, ఆరచన అనర్గళముగా ఆకర్షకముగా సాగుటయు సంభవించినవి. ఈ గ్రంథము వారిని మరింతపవిత్రులను గావించిన దనుటలో సందియము లేదు. వారిదివరకు అనేక పర్యాయములు తీర్థయాత్రాసంసేవనఫలము పొందిరి. ఇపుడు ఇతరులచే నట్టియాత్రలను చేయించుఫలమునుగూడ పొందు చున్నారు. ఇదివరకైనను రాగం సోదరులును, తన్మిత్రులును శ్రీరామనామక్షేత్రమునను, గుంటూరు మండలమునను, ఆంధ్రావనిని, అఖిలభారతభూమియందును క్రమముగా భక్తి బీజములను నాటి,దోహదము చేసి, ఆక్షేత్రములను ఆధ్యాత్మిక సస్యసంపన్నములనుగా, భక్తిఫలభరితములనుగా, ధర్మపరి మళవాసితములనుగా చేయుట కపారకృషి చేసి జన్మను సార్థక మొనరించుకొనుచున్నారు.

ఆంధ్రదేశమం దంతటను సువిశ్రుతమై ఆంధ్రదేశమం దలి ఆధునికాధ్యాత్మికసంస్థలకు తలమానికమైన శ్రీరామ నామక్షేత్రము, శ్రీసీతారామనామసంకీర్తన సంఘము, రామ

కోటి ఉత్సవములు, రామనామపరిచార (మోటారు) శకటము — ఇవి యీవిశుద్ధచేతస్కుల సృష్టివిశేషములై వీరి నిష్కళంకభగవద్భక్తికిని, అకుంఠితకార్యదీక్షకును, అసాధారణకర్మకౌశలమునకును శాశ్వతచిహ్నములుగా నేర్పడి నేటి కలికలుషితమానసిక వాతావరణము నైంద్రజాలికశక్తితో సంస్కరించుచు బహుముఖ పరిచార్యమాణనాస్తికభావాంధతమసములో నాశాజ్యోతులై, యాస్తికుల కెల్లరకు శిరోధార్యములై, సంసేవనీయములై యలరారుచున్న వనుటలో సంశయలేశము లేదు. అట్టి దివ్యసన్నివేశమునుండి వెలువడుచున్న సకలాస్తికోపకారకమైన యీ గ్రంథమును, తత్కర్తను పాఠకులకు పరిచయముచేయుభాగ్యము నాకు గల్గినదని యానందించుచున్నాను.

విజయవాడ,
17-11-53.

ఇట్లు,
జటావల్లభుల పురుషోత్తము.



స్థూలవస్తువులపై కన్నుంచి, తాత్వికుడు సూక్ష్మభావములను గ్రహించును. అంతరంగమున సూక్ష్మభావములను సమీక్షించి, కవి వానికి రూపుచూపు లొసగును. తాత్వికుడును కవియు నైనవ్యక్తి పైచూపులో జూపులపొందునందు కావ్యసృష్టిని కాంచును. ఇతడు అర్ధనారీశుని బోలువాడు.

పరిశీలనమునకు ధ్యానము తోడైనపుడు, తాత్వికునకు కవి జోడైనపుడు ప్రాణప్రదీప్తమైనసాహిత్యము జనించును తాత్వికుడు కానికవి అంతర్దృష్టి నెఱుగనిసామాన్యుడు కాని సాధకుడు కాడు. ఆదర్శకవి ఇత డనుట కల్ల. కవిత్వమహత్త్వము నెఱుగనితాత్వికుడు పాఠకలోకమున రసార్ణవమును సృజింపనేరడు. కడలియెడదను పండువెన్నెల స్పృశించునపుడు. దశదిశలందు పులకలు పుట్టించుసాగరసంగీతము జనించునట్లు పూర్వోక్తశక్తులు రెండును ఒకేపరిష్వంగమున కలిసినపుడు ఉదాత్తజగత్తు ఉద్భవించును. పూతకవితను కను ఆలుమగలు మననభావనములు. ఈ జంటశక్తులను నిజహృదయకల్యాణ మంటపమున జేర్చుమహనీయుడు స్థూలసూక్ష్మప్రపంచముల నేలుపాలకుడై యుండును. ఇతడు సమాధిస్థుడైనసంయమీంద్రుడు ; మునీంద్రుడైనకవీంద్రుడు. 'నానృషిః కురుతే కావ్య' మనుసూక్తినుండి మనము గ్రహించు పాఠ మిదియే! సమాధిస్థుడైనసంయమియే మహోకముహూర్తమున నటరాజై నృత్య మొనరించును.

వసుంధరలోనివివిధదృశ్యములందు సృష్టికర్తరచనమును పరిశీలించి, కళోపాసకులును, సాధకులును రసభరితస్వాంతు లగుచుందురు. ఈపరిశీలనకై వారు స్థానస్థానములందు పరిభ్రమణ మొనరింతురు. జ్ఞానపిపాసువులై విజ్ఞానయాత్రికులై, ప్రపంచపథికులై, ముక్తిదూతలై లోకోపకార మొనరించి వారు తరింతురు.

సహస్రాబ్దులనుండి బహుసీమలనుండి యాత్రికుల నాకర్షించినపుణ్యభూమి భారతభూమి.

భారతావని కేవల మొకదేశము కాదు. ఖండమే యైనను, సంపూర్ణవసుంధరావలయసంక్షేపవివరణ మది యని తెలుప జెల్లును సర్వసీమల శీతోష్ణస్థితులు, నైసర్గికపరిస్థితులు, గగనచుంబికుధరములు, సుదీర్ఘస్రవంతులు, విశాల కాసారములు, సాంద్రకాంతారములు ఇందు గలవు. రసపుత్రసీమ ఎడారియేయైనను, అందలి యిసుకరేణువులు బహుళ భాస్వదాశయసందీపితవాలుకాస్తూపములు, కాకురూపము నుండి కైబరువరకును, కన్యాకుమారినుండి కాశ్మీరమువరకును చరించు జిజ్ఞాసువుమానసదిశావలయము విశాలమగును.

పలుమారులు భారతప్రదక్షిణ మొనరించుచు, విద్యాభ్యాసము చేయుభాగ్యమును భగవంతుడు నాకుప్రసాదించెను.

మూడుమహాసముద్రములు ఐక్యకంఠమున అనంత, ఆనంద గీతిక నాలపించుచు, కన్యాకుమారిని ప్రస్తుతించుచు, భారతాంబకు, పాదప్రక్షాళన మొనరించుచుండును. వత్సరమున నొకవేళ నిండు నిండుచందమరుదును, బాలభాస్కరుదును

రెండుతీఱుల జ్యోతిర్మయములైన తిలకములై భారతాంబ భాగ్యమున కచ్చెరువొందు గగనసీమంతినీఫాలతలమున పరిఢ విల్లుచుండును. జ్యోత్స్నాలోకితమైన భారతజనయిత్రి తోడ్తో డనే కనకవసనసుందరియై కడలికెరటాలపై నుయ్యాలలూగు నవుడు చూచుకళోపాసకుని హృదయమున ఆనందరత్నా కరము ఉత్తాలతరంగసంకులమై ఉప్పొంగదా? రామేశ్వరము దెస నుఱుకులెత్తు పయోరాశివీచికలు భువిపై వెలసిన పరమ శివుని సేవింప నువ్విళ్లూరుభక్తగణములట్లు తోపవా? వనచర సహితుడై వార్ధిలో వారధి నెపుడో రఘూద్వహుడు నిర్మిం చినచోటు జేరినపుడు రామభక్తు డొందునానందానుభూతి అనిర్వచనీయము కదా! పిండీజమ్మూలనుండి శ్రీనగరము చేరి నిషాద్ బాగ్ షాలిమారుమహోద్యానవనముల నవలోకించి, మంచుమలపై మసలి, ప్రకృతిరమాసౌందర్యమునకు కన్నుల నప్పగించి, హరగిరిజలు గిరికావరూధినులు మసలినతావులను తిలకించునపుడు దివినుండి భువిమీదికి నిలింపులు దిగుచోటది యని ఊహించి పరమపరితోషమునందెదముకదా! లింగోద్భవ సమయమున పూతగాంగఝరీతోయమందు స్నానమొనరించి విశ్వనాథుని సేవించినపుడును రామపదచిహ్నితములై రజత భస్మరాసులట్లు వెలయుసరయూసైకతశ్రేణులపై సంచరించి, శ్రీరామజన్మస్థానమందలి ఎనిమిదివేల రామమందిరములను విలోకించినపుడును, కాళిందీపులినతలమున మసలి, బృందా వనవీథులందు చరించి, వ్రజవనితాసహితుడై గిరిధారి కావిం

చిన రాసక్రీడల దలచినపుడును, కృష్ణవంశీవినిర్గతగానలహరీ ప్లావితమధురాపురీపరిసరస్థలములందు సంచరించినపుడును, బదరికాశ్రమ కేదారనాథగంగోత్తరీయమునోత్తరీ బ్రహ్మావర్త కుశావర్తములను బ్రహ్మగిరిమీది గోదావరిజన్మస్థలమును, బ్రహ్మారణ్యమందు కృష్ణవేణిపుట్టినచోటును, నర్మదాతీరవిలసిత, శుభ్రజ్యోత్స్నాలోకితసౌందర్యసంశోభితప్రమోదప్రదీప్త ప్రస్తరగిరులను, కఠోరదీక్షను పూని త్యాగస్థిమాత్రవశిష్టుడైనతథాగతుని తపశ్శక్తిచే పునీతమైనబోధిద్రుమతలమును, వారణాసి కనతిదూరమందలి మృగదావమును. నర్మదానదప్రాంతసహస్రధారలను, చారుశారదచంద్రికాసందీపితమైనతాజమహాలును, లోకమాత సీతకన్నీటితో పూతమైన పరిహారమును, ప్రాచీనచారిత్రికాంశములను కన్నులకు గట్టినట్లు ప్రకటించు అజాంతాయెల్లోరాబాదామీ ఎలిఫేంటా గుహాలను, మొహెంజొదోరా హారప్పా హంపి తక్షశిల నలందాస్థానములను, సహస్రాబ్దములచారిత్రికవిషయముల కాటపందిరియైన కైబరుకనుమను, వనశంకరి, వింధ్యవాసిని, మీనాక్షి, కామాక్షి, భవాని, భ్రమరాంబ, దుర్గ, జ్ఞానప్రసూనాంబాదులు నెలసినతావులను, శివాజీ జీవితఘట్టములైన ప్రతాప్‌గడ్ సింహగడ్ దుర్గములను, రాణాప్రతాపాదుల పదస్పర్శచే పునీతమైన రాజస్థానమును, మనోహరమైన దేవాలయములతో నెలయు ఆబూశిఖరమును, సిక్కులచే నిర్మింపబడినస్వర్ణమందిరములతో విరాజిల్లు అమృతసరస్సు నాందేడ్ కోహాలో గుజరన్వాలా మున్నగు గురుద్వారములను నవద్వీప

నడియావల్లభి విక్రమశిలశాంతిపుర విద్యాపీఠములను నైమిశారణ్యవింధ్యారణ్య,బ్రహ్మారణ్యదండకారణ్యములందు వెలయు ఆశ్రమములను, మునిసమాధిసముద్భవపవిత్రభావధునీసంసిక్త తపోవనములను పరిశీలించినపుడు విజ్ఞానయాత్రికునిహృదయము బ్రహ్మానందభరితము కాదా? శిలలందును అలలందును ప్రజ్ఞానభరితసూత్రములను, సుజ్ఞానబంధురసిద్ధాంతములను తాత్త్వికకవులు గ్రహింతురుకదా! వేయిజన్మలందు బహుళగ్రంథములను పఠించినపుడు చేకుఱుజ్ఞానముకంటె ఒక్కజన్మయందు పూర్వోక్తవిధమున భారతకువలయమును జిజ్ఞాసాపూరితహృదయముతో విలోకించినపుడు లభించువిజ్ఞానము ఘనతరమైనది. ఈరీతియాత్ర భక్తిజ్ఞానకర్మయోగములందు సాధకుని సిద్ధహస్తుని చేయును. వజ్రసంకల్పేచ్ఛాశక్తులను దృఢనిశ్చయస్థితప్రజ్ఞలను ఆతనికి ప్రసాదించును. ఆత్మసాక్షాత్కార, ఈశ్వరసాక్షాత్కారముల నంది, ఆత్మజ్ఞానసముద్భవ ఆత్మవిశ్వాసముతో ఆతడు ''అహం బ్రహ్మాస్మి''యనుమహావాక్యము నుచ్చరించును. ఈయుదారాశయసిద్ధిని దృష్టియందిడికొనియే మనపరివ్రాజకులు పెక్కు ఇక్కట్టులను లెక్కసేయక భారతభూమియందును, ఇతర విషయములందును ప్రబోధప్రచారములు సలుపుచు సంచరించిరి. జీవితనిర్వహణమున ఒకానొకఘట్టమున ఐహికసుఖములకు జలాంజలి నిచ్చి, గృహస్థాశ్రమములనుండి తరలి, బహుయోజనములు నడచినడచి మనపూర్వపురుషులు వనస్థలులందు నివసించి మననిదిధ్యాసనధ్యానసమాధులం దారితేఱి, ముక్తిని ముంజేతికంకణము

జేసికొనిరి. విదేహముక్తి యటుండ, జీవన్ముక్తి ఈయాత్ర వలన జిజ్ఞాసువునకు లభించును. హృదయగర్భాలయమందలి పరంజ్యోతిని అంతర్దృష్టిలో నాలోకించి, సచ్చిదానందములం దీత డోలలాడును భారతీయసాంస్కృతిక ప్రయోజన ప్రమోదములను గ్రహించి విదేశములనుండి మెగస్తనీస్, ఫాహ్యాన్, యువాన్ చ్వాంగ్, అబ్దుల్ రజాక్, బెర్నియర్, టెవెర్నియర్, మర్కోపోలో, నికోలోకొంటె, ఇబిన్ బుటూటా, ఇట్ సింగ్ మున్నగుయాత్రికులు రమారమి రెండు వేలమైళ్ళదూరము నయితము నడచినడచి, మనవిద్యాపీఠములను చేరి, కౌపీన ధారులైనమనమునిముఖ్యులచరణోపాంతమున అధివసించి, అంతేవాసులై, జ్ఞానులై, నిజానుభూతిసముద్భవజ్ఞానమును గ్రంథస్థ మొనరించిరి.

గుంటూరులో శ్రీరామనామక్షేత్రమును నెలకొలిపి శ్రీసీతారామనామసంకీర్తనసంఘమును నెలయించి, ఏటేట మహోత్సవములను విశేషోత్సాహముతో నిర్వహించుచు, బహువిధప్రబోధప్రచారములవలన లోకోపకారము చేయుచు, ధన్యజీవు లగుచున్నసుహృదులు శ్రీశ్రీశ్రీ రాగం ఆంజనేయులుగారితోను, వారిసోదరులు శ్రీశ్రీశ్రీ వెంకటేశ్వరులు గారితోడను యాత్రవలన లభించు విశేషాభ్యుదయమును దృష్టాంతములతో నెఱిగించి, యాత్రికులకు బహువిధముల ప్రయోజనకారి కాజాలుగ్రంథప్రకటనము మిక్కిలి అక్కఱకైనదని తెలిపితిని. బహుజనమోక్షసాధనము వారి జీవిత పరమలక్ష్యము కావున పూర్వోల్లిఖితగ్రంథప్రకటనమునకై

వారు పూనుకొనిరి. సంకల్పశక్తిగలమహనీయులు కావున అచిరములో వారి "యాత్రామార్గదర్శి"ని ప్రచురించి దేశము నకై పంపుచున్నారు.

ఈయుద్గ్రంథము గంభీరభావబంధురమై సర్వాంగసుంద రమై యుండుటచే ఆంధ్రశారదకు, భారతాంబకు, హిందూ మాతకు అమూల్యమైనకయిసేతయై వెలయజాలును. యాత్ర వలన చేకూరుపరమప్రయోజనము లిందుకడు నేరిమితో వర్ణింప బడినవి. వివిధపుణ్యక్షేత్రములను దర్శించునపుడును, బహుళ తీర్థములను సేవించునపుడును గమనింపవలసినవిషయము లిందు విశదీకరింపబడినవి. అవసరసమయములందుప్రయోగింపవలసిన బహుభాషాపదము లిందు జేర్చబడినవి. అనేకసంపుటములం దీమహాగ్రంథము క్రమవిస్తృతభావశబలతతో విలసిల్లగలదు. ఇది కేవలము సానలుదీరిన జాతిరత్నమే కాదు.-గ్రంథశమంత కమై తేజరిల్లజాలునని విశ్వసించుచున్నాను. పఠిత లీమణిని గ్రహించి, సఫలీకృతమనోరథు లయ్యెదరని విశ్వసించు;

సోదరుడు,

విజయసంవత్సర కార్తికపూర్ణిమ 20-11-1953

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి,
ఎస్. ఆర్. ఆర్. ఎండ్ సి. వి. ఆర్. కళాశాల
విజయవాడ

ప్రపంచమున, అందును ముఖ్యముగ భారతదేశమున ప్రతిమానవుడును తనజీవితములో ఎప్పుడో యొకప్పుడు తీర్థ యాత్రలను సలుపుచుండును; లేదా సలుపవలెనని ఆశపడును. ఇందులకు కారణమేమి? అది మానవసహజసిద్ధవాంఛ గాన.

1. ఇంద్రియము లిందులకు వలయువాసన గల దగుటచేతను,
2. ఇహపరానందముల కిది సాధనమైన దగుటచేతను తీర్థ యాత్రావాంఛ పలువురకు కలుగును.

ఇహలోకానందమును పొందతలచినవారు దిగువ 'రెండు రెండుగ' చేర్కొనబడిననియమముల నవశ్యముపాటించదగును.

దినమునకు– రెండుపర్యాయములుమాత్రమే భుజించుచుండ వలెను.

వారమునకు–రెండుపర్యాయములుమాత్రమే సత్సంతాన సంపాదనార్థము మిథునధర్మము ననుసరించవలెను.

పక్షమునకు–రెండుపర్యాయములు తలంటుకొనవలెను.

మాసమునకు–రెండుపర్యాయములు (ప్రతిఏకాదశి) ఉపవా సము చేయవలయును.

ఋతువునకు–మాసమున కొకపర్యాయమునకు తక్కువ గాకుండగ క్షురకర్మను చేయించుకొనవలెను.

అయనమునకు–రెండుపర్యాయములుమూడేసిమాసములకొక పర్యాయము గర్భశోధనౌషధమును సేవించవలెను.

సంవత్సరమునకు–ఆరేసిమాసముల కొకపర్యాయముచొప్పున తీర్థయాత్రలను సలుపవలెను.

ఇట్టినియమముల నవలంబించువారికి ఇహపరానంద ములు కలుగును. ఈనియమములలో తీర్థయాత్ర చాలముఖ్య మైననియమము. దీనివలన తక్కునియమము లన్నియు చరితార్థ ములు కాగలవు.

తప స్తీర్థం, క్షమా తీర్థం, తీర్థ మింద్రియనిగ్రహః
సర్వభూతదయా తీర్థం, ధ్యానం తీర్థ మనుత్తమమ్.
ఏతాని పంచతీర్థాని సత్యం షష్ఠం ప్రకీర్తితమ్
దేహే తిష్ఠంతి సర్వస్య తేషు స్నానం సమాచరేత్,
దానం తీర్థం, దమ స్తీర్థం, సంతోష స్తీర్థ ముచ్యతే.
బ్రహ్మచర్యం పరం తీర్థం, తీర్థం చ ప్రియవాదితా,
జ్ఞానం తీర్థం, ధృతి స్తీర్థం, తప స్తీర్థ ముదాహృతమ్
తీర్థానామపి త త్తీర్థం, విశుద్ధి ర్మనసః పరా.

మహాభారతము.

తీర్థమనగా తపమ్ము చేయుట, క్షమాగుణమును కలిగి యుండుట, బాహ్యేంద్రియనియమనము, అంతరింద్రియనియ మనము, సమస్తప్రాణులయందును దయకలిగియుండుట, భగవ ద్ధ్యానమును జేయుచుండుట, సత్యవాక్పరిపాలనచేయుట, దాన ధర్మములాచరించుట, దమము సంతోషము, బ్రహ్మచర్యము, ప్రియము పలుకుట, జ్ఞానము, ధృతి, అనశనము అనునవి. ఈగుణములను గలిగియుండుటయే తీర్థయాత్ర యనబడును. వీని ననుష్ఠించుటయే స్నానమనబడును అనగా నెచ్చటికి నెళ్లినను దేనియందు మునిగినను, వేనిని సందర్శించినను, ఈగుణముల యావిర్భావము, వీనియుద్భేధము. వీనిప్రకాశము ఉండవల యును. ఈగుణములు లేకుండినచో ఎన్ని దేశములు తిరిగినను,

ఎన్నినదులలో మునిగినను, ఎన్నిస్థలములను సందర్శించినను ఉపయోగ ముండదు. కావుననే పరిశుద్ధమానస ప్రవర్తనమే అన్నిటికంటె ప్రధానమైన తీర్థయాత్ర.

ఇది కలుగుటకే ఇంతమంది ప్రజ లిన్నికష్టముల కోర్చి ఇంతవ్యయప్రయాసలను సహించి, తీర్థయాత్రలను చేయు చుందురు. దేశము, కాలము, తీర్థము, వాతావరణము అనునవి మానసికపరివర్తనముల కాకరములు. తీర్థయాత్రలవలనకలుగు ప్రధానఫలిత మీమానసికపరిశుద్ధియే. దీనినే ఆత్మవిజ్ఞాన మనియు అనవచ్చును. ఏయేస్థలము లిట్టిపవిత్రమాహాత్మ్యము కలవియో, ఆయాపవిత్రస్థలములలో సందర్శించదగిన వేవేవి కలవో, అచటి కెటుల వెళ్ళవలెనో ఏమిచేయవలెనో, తెలియక చాలమంది చాలనిబ్బందులకు లోనగుచున్నారు.

ఇట్టిలోపముల లేకుండ చేయుటకై గుంటూరువాస్తవ్యు లగు శ్రీరాగం వెంకటేశ్వర్లుగారు సర్వతీర్థములను తాము స్వయ ముగ జూచివచ్చి, వానినన్నిటి నతివిపులముగా, అవసరమైన స్వల్పవిషయములకూడ విడువకుండగ వలయుఛాయాచిత్రము లతో సంగ్రహముగను సుందరముగను ఈ"యాత్రామార్గదర్శి" అనుపుస్తకమును వ్రాసి శ్రీసీతారామనామసంకీర్తనసంఘము ద్వారా ప్రచురించిరి. ఈపుస్తకమును వ్రాయుటలో వీరుపడిన శ్రమ ప్రతియాత్రికునికిని బాగుగా తెలియగలదు. ఇదివరలో యాత్రచేసికూడ తెలిసికొననినూతనవిషయము లెన్నింటినో యిందుమూలమున తెలిసికొన కలుగుచున్నారము.

నేను స్వయముగ నేత్రతీర్థసంయోగముచే తెలిసికొనని కొన్ని ముఖ్యవిషయములను, ఈపుస్తకమందలి చక్షురక్షర సంయోగముద్వారా తెలిసికొనగలిగి ఆనందించితిని.

ఒకే దేశభాగమందలి యాత్రికులు మరొక దేశభాగమునకు వెళ్లినపుడచటిభాష తెలియక తమకు వలయుకార్యములను జరుపుకొనజాలక పడుబాధ లనంతములు. ఇవి అనుభవైకవేద్యములు. అనుభవజ్ఞు లగునీగ్రంథకర్తగారు యాత్రలో నవసరమగునన్ని మాటలకును, అవసర మగువెక్కువాక్యములకును హిందూదేశమందలి ప్రధానభాషలు 10కి చక్కనిపర్యాయపదముల నిచ్చిరి. మరియు అన్నిమతస్థులకును, అధునికులకు సనాతనులకును వలయు అన్నియాత్రాస్థలములను గురించికూడ వీరీపుస్తకమున చేర్చి వివరముల వ్రాసి మహోపకార మొనర్చిరి. యాత్రికులకు కావలసిన గమనించవలసిన యావద్విషయములను వివరముగ వ్రాసిరి ఇది యాత్రికులపాలిటి కరదీపిక. ఈపుస్తకము నాకు చాల ఆనందము చేకూర్చినది.

యాత్రికులేగాక పవిత్రస్థలవిశేషముల తెలిసికొని యానందించువారుకూడ దీనిని చదువుకొని, ఉపయోగపరచుకొని యానందించి, ధన్యులగుదురుగాక? దీనిని ప్రచురించిన శ్రీసీతారామనామసంకీర్తనసంఘమువారీసత్కార్య మొనర్చినందులకు సంశ్లాఘ్యులు.

ఇట్లు,

దుమ్ముకులవారిరామానుజ కూటము - విజయవాడ, 21-11-53.

ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు,
కార్యదర్శి,
శ్రీవిశిష్టాద్వైతప్రచారసంఘము.



# వివిధ దక్షిణయాత్రామార్గములు

భారతదేశము నలుమూలలగల క్షేత్రముల నొకేసారి దర్శింప నెల్లరకు వీలుగలుగదు; గాన వివిధమార్గములలో పలుసార్లుపోయి దర్శించు లాగున క్రిందమార్గములు పొందుపర్చబడియున్నవి. ఇందలి మైళ్ళు, చార్జీలు పైక్షేత్రమునుండి దిగువక్షేత్రమునకు గుర్తించబడియున్నవి. 'వయా' అనగా రైల్వేకు, బస్సురూట్లకు సంబంధించిన జంక్షనులేగాని క్షేత్రములుకావు. ఇందలి చార్జీలన్నియు మొయిలు చార్జీలు.

1500 మైళ్ళకు తక్కువగాని చుట్టుప్రయాణములకు రైల్వేవారు ప్రతి రూ 100 లకు రూ 25 లు మినహాయించి చార్జికట్టి టిక్కెట్లు నిచ్చెదరు. ఆటిక్కెట్లు 3 మాసములవరకు చెల్లును. అవి స్టాండర్డుటూరు టిక్కెట్లనియు, సర్క్యులర్ టూర్ టిక్కెట్లనియు రెండువిధములు. మొదటిరకపుటిక్కెట్లలో పోదగిన మార్గమును వారే నిర్ణయించెదరు. రెండవరకపుటిక్కెట్లుకు మార్గమును మనయిచ్ఛవచ్చినట్లు 1500 మైళ్ళకు మించెడి చుట్టుప్రయాణమును మనమే నిర్ణయించుకొనవలెను. రెంటికిని వారు రూ. 100 లకు రూ. 25 లు తగ్గించెదరు. కాలము రెంటికిని 3 మాసములే.

| యాత్రామార్గవివరము | | రైలు, బస్సు, అసలుచార్జి. | 4వ వంతుతగ్గింపబడిన చార్జీ. |
|---|---|---|---|
| 1. సంపూర్ణదక్షిణయాత్ర | 3392 మై. | రు 120- 3-0 | రు 88-10-0 |
| 2. రామేశ్వరయాత్ర | 1773 మై. | 58-12-0 | 44- 3-0 |
| 3. రామేశ్వరకన్యాకుమారియాత్ర | 2131 మై. | 73- 3-0 | 64-15-0 |
| 4. రామేశ్వర, మైసూరుయాత్ర | 2602 మై. | 87- 0-0 | 65- 4-0 |
| 5. మైసూరు,కూర్గ,ఉడిపి,గోకర్ణయాత్ర | 2159 మై. | 71- 0-0 | 53- 4-0 |

పైచార్జీలలో బస్సుచార్జీలుగూడ కలసియున్నవి. కాని, రైల్వేవారికి బస్సుచార్జీలతో సంబంధములేదు. అందుచేత బస్సుచార్జీలను, వానికి సంబంధించిన మైలేజిని పైనసూచించిన మొత్తములనుండి తగ్గించుకొని లెక్కచూచుకొనవలెను.

## 1. సంపూర్ణ దక్షిణయాత్రామార్గము

| క్షేత్రము పేరు | మైళ్లు | చార్జి | క్షేత్రము పేరు | మైళ్లు | చార్జి |
|---|---|---|---|---|---|
| గుంటూరు | 0 | | నాగపట్నం | 15 | రు0- 8 |
| నెల్లూరు | 155 | రు5- 1 | నాగూరు | 4 | 0- 3 |
| గూడూరు (వయా) | 22 | 0-12 | తంజావూరు (తిరిగి) | 53 | 1-12 |
| కాళహస్తి (రేణిగుంట) | 46 | 1- 8 | తిరుచునాపల్లి (వయా) | 31 | 1- 1 |
| తిరుపతి | 12 | 0- 6 | ♦శ్రీరంగం (బస్సు) | 8 | 0- 5 |
| అరకోణం (వయా) | 47 | 1- 8 | తిరుచినాపల్లి (తిరిగి) | 8 | 0- 5 |
| కంచి | 17 | 0- 9 | రామనాథపురము (వయా) | 131 | 4- 5 |
| అరకోణం (తిరిగి) | 17 | 0- 9 | ♦నవపాషాణము | 10 | 0-10 |
| తిరువళ్లూరు | 17 | 0- 9 | ♦రామనాథపురం (తిరిగి) | 10 | 0-10 |
| ♦బస్సు శ్రీపెరుంబదూరు | 10 | 0- 6 | ♦దర్భశయనం | 9 | 0-10 |
| ♦మద్రాసు (బస్సు) | 26 | 0-14 | ♦రామనాడ్ (తిరిగి) | 9 | 0-10 |
| చెంగల్పట్టు (వయా) | 35 | 1- 3 | రామేశ్వరము (వయా) | 33 | 1- 2 |
| ♦పక్షితీర్థం, తిరుకళుకుండ్రం | 9 | 0- 5 | ధనుష్కోటి | 23 | 0-12 |
| ♦మహాబలిపురం | 10 | 0- 6 | రామేశ్వరము (తిరిగి) | 23 | 0-12 |
| చెంగల్పట్టు (తిరిగి) | 19 | 0-10 | మానమధురై (వయా) | 70 | 4- 1 |
| విల్లుపురం (వయా) | 64 | 2- 2 | మధుర | 30 | 1- 1 |
| పాండిచేరి | 24 | 0-12 | డిండిగల్లు (వయా) | 38 | 1- 4 |
| విల్లుపురం (తిరిగి) | 24 | 0-12 | పళని | 36 | 1- 3 |
| చిదంబరము | 52 | 1-12 | డిండిగల్, మధుర, (తిరిగి) | 74 | 2- 7 |
| మాయవరం (వయా) | 23 | 0-12 | విరుధునగర్ (వయా) | 27 | 0-15 |
| కుంభకోణము | 20 | 0-11 | శ్రీవిల్లిపుత్తూర్ | 26 | 0-14 |
| తంజావూరు (వయా) | 24 | 0-13 | శంకరనయనార్ కోవిల్ | 27 | 0-15 |
| ♦తిరువాడి | 7 | 0- 8 | తెన్‌కాశి (వయా) | 23 | 0-12 |
| తంజావూరు (తిరిగి) | 7 | 0- 8 | ♦కుర్తాళం | $3\frac{1}{2}$ | 0- 8 |
| మన్నారుగుడి | 27 | 0-15 | తెన్‌కాశి (తిరిగి) | $3\frac{1}{2}$ | 0- 8 |
| తిరువారూర్ | 15 | 0- 8 | అంబాసముద్రము | 29 | 1- 0 |

♦ బస్ రూట్లకు గుర్తు

| క్షేత్రముపేరు | మైళ్ళు | చార్జి |
|---|---|---|
| సర్వాదేవి | 9 | రు0- 5 |
| తిరునల్వేలి | 12 | 0- 6 |
| శ్రీవైకుంఠం | 18 | 0- 9 |
| ఆళ్వారుతిరునగరి | 3 | 0- 2 |
| తిరుచ్చెందూర్ | 17 | 0- 9 |
| తిరునల్వేలి (తిరిగి) | 38 | 1- 4 |
| ♦తోతాత్రి (నాంగునేరి) | 19 | 0-10 |
| ♦శుచీంద్రము | 42 | 1-12 |
| ♦కన్యాకుమారి | 9 | 0- 4 |
| ♦త్రివేండ్రం | 52 | 1-14 |
| వర్కాలా (జనార్ధనం) | 26 | 0-14 |
| క్విలాన్ (వయా) | 14 | 0- 8 |
| వైక్కాం | 80 | 2-10 |
| ఎర్నాకులం | 12 | 0- 6 |
| కాలడి | 17 | 0- 9 |
| షోరనూర్ (వయా) | 48 | 1- 9 |
| కన్హాన్‌గాడ్ (వయా) | 147 | 4-13 |
| ♦ఆనందాశ్రమము | 3½ | |
| కన్హాన్‌గాడ్ (తిరిగి) | 3½ | |
| మంగుళూరు | 45 | 1- 2 |
| ♦ఉడిపి | 33 | 1- 2 |
| ♦గోకర్ణము | 100 | 4- 0 |
| ♦షిమోగా (వయా) | 150 | 5- 0 |
| ♦శృంగేరి | 52 | రు2- 4 |
| ♦షిమోగా (తిరిగి) | 52 | 2- 4 |
| బిరూరు, అరిసికేరి, హాస్సన్ | 97 | 3- 8 |
| ♦బేలూరు | 24 | 1- 1 |
| ♦హళేబీడు | 10 | 0- 8 |
| హాస్సన్ (తిరిగి) | 34 | 1- 9 |
| ♦శ్రావణబెలగొల | 36 | 1- 4 |
| హాస్సన్ (తిరిగి) | 36 | 1- 4 |
| కృష్ణరాజసాగర్ | 66 | 2- 3 |
| మైసూరు | 8 | 0- 4 |
| శ్రీరంగపట్నం | 9 | 0- 5 |
| ♦మేలుకోట | 20 | 0-14 |
| ♦శ్రీరంగపట్నం (తిరిగి) | 20 | 0-11 |
| బెంగుళూరు | 77 | 2- 9 |
| హిందూపురం (వయా) | 63 | 2- 1 |
| ♦లేపాక్షి | 9 | 0- 5 |
| ♦హిందూపురం (తిరిగి) | 9 | 0- 5 |
| గుంటకల్ | 113 | 3-11 |
| గాజులపల్లి (వయా) | 99 | 3- 4 |
| ♦మహానంది | 3½ | 1- 0 |
| ♦గాజులపల్లి (తిరిగి) | 3½ | 1- 0 |
| గుంటూరు | 160 | 5- 4 |
| బస్సుమార్గం | 3392 | 120-3-0 |

## 2. రామేశ్వరయాత్ర

| క్షేత్రముపేరు | మైళ్ళు | చార్జి |
|---|---|---|
| గుంటూరు | 0 | |
| నెల్లూరు | 155 | 5- 1 |
| గూడూరు (వయా) | 22 | 0-12 |
| కాళహస్తి | 46 | 1- 8 |

| క్షేత్రము పేరు | మైళ్ళు | చార్జి | క్షేత్రము పేరు | మైళ్ళు | చార్జి |
|---|---|---|---|---|---|
| ఏర్పేడు | 6 | రు0-4 | మధురై, రామనాథపురం | 131 | రు4-5 |
| తిరుపతి | 6 | 0-4 | ♦నవపాషాణము | 10 | 0-6 |
| పాకాల, కాట్పాడి(వయా) | 70 | 2-5 | ♦రామనాడ్ (తిరిగి) | 10 | 0-6 |
| తిరువణ్ణామలై | 58 | 1-15 | ♦దర్భశయనం | 9 | 0-5 |
| కాట్పాడి (తిరిగి) | 58 | 1-15 | ♦రామనాథపురము (తిరిగి) | 9 | 0-5 |
| అరక్కోణం (వయా) | 38 | 1-4 | రామేశ్వరము | 33 | 1-2 |
| కంజీవరం | 17 | 0-9 | ధనుష్కోటి | 23 | 0-12 |
| అరక్కోణం (తిరిగి) | 17 | 0-9 | మానమధురై (వయా) | 70 | 2-5 |
| మద్రాసు | 43 | 1-7 | మధుర | 30 | 1-0 |
| చెంగల్పట్టు (వయా) | 35 | 1-3 | డిండిగల్లు (వయా) | 38 | 1-4 |
| ♦పక్షితీర్థం | 9 | 0-5 | పళని | 36 | 1-3 |
| ♦మహాబలిపురము | 10 | 0-6 | డిండిగల్లు | 36 | 1-3 |
| చెంగల్పట్టు(తిరిగి) | 19 | 0-10 | తిరుచునాపల్లి (వయా) | 58 | 1-15 |
| విల్లుపురం, కడలూరు(వయా) | 64 | 2-2 | శ్రీరంగము | 8 | 0-5 |
| చిదంబరం | 52 | 1-12 | వృద్ధాచలం, విల్లుపురం | 103 | 3-0 |
| కుంభకోణం | 43 | 1-7 | మద్రాసు | 99 | 3-4 |
| తంజావూరు | 24 | 0-13 | పొన్నూరు (నిడుబ్రోలు) | 235 | 7-9 |
| ♦తిరువాడి | 7 | 0-4 | తెనాలి (వయా) | 13 | 0-7 |
| ♦తంజావూరు (తిరిగి) | 7 | 0-4 | గుంటూరు | 16 | 0-7 |
| తిరుచునాపల్లి, మదుర | | | | 1773 | 58-12-0 |

## 3. రామేశ్వర, కన్యాకుమారియాత్ర

| క్షేత్రము పేరు | మైళ్ళు | చార్జి | క్షేత్రము పేరు | మైళ్ళు | చార్జి |
|---|---|---|---|---|---|
| గుంటూరు | 0 | | ఏర్పేడు | 6 | రు0-4 |
| సింగరాయకొండ | 100 | రు3-5 | తిరుపతి | 6 | 0-4 |
| నెల్లూరు | 54 | 1-13 | పాకాల, కాట్పాడి(వయా) | 70 | 2-5 |
| గూడూరు (వయా) | 22 | 0-12 | తిరువణ్ణామలై | 58 | 1-15 |
| కాళహస్తి | 46 | 1-8 | విల్లుపురం, కడలూరు(వయా) | | |

| క్షేత్రము పేరు | మైళ్ళు | ఛార్జి |
|---|---|---|
| చిదంబరము | 52 | రు1-12 |
| కుంభకోణం | 43 | 1-7 |
| తంజావూరు | 24 | 0-13 |
| ♦తిరువాడి | 7 | 0-4 |
| తంజావూరు (తిరిగి) | 7 | 0-4 |
| నిడామంగళం | 19 | 0-10 |
| మన్నారుగుడి | 8 | 0-5 |
| నిడామంగళం (తిరిగి) | 8 | 0-5 |
| తిరువారూర్ | 23 | 0-12 |
| నాగపట్నం | 15 | 0-8 |
| నాగూరు | 4 | 0-3 |
| తంజావూరు (తిరిగి) | 53 | 2-12 |
| శ్రీరంగము | 37 | 1-4 |
| తిరుచునాపల్లి | 8 | 0-5 |
| మనమధురై, రామనాధపురం(వయా) | 131 | 4-5 |
| ♦నవపాషాణము | 10 | 0-6 |
| ♦రామనాడ్ (తిరిగి) | 10 | 0-5 |
| ♦దర్భశయనము | 9 | 0-5 |
| ♦రామనాడ్ (తిరిగి) | 9 | 0-5 |
| రామేశ్వరము | 33 | 1-2 |
| ధనుష్కోటి | 23 | --12 |
| మనమధురై (వయా) | 70 | 2-5 |
| మధుర | 30 | 1-0 |
| విరుధునగర్, తిరునల్వేలి Via | 98 | 3-4 |
| శ్రీవైకుంఠం | 18 | రు0-10 |
| ఆళ్వారుతిరునగరి | 3 | 0-2 |
| తిరుచ్చెందూరు | 17 | 0-9 |
| తిరునల్వేలి (తిరిగి) | 38 | 1-4 |
| ♦నాంగునేరి (వానమామలై) | 19 | 0-10 |
| ♦శుచీంద్రం | 42 | 1-12 |
| ♦కన్యాకుమారి | 9 | 0-4 |
| ♦త్రివేండ్రం (పద్మనాభస్వామి) | 52 | 1-14 |
| వర్కల, (వయా) | 26 | 0-14 |
| క్విలాన్, తెన్కాశీ(వయా) | 64 | 2-2 |
| ♦కుర్తాళం | 3 1/3 | 0-8 |
| ♦తెన్కాశీ (వయా) | 3 1/3 | 0-8 |
| శంకరన్ నాయనార్ కోవెల | 23 | 0-12 |
| శ్రీవిల్లిపుత్తూర్ | 27 | 0-15 |
| విరుధునగర్ (వయా) | 26 | 0-14 |
| మధుర (వయా) | 27 | 0-15 |
| డిండిగల్ (వయా) | 38 | 1-4 |
| పళని | 36 | 1-3 |
| డిండిగల్ (తిరిగి) | 36 | 1-3 |
| తిరుచునాపల్లి, వృద్ధాచలం | 131 | 4-6 |
| మద్రాసు | 132 | 4-5 |
| పొన్నూరు (నిడుబోలు) | 235 | 7-9 |
| తెనాలి (వయా) | 13 | 0-7 |
| గుంటూరు | 16 | 0-7 |
| | 2131 | 73-1-0 |

## 4. రామేశ్వర, మైసూరుయాత్ర

| క్షేత్రము పేరు | మైళ్లు | చార్జి |
|---|---|---|
| గుంటూరు | 0 | |
| నెల్లూరు | 155 | రు5- 1 |
| గూడూరు (వయా) | 22 | 0-12 |
| కాళహస్తి | 46 | 1- 8 |
| తిరుపతి | 12 | 0- 7 |
| రేణిగుంట, అరక్కోణం | 47 | 1- 9 |
| కంజీవరము | 17 | 0- 9 |
| అరక్కోణము (తిరిగి) | 17 | 0- 9 |
| మదార్సు | 43 | 1- 7 |
| చెంగల్పట్టు (వయా) | 35 | 1- 3 |
| ♦పక్షితీర్థము | 9 | 0- 5 |
| ♦మహాబలిపురము | 10 | 0- 6 |
| చెంగల్పట్టు (తిరిగి) | 19 | 0-10 |
| విల్లుపురం, వృద్ధాచలం, శ్రీరంగము (వయా) | 167 | 5- 7 |
| మనమధురై, రామనాడ్ | 139 | 4- 8 |
| నవపాషాణం | 10 | 0- 6 |
| రామనాథపురము | 10 | 0- 6 |
| దర్భశయనం | 9 | 0- 5 |
| రామనాడ్ (వయా) | 9 | 0- 5 |
| రామేశ్వరము | 33 | 1- 2 |
| ధనుష్కోటి | 23 | 0-12 |
| మానమధురై (వయా) | 70 | 2- 5 |
| మధుర | 30 | 1- 0 |
| డిండిగల్లు (వయా) | 38 | 1- 4 |
| పళని | 36 | 1- 3 |
| పొదనూరు, ఈరోడ్డు, సేలం, జాలార్పేట్ | 238 | రు7-11 |

| క్షేత్రము పేరు | మైళ్లు | చార్జి |
|---|---|---|
| బెంగుళూరు | 89 | 2-15 |
| శ్రీరంగపట్నం | 77 | 2- 9 |
| ♦మేలుకోట | 20 | 0-14 |
| ♦శ్రీరంగపట్నం (తిరిగి) | 20 | 0-14 |
| మైసూరు | 9 | 0- 5 |
| కృష్ణరాజసాగర్ | 9 | 0- 5 |
| హాసన్ (వయా) | 74 | 2- 7 |
| ♦సుబ్రహ్మణ్యం | 100 | 4- 8 |
| ♦శృంగేరి | 106 | 4-12 |
| హాస్సన్ (తిరిగి) | | |
| ♦శ్రావణబెలగోల | 36 | 1- 4 |
| హాస్సన్ (తిరిగి) | 36 | 1- 4 |
| ♦బేలూరు | 24 | 1- 1 |
| ♦హాళెబీడు | 10 | 0- 8 |
| హాస్సన్ (తిరిగి) | 34 | 1- 2 |
| అరిసికేరి | 29 | 1- 0 |
| బెంగుళూరు | 103 | 3- 6 |
| విదురాశ్వత్థము (దొడ్డకురుగాడి) | 51 | 1- 11 |
| హిందూపురం | 12 | 0- 7 |
| ♦లేపాక్షి | 9 | 0- 5 |
| హిందూపురము (తిరిగి) | 9 | 0- 5 |
| గుంటకల్ (వయా) | 113 | 3-11 |
| నంద్యాల (వయా) | 90 | రు2-15 |
| ♦శ్రీశైలం (పడవ, బసు) | 61 | |
| ♦నంద్యాల (తిరిగి) | 61 | |
| గాజులపల్లి (వయా) | 9 | 0- 5 |

| క్షేత్రముపేరు | మైళ్ళు | చార్జి | క్షేత్రముపేరు | మైళ్ళు | చార్జి |
|---|---|---|---|---|---|
| మహానంది (బండి) | 3½ | రు1-0 | గుంటూరు | 160 | 5-4 |
| గాజులపల్లి (తిరిగి) | 3½ | 1-0 | | 2602 | 87-0-0 |

## 5. మైసూరు, కూర్గు, ఉడిపి, గోకర్ణయాత్ర

| క్షేత్రముపేరు | మైళ్ళు | చార్జి | క్షేత్రముపేరు | మైళ్ళు | చార్జి |
|---|---|---|---|---|---|
| గుంటూరు | 0 | | మైసూరు (తిరిగి) | 9 | 0-5 |
| మార్కాపురంరోడ్డు (వయా) | 89 | రు2-15 | కృష్ణరాజసాగర్ | 9 | 0-5 |
| ♦దోర్నాల | 24 | | హాసన్ | 74 | 2-7 |
| ♦శ్రీశైలము | 31 | | ♦శ్రావణబెళగోల | 36 | 1-4 |
| ♦మార్కాపురంరోడ్డు (తిరిగి) | 55 | | హాసన్ (తిరిగి) | 36 | 1-4 |
| గాజులపల్లి (వయా) | 71 | 2-5 | ♦బేలూరు | 24 | 1-1 |
| మహానంది | 3½ | 1-0 | ♦హాళేబీడు | 10 | 0-8 |
| గాజులపల్లి (తిరిగి) | 3½ | 1-0 | హాసన్ (తిరిగి) | 34 | 1-2 |
| గుంటకల్లు (వయా) | 99 | 3-4 | అరిసికేరి | 29 | 1-0 |
| హాస్పేట (వయా) | 71 | 2-5 | బిరూరు (వయా) | 28 | 0-15 |
| ♦హంపి | 7 | | షిమోగా (వయా) | 40 | 1-5 |
| ♦హాస్పేట (తిరిగి) | 7 | | శృంగేరి | 52 | 2-4 |
| గదగ్ హుబ్బళి (వయా) | 89 | 2-10 | షిమోగా (తిరిగి) | 52 | 2-4 |
| ♦గోకర్ణము | 110 | 4-6 | బిరూరు. అరిసికేరి (వయా) | 97 | 3-8 |
| ♦ఉడిపి | 100 | 4-0 | బెంగుళూరు | 103 | 3-6 |
| మంగుళూరు (వయా) | 33 | 1-2 | విదురాశ్వర్థము (దొడ్డకురుగాడి) | 51 | 1-11 |
| ♦మెర్కారా | 70 | 2-8 | హిందూపురం | 12 | రు0-7 |
| ♦తలకావేరి | 25 | 1-2 | ♦లేపాక్షి | 9 | 0-6 |
| ♦మెర్కారా | 25 | 1-2 | ♦హిందూపురం (తిరిగి) | 9 | 0-5 |
| ♦మైసూరు | 50 | 2-0 | గుంటకల్లు | 113 | రు3-11 |
| శ్రీరంగపట్నం | 9 | రు0-5 | గుంటూరు | 259 | 8-5 |
| మేలుకోట | 20 | 0-14 | | 2159 | 71-0-0 |
| శ్రీరంగపట్నం (తిరిగి) | 20 | 0-14 | | | |

# హరిద్వార్, కాశీయాత్ర

| క్షేత్రముపేరు | మైలు | చార్జి | క్షేత్రముపేరు | మైలు | చార్జి |
|---|---|---|---|---|---|
| గుంటూరునుండి | | | అంబాలా (వయా) సహా | | |
| మంగళగిరి | 8 | 0-5 | రన్‌పూర్ (వయా) | | |
| విజయవాడ | 12 | 0-7 | లక్సర్ (వయా) | | |
| డోర్నకల్ భద్రాద్రి | | | హరిద్వార్ | 111 | 3-10 |
| చలంరోడ్డు (వయా) | 111 | 3-10 | హృషీకేశము | 14 | 0-8 |
| *భద్రాచలము | 31 | 1-2 | హరిద్వార్ (తిరిగి) | 14 | 0-8 |
| *డోర్నకల్ (తిరిగి) | 34 | 1-2 | మొరాదాబాద్ (వయా) | 104 | 3-7 |
| వరంగల్ | 58 | 2-1 | బరేల్లి (వయా) | 56 | 1-14 |
| కాజీపేట (వయా) | 6 | 0-4 | బాలాము (వయా) | | |
| వార్ధా | 229 | 7-6 | నైమిశారణ్యము | 101 | 3-5 |
| నాగపూర్ | 48 | 1-9 | బాలాము (తిరిగి) | 16 | 0-9 |
| రామ్‌టేక్ | 8 | 0-5 | లక్నో | 43 | 1-7 |
| నాగపూర్ (తిరిగి) | 8 | 0-5 | ఫైజాబాద్ (వయా) | 80 | 2-10 |
| ఇటార్సి | 186 | 6-1 | అయోధ్య | 4 | 0-3 |
| హోషంగాబాద్ | 12 | 0-7 | ఫైజాబాద్ (తిరిగి) | 4 | 0-3 |
| భూపాల్ (వయా) | 45 | 1-8 | అలహాబాద్ | 93 | 3-4 |
| ఉజ్జయినీ | 114 | 3-12 | బెనారెస్ (కాశీ) | 104 | 3-7 |
| భూపాల్ (తిరిగి) | 114 | 3-12 | గయ | 137 | 4-8 |
| సాంచీ | 28 | 0-15 | హౌరా | 281 | 9-0 |
| భీల్సా | 6 | 0-4 | ఖుర్దారోడ్డు (వయా)పూరి | 310 | 9-14 |
| ఝాన్సీ | 147 | 4-13 | ఖుర్దారోడ్డు (తిరిగి) | 27 | 0-15 |
| ఆగ్రా | 133 | 4-6 | సింహాచలము | 259 | 8-5 |
| మధుర | 33 | 1-2 | సాత్తేరు | 5 | 0-3 |
| బృందావనము | 6 | 0-4 | రాజమహేంద్రవరము | 125 | 4-2 |
| మధుర (తిరిగి) | 6 | 0-4 | విజయవాడ | 93 | 3-0 |
| ఢిల్లీ | 94 | 3-1 | గుంటూరు | 20 | 0-11 |
| కురుక్షేత్రము | 97 | 3-3 | మొత్తము | మై.3,573 | రూ.117-13 |

☞ వివరములకు ఉత్తరయాత్రామార్గదర్శి చూడుడు.

# క్రొత్తనాణెములు 1957 ఏప్రిల్ 1 నుండి మారకపుపట్టి

| ప్రస్తుత నాణెములు అణా | పై | క్రొత్త నాణెములు నయాపైసలు | ప్రస్తుత నాణెములు అణా | పై | క్రొత్త నాణెములు నయాపైసలు | ప్రస్తుత నాణెములు అణా | పై | క్రొత్త నాణెములు నయాపైసలు |
|---|---|---|---|---|---|---|---|---|
| 0 | 3 | 2 | 5 | 6 | 34 | 10 | 9 | 67 |
| 0 | 6 | 3 | 5 | 9 | 36 | 11 అణాలు | | 69 |
| 0 | 9 | 5 | 6 అణాలు | | 37 | 11 | 3 | 70 |
| 1 అణా | | 6 | 6 | 3 | 39 | 11 | 6 | 72 |
| 1 | 3 | 8 | 6 | 6 | 41 | 11 | 9 | 73 |
| 1 | 6 | 9 | 6 | 9 | 42 | 12 అణాలు | | 75 |
| 1 | 9 | 11 | 7 అణాలు | | 44 | 12 | 3 | 77 |
| 2 అణాలు | | 12 | 7 | 3 | 45 | 12 | 6 | 78 |
| 2 | 3 | 14 | 7 | 6 | 47 | 12 | 9 | 80 |
| 2 | 6 | 16 | 7 | 9 | 48 | 13 అణాలు | | 81 |
| 2 | 9 | 17 | 8 అణాలు | | 50 | 13 | 3 | 83 |
| 3 అణాలు | | 19 | 8 | 3 | 52 | 13 | 6 | 84 |
| 3 | 3 | 20 | 8 | 6 | 53 | 13 | 9 | 86 |
| 3 | 6 | 22 | 8 | 9 | 55 | 14 అణాలు | | 87 |
| 3 | 9 | 23 | 9 అణాలు | | 56 | 14 | 3 | 89 |
| 4 అణాలు | | 25 | 9 | 3 | 58 | 14 | 6 | 91 |
| 4 | 3 | 27 | 9 | 6 | 59 | 14 | 9 | 92 |
| 4 | 6 | 28 | 9 | 9 | 61 | 15 అణాలు | | 94 |
| 4 | 9 | 30 | 10 అణాలు | | 62 | 15 | 3 | 95 |
| 5 అణాలు | | 31 | 10 | 3 | 64 | 15 | 6 | 97 |
| 5 | 3 | 33 | 10 | 6 | 66 | 15 | 9 | 98 |
| | | | | | | 16 అణాలు | | 100 |



# విషయసూచిక

## (పీఠికాభాగము)

# గ్రంథాంశసూచి



# యాత్రా మార్గ దర్శి

## యాత్రోద్దేశ్యములు, తద్విధానములు

భగవదపరోక్షసాక్షాత్కారార్థము వెడలిపోవు
భక్తుని దరింపజేయునదియే యాత్ర

శ్లో. "ప్రభావా దద్భుతా ద్భూమే । స్సలిలస్య చ తేజసామ్
పరిగ్రహా న్మునీనాం చ । తీర్థానాం పుణ్యతా స్మృతా."
—(కాశీఖండము)

భూమియందును జలమునందును తేజస్సునందును మహాద్భుతప్రభావ ముండుటవలనను, తదాశ్రియులై మహా మునులు నివసించుటవలనను, అందందు తదీయాధ్యాత్మికశక్తి యుండుటచేతను క్షేత్రములకును తీర్థములకును పుణ్యత గలదని మనశాస్త్రములు ఘోషించుచున్నవి. ఇంతియేగాక సహస్రనామములలో 'సర్వతీర్థాయ నమః' అనగా సర్వతీర్థములును తానే (భగవంతుడే) అయియున్నాడనియు అట్టి తీర్థస్వరూపుడగు స్వామికి నమస్కారమనియు మనము నిత్యము స్వామిని అర్చించుచున్నాముగదా. కాన తీర్థములును భగవంతునిస్థూల రూపములే.

కరుణామయు డగుపరమేశ్వరుడు దుష్టశిక్షణ శిష్టరక్షణార్థమై శ్రీరామ శ్రీకృష్ణ నృసింహాద్యవతారములం దాల్చి

టయేగాక సర్వకాలసర్వావస్థలయందును సేవ్యము లగునట్లు అర్చారూపములు దాల్చి భక్తులకు తన సేవాభాగ్య మొసఁగు చుండును. అనాదిసిద్ధములగు కాశీ రామేశ్వర జగన్నాథ ద్వారకాదులయందలి యర్చారూపము లట్టివియే.

శ్లో. "అయోధ్యా మధురా మాయా। కాశీ కాంచీ హ్యవంతికా
పురీ ద్వారవతీ చైవ । సప్తైతా మోక్షదాయకాః.

అయోధ్య, మధుర, మాయ (హరిద్వారము), కాశీ, కాంచీపురము (కంచి), అవంతిక (ఉజ్జయిని), ద్వారక-యనెడి యీసప్తపురులను దర్శించినవారికి మోక్షము కరతలామలక మని యీశ్లోకమువలన తెలియుచున్నది. ఈశ్లోకము శైవ, వైష్ణవక్షేత్రములకు సమానప్రధానత నిచ్చుచున్నట్లు కనబడు చున్నది. ఇందలి అయోధ్య, మధుర, ద్వారక, విష్ణుకంచి మొత్తము— 3½ ఇవి వైష్ణవక్షేత్రములు; హరిద్వారము (మాయావతి) కాశీ, అవంతిక (ఉజ్జయిని) శివకంచి-మొత్తము 3½ – ఇవి శైవక్షేత్రములు, కాన మొత్తము శైవ, వైష్ణవ క్షేత్రములు 3½ + 3½ = 7సప్తమోక్షదాయకపురులుగ శాస్త్ర ములందు రెండుసంప్రదాయములవారికి సమానప్రాధాన్య మును కల్పించినటుల కనుపించుచున్నది. ఆయా యాత్రలు చేయవలసిన పద్ధతిని, సాధకుడు గుర్తెఱిగి, సాంసారిక, ప్రాపం చిక వాంఛలను విడిచి, కేవలము పరమేశ్వరసాన్నిధ్యమును జేరగోరి నిరంతరభగవన్నామచింతన కలవాడై, అనుక్షణము భగవంతునిపై నాధారపడి, తన సర్వస్వమును త్యజించి, యాత్రసల్పినచో తప్పక మోక్షమును బడయును. అంతేగాని

యాత్రయను పేర వ్యాపారము మొదలగుప్రాపంచికదృష్టితో బోవువారి కందఱకు మోక్షము లభించవలెనన్న లభించునది కాదు. అట్టివారికిని కొంతఫలము లేకపోదుగాని బహుస్వల్పము.

మనభారతవర్షమున సాధకుడు ముఖ్యముగ యాత్ర చేయవలసినక్షేత్రములు 4 ధామములుగ నిర్ణయింపబడి యున్నవి. అవి యేవియన తూర్పున జగన్నాథము. (పూరీజగన్నాథము) దక్షిణమున రామనాథము, (రామేశ్వరము) పడమట ద్వారకానాథ్ (ద్వారక), ఉత్తరమున హిమాలయము లోని బదరీనాథ్ (బదరీనారాయణము), మఱియు పైజెప్పిన సప్తపురులును, తదుపరి సప్తక్షేత్రములును-అనగా కురుక్షేత్రము, హరిక్షేత్రము, గయాక్షేత్రము, పుష్కరక్షేత్రము, వరాహక్షేత్రము, ప్రయాగక్షేత్రము నైమిశారణ్యక్షేత్రమును.

సప్తనదులు: గంగ, యమున, గోదావరి, సరస్వతి, నర్మద, సింధు, కావేరి.

సప్తపర్వతములు: రైవతక, వింధ్య, సహ్యాద్రి, కుమారమాల్య, శ్రీపర్వత, పారియాత్రములు,

చతుస్సరోవరములు : బిందు, పంపా, నారాయణ, మానససరోవరములు.

ఇవిగాక మార్గమున అనేకక్షేత్రములు, నదులు, నదములు, గిరులు, మహారణ్యములు, ఆశ్రమములు గలవు. ఈ మహాక్షేత్రములలో యాత్రలు చేయుసాధకునికి జ్ఞానులు, యోగులు, భక్తులు మొదలగు ననేకులతో పరిచయము గలుగుటచేఅతనిసాధారణప్రవృత్తిమారి, ఆధ్యాత్మికజీవనమున

కలవాటుపడును; లేక అట్టికోరికయైన జనించి యీ జన్మమున గాకపోయినను మఱుజన్మముననైన దాని కలవాటుపడును.

పైన నుదహరించిన నాలుగుధామములు, సప్తపురులు, సప్తక్షేత్రములు యాత్రచేయుటకు కనీసము కాలినడకనైన2, లేక 3 సం॥ లును, రైలుప్రయాణమునైన 6 మాసములును పట్టును. ఈకాలమున యాత్రికు డొకవిధమైన కార్యక్రమము నకు అనగా ఎక్కువభాగము ఆధ్యాత్మికచింతన కలవాటు పడి, ఆధ్యాత్మికమునందు కొంత రుచి కలిగి, తన జీవితకాల మంతయు నట్టులే యున్న బాగుండునని వాంఛించుచు నింటికి తిరిగివచ్చి తన సాధారణజీవితమున కొంతమార్పు కల్పించు కొనుటకు తప్పక ప్రయత్నించును. యాత్రాకాలమున నేదిన మున కాదినము నూతన క్షేత్రప్రవేశము, అందలి స్వామి (మూర్తి) సందర్శనము, అచటిసాధుపుంగవసాంగత్యము, ఎప్పుడు కలుగునాయని యాతురపడుచుండుటచే మనస్సునకు సాంసారిక ప్రాపంచిక చింతలురాక ఆధ్యాత్మికచింతలు కలుగు చుండును.

ఈసందర్భమున శ్రీరామకృష్ణపరమహంసవారుహిందూ దేశమున చూడదగిన మహత్తరవిషయములు మూడు కలవని నుడివియున్నారు. అందు (1) దేవ, యోగి వాతావరణములు గలిగియుండి పాపాత్ములను బవిత్రులనుగా జేయు హిమాలయ పర్వతములును (2) సకలపాపులపాపముల బోగొట్టు మహత్తరశక్తిగల గంగాజలమును (దీనిని నవీన శాస్త్రజ్ఞులుకూడ

అంగీకరించియున్నారు) (3)బృందావనమున గోపికల విరహ తాపముతో నెలకొల్పబడిన మహత్తరభక్తివాతావరణమును.

ఒకప్పుడు శ్రీ వివేకానందస్వామివారిట్లు చెప్పియున్నారు- "ఎక్కడ అసామాన్యమైన ప్రకృతిసౌందర్యమును పాశ్చాత్యులు కనుగొందురో అచ్చట వారు ప్రయాణికులనాకర్షించుటకు (Hotels) హోటళ్ళు నిర్మించెదరు; కాని హిందువులు అట్టి ప్రకృతిసౌందర్యము గలప్రదేశములలో అనగా నదీతీరములగాని, పర్వతశిఖరములగాని, యాత్రికుల నాకర్షింప దేవాలయములుగాని మఠములుగాని నిర్మించెదరు. ఇదియే పాశ్చాత్యులకును హిందువులకును తారతమ్య" మని నుడివిరి. హిందువులుసామాన్యముగ నిట్టిప్రదేశములను మతధర్మచోదకములుగ నుపయోగించెదరు.అందువలన మనక్షేత్రములన్నియు అట్టి ప్రకృతిసౌందర్య రమణీయతతో యాత్రికుల నాకర్షించు విధముగ హిందూదేశమం దంతటను నిర్మింపబడినవి.

## పుష్కరములు

సూర్యుడు పండ్రెండురాసులలో నొక్కొక్కరాశియం దొక్కొక్క సంవత్సరము చొప్పున ప్రవేసించునప్పు డొక్కొక్కనదీపుష్కర మేర్పడుచుండును. అట్టి పుష్కర ప్రవేశసమయమున లక్షలకొలదియాత్రికులు లాయానదీతీరములకుబోయి పరమ పవిత్రమైన న్నదీజలముల స్నానములు గావించెదరు.

| సూర్యుడు ప్రవేశించురాశి | | | నదీపుష్కరము | |
|---|---|---|---|---|
| 1. మేషరాశిలో ప్రవేశించు నప్పుడు | | | గంగానదీపుష్కరము | |
| 2. వృషభ | , | , | నర్మదా | , |
| 3. మిధున | , | , | సరస్వతీ | , |
| 4. కర్కాటక | , | , | యమునా | , |
| 5. సింహా | , | , | గోదావరీ | , |
| 6. కన్యా | , | , | కృష్ణా | , |
| 7. తులా | , | , | కావేరి | , |
| 8. వృశ్చిక | , | , | తామ్రపర్ణీ | , |
| 9 ధనూ | , | , | సింధు | , |
| 10 మకర | , | , | తుంగభద్రా | , |
| 11. కుంభ | , | , | భీమా | , |
| 12. మీన | , | , | ప్రణీతా | , |

ఈపుష్కరకాలమునందు సమస్తదేవతలు, ఋషులు, పితరులు, 3½ కోట్ల తీర్థములు ఆయానదీజలములలో సన్నిహితులయి వరప్రదులయి యుందురు; గాన అట్టి శుభసమయమున గావించిన స్నాన,దాన, జప, హోమ, అర్చన, పిండప్రదాననాది సత్కార్యముల వలన మహోన్నతమైన ఫలము కలుగును. సాధారణదినములలో చేసినదానికంటె కోటిరెట్లు ఫల మధికమని శాస్త్రప్రమాణము.

ప్రపంచమతములలో యాత్రలు ఆయామతానుసారముగ ప్రతివ్యక్తికి నిర్ణీతమై యున్నవి. క్రైస్తవులకు "జెరూ

సెలము''ను, బౌద్ధులకు "బుద్ధగయాక్షేత్రమును'', మహమ్మదీయులకు "మక్కా, మదీన'లును యాత్రాస్థలములుగ నిర్ణయింపబడినవి. ఇట్లే ప్రపంచమందు ప్రతిమతమునను కొన్ని తీర్థములనిర్ణయించి మానవుడు తనజీవితమునందొకసారియైన ఆయాక్షేత్రములను సేవించునట్లాదేశింపబడియున్నది. అట్లే హిందూయాత్రికులచేతండోపతండములుగా ననేకక్షేత్రములు తత్తత్ప్రభావముచే నిరంతరము దర్శింపబడుచున్నవి.

శ్లో. క్రియాక్రమేణ మహతా ॥ తపసా నియమేన చ
దానేన తీర్థయాత్రాభి। శ్చిర కాలం వివేకతః.
దుష్కృతే క్షయ మా పన్నే । పరమార్థవిచారణే
కాకతాళీయయోగేన । బుద్ధి ర్జన్తోః ప్రవర్తతే,
(యోగవాసిష్ఠము - ము. వు. ప్ర.)

చిరకాలము నియమనిష్ఠలతో తా నొనర్చిన గొప్ప పుణ్యకర్మలచేతను, తపస్సుచేతను, దానధర్మములచేతను, తీర్థయాత్రలచేతను, సకలపాపక్షయముకాగా, పిదప మనుష్యునకు హృదయము నిర్మలమై కాకతాళీయన్యాయమున పరమార్థవిచారణయందు బుద్ధి ప్రవర్తించును.

తీర్థయాత్రలవలన ప్రయోజనములను శ్రీరామకృష్ణ పరమహంసవా రిట్లు సెలవిచ్చియున్నారు:—

''ఆవుపాలు నిజముగ రక్తమూలమున ఆవుశరీరమునందంతటను వ్యాపించియున్నను దానిచెవులను, కొమ్ములను పిండుటచే పాలు రావుకదా! పొదుగునుండిమాత్రమే పాలు లభిం

చును. అటులనే భగవంతుడు సర్వాంతర్యామియై యున్నను ఎల్లెడల నీవు వానిని గనజాలవు. పూర్వపు భక్తవరులు తమ పవిత్రజీవితములచేతను, పారమార్థికసాధనలచేతను, భక్తిమయ మొనర్చిన పావన దేవాలయములయందు భగవానుని సులభముగా బ్రత్యక్షీకరించుకొనగలిగిరి.

బ్రహ్మసాక్షాత్కారమునుగోరి అసంఖ్యాకులైన జనులు చిరకాలము జపతపములను, ధ్యానమును, ప్రార్థనలను, పూజలను సలిపినపుణ్యస్థలములందు భగవానుడు నిశ్చయముగా వెలసియుండునని గ్రహింపుడు. వారి శ్రద్ధాభక్తులచే పారమార్థికభావము లచ్చట ఘనీభవించియుండును. ఇట్టి పుణ్యతీర్థములందు మానవుడు సులభముగా ఆత్మప్రబోధము నొంది భగవంతుని గనజాలును. అనాదిగా అసంఖ్యాకులగు సాధువులు, భక్తులు, జ్ఞానులును, సకలైహికవాంఛలను విడనాడి ఇట్టిపుణ్యక్షేత్రములను దర్శించి భక్తిపూరితహృదయములతో నీశ్వరసాక్షాత్కారమునకై నిష్ఠలు సలిపియుందురు. కావున భగవంతుడు సర్వత్ర నిండియున్నను ఈక్షేత్రములందు ముఖ్యముగా వెలసియుండునని గ్రహింపుడు, ఎక్కడ త్రవ్వినను నీరు దొరకును, కాని బావియో, కోనేరో, సరస్సో ఉన్న తావున త్రవ్వవలసినపని లేకయే కావలసినపుడెల్ల సిద్ధముగా జలము లభించునుగదా !

ఆవు కడుపారమేసి ఒకచోట పరుండి నెమ్మదిగా నెమరు వేయును. అటులనే నీ వొకపుణ్యక్షేత్రమును దర్శించినపిమ్మట

అచ్చట నీమనస్సున నుదయించిన పవిత్రభావముల గైకొని, యేకాంతస్థలమున గూర్చుండి వానిలో నీవు నిమగ్నుడ వగువఱకును మననము చేయవలయును. ఆక్షేత్రములనుండి మఱలగనే విషయభోగములకు దాసుడవై ఆయుత్తమభావముల నన్నిటిని బోగొట్టుకొనకుము.

హృదయముననే భగవద్భావన గలవానికి అయ్యది పుణ్యక్షేత్రములందు మఱింతవృద్ధి యగును. దృఢమగును."

(శ్రీరామకృష్ణ బోధామృతము)

భరతఖండమున హిమాలయాది మహాపుణ్యప్రదములగు పర్వతములును, పరమపవిత్రము లైనగంగాయమునా నర్మదాది నదీనదములును, అసంఖ్యాకము లగుపుణ్యతీర్థములును, క్షేత్రములును, సరోవరములును తటాకములును, ఆశ్రమములును, మఠములును గలవు. వానిదర్శనమువలనను, స్పర్శనమువలనను, అట నాచరించు స్నాన,దాన,నియమ,వ్రత, తపోయోగాదులవలనను సకలపాపములు నశించును. అనంత పుణ్యము కలుగును. తన్మూలమున శరీరమునకు, ఇంద్రియములకు, మానసమునకు శుద్ధి సిద్ధించును; వ్యాధులు నశించి పోవును. ఏకాగ్రతకలుగును. వేయేల, సర్వకామితార్థములును సిద్ధించును. ధర్మార్థకామమోక్షములు అను చతుర్విధపురుషార్థములును అరచేత నుండును. ఈ కారణములచేతనే అనాదినుండియును మన దేశమున తీర్థయాత్రలు సేవించుట ముఖ్యాచారమైయున్నది. మనమతగ్రంథములందెచటచూచినను ప్రకృతి

సౌందర్యశోభితపుణ్యభూములు, ఋష్యాశ్రమములు, క్షేత్రములు మున్నగువానివర్ణనలు మిక్కుటముగ గన్పించుచుండును.

సంసారబంధనములు లేక, పరమార్థమే ప్రయోజనముగా గలవా రిట్టి తీర్థములను, క్షేత్రములను సేవించుటలోనే తమ జీవితముల గడుపుచుందురు. ఇది యెంతయు ముదావహము. ఇట్లు జీవితము సఫలముచేసికొనువారు ధన్యులు. సంసారమున క్రుంగి పరితపించుచుండుగృహస్థులును తమ జీవితకాలమున నొకసారియైన తీర్థయాత్రలుచేసిధన్యులగుటకుయత్నింపవలెను. తీర్థయాత్రలవలన లోకజ్ఞానము కలుగును. బుద్ధివిశాలత హెచ్చును. సహనము పెంపొందును. దీనులయందు కనికరము కలుగును. పరులకష్టములు తనకష్టములుగ నెంచుసామ్య మేర్పడును. వైరాగ్య మతిశయించును. ధర్మచింతన కల్గును. సాధనయందు ప్రవృత్తి కల్గును. హృదయమున శాంతి నెలకొనును. చదువనివారికికూడ తెలివి హెచ్చును. చదివిన పండితులకు మెరుగు వచ్చును. స్త్రీలు, పురుషులు, విధవలు, బాలురు, వృద్ధులు, పండితులు, పామరులు, అన్నివర్ణములవారు, అన్ని ఆశ్రమములవారు, సర్వమతములవారు, పుణ్యపురుషులు, పాపకర్ములు, రోగులు, ఆరోగ్యవంతులు, నాస్తికులు, ఆస్తికులు, వీరు వారననేల తీర్థయాత్రలవలన వారివారి యోగ్యతానుసారము అందఱును పురుషార్థము పడయుదురు. తీర్థయాత్రలు చేయుట కెల్లరకును అధికారము కలదు. ఎట్టివారికిని నిషేధము లేదు. వేర్వేరు తీర్థములు వేర్వేరు ప్రభావములను కలిగి

యున్నవి. కొన్ని విశేషతీర్థములందు తపోవృద్ధి యగును. కొన్ని స్థలము లెట్టిమహాపాతకములనైన హరించును. కొన్ని తావుల నెట్టికోరికలైన సిద్ధించును. కొన్ని తీర్థసేవనలు సంతానప్రాప్తిని కలుగచేయును. కొన్ని ప్రత్యేకము ముక్తిప్రదములు. మొత్తము మీద నన్నియును బరమపావనములు. భక్తి, జ్ఞాన, వైరాగ్య దాయకములు.

ఆస్తికత్వము, తీర్థయాత్రలయెడ శ్రద్ధాభక్తులు, పట్టుదల యున్నచో ద్రవ్యహీనులకుగూడ తీర్థయాత్రలు లభించుచునే యున్నవి. ఎందఱు సాధువులు, సన్న్యాసులు, భిక్షుకులు, విరాగులు, దరిద్ర్యసంపత్తి లేనివారు తీర్థయాత్రల జేయుటలేదు? వారి వారి శారీర, మానసిక శ్రమలకు తగినట్లు వారువారు ఫలభాగులయ్యెదరు.

నిజముగా హైందవుని మానసమునకు ప్రకృతిశోభతో నలరారుప్రదేశము భగవానునుండి ఆత్మకువచ్చినపిలుపువంటిది. అందువనే పూర్వము ఋషీశ్వరులు తపములొనరించుచు నిర్జనారణ్య ప్రదేశములలో ఆశ్రమములు నిర్మించుకొని జీవించుచుండెడివారు. వారిని దర్శించి, వారి ఆశీర్వాదములు బడయుటకును, ఆధ్యాత్మికోన్నతి బడయుటకును అసంఖ్యాకులగు మానవులు వారిని దర్శించి వారినుండి ఫలములను బొందుచుండెడివారు. కాలక్రమముగ అట్టి యాశ్రమములే గొప్పపుణ్యస్థలములుగ నేటికిని వెలసి యాత్రికుల ఆధ్యాత్మిక దాహముల దీర్చుచున్నవి.

శ్రీరామ, శ్రీకృష్ణాద్యవతారములలో వారు సంచరించినతావులనే భారతీయులు నేడు పవిత్రతీర్థములుగ నెంచి, వానిని సేవించినపుడెల్ల ఆయవతారమూర్తులను, అచ్చటిచరిత్రలను స్మరించి పులకితగాత్రు లగుచు, నేగుచుందురు. ఇట్లే అనేకభక్తులు. యోగీశ్వరులు, త్రిమతాచార్యులు జన్మించిన స్థానములు పుణ్యక్షేత్రములుగ వెలసి హిందూదేశమెటుచూచినను పుణ్యతీర్థమయమయి యున్నది.

ఆస్తికబుద్ధి కలశ్రీమంతులు మహాపురుషు లుండునాశ్రమములను దర్శించుటకు వెళ్ళి, అచ్చట ఆశ్రమమునకు అవసర మగుసుందరమందిరములను, వాపీ, కూప, సరోవరములను, కార్యాలయముల కనేకసుందరభవనములను నిర్మించుచు వచ్చిరి. ఇట్లేర్పడి యభివృద్ధిచెందుచున్న వానిలో శ్రీఅరవిందాశ్రమము (పుదుచ్చేరి), శ్రీఆనందాశ్రమము (దక్షిణకన్నడదేశము), శ్రీరమణాశ్రమము (తిరువణ్ణామలై), శ్రీశివానందాశ్రమము (ఋషీకేశ్), శ్రీరామకృష్ణమఠము (బేలూరు), గౌడియామఠము (మాయాపూర్-బెంగాలు), శ్రీరామనామక్షేత్రము (గుంటూరు), శ్రీవ్యాసాశ్రమము (ఏర్పేడు) నేడు పేర్కొనదగినవి. కాలక్రమముగ నీయాశ్రమములు గొప్ప పుణ్యక్షేత్రములుగ మారుచున్నవి. శ్రీమంతులు తమగ్రామములలో తమయిష్టదేవతామందిరములను సుందరముగ నిర్మించి యేటేట గొప్పఉత్సవములు చేయుచుండ అనేకయాత్రికులు దర్శించుటచే కాలక్రమముగ నవియు క్షేత్రములుగ మారినవి. అందుచేతనే హిందూదేశమున ప్రతిగ్రామమున ఒకటి

రెండు దేవాలయములు వెలసియున్నవి. ఈ దేవాలయములు, ఆశ్రమములు, యాత్రికుల కాధ్యాత్మికప్రబోధము గావించుచు విల్చియున్నవి.

ఇట్టి క్షేత్రములను దర్శించిన నేమిఫలము కలుగు నను వారు కొందఱు లేకపోలేదు. కాని యేఫలమ్ము లేకున్న గయా క్షేత్రమును సాలుకు దాదా పౌకలక్షప్రజలును, పూరీ, 'కాశీ పుణ్యక్షేత్రములను దాదాపు 3 లేక 4 లక్షలప్రజలును, ఆషాఢ, కార్తిక శుద్ధ ఏకాదశీదినములలో పండరీపురమును దాదాపు 2 లక్షలకు పైగా యాత్రికులును అనేకకష్టములకు లోనై నేటికిని ఏల దర్శించుచున్నారు? తిరుపతిలో నెలకు దాదాపు 2 లక్షలు దిబ్బెననుండి కానుకలు వచ్చును. యెందరు యాత్రికులు దర్శించుచున్నారో! వారి కేదో కొంత ఆధ్యాత్మికభావనతో తృప్తి లేనిదే యింతశ్రమలకు లోనై తీర్థ యాత్రలు చేయరుగదా !

## తీర్థయాత్రలు - శాస్త్రీయదృష్టి

సర్వమానవులబుద్ధియందు వివిధాధ్యాత్మకతరంగములు గలవు. వారు దివ్యదేశములకు (క్షేత్రములకు) వెళ్ళినప్పుడు ఆప్రదేశపువాతావరణముకూడ నాయాధ్యాత్మికతరంగముల పొంగజేయును. అసంఖ్యాకు లగునిట్టిమహనీయులసన్నిధిచే ఆయాక్షేత్రము లాధ్యాత్మికవాసనాతిశయమున నచ్చటికివచ్చు ప్రతిమానవునిగూడ పవిత్రునిగ జేయును.

మనహిందూశాస్త్రము సత్పురుషులను సందర్శించిన మోక్షము ప్రాప్తించునని ఉద్ఘోషించుచున్నది. అందు ముఖ్య

ముగ కాశిలో మృతినొందిన కేవలము కైవల్యమే యని అనే కులు తమజీవితావసానకాలమున కాశియందునివాస మేర్పఱచు కొని జీవితమును చాలించి మోక్షము నొందుచున్నారు. దీని యర్థ మేమి? ఆధ్యాత్మికముగ క్రింద వివరించబడినది.

| | |
|---|---|
| 1. అయోధ్య | సహస్రార చక్రము |
| 2. మధుర | ఆజ్ఞా ,, |
| 3. మాయావతి | విశుద్ధ ,, |
| 4. కాశి | అనాహత ,, |
| 5. కంచి | స్వాధిష్ఠాన ,, |
| 6. అవంతిక | మణిపూరక ,, |
| 7. ద్వారక | మూలాధార ,, |

పైవిధముగ ఒక్కొక్కపురి శరీరమునం దుండుఒక్కొక్కచక్రి మునకు సంబంధము కలిగియున్నది. ఒక్కొక్కపురిని దర్శించి నప్పు డాయాఅవస్థలనుపొంది తత్తత్ఫలమును పొందుచుండును. పైనపొందుపరచినవానినిబట్టిచూడ కాశీపురము అనాహతచక్ర మునకు సంబంధించినది. అనగా హృదయమునకు సంబంధించి నది. అనాహతమున నాద ముద్భవించును. నాదమునకు మూలము ఓంకారము. ఓంకారమును శ్రీరామనామమును తారక మందురు. మరణకాలమున నీరెంటిలో దేనిని స్మరించి నను ముక్తి కలదు. గీతలో భగవంతు డిట్లు ఓంకారమును గూర్చి చెప్పియున్నారు.

శ్లో. ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ । వ్యాహరన్ మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం । స యాతి పరమాంగతిమ్.

ఓం అనునీయొక్క అక్షరబ్రహ్మమును బలికి నన్ను స్మరించుచు నెవ డీశరీరమును వదలిపోవునో ఆతడు పరమగతికి బోవును.

శ్లో. ముమూర్షూణాం దక్షిణే కర్ణే యస్య కస్యాపి వా స్వయమ్
ఉపదేక్ష్యసి మన్మంత్రం స ముక్తో భవితా శివ !

ఓశివా! చావబోవునెట్టిప్రాణికైన గుడిచెవిలో నీవు నారామ మంత్రము నుపదేశించితివా ఆతడు ముక్తు డగును.

ఈరెండునామములును నాదమునకు సంబంధించినవే. అనగా కాశిలో మృతినొందుటయన హృదయ మాగుటయని యర్థము. హృదయము పరమేశ్వరునియందు లగ్నమై లయ మయిన మోక్షమేగదా ! మనప్రాచీను లోకోత్కృష్టవిషయ మున నింతగూఢార్థమును నెలకొల్పిరి. ఇట్లే యితరక్షేత్రము లును. గ్రంథవిస్తరభీతిచే విపులముగ వ్రాయ నవకాశము లేక పోయినది.

"గంగాదినదులు వాస్తవముగా బరిశుద్ధములే యైనను బాపాత్ములు వచ్చి తమపాపముల నందు బరిహరించుకొనిపోవు దురు. గంగ కాపాదించినయిట్టిపాపముల దొలగించి శుద్ధి నొందించుటకే మీవంటివారు తీర్థముల సేవింపబోయి పాప ముల దొలగించి తీర్థములనుగూడ పవిత్రీకరించుచున్నారు." అని ధర్మరాజు విదురునితో నన్నట్లు శ్రీభాగవతమున ప్రథమ స్కంధమున జెప్పబడియున్నది.

సీ. ఏవర్తనంబున నింతకాలము మీరు
సంచరించితి రయ్య జగతిలోన

నేతీర్థములు గంటి రెక్కడ నుంటిరి
భావింప మీవంటిభాగవతులు
తీర్థసంఘంబుల ధిక్కరింతురుగదా
మీయందు విష్ణుండు మెఱయుకతన
మీరె తీర్థంబులు మీకంటె మిక్కిలి
తీర్థంబు లున్నవే తెలిసి చూడ

గీ. వేఱె తీర్థంబు లవనిపై వెదక నేల?
మిమ్ము బొడగని భాషించుమేలె చాలు;
వార్త లేమండ్రు లోకులు వసుధలోన?
మీకు సర్వంబు నెఱిగెడుమేర గలదు.

## ప్రాచీనకాలము - తీర్థయాత్రలు

పూర్వకాలమున ప్రయాణసౌకర్యములు లేకపోవుటచే త్వరితముగ దూరప్రాంతములకు వెళ్ళుట కవకాశములు తక్కువగ నుండెడివి; కాని ధనవ్యయముమాత్రము కొద్దిగా నుండెడిది. యాత్ర పూర్తిచేయుటకు కొన్నియేండ్లు లేక జీవితము పట్టెడిది. కాని యిట్టిసంపూర్ణయాత్రలు సల్పినవారు గ్రహించెడిఆధ్యాత్మిక, ప్రాపంచికానుభవములు వర్ణనాతీతములు. ఈయనుభవములు గొప్పవగుటయే కాక హృదయాంతరాళము లందు స్థిరముగా నాటుకొనియుండెడివి.

ఇదియేకాక ఆయాప్రాంతములలోని భాషా, ఆచార వ్యవహారములను గ్రహించుటగాక తమఆధ్యాత్మికతత్త్వమును

గ్రామగ్రామమునను వెదచల్లుచు నిటు తానును గ్రామవాసులును అన్యోన్యసాహాయ్యము చేసికొనుచుండెడివారు. ఇదేవిధముగ ఒక్కసారి మనము 400 సం॥ క్రింద జరిగినభక్త్యవతారమూర్తి యైనశ్రీకృష్ణచైతన్యునియాత్రలవైపు మరలుదము. ఆప్రభువుచేయుయాత్రలపుణ్యమేగదా మార్గమధ్యమున అనేక దుర్మార్గవర్తను లగురాజులను, అనాగరికులుగ నుండునాదిమనివాసులను, మతవిశ్వాసము లేనిస్త్రీపురుషులను, తేజస్వంతుల చేసి మోక్షమార్గమున పడవైచినది! వారు మార్గమున గయాక్షేత్రమున నుండుఈశ్వరపూరి యనునాయనయొద్దను, పూరీజగన్నాథనివాసి యైనరామానందుని యొద్దను అనేక విశేషములను గ్రహించిరి. ఇట్లే వారు చేసినదక్షిణపశ్చిమదేశ యాత్రలను పరిశీలించిన అనేకవిషయములు తెలిసికొనగలము.

మధ్యయుగములలో హిందూదేశఆధ్యాత్మికాదిపరిజ్ఞానము పశ్చిమయిరోపాఖండమునను, మెడిటరేనియన్ప్రాంతమునను యాత్రోత్సాహము మెండుగగలఅరేబియాదేశయాత్రికులవలననే వెదజల్లబడినది.

ఆసియా యూరపుఖండములకు మొదట పరిచయము కలుగజేసినది మార్కోపోలో, కొలంబస్, వాస్కోడగామా, అబ్దుల్‌రజాక్ మొదలకు గొప్పవిజ్ఞానయాత్రికులే. వీరివివిధగ్రంథములే నేటికిని ఆధారములు.

తూర్పు దేశములలో హిందూ దేశమునకు చైనా దేశమునకు సంబంధము కలిగించినది మెగస్తనీన్, ఫాహ్యాన్, యూహాన్ చ్యాంగ్ మొదలైన గొప్ప దేశయాత్రికులేగదా !

బుద్ధశంకరరామానుజమధ్వాచార్యులు చైతన్యప్రభువు మొదలగువారు భరతఖండ మామూలాగ్రము దిగ్విజయ యాత్రలు సల్పిగదా మహామతములు స్థాపించి మఠముల నిర్మించగలిగిరి ! మఠాధిపతులద్వారా అజ్ఞానాంధకారమును బారద్రోలుటకు నేటికిని స్థిరస్థావరములై యాత్రికుల కాధ్యాత్మికజ్ఞానోదయము కలిగించుచుండుట ప్రత్యక్షమేగదా !

ఫాహ్యాన్ చీనాయాత్రికుడు క్రీ. శ. 630 A. D.లో 28వ యేట భారత దేశమునకు వచ్చెను. ఇండియాలోని సంస్కృత గ్రంథములను చైనీయులు వారి భాషలోనికి తర్జుమా చేసిరి. కాని ఫాహ్యాన్ ఆగ్రంథములకు మూలగ్రంథములను చదువవలెనని యిండియాకు వచ్చెను. భారత దేశమున 16 సం॥లలో 10,000 మైళ్లు పాదచారియై పర్యటించెను.

యాత్రాసమయములందు వల్లభుడు శ్రీమద్భాగవత పారాయణమును గావించెడివారు. వీనిని పీఠములు (బైఠకులు) అందురు. ఇట్టిపీఠము ఎనుబదినాలుగు (84) గలవు. ఈమహాప్రభుపు పీఠములు పుష్టిసంప్రదాయమందిరములవలె నతిపవిత్రములు. ఇవి దేశవ్యాప్తములు. ఇందు 22 వ్రజ ప్రాంతమున గలవు. అందు గోకులమందలి గోవింద ఘాట్ - ఇది 1550 లో శ్రీ వల్లభాచార్యుల పర్యటన సమయంబున విచ్చేసినపుడు కట్టబడినది.

పూర్వకాలమందు మనవిద్యార్థులు విద్యాభ్యాసము కొరకు ఒరిస్సానుండి నాటోర్, సిల్‌హాట్‌కును, మిడ్నపూర్ నుండి తంజావూరు నవద్వీపమునకేగాక దక్షిణమున తిరువాన్కూరువరకుకూడ వెళ్లుచుండెడివారు. విద్యాభ్యాసముపూర్తి యైనపిదప ముఖ్యముగ త్రైవర్ణికులు స్నాతకవ్రతము గావించుకొని, విశేషవిద్యాలోకానుభవసంపాదనార్థము కాశీయాత్రకై పాదచారులై దేశముయొక్క ఒకమూలనుండి మఱియొక మూలకు యాత్రచేసి (ప్రయాణముచేసి) అనేకానుభవములను పొందుటయేగాక వారిపాండిత్యము (విద్య) ను పరీక్షించుకొనుటకును, సంపూర్ణత పొందుటకును, మార్గమధ్యమున నుండు గొప్పగొప్పపండితులను, అనుభవజ్ఞులను కలిసికొని వారితో చర్చలు జరిపెడివారు.

పండితులు లేక అవతారమూర్తులు ఉత్తరహిందూస్థానము, కాశ్మీరమునుండి కన్యాకుమారివఱకుకూడ తర్కము వేదాంతము అచ్చటివారితో చర్చించి, వారి నోడించి దిగ్విజయిపండితు లనెడిబిరుదమును పొందుచుండి రనువిషయమును మనము వినుచుంటిమి.

పూర్వము ప్రయాణసౌకర్యములు లేక మార్గమున మృగచోరరోగభయము లుండుటచే కాశికి వెళ్ళినవారు కాటికి వెళ్ళినవారితో సమాన మనుసామెత గలదు. అట్లున్నను అనేకులు యాత్రలుసల్పినట్లు చరిత్రలవలన తెలియుచున్నది. దీనియర్థ మేమన ప్రాణమునకన్న తీర్థాటనమేయెక్కువ

యనిగ్రహించి, యాత్రలో ప్రాణము పోవుటకైన సంసిద్ధులై యాత్రలు సల్పి వారు తదౌన్నత్యమును చాటిరి.

మహాభారతమున పాండవులు యాత్రలుచేసినట్లును, రామాయణమున శ్రీరామచంద్రుడు తనయేడవయేట తీర్థాటనము గావించి శివవిష్ణుక్షేత్రముల నెనుబదింటిని దర్శించినట్లునున్నది; గాన యాత్రలుచేయు టనాదినుండి వచ్చునాచారమై యున్నది. బౌద్ధభిక్షుకులు బౌద్ధక్షేత్రములకు విశేషముగా యాత్రలు సల్పినట్లును, ఇతర దేశములనుండిగూడ కొందరు ప్రాజ్ఞులు యాత్రలుచేయుటకు భారతదేశమునకు వచ్చినట్లును చరిత్రలవలన మనము వినుచున్నాము.

తీర్థాటన మొకగొప్పసాధనముగ తీసికొని ఒక్కొక్క రొక్కొక్కమార్గమున యాత్రలుచేసి దానిఫలమును పొంది యుండిరి. పుండరీకు డంధు లగుతనతల్లిదండ్రులను భుజములపై మోసికొనిపోయి యాత్రలను చేసినట్లును, శ్రీఏకనాథస్వామి కాశినుండి గంగాజలము (కావడి) భుజమున నిడుకొని తీర్థాటనము చేసినట్లును, మనుచరిత్రలో ప్రవరుడు పసరుమహిమచే తీర్థాటనము గావించినట్లును, తుకారాం, జ్ఞానదేవు, నామదేవు, కబీరుదాసు, ఇత్యాదిభక్తశిరోమణులు, యాత్రలు చేసి తమభక్తి నభివృద్ధిపరచుకొని, మోక్షమార్గమున త్వరితముగ గనుటకు ప్రథమసాధనముగ గైకొనినట్లును నిశ్చయించుటకు సందేహము లేదు.

వారు వీరననేల భగవచ్చింతన గలభక్తులు జ్ఞానులు, అవతారపురుషులు యాత్రచేసి తరించలేదా! మనలో కొందఱు

యాత్రలుచేయుటకు సమయము వృద్ధావస్థ యనియు తరుణావస్థ కాదనియు వాదించెడివారును గలరు. కాని యాత్రచేసి అనేక నూతనానుభవములను గ్రహించి భావిజీవితమున మార్పు జెందుటకు ముసలితనమని నిర్ధారణమేమి? శ్రీరాముడు, శంకరుడు, వివేకానందుడు-ఇత్యాదులు యౌవనముననే తీర్థాటనములు చేయలేదా!

ఇటీవల పండరీపురమునుండి శ్రీగాడ్జే-బాబాగారి శిష్యులగు శ్రీతన్సారుమహారాజా, పుంజాజీమహారాజా,హరి భక్తమీరాబాయివార్లు లక్షలాదిరూప్యములు ఖర్చుచేసి,పాదచారులై నాల్గుధామములు తీర్థాటనము గావించి, వేలకొలది అజ్ఞానులకు జ్ఞానబోధచేసియు బీదల కన్నవస్త్రాదిసౌకర్యములు గల్పించలేదా!

## ఆధునిక ప్రయాణములు

పాశ్చాత్యవ్యామోహములలో పడి మునిగి తేలుచుండు ఈ నవయుగములో శ్రీమద్వివేకానంద, శ్రీరామతీర్థాదులుం తాము దూరదేశములకు యాత్రలుచేయుటవలననే ప్రాక్పశ్చిమ ఖండములకు నూతనాధ్యాత్మిక తేజమును కలిగించిరి. అంతియే గాక వివేకానందు డమెరికాఖండమునందు నూతనాధ్యాత్మిక జ్యోతిని ప్రకాశింపచేసెను. హైందవాధ్యాత్మికతత్త్వము నమెరికనులు గ్రహించి హిందుదేశమున్న నెత్తినపెట్టుకొనునట్లుచేసిన వివేకానందుడు పరివ్రాజకుడై హిందుదేశ మాసేతుహిమా

చలము పర్యటించియు తృప్తిజెందక, సముద్రముల దాటి ఖండ ఖండాంతరాలలో ఆధ్యాత్మికఘోష కావించగల్గుట కాతని విరామములేనియాత్రయే కారణము. ప్రపంచమున దూర ప్రయాణములు సలుపక యే దేశముగాని మతముగాని అభివృద్ధి జెందదు. ధీరులై ప్రాణత్యాగమునకైన వెనుదీయక యాత్రలు (దూరప్రయాణములు) చేయకయే సామ్రాజ్యములు నిర్మింప బడలేదని మనకు దేశచరిత్ర లుద్బోధించుచున్నవి.

పాశ్చాత్యులు ప్రయాణముచేయుటలో నిపుణులు, ఉత్సాహులు. కాని వారిప్రయాణములు ఆధ్యాత్మికములు గాక ప్రపంచసంబంధమైనవిగ నుండును. వారు ప్రాణత్యాగ మునేని గణింపక దూరప్రయాణములు చేయుట ప్రశంసనీయమే కాని అవి కేవల మైహికప్రయోజకములే. స్వదేశములను వదలి జీవితాంతము సముద్రయానములు సల్పిన కొలంబస్సు అమెరికాదేశమును, వాస్కోడిగామా ఆసియాఖండమును, తదితరులు ధ్రువములను, హిమాలయమునందలి ఎవరెష్టుశిఖ రాత్యున్నతాగ్రములను కనుగొనుటయందును, దీక్షగలవారై దీర్ఘప్రయాణములు చేసి తమజీవితములు గడపిరి. ఇట్లే ఫాహి యాన్, హ్యువాన్‌సాంగు మొదలగువారు చైనానుండి హిందూ దేశములో నున్నబౌద్ధక్షేత్రములను దర్శించినదెల్ల గ్రంథస్థము చేసిరి. అట్టిగ్రంథములనుండి మన మానాటిమన దేశౌన్నత్య మును పూర్వరాజులపరిపాలనావిధానములను క్షేత్రవైభవము లను గ్రహింపగలుగుచున్నాము.

# ఆనాటి దేవాలయములే నేటివిశ్వవిద్యాలయములు

పవిత్రభారతవర్షమున దేవాలయము లనాదిసిద్ధములు. దాదాపు రెండు వేలసంవత్సరములనాటి చరిత్రములను ఆనాటి శోభను దేవాలయములు నిలిచియుండి తెలియజేయుచున్నవి. దేవాలయములలో నేదో గొప్పమహిమాతిశయము లేకున్న అనేకరాజ్యములు గతించినను, పరరాజులు దండెత్తి దేవాలయములను కొల్లగొట్టి ధ్వంసముచేసినను, ఆయాకాలములలో జీర్ణదేవాలయములు పునరుద్ధరింపబడుచు వచ్చినవి. మతమునం దేవిశ్వాసము లేని యీకాలములోగూడ నూతనాలయము లనేకములు నిర్మింపబడుచునే యున్నవి. దీనిని బట్టిచూడ దేవాలయములు గొప్పఆధ్యాత్మికశక్తి, దైవశక్తులతో కూడుకొనియున్న వనుట సందియము లేదు. అవియే నేటికిని హైందవవిజ్ఞానమునకు సర్వతోముఖముగ సహాయకారిగ నిల్చియున్నవి.

దేవాలయములు మానవశరీరనిర్మాణము నాధారము చేసికొని నిర్మించబడినవి. దేహమే దేవాలయ మనియు జీవుడే పరమాత్మయనియు మనశాస్త్రములు తెలుపుచున్నవి; గనుకనే శ్రీకృష్ణభగవానునిచే మానవశరీరమునకు క్షేత్ర మను పద ముపయోగింపబడియున్నది. క్షేత్రమనగా దేవాలయమునుగూడ తెలుపునుగదా! ప్రాకార, గోపుర, ద్వారములు, గర్భాలయము మొదలగునవన్నియు మానవశరీరములోని భాగ

ములతో పోల్చబడి నిర్మింపబడినవి. మానవశరీరము పురుషార్థములు సాధించుట కెట్లుపకరించునో అట్లే దేవాలయములుగూడ వానిని పొందుటకు సహాయకరములు కాగలవు.

భారతదేశములో ఒకటిరెండు దేవాలయములు లేని గ్రామము లేదనియే చెప్పవచ్చును. ఏగ్రామములో దేవాలయము లేదో అట్టిగ్రామములో భోజనముచేయగూడదని శాస్త్రము చెప్పుచున్నది. పాశ్చాత్యులు వారి సర్వస్వము వినియోగించి విశ్వవిద్యాలయములను, వానిద్వారా కళాశాలలు, భవనములు మొదలగువానిని శాఖోపశాఖలుగ నిర్మించెడికాలములో మనభారతీయులు విశాలదేవాలయముల నిర్మాణముల ద్వారా మానసిక, నైతిక, సాంఘికవిద్యాప్రబోధ గావించిరి. సామ్రాజ్యములు మారినవి రోమన్ఎంపైర్ వంటి సామ్రాజ్యముతో వారివిశ్వవిద్యాలయము లడుగంటినవి. కాని భారతీయులు స్థాపించినవిశ్వవిద్యాలయములు (దేవాలయములు) శతాబ్దములు గడచినను, రాజ్యములు మారినను, మహాచక్రవర్తులు తలక్రిందైనను, నశించక నేటికిని శోభాయమానముగ ప్రకాశించుచునేయున్నవి. దేవాలయము విశ్వవిద్యాలయమెట్లగునన దేవాలయములలో శిల్పులు వారివారి నైపుణ్యమును చూపుచు, చిత్రకారులు వారిచిత్రకళానైపుణ్యమును, నృత్య, సంగీత, వాయిద్యకారులు వారికళలను, వేదశాస్త్రాధ్యయనపరులు భాషావాఙ్మయమును గ్రోత్త్రకొత్తవైఖరిని ప్రదర్శించుచుండుటచే దేవాలయము విశ్వవిద్యాలయ మగుచున్నది.

దేవాలయగోపురనిర్మాణము మనభారతీయు లెట్టిదూర దృష్టితో నిర్మించిరో చూడుడు. విషయచింతానిమగ్నుడైన మానవు డేప్రాంతములోనున్నను, తాను దూరమునుండియే దర్శించి భగవత్సంకీర్తన మొనర్చి, చింతావిముక్తు డగుటకై యెత్తుగా గోపురములను పర్వతశిఖరములపైన దేవాలయములను నిర్మించిరి.

ఇట్లు పరమపవిత్రమైనయుద్దేశములతో నిర్మించబడి సర్వతోముఖముగ మానవాభ్యుదయమునకు తోడ్పడుదేవాలయశిల్పవాఙ్మయములను మనవారిలో కొందరు నేడు నిర్లక్ష్య మొనర్చుట శోచనీయము. సర్వతోముఖముగ అనాదికాలము నుండి మనకు తోడ్పడుచున్న దేవాలయములను పునరుద్ధరించి వానిప్రాముఖ్యమును గ్రహించి దేశకళ్యాణమునకు దోహదము చేయుట మానవధర్మముగాదా !

## యాత్రచేయుటవలన మానవునిజీవితము ఆధ్యాత్మికముగ మారునా? అది యెట్లు?

"Even famous saints are reported to have gone to sacred places for spiritual practice in the belief that their efforts will be crowned with success with greater ease in such places".

పుణ్యక్షేత్రములలో చేయుఆధ్యాత్మికసాధనలు సులభముగ సఫలము లగుననువిశ్వాసముతో, ప్రఖ్యాతఋషిపుంగ

(4)

వులుసైతము ఆధ్యాత్మికసాధనలు గావించుకొనుటకు పుణ్య క్షేత్రములకు వెళ్లియున్నట్లు తెల్పబడియున్నది.

"The very dust of India has become holy to me. The very air is now to me holy. It is now the holy land, the place of Piligrimage, the thirtha" (తీర్థ.) Vivekananda.

(విదేశపర్యటనానంతరము)

భారతదేశపుమృత్తుకూడ పవిత్రమైనట్లు తెలిసికొనగలిగితిని. ఇప్పుడు భారతవర్షపుగాలికూడ పవిత్రతతో నిండియున్నదని నేను గ్రహించితిని. ఇప్పుడు నా కది మహాపుణ్యభూమి, యాత్రాస్థలము, పుణ్యతీర్థ మైనది.

యాత్రికు డేభావముతో యాత్రచేసిన తదనురూపఫలమునే పొందును. ప్రతిమానవుడు గమ్యస్థానమును చేరుటకు తీర్థయాత్రలు సల్పుట ముఖ్యాతిముఖ్యము. ఏలయన ఆయా క్షేత్రములలో నుండుఆధ్యాత్మిక విద్యుచ్ఛక్తిబలము యాత్రికుని ప్రాపంచికదృష్టి నణచివైచును. నాటినుండి యాతనిశరీరములో ఆతనికి తెలియకుండగనే ఒకనూతనవికాసము గలిగి యాతడు సన్మార్గమున జీవితమును గడుపప్రయత్నించును. మహాక్షేత్రములలోని దేవతాదర్శనమయినపుడును, సాధువులతో, మహాపురుషులతో, భక్తులతో సాంగత్యము కలిగినప్పుడును, ఆయా క్షేత్రములలో తరించిన భక్తులయొక్క జీవితచరిత్రములను స్మరించుకొనినప్పుడు ఎవనిశరీరము పులకరింపకుండును ?

తిరుపతియందు శ్రీవెంకటేశ్వరస్వామిని, రామేశ్వరమున శ్రీరామచంద్రప్రతిష్ఠిత రామలింగేశ్వరస్వామిని దర్శించినప్పుడును, కన్యాకుమారికడ దేవీప్రభావమును, మంచుచే కప్పబడి సూర్యకాంతికి కరిగించిన వెండివలె ద్రవీభూతమగుచు ధగధగ మెరయుహిమాలయశిఖరములను చూచినప్పుడును లేక మనస్సునకు స్ఫురించునపుడును ఎవనిహృదయము భక్తిరసముతో పొంగిపొరలదు! యాత్రలు పూర్తిచేసివచ్చినవానిహృదయమున సమస్తతీర్థములు, వనములు, గిరులు, సాధువులు వారి ప్రభావములు నాటుకొనిపోవును.

"Almost every town, stream, hill, stone or animal is personified and sanctified in India. It is not high time now to deify the entire motherland and let every partial manifestation inspire us with devotion to the whole."

Ramathirtha.

"దాదాపు భారతవర్షములోని పట్టణము లన్నియును, నదులును, చిన్నపర్వతములును, అపరూప మగుశిలలును, జంతువులును దైవత్వముతో రూపొందింపబడి పవిత్రముచేయబడినవి. మనమాతృభూమిని దేవతాస్వరూపముగా గౌరవింపవలసినతరుణ మిది. అపూర్వలక్షణశోభితవస్తువు లన్నియు మాతృభక్తి నుద్దీపింపజేయునుగాక!"

అతడు సంసారమున మునిగి కష్టపరంపరలకు గురియైనప్పుడు, కన్నులు మూసికొని ఒక్కసారి తాను వెనుక సల్పిన యాత్రలను స్మరణకు తెచ్చుకొనిన, ఆకష్టపరంపరలన్నియు

వేయి సంవత్సరములచీకటి ఒకచిన్న అగ్నికణికచే పటాపంచ లయినట్లు ఛేదింపబడదా? పర్వదినములలో ఉదయమున స్నానసంధ్యాద్యనుష్ఠానములు సల్పునప్పుడు తాను పూర్వము గావించిన యాత్రాస్థలములలో సల్పుచున్నట్లు భావించిన బ్రహ్మానందము కలుగును.

తీర్థయాత్రలు సలుపునపుడు ప్రతివ్యక్తికి నుండుదురభిమానములు (అనగా తనమతమే గొప్పదనుకొనుట, తానే గొప్పవిద్వాంసు డనుకొనుట, తానే మిక్కిలిధనవంతు డనుకొనుట, దాత యనుకొనుట, తానే సర్వము తెలిసినవా డనుకొనుట ఇత్యాది) దంభ, గర్వము లోకలోకపరిస్థితినిబట్టి క్రమముగ నశించును. ఎవని కెప్పుడు దంభ, గర్వాభిమానములు నశించునో, యప్పు డతడు వెంటనే గొప్పమనోబలము, వినయవిధేయతలు, భూతదయ, పెద్దలయెడ గౌరవము, ఆధ్యాత్మికమునందు గొప్పశక్తి క్రమముగ నలవఱచుకొని మోక్షమార్గమునకు ముందంజ వేయును.

భక్తుడు పాదచారియై యావద్భారతయాత్ర చేయుచో మూడుగంటల కొకపర్యాయ మాధ్యాత్మికభావములను నుద్దీపింప జేయుయాత్రాస్థలము నొక్కదానిని సందర్శించగల యవకాశము గలదు.

తీర్థయాత్రలవలన పొందులాభము లనంతములు. పవిత్రమైన గంగాజలస్నానపానములవలన జనులు కెట్టిసౌభాగ్యము గలదో యాధునికశాస్త్రవేత్తలు తెలుపుచున్నారు. దేహా

రోగ్యమునకును మనశ్శాంతికిని దివ్యౌషధ మనదగుతీర్థయాత్రలను సేవించుటకు భక్తిప్రాధానమని మనశాస్త్రకారులు తెలుపుచున్నారు. కాన నిట్టియవకాశ మెప్పు డేర్పడునాయని ప్రతి భారతీయుడును ఆసించుచుండవలదా? తనజీవితములో గావింపదగు గొప్పకార్యము లెన్నియున్న వనుకొన్నను, బ్రహ్మానందమును గూర్చు తీర్థయాత్రాకార్యమునకన్న మిన్నయగునది వేఱొండున్నదా?

## దంపతులుగ యాత్ర చేయవలెనా?

గృహస్థునకు భార్య అర్థాంగి. జీవయాత్రాసాధనము. కాన తీర్థయాత్రకు వెళ్ళునప్పుడు తనయర్థాంగిని విడిచివెళ్లిన యాత్ర పూర్తి యెట్లగును? భర్తతోపాటు భార్యకుకూడ పాపపుణ్యములు వర్తించునుగాన తీర్థయాత్రాఫలము ననుభవించుటకై దంపతులు కలిసియే వెడలవలెను. పూర్వచరిత్రలు పరిశీలించిన సీత, దమయంతి, సావిత్రి మొదలైనపతివ్రతాశిరోమణులు భర్తలతో పాటు కష్టసుఖముల కోర్చి, తాము తరించుటేగాక లోకమున కాదర్శప్రాయ లై నేటికిని నీతి గరపుచున్నారు.

పురుషులు తా మొంటరిగా యాత్రలు సలిపిన స్త్రీలగతి యేమి? వారిని యాత్రలకు తీసికొనివెళ్ళువా రెవరు? కావున పురుషుని యాదాయవ్యయములఫలితములు రెండును భార్యకు

జెందునుగాన స్త్రీని తప్పక ప్రతిపురుషుడు యాత్రలకు వెంట బెట్టుకొని వెళ్ళవలెను. భార్యపిల్లలు వెంట నుండిన వారు తమకు మార్గమున యాతనయని తలపరాదు. భార్య మార్గ మధ్యమున తా నెన్నికష్టముల కోర్చియైన భర్తను జాగరూ కతతో గాపాడుచు, వేళకు భోజనపానీయము లమరునట్లు చేయుటచే మార్గమధ్యమున నెట్టియిబ్బందులు గలుగకుండ యాత్ర పూర్తిగావించుకొనవచ్చును.

నదీనదములలో సముద్రములలో తీర్థమాడునప్పుడు దంపతులు జంటగా తీర్థమాడవలెనేగాని ఒంటరిగా చేయుటచే దానిఫలితము తన కొక్కనికే రాదు. కాశీ, గయా, ప్రయా గాదిక్షేత్రములలో తీర్థశ్రాద్ధాదు లాచరించునపుడు భార్య వెంట లేకున్న నవి యసంపూర్ణములే యగును. తనభార్యచే పక్వముచేయబడి, తనచే సమంత్రకముగ నొసంగబడుపిండ, తిలోదకాదులనే పితరులు తృప్తితో స్వీకరించి ఆయాక్షేత్రనాథ ముఖమున సంపూర్ణఫలభరిత మగునట్లనుగ్రహింతురు. ఎంతో ధనవ్యయ మొనర్చి దూరక్షేత్రములకు వెళ్లియు పూర్ణఫలితము నొందలేడుగాన తన వెంట తనధర్మపత్నిని గొని తీర్థయాత్రలు చేయుటే ముఖ్యము.

భార్యాభర్తల కెన్నడు నెడబా టుండరాదు. యాత్రల కొంటరిగా వెళ్ళిన 3 లేక 4మాసములు పట్టిన, నొకరియోగక్షే మము లొకరికి తెలియక మనస్సు ప్రధానముగ పరమేశ్వరుని యందు లీనముగాక, యింటియందో లేక భార్యాపుత్రాదుల

యందో లీనమయి యెప్పుడు తిరిగివెళ్లుదుమా యనుతలంపు నకు కారణభూతమై యుండును. కాన దంపతు లిరువురు వెళ్లిన నింటిగొద్ద నుండువారిపై భ్రాంతితగ్గి, తనమనస్సు పరమేశ్వరుని యందే లగ్నమై యాత్రాఫలితమును భార్యాభర్త లిరువురు ననుభవింతురు.

స్త్రీలు సాధారణముగ తమయింటియావరణము వదలి యెన్నడును బయట స్వేచ్ఛగా అనగా భక్తులను, క్షేత్రములను సేవించ వీలుండదుగాన తమజీవితములో నొక్కమారైన తమ భర్తతో కలిసి తీర్థయాత్రలు చేయనిచో, తాను కూపస్థమండూ కముగ నుండి బాహ్యప్రపంచ మనగా నేదో తెలియదుగాన, అటుగాక భార్యను తనతోపాటు తీర్థయాత్రలకు తీసికొనివెళ్ళి ఆధ్యాత్మికవిద్యాజ్ఞానము పడయున ట్లవకాశము కలిగించు టెంతయు నవసరము.

# యాత్రాదీక్ష

కాలినడకన ఆసేతుహిమాచలము పర్యటనముచేయువిధానము.

---

భక్తి, జ్ఞాన, యోగాదిమార్గములచే పరమేశ్వరుని చేరు టకు సాధకులెట్లు తమకాలము నుపయోగింప ప్రయత్నింతురో, అదే విధముగ బ్రహ్మచారులు, గృహస్థులు, సాధువులు నిరంత రము తీర్థయాత్రలు జరుపుటయందు తమకాలమును వినియో గించుటయే యాత్రాదీక్ష. ఈదీక్షయందు ఆసేతుహిమాచలము

పాదచారిత్వమున తీర్థముల సేవించుకొనుచు కాలముగడపనిశ్చ యించుకొని దానిప్రణాళిక ముందుగ నేర్పఱచుకొని, లేదా భగవంతు డెట్లు నడపిన నట్లు నడచుటకు నిశ్చయించుకొని తీర్థా టనము సలుపవచ్చును. 'ఇట్లు దేశమునం దొకమూలనుండి మరి యొకమూలకు దేశద్రిమ్మరులవలె తిరిగినంతమాత్రమున మోక్ష మును సాధింపగలమా? ఇక్లెందఱు నిరంతరము తిరుగుట లేదు? ఎందఱుబైరాగులు తిరుగుటలేదు? వారందఱు తరించిరా? ఇది యేటిమాట' యనరాదు. వారిలో నొక్కడును యాత్రాదీక్షా పరుడు లేడు. అందఱుపొట్టపోసికొన దిరుగువారే. దీక్షాపరుని వారివలె గణింపరాదు. ఈదీక్ష నిర్వహించుట సులభము గాదు. కామినీకాంచనములయం దాసక్తివిడిచి నిరంతరము నోట భగవ న్నామ ముచ్చరించుచు, మనస్సు పరమేశ్వరునిపై లగ్నముచేసి, మార్గమున వచ్చుకష్టపరంపరలకు వెఱవక అవియన్నియు భగవ ద్వినోదములుగ భావించి, తమమార్గమున పోవునారే నిజ ముగ దీక్షాపరులు. వారిని పరమేశ్వరుడు తప్పక కటా క్షించును. అట్లు నేటికాలమున పరివ్రాజకుడై యాత్రసల్పిన శ్రీమద్వివేకానందస్వామివారికి పరమేశ్వరు డెన్నిసారులు భృత్యుడై మహారణ్యములలో నాహార మిడలేదు? స్వామి రామదాస్ (కాంచన్‌గాడ్) వారు వనపర్వతగుహలలో 12 సం॥ ఏకదీక్ష కొని యాత్రలు సల్పినప్పుడు పరమేశ్వరుడు గోవు వెంట దగులుకొ డెభంగి నిరంతర మాయనయడుగులలో నడు గులు వైచుచు రక్షించలేదా? ("In the Vision of God" అనుఆంగ్లగ్రంథము చూడుడు.) ఇది ఇటీవల జరిగినవిషయమే

గదా? భగవంతుని నమ్మవలెనేగాని నమ్మినవారిని భగవంతుడు చెరుపడు. ఇట్లు దీక్షగ యాత్రలుచేయునభ్యాస ముత్తర హిందూదేశమున సాధువులలో ముఖ్యముగ గలదు. కొన్ని సంప్రదాయములగురువులు తమశిష్యుని శిక్షింపవలసివచ్చి నప్పుడుగాని లేదా శిష్యుని బాగుపఱచదలచినప్పుడుగాని పాదచారియై ఆసేతుహిమాచలము తీర్థయాత్ర చేసిరావలసిన దని శిష్యు నాజ్ఞాపింతురు. అట్లుచేయుటచే శిష్యుడు యాత్రా కాలమున శీతాతపముల నోర్చియు, కష్టనిష్ఠురములు వచ్చి నప్పుడు గురుకటాక్షమును గోరియు, అవమానము లెన్ని తటస్థించినను వానిని శాంతితో సహించియు, తనదుర్గుణముల నెల్ల పోగొట్టి స్వచ్ఛజీవితము గలవాడై మరల తనగురువు గారిసేవ చేయ నుత్సహించును. స్వస్థానమును వదలి యిట్లు యాత్రలుచేయబోవుతరి ప్రారంభమున కష్టముగ కనిపించినను కాలక్రమమున సులభముగ తోపకమానదు. శ్రీరామ చంద్రుడు 14 ఏండ్లు వనములలో పాదచారియై సంచరించి పెక్కు మార్పులు ప్రజలలో గల్పించి తిరిగి సురక్షితముగ అయోధ్య చేరలేదా? కావున దీక్ష గైకొనినమీదట సులభ మగును.

కొంద ఱింకొకవిధముగ దీక్ష గైకొందురు. ముఖ్యమైనజీవనదులప్రదక్షిణము (పరిక్రమము) చేయుట. ఇది చాల కఠినమైనసాధన. రైలు, కారు, బండ్లు వసతులు కలిగియుండుటచే, మామూలుతీర్థయాత్రలు చేయుట చాల సులువు. గాని నదీప్రదక్షిణముచేయుటకు పాదచారియై అది ఉద్భవించిన

కొండలలోనుండి సవ్యముగ బయలుదేరి, అది సాగరము చేరు వఱకు వెళ్ళి, అచ్చటనుండి రెండవవైపుగ మరల తిరిగి వెళ్ళి జన్మస్థానము చేరుట. ఇది తీవ్రమైనసాధన. ఇది కేవలము తీవ్రమైనఆధ్యాత్మికచింతన గలిగి దాని ప్రభావము తెలిసికొనిన వారే చేయుదురు. అట్లుచేసినవారిలో మనము వినినవారు ప. ప. శ్రీబ్రహ్మానందతీర్థులగురువుగా రగు ప. ప. శ్రీవాసుదేవానంద స్వామివారును, 'వేదోద్ధారకు'లగు ప. ప. రామచంద్రేంద్రసరస్వతీస్వాములవారును, శ్రీపీసపాటి అప్పావధానులుగారు, అమరావతి) గలరు. పండరీపురమునకు వార్కరీపద్ధతి యనునొకగొప్పనియమముతో యాత్రచేయువిధాన మొకటి యున్నది. కార్తికశుద్ధైకాదశికిని, ఆషాఢశుద్ధైకాదశికిని శ్రీపాండురంగని సేవించునిమిత్తము తన గ్రామమునుండి పాదచారియై యాత్రచేయుట. ఈవిధానము బొంబాయిరాజధానియందు మహారాష్ట్రదేశమున హెచ్చుగకలదు. అట్లనేకులు నేటికిని చేయువారు కలరు. తరించినవారు లెక్కకు మీరియున్నారు.

విధానము :—

ఈదీక్ష తీసికొనుసాధకుడు, ప్రతినిత్యము తనయింటియొద్ద పాండురంగభజనలు సలుపుచుండి ప్రతిఏకాదశికి నుపవాసముండి, తనగ్రామములో నున్నయితరభక్తులతో గూడి భక్తులజీవితములు చదువుట, మొదలగుసత్సాంగత్యము సలుపుచు, ఆషాఢ శు॥ ౧౧ కి పండరిపురమునకు తనగ్రామమునుండి పల్లకిలో స్వామినిగాని లేక ఒకభక్తుని జన్మస్థలమైన ఆగ్రామ

మున తరించినఆభక్తుని (తుకారాం, జ్ఞానదేవు, నామదేవు- ఇత్యాదిభక్తుల) యొక్క ఛాయాపటమునుగాని అం దుంచి, ఒక్కొక రొక్కొకకాషాయపుజెండాను దీక్షగ తనభుజముపై నుంచుకొని, ఆ పల్లకితో అనేకభక్తజనులతో పాదచారియై కోలాహలముగ శరీరములు తన్మయత్వ మొందులాగున భజన చేయుచు గ్రామగ్రామము, వాడవాడ, తిరుగుచు యథేచ్ఛగ లభించుదానితో తృప్తిజెందుచు, ఆషాఢ శు॥ ౧౧కి ఒకటి రెండు దినములు ముందుగనే పండరీపురము చేరుకొనును. ఈవిధముగ కొన్ని వందలమైళ్ళదూరమున నున్నవారు సైతము దీక్షగైకొని, పల్లకీవెంట పయనమై, మార్గమధ్యమున అనేకనూతనభక్తుల దర్శనముచేతను, క్రొత్తక్రొత్తఅనుభవములచేతను వారలజీవిత ములు పవిత్రపఱచుకొందురు. కొందఱికి కేవలము పండరీ పురము చేరుటకు 6 మాసములకాలము పట్టును. మరల ఈ విధముగ పాదచారులై స్వగ్రామమును చేరుటకు 6 మాస ములు పట్టును. అనగా అటువంటివారికి తమజీవితమంతయు నీయాత్రాదీక్షతోనే, సరిపోవుచుండును. ఇట్లు తరించినభక్తు లనేకులు గలరు. నేటికిని ఈవార్కారీపద్ధతి ఆషాఢ శు॥ ౧౧ నాడు పండరీపురమును దర్శించినభక్తులకు తెలియగలదు. ఈ దీక్షను కొందరు 12 సంవత్సరములవఱకు తీసికొందురు. మరి కొందరు జీవితాంతమువరకు గైకొందురు.

నియమముగ కుంభమేళములను, నదీపుష్కరములను దర్శించుటయు నొకసాధనమే. మేళ యనగా హిందీభాష

యంచు కలియుట యనిభావము. అనగా పెక్కువేలమంది ఆధ్యాత్మికభావము గలవా రొకచోట కలియుట యనిభావము. ఇట్టివి కుంభమేళ (ఇది 12 సం॥ లకు ఒకసారియు,) మాఘమేళ (ప్రతిసంవత్సరము మాఘమాసములోను జరుగుచుండును.) ఇట్టికుంభమేళలు ముఖ్యముగ హరిద్వారము, ప్రయాగ, (అలహాబాదు,) ఉజ్జయిని (అవంతిక) నాసికాదిక్షేత్రములలో 12 సం॥ ఒకసారి జరుగును. ఆమేళోత్సవములకు సంవత్సరముల కొలది హిమాలయనిర్జనారణ్య ప్రదేశములో తమ తపోమహిమచేత భగవద్ధ్యాన నిమగ్నతజెంది కాలముగడపు, యోగి, సాధు, సన్న్యాసి, దిగంబర ప్రభృతులు వేనవేలుగ వత్తురు. వారిముఖవర్చస్సు వారియాధ్యాత్మికశీవిని చూచియే తీరవలెను. వర్ణింప నలవిగాదు. అట్టిమహనీయులతో సత్సంగము యాత్రికునిహృదయాంతరాళములలో ప్రవేశించి యెన్నటికిని మఱపునకు రాక ఆధ్యాత్మికజ్యోతిని మిక్కిలి ప్రకాశింపజేయుచుండును. ఇట్టిమేళలు, పుష్కరములు నియమముగ దర్శించుసాధకునియానంద మేమని వర్ణింతుము!

# యాత్రా విధానము

శ్లో॥ విరాగం జనయే త్పూర్వం కలత్రాదికుటుంబకే।
అసత్యభూతం తత్ జ్ఞాత్వా హరిం తు మనసా స్మరేత్ ॥

శ్లో. క్రోశమాత్రం తతో గత్వా రామరామేతి చ బ్రువన్।
తత్రతీర్థాదిషు స్నాత్వా క్షౌరం కుర్యాత్ విధానవిత్ ॥

శ్లో. మనుష్యాణాం చ పాపాని తీర్థాని ప్రతిగచ్ఛతామ్।
కేశ మాశ్రిత్య తిష్ఠన్తి తస్మాత్తద్వపనం చరేత్॥

శ్లో. తతో దండం తు నిర్గ్రంథిం కమండలు మథాజినమ్।
బిభృయా ల్లోభనిర్ముక్త స్తీర్థవేషధరో నరః॥

శ్లో. విధినా గచ్ఛతాం నృణాం ఫలావాప్తి ర్విశేషతః।
తస్మాత్ సర్వప్రయత్నేన తీర్థయాత్రావిధిం చరేత్॥

శ్లో. యస్య హస్తౌ చ పాదౌ చ మనశ్చైవ సుసంయుతమ్।
విద్యాతపశ్చ కీర్తిశ్చ స తీర్థఫల మశ్నుతే॥

శ్లో. హరే కృష్ణ హరే కృష్ణ భక్తవత్సల గోపతే।
శరణ్య భగవన్ విష్ణో మాం పాహి బహుసంసృతేః॥

శ్లో. ఇతి బ్రువన్ రసనయా మనసా చ హరిం స్మరన్।
పాదచారీ గతిం కుర్యాత్ తీర్థం ప్రతిమహోదయః॥
(పద్మపురాణము)

యాత్రికు ప్రయాణమైనప్పటినుండి ఐహికదృష్టిని మరల్చుకొని ఆధ్యాత్మదృష్టి నలవరచుకొనుచు, రామనామమును జపించుచు రెండుమైళ్లు నడచి, ఒకక్షేత్రమును జేరి స్నానాదులు గావించుకొని శుచియై, శిరోముండనాదుల గావించుకొని, కామాదుల వర్జించి కాషాయాంబరధారియై కమండలు, కృష్ణాజినముల గొని హరినామస్మరణగావించుచు, తీర్థయాత్రలను యజ్ఞదృష్టితో సలుపువారు శాస్త్రములలో చెప్పినవిధమున తీర్థయాత్రాఫలములను తప్పక పొందగలరు.

# యాత్రాఫలానుభూతికి యోగ్యులెవరు ?

శ్లో. ప్రతిగ్రహా దుపావృత్తః సంతుష్టో యేన కేనచిత్।
అహంకార విముక్తశ్చ స తీర్థఫల మశ్నుతే॥

లభ్యమైనదానితోడనే తృప్తిపడి, పరులొసంగు దాన ధర్మముల గ్రహింప పాల్పడక, అహంకారమును విడుతురో వారు తీర్థయాత్రాఫలానుభూతికి యోగ్యులు.

శ్లో. అదమ్భకో నిరారమ్భో లఘ్వాహారో జితేన్ద్రియః।
విముక్త స్సర్వసంగై ర్యః స తీర్థఫల మశ్నుతే॥

కపటవర్తనము లేక, వ్యావహారిక విషయాసక్తివిడచి, ఇంద్రియనిగ్రహము, ఆహారనియమము కలిగియుందురో వారు తీర్థయాత్రాఫలానుభూతికి యోగ్యులు.

శ్లో. అకోపనోఽమలమతి స్సత్యవాదీ దృఢవ్రతః।
ఆత్మోపమశ్చ భూతేషు స తీర్థఫల మశ్నుతే॥

సర్వభూతములను తనవలెనే చూచుకొనుచు, కోపమును చంపుకొని, సత్యవ్రతుడై, గట్టిదీక్షతో త్రికరణశుద్ధి పడసినవారు తీర్థయాత్రాఫలానుభూతికి యోగ్యులు.

శ్లో. తీర్థా న్యనుసరన్ ధీరః శ్రద్ధధాన స్సమాహితః।
కృతపాపో విశుద్ధ్యేత కింపున శ్శుద్ధకర్మకృత్॥

దీక్షతో, ప్రశాంతచిత్తముతో తీర్థయాత్రలుసేవించు పాపియైనను బవితుడగును. అట్టిచో మొదటినుండి సత్కర్మాదు లాచరించు సుజనులపవిత్రతావిషయమున సందేహమేమి ?

శ్లో. అశ్రద్దధానః పాపాత్మా నాస్తికోఽచ్ఛిన్నసంశయః।
హేతునిష్ఠశ్చ పంచైతే న తీర్థఫలగామినః॥

(స్కాందపురాణము)

దేవతాశ్రద్ధాభక్తి లేనివారు, దుష్టచింతలు గలవారు, ఎవరిని విశ్వసింపనివారు, ప్రతివిషయమున అనుమానము గలవారు, కుతర్కము చేయువారు, తీర్థయాత్రాఫలమును పొందరు.

శ్లో. నృణాం పాపకృతాం తీర్థే పాపస్య శమనం భవేత్।
యథోక్తఫలదం తీర్థం భవేచ్ఛ్రద్ధాత్మనాం నృణామ్॥

పాతకుల పాపములు తీర్థయాత్రాస్థలములందు క్షాళితమగును. సత్పురుషులకు తీర్థములు శాస్త్రోక్తఫలప్రదములగును.

శ్లో. కామం క్రోధంచ లోభంచ యో జిత్వా తీర్థమావిశేత్।
న తేన కించిదప్రాప్తం తీర్థాభిగమనాత్ భవేత్॥

కామక్రోధలోభములను జయించి, తీర్థయాత్రలనాచరించుపుణ్యాత్ములు పడయరాని శ్రేయస్సెద్దియును లేదు; అనగా సర్వశ్రేయస్సులను బడయగలరు.

శ్లో. తీర్థానిచ యథోక్తేన విధినా సంచరన్తి యే।
సర్వద్వంద్వసహా ధీరా స్తే నరాః స్వర్గగామినః॥

శీతోష్ణాదిద్వంద్వముల సహించి, శాస్త్రములందు నిర్దేశింపబడిన రీతిగ తీర్థయాత్రలు సలుపుధీరులు తప్పక స్వర్గమును బడయఁగలరు.

శ్లో. గంగాదితీర్థేషు వసన్తి మత్స్యాః
దేవాలయే పక్షిగణా శ్చ సన్తి।
భావోజ్ఝితా స్తేన ఫలం లభన్తే
తీర్థాచ్చ దేవాయతనాచ్చ ముఖ్యాత్।
భావం తతో హృత్కమలే నిధాయ
తీర్థాని సేవేత సమాహితాత్మా॥

(నారదపురాణము)

జాహ్నవివంటిపవిత్ర నదీతీర్థములలో కోటానుకోట్లు మత్స్యములు నివసించుచున్నవి. దేవాలయములం దనేక పక్షులు వసించుచున్నవి. కాని శ్రద్ధాభక్తిభావము లేనియట్టి వానికి తీర్థయాత్రాఫలమబ్బునా? అబ్బదు. కాన విశ్వాసపూరితహృదయములతో మానవు లాపవిత్రస్థలముల సేవించిన ఫలానుభూతి గలుగును.

## తీర్థయాత్ర లెందుకు?

శ్లో. వలీపలితదేహో వా యౌవనే నాస్తికోఽపి వా।
జ్ఞాత్వా మృత్యు మనిస్తీర్య హరిం శరణ మావ్రజేత్॥

శ్లో. తత్కీర్తనే తచ్ఛ్రవణే వన్దనే తస్య పూజనే।
మతిరేవ ప్రవక్తవ్యా నాన్యత్ర వనితాదిషు॥

శ్లో. సర్వం నశ్వర మాలోక్య క్షణస్థాయి సుదుఃఖదమ్।
జన్మమృత్యుజరాతీతం భక్తివల్లభ మచ్యుతమ్॥

శ్లో. స హరి ర్జ్ఞాయతే సాధుసంగమాత్ పాపవర్జితాత్।
యేషాం కృపాతః పురుషా భవ న్త్యసుఖవర్జితాః॥

శ్లో. తే సాధవః శాంతరాగాః కామలోభవివర్జితాః।
బ్రువన్తి య న్మహారాజ! త త్సంసారనివర్తకమ్॥

శ్లో. తీర్థేషు లభ్యతే సాధూ రామచంద్రపరాయణః।
యద్దర్శనం నృణాం పాపరాశిదాహాశుశుక్షణిః॥

శ్లో. తస్మా త్తీర్థేషు గన్తవ్యం నరైః సంసారభీరుభిః।
పుణ్యోదకేషు సతతం సాధుశ్రేణివిరాజిషు॥

పద్మపురాణము – పాతాళఖండము 19.

విషయానుభవానికి యోగ్యమగు యౌవనముననున్నను, కాటికి కాళ్లుచాపుచున్న ముసలితనమున నున్నను ప్రతిమానవుడు శ్రీహరిని శరణువేడవలయును. ఎందుకన మరణము తప్పనిసరికనుక. యాత్రార్థము వెడలుచున్నపుడు సృష్టికర్త సంస్మరణముతప్ప భార్య, బిడ్డలు, ఇల్లు, వాకిలివంటి వేఱు తలంపులకు మనసునం దవకాశ మీయరాదు. ప్రపంచమున

కనుపించునదంతయు అనిత్యమని భావించి, జన్మజరామరణ ములకతీతుడయిన అచ్యుతుని శరణువేడవలయును.

మహాత్ముల దర్శనభాగ్యముచే మానవులదుఃఖములు నశించును. ఏతత్ప్రపంచ, పరప్రపంచసంబంధ బంధములను మహాత్ములు త్రెంచుకొనినవారు కనుక వారికి సుఖదుఃఖములు లేవు. అట్టివారిసంపర్కముచే శ్రీహరికటాక్షము సులభసాధ్య మగును. పవిత్రభూములలోని పవిత్రహృదయులు శ్రీరామ చంద్రుని సాక్షాత్తు సృష్టికర్తగా దర్శించుచుందురు. వారి దృష్టిప్రసరణద్వారా మానవకోటిపాపపంక మంతయు దూది వలె భస్మమగును. అందువలన పవిత్రనదీనదములకు మహాత్ము లకు ఆలవాలమయిన పుణ్యక్షేత్రములను సర్వులు సందర్శించ వలయును. (పద్మపురాణము)

# యాత్రలలో నిత్యకార్యక్రమము లేక దినచర్య

| | | | |
|---|---|---|---|
| గం. 4- 0 | మొ | 4-30 | ప్రభాతసేవ (క్లుప్తముగ) |
| ,, 4-30 | ,, | 5-30 | ప్రాతః కాలకృత్యములు |
| ,, 5-30 | ,, | 7- 0 | స్వధర్మానుష్ఠానము |
| ,, 7- 0 | ,, | 9- 0 | నదులు, పుష్కరణులు, సముద్రములలో ప్రత్యేక స్నానములు, తీర్థవిధులు, దేవతాదర్శనము మొద లగునవి యాచరించుట |
| ,, 9 -0 | ,, | 9-30 | బజారువస్తువులు కొనుట [కూరలు, పెరుగు, బియ్యము - పూటకు వంటకవసర మగువస్తువులు మాత్రమే] |

,, 9-30 ,, 11-30 పచనము, భోజనము
,, 11-30 ,, 12-30 విశ్రాంతి
,, 12-30 ,, 2- 0 సద్గ్రంథపఠనము లేక సాయంతనకార్యక్రమనిర్ణయ విచారణ
,, 2- 0 ,, 3-30 బజారుపనులు - క్రొత్తసామానులుకొనుట
,, 3-30 ,, 6- 0 దేవతార్చనము. (ముఖ్యముగ ఆక్షేత్రములో చూడవలసిన విశేషములు మొదలగునవి చూచుట)
,, 6- 0 ,, 7- 0 ఇంటికి (బసకు) చేరుట, కాలకృత్యములు
,, 7- 0 ,, 8- 0 భోజనము, లేక ఫలాహారము (ఫలాహారము చేయుట మంచిది)
,, 8- 0 ,, 9- 0 ఆదినము చూచినవానిపై నోట్సువ్రాయుట లేక మరుసటిదినము కార్యక్రమనిర్ణయము లేక ఆలయములలో పవళింపుసేవ దర్శనము.

ఈకార్యక్రమము మరుసటిదినమునుండి తప్పక సాగును. హిమాలయములలో పయనించునప్పుడు కొద్దిగ మార్పు చెందును. యాత్రికులవీలు ననుసరించి కార్యక్రమము నిర్ణయించుకొనవలెను. నిర్ణీతకార్యక్రమము లేనియెడల కాలము వృథయగును. తీర్థయాత్ర ప్రయాసఫలకమగును. యాత్రికుడు సమయము వీలును అనుసరించి యీకార్యక్రమములో కొలది మార్పులను చేసికొనవచ్చును.

ఇట్లే తీర్థయాత్రబయలుదేరుటకు ముందుగా తాము చూడదలచిన పుణ్యక్షేత్రములు, అచ్చట నుండదలచినదివసములు గుర్తించి కాలనిర్ణయపట్టి తయారుచేసికొని బయలుదేరుట చాలమంచిది.

# యాత్రలుచేయుటకు వివిధసాధనములు

యాత్రలుచేయుటకు వివిధములైనసాధనములు గలవు. అన్నిటికంటె పాదచారియై కేవలము భగవంతునిపై భారము నైచి (భగవంతుని శరణాగతిపొంది), మరుక్షణముసంగతి తాను విచారింపక, భగవదాదేశానుసారముగ తీర్థయాత్రలు చేయుట ఉత్తమోత్తమ మైనమార్గము. ఇట్లుచేయువారు నేటి కిని అనేకులు గలరు. వారిలో సాధువులు పలువురు. 1939 వ సంవత్సరము షుమారు 40 మంది అయోధ్యాకాక్ చౌకుకు చెందినవైష్ణవసంప్రదాయసాధువులు పాదచారులై, గంగోత్రి సేవించి, గంగాజలము గొని శ్రీరామేశ్వరము వెళ్ళుచు శ్రీరామనామక్షేత్రమునకు వేంచేసి కొన్నిదినము లుండి వెళ్లిరి. నిజముగ వారిసత్సంగము, వారిపూజా, కీర్తన, పఠనాదినిత్య కార్యక్రమము చూచియేతీరవలెను. వారిపట్టుదల కార్యదీక్ష వర్ణనాతీతము.

రెండవమార్గము — బండ్లమీద నెక్కిపోయి తీర్థ యాత్రలు సల్పుట. ఇది కొంచెము వ్యయప్రయాసలకు సంబం ధించినది. ఇది గృహస్థులుగూడ చేయవచ్చును. దీనివలన జీవిత మున పెక్కుమార్పులు గలిగి విశాలహృదయ మేర్పడును. సంకుచితభావము లదృశ్యములగును. కాని యిదియు, నొక దక్షిణదేశయాత్ర పూర్తిచేయుటకే సంవత్సరకాలము పట్టును. మార్గమధ్యమున అనేకసాధుపురుషులు, భక్తులు, మఠములు, ఆశ్రమములు, క్షేత్రములు, వనములు, గిరులు, తీర్థములు,

తటస్థపడి మనయిచ్ఛానుసారముగ అచ్చట కాలము గడుపు కొనుచు ప్రయాణములు సాగించుచుండవచ్చును. ఇతరమార్గములలో నీవసతి చాలతక్కువ. కనుకనే పూర్వమునుండి మన మఠాధిపతులు (శంకర, రామానుజ, మధ్వాచార్యపీఠములు) బండ్లపై తీర్థయాత్ర సల్పుఆచారము గలదు. మార్గమధ్యమున అనేకశిష్యులయజ్ఞానాంధకారమును రూపుమాపుచు ప్రయాణములు సాగించుచుందురు. 1944 సం॥ పండరీపురనివాసియగు శ్రీశ్రీశ్రీ గాడ్కేబాబాగారిశిష్యులగు తన్‌పూర్ మహారాజ్, శ్రీ పుంజాజీమహారాజును, 1951లో హరిభక్త మీరాబాయి గారును, బండ్లపై ప్రయాణమై నాలుగుధామములు సేవించి గుంటూరుకూడ వేంచేసియుండిరి. ఇప్పటికిని అనేకు లిట్టి ప్రయాణములు చేయుచున్నారు. ఈమధ్య పాశ్చాత్యకుటుంబ మొక డన్‌లప్ బండిని నిర్మించుకొని హిందూదేశమంతటిని దర్శించితి రని వార్తాపత్రికలలో చదివితిమి. మార్గమున ననేకు లాదరింతురుగాన, ఖర్చు బహుస్వల్ప మగును.

మూడవమార్గము — <u>బస్సు లేక టాక్సీలలో</u> ప్రయాణము. ఇది ధనికులు చేయుయాత్ర. ఇందు కొంచెము సుఖము గలదు. ఈయాత్ర రాజసముగ నుండును, కాని భక్తి ప్రధానము. ఎట్లు ప్రయాణముచేసినను అంతశ్శుద్ధికలిగిన చాలును. ఇట్లనేకులు జమీందార్లు, ధనికులు కుటుంబములతో యాత్ర చేయుట కలదు.

సైకిలుప్రయాణము — కొందఱు యువకులు సైకిళ్ళపై All India Cycle tourists అనియు World cycle tourists అనియు తిరుగుట మనము చూచువిషయమే. ఈమార్గము చాలశ్రమ కలుగునది. ఇది కేవలము నవీనయువకులుమాత్రమే చేయుయాత్రలు. అందు ప్రతిదినము నియమప్రకారము సైకిలు త్రొక్కవలెనేగాని యిష్టానుసారము ప్రయాణముచేసిన అనారోగ్యము కలుగును ఇంతకు యాత్రల కీమార్గ ముపకరింపదు.

రైలుప్రయాణము — ఇది అందరు ధనికులకు బీదసాదలకు సులభమైనమార్గము. కాని యాత్రచేయువిధానము తెలిసికొని, ముందుగ మార్గమున చూడవలసినక్షేత్రములు, వాని ప్రభావములు, విశదముగ తెలిసికొని యాత్రచేయుట ఉచితము. ఈమార్గము బహుయాత్రికు లనుసరించుచున్నదే. ఇట్టి యాత్రికుల కుపకరించుటకే యీగ్రంథము ముఖ్యముగ నుద్దేశింపబడినది.

విమానప్రయాణము :— కేవలము లక్ష్మీపుత్రులు యాత్రచేయగలమార్గ మింకొకటి గలదు. అదియే విమాన తీర్థయాత్ర. విమానమువిూద అన్నిక్షేత్రములు యాత్రచేయ వీలుపడదుగాని నాలుగుధామములు సప్తపురులుమాత్రము చేయవచ్చును. ఇది లక్ష్మీసంపన్నులు చేయుయాత్ర. దీనివలన యాత్రికులకు గొప్పఫలము వచ్చునని నమ్మకములేదు. గాని యాయాపుణ్యక్షేత్రములు దర్శించితి మనుతృప్తి కలుగును. ఇట్లుచేయువారు కొలదిమందిమాత్రమే యుందురు. ఇటీవల

హరిద్వారమునుండి బదరీనారాయణమునకు విమానసర్వీ సుండెడిదికాని యుద్ధసమయమున తీసివేసిరి. మున్ముందు విమానయానము మనహిందూదేశమున వృద్ధిచెందవచ్చును. కాని దీనియందపాయము సంభవించుట కెక్కువయవకాశము కలదు; గాన నిది యంతగ ననుసరింపదగినది గాదు.

## దేవాలయ నియమములు

1. భగవత్ప్రసాదముదప్ప నితరాహారములు భగవంతుని యెదుట పుచ్చుకొనగూడదు.
2. భగవంతునెదుట వ్యర్థప్రసంగము దేహచింతనము చేయరాదు. (చేయువాడు 5 జన్మలు తిత్తిరిపక్షియై పుట్టును.)
3. బొమ్మపై వస్త్రము కప్పుకొని నమస్కరించువాడు 3 జన్మలందు కుష్ఠరోగియై పుట్టును.
4. విమానచ్ఛాయ ద్రొక్కరాదు. (అట్లు ద్రొక్కక ప్రదక్షిణము చేయుటకు వీలుకానిచోట ఆఛాయను 3 భాగములుచేసి మొదటిభాగమందు బోవచ్చును.)
5. దేవాలయములోపల సకారణముగనైన నుమియువాడు మూడుజన్మములవఱకు కుక్కయై పుట్టును.
6. శ్రాద్ధమున భుజించి భగవంతు నర్చించువాడు పిచ్చుకయైగాని యుడుమైగాని పుట్టును.
7. దేవాలయమునందు భగవంతున కెదురుగా గాళ్లు చాచి పండుకొనువాడు భయంకరమైనభూమియందు పాడుచెట్టై

పుట్టును. 7 జన్మలు చండాలుడు, 3 జన్మలు దరిద్రుడై పుట్టును.

8. భగవంతునియుత్సవము వేళ నితరులను తాకితి మేమోయని సందేహించి స్నానముచేయువాడు నరకమున బడును.

9. దేవాలయము దేవుని దేహము కనుక అందు ప్రసాదము పుచ్చుకొని దేవాలయపుగుంజలకు రాయరాదు.

10. కల్లు, సారాయము త్రాగిగాని, తాంబూలము నము లుచుగాని, పొగచుట్టు త్రాగుచుగాని దేవాలయము లోనికి బోవువాడు (1) పిశాచముగను (2) నెమరు వేయు పశువుగను (3) కొఱవిదయ్యముగను పుట్టును.

11. దేవునికి బలిపీఠమునకు నడుమబోరాదు. శివాలయమందు నందీశంకరులనడుమ బోరాదు. అట్లుపోయినవానికి పూర్వపుణ్యము నశించును.

12. మలమూత్రవిర్జనానంతరము కాళ్ళు కడుగుకొనకుండ దేవాలయములోనికి బోరాడు.

13. తీర్థము నొంటిచేతితో తీసికొనరాదు. జుఱ్ఱరాదు. క్రింద బడనీయరాదు. చేతిక్రింద గుడ్డనుంచుకొనుట శ్రేష్ఠము. లేదా రెండవచేతినైన నుంచుకొనవలెను

14. సాధారణముగాదక్షిణ దేశమున ప్రతి దేవాలయధ్వజస్తంభ సమీపమున బలిపీఠ ముండును. దానిభావ మేమనగా దేవాలయములోనికి పోవుటకు ముందుగా నీపీఠముపై తనశిరస్సు నుంచి తనయందలి "అహంకార, మమకార,

దుర్వృత్తులను" బలి యిచ్చి శుద్ధసాత్త్వికమనస్సుతో దేవుని దర్శించుటకు లోనికి పోవలయునని. కాన బలిపీఠ మున్నస్థలములయందు, తలయొగ్గి యహంకారమును బలిపెట్టుచున్నట్లు భావించి పిదప భగవద్దర్శనము చేయవలెను.

15. స్వామివారికి పూజచేసినతులసినిగాని, తీర్థములోనితులసీ దళమునుగాని నోటిలో వేసికొనవలయును. పూజాపుష్పములను స్త్రీలు పురుషులు తలలో ధరింపవలయును. తులసీదళమును చెవిలో పెట్టుకొనుటగాని, తలలో పెట్టుకొనుటగాని పనికిరాదు.

16. గంధమును స్త్రీలు గళమున ధరింపవలెను. పురుషులు ముఖమునగాని, ఎదురురొమ్మునగాని ధరింపవలెను. పురుషులు గంధమును మెడకు పూసికొనరాదు.

17. తీర్థమును కూర్చుండిపుచ్చుకొనుటయే మంచిది. నిలుచుండియైన వంగి పుచ్చుకొనవచ్చును. తీర్థమురాగానే తీర్థప్రదాతకు, తీర్థమునకు నమస్కరింపవలెను. పూజజేయువాడు ముందుగా పుచ్చుకొనవలెను. తర్వాత అందరికీయవలెను. గుడ్డను నాలుగుమడతలు వేసి ఎడమచేతిమీద బెట్టుకొని దానిమీద కుడిచేయి పెట్టి దానిలో తీర్థము వేయించుకొని పుచ్చుకొనవలయును. తీర్థమును క్రిందపడనిచ్చినచో బ్రహ్మహత్యాదోషము రాగలదు. తీర్థములో వచ్చినతులసీదళమును దినవలెను. పుష్పమును

శిరసున ధరింపవలెను. తీర్థము పుచ్చుకొనుటకు ముందు వెనుక లవసరములేదు. మూడుసార్లు పుచ్చుకొనుట మంచిది. మనకు ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక తాపము లుండును. ఈ 3 తాపములు శాంతి చెందుటకు మూడుసార్లు పుచ్చుకొనవలయును. పెద్దసమూహము నను,సందడిసమయములోను ఒక్కసారియైనను చాలును.

18. దానధర్మములు తీర్థములలో నెంతైన జేయవచ్చును. ఇది తమతమశక్తి ననుసరించి యుండును. కాని కొన్ని క్షేత్రములలో మోసము లెక్కువ.[ఉ. రూ 2-8-0 యిచ్చిన సాలగ్రామదానము చేయించెద మందురు. నిజమున కది సాలగ్రామము కాదు. ఒకనల్లరాయి. అదియే యెన్ని చేతులలోనో తిరుగును. గోదానము చేయించెదరు. ఎక్కడనో తిరిగెడి ఆవును తీసికొనివచ్చి దానితోక మీద నీళ్లు విడిపించి గోవువెల యని రూ 10 నుండి, 100-0-0 వరకు గోదానముపేర కాజేయుచుందురు. ఇంతకు దానముపట్టువారి శీలము కూడ సరిగా నుండదు. [నే నొకప్పుడు భద్రాద్రికి వెళ్లితిని. గోదావరియొడ్డున ఇద్దరు దంపతులమని మూసివాయనములుపట్టుచున్నారు. పాపము తీర్థముగదాయని భక్తులు చీరెలు, రవికెలు, ధోవతులు, దక్షిణలు ఇచ్చుచున్నారు. ఇంతకు విచారింతుముకదా వారిద్దరిది ఒక్కగ్రామమైన కాదు. ఆ కొంచముసేపు డబ్బు సంపాదించుటకై భార్యాభర్తలైనారు. ఇట్టివా రేయకార్యము లొనర్పరు!] అసలుతీర్థ

స్థానములలో నుండువారికి దాన మీయకూడదు. వారికి సరియైన శీల ముండుటరుదు. వెంట నొకబ్రాహ్మణుని గొని పోవుట మంచిది. ఇదంతయు నతనికే ముట్ట చెప్పుట మంచిది. బాగుగాస్మార్తము చేయించగలవానిని ఖర్చులిచ్చి తీసికొనిపోయిన మన కన్ని సంకల్పములు తీర్థశ్రాద్ధములు జరుగగలవు. దానములు సక్రమముగ జరుగగలవు. యోగ్యమైనపాత్రముకాగలడు. దానము సంకల్పముచేసి చేయవలెను. కాళ్ళు గడుకగ సంకల్పరహితముగా జేసినదానము దానము కాదు. మనశక్తి ననుసరించి భక్తియుక్తముగ దానము చేయవలెను.

# సముద్రస్నానము చేయువిధానము

(నదీ, తటాకములు మొదలైనవి.)

సముద్రస్నానము నిత్యము చేయరాదు. పర్వదినముల యందుమాత్రమే సముద్రస్నానము చేయ శాస్త్రానుజ్ఞగలదు. కాని నవపాషాణములు, ధనుష్కోటి, దర్భశయనము, రామేశ్వరము, కన్యాకుమారి మున్నగుకొన్ని క్షేత్రములలో నిత్యము సముద్రస్నానము చేయువిశేషానుజ్ఞ గలదు. సముద్రస్నాన మప్పుడప్పుడు చేయవలసినదనియు కొన్ని నదులజలముల యందు విశేషలక్షణములు గలవనియు నిప్పుడిప్పుడు పాశ్చాత్యులు బోధపరచుచున్నారు. సముద్రము గంభీరముగ నుండి చూచు వారికి భీతి గొలుపుచుండును. అట్టియెడ స్నానము

చేయుటకు మరింత భయోత్పాదకముగ నుండును. పెద్దపెద్ద కెరటము లొడ్డునకు తాకి అతివేగముతో నీరు లోనికి పోవు చుండును. అట్టిసమయములందు జాగరూకత వహించియుండ వలెను. లేనియెడల ఆవేగమునకు చెంత నున్నవారినిసైతము లోని కీడ్చుకొనిపోయి ప్రాణాపాయమును గల్పించును.

ఇట్లు ప్రాణాపాయము కలుగకుండ నుండుటకు కొన్ని యుపాయములు గలవు. జలధిలో దిగుటకు ముందు సముద్రపు కెరట మొడ్డునకు తాకి లోనికి పోవునప్పుడు దానితోపాటు గబగబ సముద్రములోనికి పరుగెత్తుకొనిపోవలెను. అంతలో వేఱొకయల సిద్ధముగ మీదికి నురుకుచుండును. అప్పుడు నీవు ధైర్యముతోనుండి ఆయలతోపాటు పై కెగురుము. చాల తేలికగ పైకి లేచెదవు. లేదా అల నీమీదికి వచ్చునప్పుడు నీటిలో మునుగుము. ఆయల నీమీదుగ పోవును. తరువాత లేచి నిల్చుండుము. నీవు సముద్రములో నున్నంతకాలము నీకాలివేళ్ళు నిసుకలో గుచ్చియుంచుము. లేనియెడల నీ పాదములక్రింద నుండునిసుక నీటివేగమునకు కోసికొనిపోయి నీవునీటిమీదపడి సముద్రములోనికి అంతులేనిదూరము గొనిపో బడుదువు. ప్రాణాపాయము గలుగును. ఇదియంతయు తెలి సినవారిని వెంటబెట్టుకొని యొకపర్యాయము మునిగి లేచిన నీకే ఉత్సాహము గలిగి ఎంతసేపైనను సముద్రస్నానము చేసి యానందించెదవు. ఈ విధానము తెలియక కెరటమున కెదు రుగ నిల్చుండినయెడల నది నిన్ను తలక్రిందుగ నీటిలో పడ

వేయును. ఆ భయసమయములో నోటిలోనికి నీరుపోయి ప్రాణాపాయము గలుగును. సముద్రములో మృతినొందినవా రందఱు నిట్లు మృతినొందినవారే గాన చాలజాగరూకత వహించి సముద్రస్నానము చేయవలెను.

# స్నానసామాన్యసంకల్పములు

కాశీప్రాంతమున :— వింధ్యస్యోత్తరే, ఆర్యావర్తదేశే, అవిముక్తక్షేత్రే, (వారణాసి) అసీవరుణయోర్మధ్యే, ఆనందవనే, మహాశ్మశానే, గౌరీముఖే, త్రికంటకవిరాజితే, భాగీరథ్యాః పశ్చిమే తీరే ఉత్తరవాహిన్యాం బ్రహ్మనాళయోర్మధ్యే, మణికర్ణికాక్షేత్రే, విశ్వేశ్వరాది త్రయస్త్రింశత్కోటి దేవతా గోబ్రాహ్మణ హరిహరగురుచరణసన్నిధౌ ......

హరిద్వారప్రాంతములో సంకల్పము:— మాయాపురీ మండలే, దక్షప్రజాపతిక్షేత్రే, హిమాలయదేశే, బదరికారామే, వాలఖిల్యాశ్రమే, కేదారఖండే, నీలధారే, బిల్వపర్వతే, హిమాలయే దక్షిణే హరిద్వారే బ్రహ్మకుండతీర్థే కుశావర్త ఘట్టే గంగాతీరే బౌద్ధావతారే, కలియుగే విక్రమశక బార్హస్పత్యమానే. ......

బదరీసంకల్పము:— ఆర్యావర్తాంతర్గత హిమపర్వతైక దేశే బదరికాశ్రమే, నరనారాయణపర్వతయోర్మధ్యే, పంచ

శీలాంతర్గత తప్తకుండాఖ్యవహ్ని క్షేత్రే, శ్రీ బదరీనారాయణ చరణారవింద సన్నిధౌ ... ...

స్నానము చేయునపుడు సంకల్పముచేయవలెను. సంకల్పము లేనిస్నాన ముపకారకము కాదు. కనీసము గంగా ప్రార్థనమైనను చేయవలెను. ఆయాస్థలములనుబట్టి సామాన్య సంకల్పము కొంతమారుచుండును. మార్పు కొంచెము గమనించిన చాలును.

ఆచమ్య—ఓం కేశవాయ స్వాహా, ఓంనారాయణాయ స్వాహా, ఓంమాధవాయ స్వాహా, (స్త్రీలు, బ్రాహ్మణేతరులు, ముందున్నప్రణవమును, చివర నున్న స్వాహాశబ్దములు తీసివేసి ముందు శ్రీశబ్దమును, చివర నమః శబ్దమును జేర్చవలెను.) గోవిందాయ నమః, విష్ణవే నమః, మధుసూదనాయ నమః, త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్దనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణాయ నమః.

శ్లో. ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమిభారకాః
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే.

ఓం భూః, ఓం భువః, ఓగ్ంసువః, ఓం మహః ఓంజనః ఓంతపః, ఓగ్ంసత్యం, ఓంతత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య

ధీమహీ ధియో యో నః ప్రచోదయాత్-ఓ మాపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥ మమోపాత్త దురిత క్షయద్వారా శ్రీగోవింద గోవింద మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్త మానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరత వర్షే భరతఖండే మేరోః—దిగ్భాగే శ్రీశైలస్య——ప్రదేశే ——మధ్యప్రదేశే సమస్తదేవతా బ్రాహ్మణ హరిహర గురుచరణ సన్నిధౌ, అస్మిన్ వర్తమానేన వ్యావహారిక చాంద్ర మానేన——నామసంవత్సరే—అయనే—ఋతౌ—మాసే —పక్షే——తిథౌ——వాసరయుక్తాయాం శుభనక్షత్రశుభ యోగశుభకరణఏవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ..... గోత్రస్య.....నామధేయస్య మమ మనోవాక్కాయకర్మభిః జ్ఞానాజ్ఞానకృతసర్వదోషనివృత్త్యర్థం. ధర్మార్థకామమోక్షచతు ర్విధఫలపురుషార్థసిద్ధ్యర్థం.....స్నాన మహం కరిష్యే:-

## గంగాధ్యానము

శ్లో. గంగా గంగేతి యోబ్రూయాత్ యోజనానాం శతైరపి
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి. 1
అంబ! త్వద్దర్శనా న్ముక్తిః న జానే స్నానజనం ఫలమ్
స్వర్గారోహణసోపానే! మహాపుణ్యాతరంగిణి! 2
విశ్వేశం మాధవం ధుండిం దండపాణిం చ భైరవమ్
వందే కాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికామ్. 3

అతితీక్ష్ణ ! మహాకాయ ! కల్పాంతదహనోపమ !
భైరవాయ నమ స్తుభ్య మనుజ్ఞాం దాతు మర్హసి. 4
త్వం రాజా సర్వతీర్థానాం త్వమేవ జగతః పితా
యాచతో దేహి మే తీర్థం సర్వపాపాపనుత్తయే. 5
నందినీ నలినీ శీతా మాలినీ చ మహాపగా
విష్ణుపాదాబ్జసంభూతా గంగా త్రిపథగామినీ. 6
భాగీరథీ భోగవతీ జాహ్నవీ త్రిదశేశ్వరీ
ద్వాద శైతాని నామాని మహాపాతకనాశనే. 7

## ప్రతి క్షేత్రమున దిగినది మొదలు విడుచువఱకు నెట్లు గడపవలెను?

ప్రతిక్షేత్రములోను తనకాల మంతయు సద్వినియోగ మగునట్లు చూడవలయును. ఇట్టి యవకాశములు మరల జీవితములో గలుగుట కష్టతరముగాన కాలమును దుర్వినియోగము చేయక సత్సంగము, శ్రవణము, దర్శనము, ఇత్యాదికార్యములచే పవిత్రముగ గడపవలెను. మొదట క్షేత్రములో దిగిన వెంటనే తనసామానులను బసయందో సత్రమునందో యుంచి ధూళిదర్శనము చేయుటకు వెళ్ళి స్వామిని సేవించి బసకు చేరి తనకాలకృత్యములు తీర్చుకొని భోజనాదివసతులు చూచుకొనుచు కనిపించినవారి నెల్ల "ఈ క్షేత్రమహాత్త్వమేమి? ఇందు, సాధువులు, గొప్పభక్తు లున్నారా? ఆశ్రమములు గలవా? గొప్ప దేవాలయము లేమి గలవు? ఈ క్షేత్రమునకు సమీ

పమున నింక గొప్పక్షేత్రము లేవియైన గలవా? ” అని యడిగి తెలిసికొనవలెను. భోజనానంతరము కొంతవిశ్రాంతి తీసికొని సద్గ్రంథమును పఠించిగాని, గొప్పమహనీయు లున్న వారి యొద్దకు వెళ్ళి శ్రవణపాఠము చేసిగాని, లేదా నీదినప్రణాళికా విషయము చూచుకొని ముందుచేయవలసినకార్యమును గురించి విచారించుకొని, సాయంతనము 3 లేక 4 గంటలకు క్షేత్రములో చూడవలసిన స్థలములకు వెళ్ళి స్వామిని సేవించి, భోగములు, పూజలు చేయించి తీర్థప్రసాదములు స్వీకరించి, స్వామియెదుట (మీరు పదిమంది సంఘముగా వెళ్లినపక్షమున) సంకీర్తనగావించి ఆనందించవలెను. ఆక్షేత్రము, స్వామి—వీరల యవతారవిషయములు అడిగి తెలిసికొని మీనోటుపుస్తక ములో గుర్తించుకొనవలెను. అచ్చటనుండి కొండలుగాని అడ వులు, ఆశ్రమములుగాని, నదులుగాని యున్నవేమో తెలిసి కొని మరుదినముగూడ నచ్చటనే యుండి తమప్రాతరనుష్ఠాన మును ఆనదీతీరముననో లేదా కొండయందో గావించుకొన వలెను. ప్రతిక్షేత్రమునందుండు స్వామియెదుట చేతులు జోడించి “ప్రభూ! నాకు నిరంతరము నీసేవాకార్యములందు పాల్గొనునవకాశ మిప్పించుము; మీభక్తులతో సత్సంగము గలుగునట్లు చేయుము; మీస్మరణ నిరంతరము తమప్రీతికొరకు చేయున ట్లనుగ్రహింపు”మని ప్రార్థించవలెను.

ఇట్లు పగలంతయు గడిపి రాత్రి పెందలకడ బసకు చేరి ఫలాహారముచేసి (అనగా యాత్రలసమయములో ఒంటిపూట

భుజించుట ఆరోగ్యమునకు చాలమంచిది) స్వామి పవళింపు సేవ గాంచి 9 గంటలకు నిద్రించవలెను. మరల ఉదయము 4 గంటలకు ప్రభాతసేవతో నిద్ర మేల్కొని నిత్యకార్యక్రమ మును ప్రారంభించవలెను. ఆ క్షేత్రమును విడుచునప్పుడు స్వామికి దూరమునుండియే (బసనుండియే) నమస్కరించి, ''యీదీనుని సన్మార్గమునకు వచ్చునట్లాశీర్వదించు'' మనికోరి ఆ క్షేత్ర వాసులకు నమస్కారములు సల్పి ఆ క్షేత్రమును విడువవలెను.

## ఆరోగ్య సంబంధమైన సలహాలు

1. యాత్రకు బయలుదేరుముందు 'ఇన్ ఆక్యులేషన్' చేయిం చుకొన్నట్లు ఆరోగ్యశాఖవారినుండి సర్టిఫికెట్టు తీసికొని వెళ్ళిన, దారిలో గొప్పయుత్సవసమయములలో కలరా మొదలగువ్యాధు లున్నను మనకు వారు 'ఇన్ఆక్యులే షన్' చేయరు. అచ్చట చేయించుకొన్నయెడల జ్వరము తగులుట బాధపడుట బాగుండదు. (కాని పదిమందికి తక్కువయున్న వేయరు. ఒక్కొక Tube యిరువది మందికి సరిపోవును)
2. యాత్రకు వెళ్లుటకు ముందు, తర్వాత వెంటనే విరే చనమునకు సాధనచేసికొనుట మంచిది.
3. ప్రతిగుంట (కొళం) లోనినీరు త్రాగరాదు. తెలిసికొన నిదే స్నానముచేయరాదు.
4. సాధ్యమైనంతవరకు మన్యప్రదేశములలో కాచిచల్లా ర్చిననీరు త్రాగుట క్షేమకరము.

5. యాత్రచేయునంతకాలము ఒంటిపూట భుజించుట యుక్తమము. తేలికగజీర్ణమగు ఆహారమునే భుజింపవలెను.
6. సాధ్యమైనంతవరకు నెయ్యి మనప్రాంతమునుండియే తీసికొని వెళ్లుట మంచిది. ఆప్రాంతపునెయ్యి కల్తీగ నుండి, అనారోగ్యము గల్గించును.
7. తమ కలవాటైనయాహారమునే సాధ్యమైనంతవరకు పుచ్చుకొనవలెను. రుచులు మార్చిన ఆరోగ్యము చెడును.
8. అనారోగ్యసూచన కనబడగనే సమీపవైద్యాలయము (ఆసుపత్రి) నకు వెళ్ళి వెంటనే చికిత్స పొందవలెను. అశ్రద్ధచేయరాదు.
9. ఇంటినుండియే తినుబండారములు నిలువయుండునవి తీసికొని వెళ్ళవలెనుగాని అంగళ్ళలో, ఫలాహారశాలలో కొని తినినయెడల అనారోగ్యమేర్పడును. ఇళ్లే ఊరుగాయలు, పొడులు, సిద్ధము చేసికొనవలెను.
10. చలిదివంటకములు (పాసినవి) తినరాదు.
11. శరీరమునకు తగినంత విశ్రాంతినిగూడ నీయవలెను.
12. సకాలములో నిద్ర, భోజనము, ఫలాహారములు జరుప యత్నించవలెను.

## యాత్రల కనుకూలమైనకాలము

వర్షాకాలములో మిక్కుటముగ వర్షమువల్లను, వేసవియందు విపరీతమైనయెండలవలనను ప్రయాణములు చాలకష్ట

ముగ నుండును. అందువలన ఫాల్గునమాసము యాత్రలు కను కూలమైనకాలమని మన హైందవు లనాదిగా పరిగణించు చున్నారు. అనగా సుమారుగా ఫిబ్రవరి నెలనుండి ఏప్రిల్ నెలలోపల యాత్రలు ముగించువారికి ఎండవానలబాధ కలు గదు. హిమాలయయాత్ర, బదరీ, కేదార్, కైలాస్ మొద లగుయాత్రలు కేవలము ఏప్రిల్ నుండి సెప్టెంబరు నెలలోపుగ చేయ వలెను. ఎండకు మంచు కరిగి మార్గమిచ్చును. మొత్తము మీద సమశీతోష్ణ మైనకాలము కావలెనన్న ఒకసంవత్సర ముత్తర దేశము మరియొక సంవత్సరము దక్షిణ దేశము యాత్ర చేయుటవలన ఎండవానలబాధనుండి తప్పించుకొని సుఖప్రయా ణము చేయగలము.

## రైలుగైడును చూచుకొనువిధానము

రైలుబండి ప్రయాణముచేయువారు ముఖ్యముగ బండి ఎప్పుడెక్కడ బయలుదేరునో, ఎప్పుడెక్కడ నాగునో, ఆబండి దిగి యింకొకబండిలో నెక్కవలెనన్న ఆబండి యెప్పుడు వచ్చునో మొదలగువిషయములు తెలిసికొనియుండవలెను. పైవిషయ ములు తెలిసికొనుట కితరుల నడుగుట, వారు విసుకుచెందుట, తెలియకపోయినను తెలిసినట్లు తప్పుడుటైములు చెప్పుటచే మన కెన్నో యిబ్బందులు కలుగుచుండును. అట్టియిబ్బందుల నివా రించుకొనుటకై మనము రైల్వేవారు ప్రచురించు, "రైల్వే గైడు" లేక "టైమ్ టేబిల్" కొని దాని చూచువిధానము నేర్చు కొన దగును. టైమ్ టేబిలు ఇంగ్లీషులోను ఆయాప్రాంతీయ భాషలలోను నుండును. వెల స్వల్పము.

టైమ్ టేబిలు చూచువిధానము:-

ఆయా రైల్వేకంపెనీలవారు తమ రైలుబండ్ల రాకపోకల విషయమై అచ్చువేసియుంచెదరు. ఇండియాలోనున్న అన్ని రైల్వేకంపెనీల కాలములు All India Railway Guide లేక Indian Bradhusa (బ్రాడ్షాగైడు) అని అచ్చుకాబడుచున్నది. అది కొనిన అన్నివిషయములు తెలిసికొనవచ్చును.

ప్రతిరైల్వేలైనులో 3 రకములు గలవు 1) బ్రాడ్ గేజి 2) మీటరుగేజి 3) న్యారోగేజి (Narrow Guage). మరల నొక్కొక్కలైను 2 భాగములక్రింద విభాగింపబడియుండును. (1) బ్రాడుగేజిమెయినులైను స్టేషనులనుండి వెళ్లుబండ్లకాల పట్టికయనియు, బ్రాడుగేజి శాఖలయందుండు స్టేషనులనుండి వెళ్లుబండ్లకాలపట్టి యనియు. ఇట్లే మీటరుగేజి, న్యారోగేజి లైన్లుకూడ భాగింపబడియుండును.

రైల్వేగైడ్లలో గంటలు మనము లెక్కించునట్లుగాక రాత్రి 1 గంటనుండి ప్రారంభమై వరుసగా24 వరకు లెక్కించ బడును, అనగా మధ్యాహ్నము 12 గంటలతరువాత 1 గంటకు బదులు 13గంటలనియు,తరువాత 14. 15, 16. 17. 18, 19, 20, 21, 22, 23, 24, అని లెక్కించెదరు. అనగా ఈగంటలలో 12 తీసివేయుచుండిన మనమామూలు వాడుకకాలము తెలియు చుండును

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఉ :- రైల్వేగంటలు | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| •12 తీసివేత | 12 | 12 | 12 | 12 | 12 | 12 | 12 | 12 |
| మన మామూలుగంటలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| | మధ్యాహ్నము | | | సాయంతనము | | | రాత్రి | |

ఇట్లే మిగిలిన 24 గంటలు. 24వగంట అనగా అర్ధరాత్రి 12గం. మామూలుకాలమని యర్థము. మీరేగ్రామమునకు (స్టేషనుకు) వెళ్ళవలెనో దానిని గైడులో నుండు రైల్వేపటమును చూచి ఆస్టేషను ఏ లైనుమీద నున్నదో గమనించుడు. కొన్ని గైడ్లలో ఆలైనుకెదురుగ టేబిల్ నంబరు (Table Number) వేసియుండును. దానినిబట్టి (అనెంబరునుబట్టి) పుటలు త్రిప్పిన మనము వెళ్ళు లైను కనిపించును. (అట్లుగాక గైడునందలి విషయసూచికను చూచినచో మీరు వెళ్ళదలచిన స్టేషన్ నే లైనులో నున్నదో తెలియును. ఉ॥ (హుబ్లీ-మచిలీపట్నము) (మద్రాసు-వాల్టేరు), (మద్రాసు—బెంగుళూరు) ఇట్లుండును. ఆవిషయసూచికయందే ఆ లైనే పేజీలో నున్నదో తెలియును. లేదా మీరు వెళ్ళదలచినస్టేషను గైడునందే పేజీలో నుండునది తెలుపుట కకారాదిగ అక్షరక్రమములో ఏర్పరచినయొకపట్టియుండును. ఉదాహరణము :- మదరాసు వెళ్ళదలచినచో M అనుఅక్షరముక్రింద చూడుము. తిరుపతి వెళ్ళదలచినచో T అనుఅక్షరముక్రింద చూడుము. ఈవిధముగా మనకు వలయు స్టేషను నుండుపేజీని తీసిచూచినచో, అందు రైలుబండ్లెప్పుడెప్పుడు బయలుదేరునో ఎప్పుడుచేరునో వ్రాయబడియుండును. పెద్దస్టేషనులకు చేరుకాలము, వదలుకాలము వ్రాయబడియుండును. దానినిబట్టి అది యచ్చట నెన్నినిమిషము లాగునో తెలిసికొని భోజనాదివసతులు చూచుకొనవచ్చును. కాలమును గుర్తించుకొనుటకు చూచునపుడు టేబిల్సులోనిచ్చిన మైళ్లను

గూడ గుర్తించి, గైడులో చివర ముద్రించిన చార్జీలపట్టీని అనుసరించి సుమా రెంతచార్జీ కాగలదో తెలిసికొనుట చాల అవసరము,

గైడులో రైల్వేనిబంధనలనుగూడ చదువుకొని జ్ఞాపకము పెట్టుకొనుట చాలముఖ్యము.

ఈవిషయములను గ్రహించినప్పటికి ప్రప్రథమమున గైడుచూచుట కనుభవజ్ఞులకడ తెలిసికొనుటయు అవసరమే.

## భారత రైల్వేలు (Indian Railways)

ప్రపంచమున రైల్వేలకున్న ప్రయోజనము నేడు మరి దేనికిని లేదు. మనభారతదేశమున వానిప్రభావమేమియో తెలిసికొందము. మన దేశమున సరిమొదటిరైలు 1853 ఏప్రిల్ 16వ తేదీసాయంతనము 3 గం॥ లకు బొంబాయినుండి ఠాణాకు 21మైళ్లు ప్రయాణముచేసినది. 1953లో రైల్వేల శతవార్షికోత్సవము గావించి, ఢిల్లీలో బ్రహ్మాండముగ 42దినములు 45 యెకరములస్థలములో ప్రదర్శనము గావించిరి. భారత రైళ్లలో రాత్రింబగళ్లుకూడ నిమిషమునకు 64,000 మందివంతు ప్రయాణము చేయుచున్నారు. ఆసియాఖండమున నన్యత్ర యింతటిగరిష్టసంఖ్య మరెచ్చటను లేదు. ఈసంఖ్య ప్రపంచమున 4వదిగ పరిగణించిరి. భారతరైల్వేలు 34,123 మైళ్లు వ్యాప్తమై వలవలె నలుమూలలకు నంటియున్నవి. రైల్వేలకు కావలసిన బొగ్గు, ఉక్కు, లోహములు మొదలైనవానికి 9కోట్ల

70 లక్షలు. సాలీనాఖర్చు అగుచున్నది. రైల్వేలన్నింటికి పెట్టుబడి 864 కోట్ల 23 లక్షలరూపాయలు.

1952న ఇండియాలో రైళ్లయందు ప్రయాణముచేసినవారు 123 కోట్ల 21 లక్షలు. 9,80,30,000 టన్నుల సామానులు రవాణాజరిగినది. ఇప్పుడు భారతదేశమును మొత్తము 6 మండలాలుగ విభజించి, ఒక్కొక్క మండలము క్రిందదాదాపు 5000 మైళ్లరైల్వేమార్గ మున్నది. 1953న భారతరైల్వేలలో 8337 ఇంజన్లు, 2,25,000 గూడ్సుపెట్టెలు, 81.650 రైలు పెట్టె లున్నవి. 1956 మార్చి నాటికి మరిఅదనముగా 2092 ఇంజన్లు, 47,533 గూడ్సుపెట్టెలు, 8535 రైలుపెట్టెలు తయారై యుండును. చిత్తరంజన్ (బెంగాల్) యంత్రాగారములో వారమున కొక ఇంజనుచొప్పున నిర్మింపబడుచున్నది. ఈచిత్తరంజన్ యంత్రాగారమునకు 15 కోట్లు ఖర్చుచేయబడినది.

ఇంతటిపెద్దయెత్తున రైల్వేలు మనకు తోడ్పడుచున్నవి. యాత్రికులను, టూరిస్టులను, వ్యాపారస్థులను, ఒకమూలనుండి మరొకమూలకు తీసికొనిపోవుచు సామానులను సులువుగ నలుమూలలకు అందించు రైల్వేలప్రయోజనము గొప్పదిగా నున్నది. గాన యాత్రికు లీరైల్వేసాధనము గొని తీర్థయాత్రలు విశేషము గావించనగును యాత్రాస్పెషల్ బండ్లు విరివిగ సాగించి, దేశముయొక్క పరిస్థితి గాంచి భారతీయసంస్కృతి, ఔన్నత్యముల తెలిసికొందురుగాక !

# ప్రయాణికులు గమనింపదగిన ముఖ్యవిషయములు

1) 60మందికి పైగానున్న Special Carriage ఇత్తురు. 600 మందికి Special train ఇత్తురు. ముందే అధికారులకు వ్రాసికొని సమ్మతిపొందవలెను.

2) భోజనటిక్కెట్లు, అన్నంప్యాకెట్లు, దక్షిణదేశమున స్టేషను లలో దొరకును. ఇట్టివి ఉత్తరదేశమున లేవు.

3) పదిమంది కలిసిపోవునప్పుడు వారిటిక్కెట్లు వరుసనంబరు ప్రకారము తీసికొని ఆటిక్కెట్లపై వారిబరువుగలసామా నంతయు లగ్గేజిచేయించుకొనవచ్చును. దీనికి చార్జి యుండదు.

4) ప్రయాణకాలములో మధ్యాహ్నభోజనము చేయబోవు స్టేషనుకు, ముందుగ మీరు ప్రయాణముచేయుబండి గార్డుతో చెప్పిన, మీకు అన్నిటిక్కెట్లకు భోజనము సిద్ధముచేయునేర్పాటు చేయుదురు. లేదా రైలుగైడు చూచుకొని ముందుగనే ముందుస్టేషనులో భోజన టిక్కెట్టు కొన్నయెడల భోజనవసతి దొరకును. ఈవిష యము రైల్వేగైడులో చూడవలయును.

5) రైలుబండి పోవుచుండునపుడు ఆపవలసిన అవసరమేర్పడి నచో ప్రతిద్వారముకును పైన టాపునకు ఆనుకొని యుండుగొలుసును లాగిన రైలుఆగును.

6) పెద్దజంక్షనుస్టేషనులలో స్టేషనుమాష్టరుగారిగదిప్రక్కన ఉత్తరములపెట్టె యుండును. అందు యాత్రికులకు వచ్చు ఉత్తరముల నుంచెదరు. గ్లాసులోగుండ బయటకు కని పించుచుండును. మనఉత్తరములు కనిపించిన స్టేషను మాస్టరు నడిగిన తాళముతీసి మనకుపా మన కిచ్చును. (ఇది రెలిగ్రాములు, ఉత్తరములకు మాత్రమే)

7) ఒకఊరికి టిక్కెట్టుకొని ప్రయాణము మానుకొనుటచేగాని బండి తప్పుటచేగాని మీరు ప్రయాణ మప్పటికి మాన దలచినచో వెంటనే బుక్కింగు ఆఫీసుకు వెళ్ళి మారు కొనిన టిక్కెట్టుకు 0-2-0 తగ్గించి డబ్బు వాపసిత్తురు, లేదా ఆటిక్కెట్టు మార్చి యింకొకయూరికి టిక్కెట్టు కొనవచ్చును.

8) టైమ్‌టేబిలులో బండి బయలుదేరు వివరములు తెలిసి కొన్నను, అది యేప్లాట్‌ఫారముమీద ఆగునో, ఏబండి ఏదియో యను విషయమును పెద్దస్టేషనులలో ప్లాట్‌ఫా రము నెంబరునుబట్టియు, లేదా ఎంక్వైరీఆఫీసు (భోగట్టా కచ్చేరి) అనుచోటనుగాని, అది లేనిచోట్ల బాధ్యత గలి గిన స్టేషన్‌మాస్టరు, టికెట్‌కలెక్టరు వగైరాలయొద్ద తెలిసికొనవలయును. కొన్ని పెద్దస్టేషనులలో (ఉ॥ బెజ వాడ, మద్రాసు) పెద్దబోర్డులమీద ఈవిషయములు వ్రాసియుండును. ఇటీవల ఈవిషయములను మైక్ (దూర శ్రవణయంత్రము) ద్వారాకూడా స్టేషనులలో చెప్పు చున్నారు. బొంబాయిలో నీయేర్పాటు విచిత్రముగ నుండును.

9) ఒకరైలులోనే కొన్ని పెట్టెలుమాత్రము జంక్షనుస్టేషనుల లోని రెండవరైలునకు చేర్చబడును. దూరప్రదేశము లకు పోదలచినవా రట్టిపెట్టెలలో నెక్కవలెను. అట్లుగాక యితరబండ్లలో నెక్కినయెడల, జంక్షనుస్టేషనులో తమ సామానుతో అర్ధరాత్రిసమయమున దిగి రెండవరైలులో మరల స్థలముచూచుకొని యెక్కవలసివచ్చును. గాన మొదటనే విచారించుకొని రైలులోని ఆప్రత్యేకమైన పెట్టెలో నెక్కవలెను.

10) జనులయొత్తిడిచేత టిక్కెట్టు కొనలేనప్పుడు ట్రెయిను టిక్కెట్టు ఎగ్జామినర్‌తో (Ticket Examiner) చెప్పి బండిలో కూర్చుండవచ్చును. రైలుపోవుచుండు కాల ములో ఆయుద్యోగి మీయొద్దకు వచ్చి పైకముపుచ్చు కొని మీకు రసీదు వ్రాసియిచ్చును ఇట్టిసౌకర్యము మీకు కల్పించినందుకుగాను అసలుటిక్కెట్టుచార్జికి మించి బేడ అదనముగ మీరీయవలెను.

11) ప్రయాణికుల లగ్గేజి:–

ప్రయాణికుడు చార్జీలేకుండ తనవెంట తీసికొనిపోవు కనీ సపుబరువు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఎయిర్ కండిషన్ | ప్రయాణికుడు | 60 | రైల్వేశేర్లు | లేక | 123 | పౌన్లు |
| 1వ | ,, | 40 | ,, | ,, | 82 | ,, |
| 2వ | ,, | 30 | ,, | ,, | 62 | ,, |
| 3వ | ,, | 25 | ,, | ,, | 51 | ,, |

12) 15మందికి మించినవిద్యార్థులు సమూహముగ ప్రయాణముచేయుతలంపుగలవారికి ప్రత్యేకము కన్సెషన్ ఈయబడును. ఈకన్సెషన్ప్రకారము రెండవతరగతి టిక్కెట్టుతోనె 1వ తరగతిలోను, ఇంటరుతరగతి టిక్కెట్టుతో 2వ తరగతిలోను, ప్రయాణముచేయుహక్కు వచ్చును.

13) ప్రయాణికులు, బండ్లయందు స్థలములేని సందర్భమున తాము కొనిన టిక్కెట్లయొక్క తరగతులకంటె తక్కువ తరగతులయందు ప్రయాణము చేయవలసివచ్చినయెడల తాము ప్రయాణముచేయుటకు ముందుగా. ఆబండిగార్డునకు తెలియపఱచి, వారివల్ల సర్టిఫికెట్ పొందినచో అధికముగా ఈయబడినపైకము వాపసుచేయబడును.

14) రాత్రియందు నిద్రించుప్రయాణికులను లేపుట :—
పై తరగతి ప్రయాణికులు రాత్రియందు వెళ్లుమెయిలు లేక ప్యాసెంజరుబండ్లయందు ప్రయాణము చేయునపుడు వారిని నిద్ర లేపవలెననినయెడల, ఆబండ్లగార్డులకు వారు ముందుగా తెలుపవలెను. ఇట్టియేర్పాట్లు ప్రయాణికుల సౌకర్యార్థము చేయబడినవిగాని, రైల్వేవారీవిషయమున నెట్టిబాధ్యతను వహింపరని ప్రయాణికులు స్పష్టముగా నెఱుగవలెను.

15) ప్రయాణములమధ్య ఆపుదల :—
200 మైళ్లకు పైబడిన దూరమునకు ఒకేప్రయాణపు టిక్కెట్లు పొందియుండు ప్రయాణికులు తమప్రయాణమునకు వలసినవ్యవధిగాక ఒకటి లేక అంతకు ఎక్కువ

స్టేషనులలో అట్టి స్టేషనులమధ్య గల దూరము 100 మైళ్లకు పైగానున్న యెడల ప్రతివంద మైళ్లకుగాని అంతకు తగ్గిన దూరమునకుగాని ఒక దినమువంతున ప్రయాణము నాపవచ్చును బయలుదేరిన స్టేషను నుండి 150 మైళ్లు ప్రయాణముచేసినగాని మొదటి ఆపుదలచేయ వీలులేదు.

16) ప్రయాణముమధ్య ఆపుచేయుట కనుమతింపబడిన టిక్కెట్లు పొందియుండు ప్రయాణికులు బండ్లు మార్చవలసిన స్టేషనులందు మారవలసినబండ్ల నందుకొనలేకపోయిన యెడల, మరుసటిదిన మట్టిబండ్లలో ప్రయాణముచేయుట కనుమతింపబడుదురు. అట్టియెడ వా రాస్టేషనుమాస్టరు నొద్ద తమటిక్కెట్లపై తగురీతిగ వ్రాయించుకొనవలయును.

17) అపాయముల నాటంకపరచుట:- అపాయముల నాటంకపరచుటకు ప్రయాణికులు రైలుబండి వెళ్ళునపుడు రైలుపెట్టెల తలుపులగుండ, కిటికీలగుండ వంగిచూచుటగాని, తలుపులను తెరచిపెట్టుటగాని, ఒకబండినుండి మరియొకబండికి దాటిపోవుటగాని ఆపదలకు దారితీయును. అట్లు ప్రవర్తించినచో వారు రైల్వే ఆక్టుక్రింద శిక్షింపబడుదురు. ప్రయాణికులు రైలుపెట్టెలతలుపులయొక్కయు కిటికీలయొక్కయు, మూతల క్రిందపడవేయుటగాని పైకెత్తుటగాని బహుజాగ్రత్తగా జరుపవలెను. రైలుపెట్టెలతలుపులయొక్క పిడులను ముట్టకూడదు. అగ్గిపుల్లలు వెలిగించి పారవేయరాదు. వట్టిసీసాలను మరి యితర వస్తువులను బండి వెళ్ళునపుడు బైటికి ఉవ్వకూడదు.

అట్లుచేసిన తమకును రైల్వేలైన్లవెంబడిపనిచేయు పనివాం డ్రకును అపాయము కలుగును. మరియు ప్రయాణికులు రైల్వేలైన్లప్రక్కనుండు బాటమీాద నడచుటగాని, వంతెనలమీాద లెవెల్ క్రాసింగ్ పైన లైన్లను దాటుటగాని కూడదని కోరబడుచున్నారు. ఇవన్నియు ఆపదలకు దారి తీయును. పైన జెప్పినవన్నియు ప్రయాణికులు శ్రద్ధగా నవలంబించిన ఆపదలు కలుగవు.

18) యాత్రికు లొకస్టేషనులో దిగి పట్టణములోనికి వెళ్ళి విశేషములు చూచుకొనివచ్చి మరల ప్రయాణము సాగించవలెనని అనుకొనినయెడల వారికి, వారిసామానులు వెంట మోసికొనిపోవుట తిరిగి తెచ్చుట చాలకష్టమగును. అట్టివారు రైల్వేపార్శిల్ ఆఫీసులో నుండు Cloak Room (క్లోక్ రూమ్) లలోనుంచి రసీదుపొంది వెళ్ళిన, వారికి ఆ సామానులయిబ్బంది తీరును. అందుకుగాను 24 గంటల కొకొక్కమూటకుగాని, పెట్టెకుగాని, వస్తువునకుగాని 0–2–0 తీసికొని రసీదిత్తురు. మరల రసీదు చూపిన మీా వస్తువులు మీా కిచ్చివేయుదురు. ఇది యాత్రికుల కనేక ప్రదేశములలో మహోపకారముగ నుండును. ఇట్టి యేర్పాట్లు గల స్టేషన్లజాబితా రైల్వేగైడ్లలో గలదు.

19) యక్స్‌ప్రెస్, మెయిలుబండ్లలోను, కొన్ని ప్యాసింజరుబండ్లలోను 300 మైళ్లు, అంతకుపైన ప్రయాణముచేయు

ప్రయాణికులకు ప్రత్యేక "క్యారేజి" పెట్టె నియమింపబడియుండును. ఆపెట్టెపై చెక్కగూడ కట్టియుండును. అట్టివానిలో ప్రయాణముచేసిన దూరప్రయాణికులు సుఖప్రయాణము చేయవచ్చును.

అట్లే దూరప్రయాణముచేయువారికి బుక్కింగుఆఫీసుల యొద్దకూడ ప్రత్యేకకిటికీలయొద్ద 300మైళ్లు అంతకు పై ప్రయాణికులకు టిక్కెట్లిమ్మెదగు.

20) ప్రతిపెద్దస్టేషనులోను ప్రయాణికులసౌకర్యార్థమై ప్రత్యేక స్నానపుగదులు (Bath Rooms) ఉండును. వానితాళము చెవి స్టేషనుమాస్టరుగారియొద్ద నుండును. వానిని యాత్రికు లుపయోగించుకొనవలెను.

21) సామానులు ప్లాటుఫారమునుండి స్టేషనుబయటకుగాని, మరియొకబండిలోనికిగాని మోయవలసివచ్చినప్పుడుకొద్ది సామానులైన పోర్టర్లను మాట్లాడి (వారి రేటు వారిచేతికి కట్టుకొనియుండుగుడ్డపైననే వేసియుండును. మోసపోయి హెచ్చురేటీయరాదు.) హెచ్చుసామాను లుండిన ట్రాలి (Trally) మాట్లాడి వారినిర్ణీతపురేటు వారికీయవలెను. మనసామానులు మనము ప్రయాణముచేయు రైలుపెట్టిలో పెట్టిననే నిర్ణయించినకూలీ యీయవలెను. ముందుగా కూలీ ఈయరాదు.

22) రైల్వే చార్జీలు

రైలు చార్జీల విధానము.

ఒక్కొక్క ప్రయాణికునకు ఒక మైలుకుచార్జీ పైసలలో

| | 1 నుండి 150 మైళ్లకు | 151 నుండి 300 మై. | 301 మై. నుండి పైన |
|---|---|---|---|
| ఏర్ కండిషన్ | 34 పైసలు | 34 పైసలు | 32 పైసలు |
| మొదటి తరగతి | 18 ,, | 16 ,, | 15 ,, |
| రెండవ తరగతి (మెయిల్, ఎక్స్ప్రెస్) | 11 ,, | 10½ ,, | 9½ ,, |
| ,, (ప్యాసింజరు) | 9½ ,, | 9 ,, | 8½ ,, |
| మూడవ తరగతి (మెయిల్, ఎక్స్ప్రెస్) | 6¼ ,, | 6 ,, | 5 ,, |
| ,, (ప్యాసింజరు) | 5¼ ,, | 5 ,, | 4½ ,, |

## తర్పణములు - వంశావళి

శ్లో. ఆదౌ పితా తథా మాతా, సాపత్నీ జననీ తథా.
మాతామహా స్సపత్నీకా, ఆత్మపత్న్య స్త్వనన్తరమ్.
సుతభ్రాతృ పితృవ్యాశ్చ. మాతులా స్సహ భార్యకాః
దుహితా భగినీచైవ, దౌహిత్రో భాగినేయకః.
పితృష్వసా మాతృష్వసా శ్యాలకో భావుకః స్నుషా
శ్వశురాచార్యగురవః స్వామినో గురురిక్థినః.

| సంస్కృతపదము | తెలుగుపదము | గోత్రము | గతించినవారిపేర్లు |
|---|---|---|---|
| 1 పితరం | తండ్రి | | |
| 2 పితామహం | తాత | | |
| 3 ప్రపితామహం | ముత్తాత | | |
| 4 మాతరం | తల్లి | | |
| 5 పితామహీం | తండ్రి తల్లి | | |
| 6 ప్రపితామహీం | తాత తల్లి | | |
| 7 సాపత్నీ మాతరం | సవతితల్లి | | |
| 8 మాతామహం | తల్లితండ్రి | | |
| 9 మాతుఃపితామహం | తల్లితాత | | |
| 10 మాతుఃప్రపితామహం | తల్లిముత్తాత | | |
| 11 మాతామహీం | తల్లి తల్లి | | |
| 12 మాతుఃపితామహీం | తల్లి తండ్రి తల్లి | | |
| 13 మాతుఃప్రపితామహీం | తల్లి తాత తల్లి | | |
| 14 ఆత్మపత్నీం | తనభార్య | | |
| 15 సుతం | కొడుకు | | |
| 16 భ్రాతరం | అన్న లేక తమ్ముడు | | |

| సంస్కృతపదము | తెలుగుపదము | గోత్రము | గతించిన వారి పేర్లు |
|---|---|---|---|
| 17 పితృవ్యం | పెదతండ్రి లేక పినతండ్రి | | |
| 18 మాతులం | మేనమామ | | |
| 19 దుహితరం | కూతురు | | |
| 20 భగినీం | అక్క లేక చెల్లెలు | | |
| 21 దౌహిత్రం | కూతురు కొడుకు | | |
| 22 భాగినేయకం | మేనల్లుడు | | |
| 23 పితృష్వసారం | మేనత్త | | |
| 24 మాతృష్వసారం | పెదతల్లి లేక పినతల్లి | | |
| 25 జామాతరం | అల్లుడు | | |
| 26 భావుకం | అక్కసెల్లెండ్రిపెనిమిటి | | |
| 27 స్నుషాం | కోడలు | | |
| 28 శ్వశురం | మామగారు | | |
| 29 శ్యాలకం | భార్యఅన్న లేక భార్యతమ్ముడు | | |
| 30 స్వామినం | మతగురువు | | |
| 31 గురుం | తండ్రిలేకఉపనయనంచేసినవారు | | |
| 32 రిక్థినం | తనచే సద్గతినొందినదిక్కు లేనివారు | | |


యాత్రికులు ప్రతిపదమునకు నెదురుగా నున్న ఖాళీలయందు గోత్రములు, గతించిన వారిపేర్లు, ముందుగా విచారించి వ్రాసికొని వెళ్ళవలెను.

# యాత్రకుబయలు దేరుటకు ముందుజాగ్రత్తలు

1. యాత్రికు వెళ్ళవలె నను సంకల్పము కలుగగనే యాత్రిసంబంధమైనపుస్తకము తెప్పించి చదివియు, వెళ్ళి వచ్చినవారినుండి అడిగి అనేకవిషయములు కనుగొనియు, పూర్తిగా విషయములు, చూడవలసినస్థలములజాబితా వ్రాసికొనవలెను. రైలులో వెళ్లునప్పుడు ప్రతిచోటను ఆరైలు పెట్టెలో నుండువారి నడిగి ఆప్రాంతములో గొప్పగొప్ప సాధువులుగాని, ఆశ్రిమములుగాని, క్షేత్రిములుగాని గల వేమో తెలిసికొని, దిగి ఆయాక్షేత్రముల దర్శించుచుండవలెను.

శాస్త్రప్రికారము దర్శించవలసినస్థలములను, అన్న హిరణ్యశ్రాద్ధములు పెట్టవలసినస్థలములను చాల ఓర్పుతో అడిగి తెలిసికొనుచుండవలెను.

2. యాత్రికు వెళ్లుటకు 15 దినములు ముందుగ రైలుగైడును కొని దానిని చూచుట అభ్యాసముచేసికొని యుండవలెను. తెలియనియెడల నేర్చుకొనవలయును. ఈ పుస్తకములో రైల్వేగైడు చూచువిధానమును చదివి అర్థము చేసికొనవలెను.

3. ప్రోనోట్లు, దావాలువగైరాలకు వాయిదాలు వెళ్ళునేమో చూచుకొనుట, కోర్టువాయిదాలు, నోట్లవాయిదాలు, తద్దినములు, ఇన్స్యూరన్సుప్రీమియములు కట్టుట, అద్దెలు, చేబాకీలు చెల్లించవలసినవి చూచుకొని చక్కబెట్టుకొనవలెను.

4. యాత్రిలో నెక్కువమొత్తము తీసికొనివెళ్ళునప్పుడు (ముఖ్యముగ కొండలలో బదరి, కేదారము, కైలాసము) పారాయణ గ్రంథమున కట్టవేసి, అందు నోట్లు పెట్టి మూడుసైపుల అంటించి ఆపుస్తకమును మనిపర్సుమాదిరిగ జాగ్రత్తపరచి యుంచవలెను. నిరంతరము చేతిలోనే ధరించుట మంచిది. లేదా పైకమును నడుమునకు కట్టుకొనవలెను. పొరపాటున నడుముననున్నది తీయకయే స్నానాదులకై నీటిలోనికి దిగరాదు.

5. దారిలో పైక మయిపోయినప్పుడు పోష్టుద్వారా తెప్పించుకొనుటకుగాను ముందుగా నిచ్చట పెద్దపోష్టు ఆఫీసు నుండి (Identification card) గుర్తింపు కార్డు (See postal Guide clause 31 A) సంపాదించుకొనవలెను. దీనివివరము మన యాత్రాగైడులో చూచి చదువుకొనవలయును. సంతకముచేయ చేతగానివారికి Identification కార్డు పొందుటకు సాధ్యపడదు.

6. వెళ్లునప్పుడు డాక్టరుచేత పరీక్షచేయించుకొని శరీరము బరువెంతయున్నది తూచుకొని గుర్తించుకొని యాత్రి నుండి తిరిగివచ్చినపిదప చూచుకొనవలెను.

7. ఉత్తరయాత్రి చేయువారు ముఖ్యముగా ఆదేశమున దక్షిణదేశభోజనము (అనగా వరిఅన్నము, కూర, పప్పు, మజ్జిగ వగైరా) లభ్యపడదు ; వారికి గోధుమరొట్టె, బంగాళదుంపలకూర ప్రధానమైన యాహారముగాన ముందుగ

(నెలముందు) ఇంటికడ గోధుమరొట్టె తినుట అలవరచుకొనుట మంచిది.

8. యాత్రకు వెళ్ళినచో 2 లేక 3 నెలలవరకు తిరిగి రాజాలరుగనుక మీరు వ్యాపారస్థులుగాని యితరకరెస్పాండెంటుగాని అయినచో మీపేర వచ్చు మనియార్డరు, వి. పి. పి., యిన్స్యూరెన్సులు వగైరాలు ఫలానావారికి నిచ్చుచుండుమని యొకఅప్లికేషను వ్రాసి మీయూరిపోష్టుజవానుకుగాని లేదా పోష్టుమాష్టరుకుగాని యిచ్చిన మీతరఫున వారు వ్యవహారములు జరుపుచుందురు.

9. యాత్రకు వెళ్లువృద్ధులుగాని, ధనికులుగాని తమ ఆస్తిని క్షేమపరచుకొనుట కేర్పాటు చేసికొనవలయును. ఒకవేళ మార్గమున ప్రమాదస్థితి యేర్పడి జీవితమునకు ముప్పు కలుగుట సంభవించిన తనఆస్థికి ముప్పువాటిల్లి చివరకు గవర్నమెంటు కలుపుకొనుటయో, లేక వారసులుకానివారు వారసులమని దావాలువేసి శ్రమపరచుటయో సంభవించును. ఇట్టి చిక్కులు కలుగకుండ ధనికులు తమవిల్లునామా వ్రాసి ఒకసీల్డుకవరులో రిజిస్ట్రారాఫీసులో నుంచి వెళ్ళవచ్చును. యాత్రనుండి తిరిగిరాగానే ఆసీల్డుకవరును మరల మనము తీసికొనవచ్చును.

10. తీర్థవిధులు పెట్టుటకుగాని గతించినవారి జాబితాను పూర్తిచేసి (ఈగ్రంథములోగల జాబితా ననుసరించి) తీసికొని వెళ్ళవలయును.

11. అవసరమైనచో పైకము పంపవలసియుండునని ఇద్దరుముగ్గురతో చెప్పి ఆపనికై యేర్పాటుచేసికొని వెళ్ళవలెను.

12. తేలికగ నుండునట్టి, మన కనుకూలమైనట్టి వస్తువులను, పాత్రలనుమాత్రమే కొనవలెను.

# తీర్థములలో పాలించవలసిన నియమములు

ప్రపంచములో ధర్మ, అర్థ, కామ, మోక్షము లను నాల్గు పురుషార్థములు గలవు. తీర్థయాత్రలు చేయునపుడు ధనమేమో వ్యయమగుచున్నది. ఇక మిగిలినవి ధర్మ, కామ, మోక్షములు. రాజసపురుషులు కామపూరణమునకును, సాత్వికపురుషులు ధర్మమోక్షములకును తీర్థయాత్రలు చేయుదురు. సాత్వికు లాత్మోద్ధారముకొఱకే నిష్కామభావముతో ధర్మపరిపాలనముగూడ చేయుదురు. కావున శ్రేయస్కాము లగువా రంతఃకరణశుద్ధిద్వారా పరమాత్మప్రాప్తి కొఱకు మాత్రమే తీర్థములకు వెళ్ళవలెను తీర్థములకు వెళ్ళి ఏవిధముగ నేమేమి చేయవలెనో చెప్పబడును.

1. కాలినడకను యాత్రజేయునపుడు మనస్సుతో భగవత్స్వరూప ధ్యానము, వాక్కుతో నామజపము చేయుచు వెళ్ళవలెను వెంట చాలమంది యుండిన అందఱు కలిసి నామసంకీర్తనముచేయుచు వెళ్ళవలెను. రైలుబండి మొదలగు నితరవాహనములలో ప్రయాణముచేయునప్పుడైనను

భగవంతుని స్మరించుచు ధార్మికగ్రంథపఠనమో భగవ న్నామజపమో చేయవలెను.

2. గంగ, సింధు, సరస్వతి, యమున, గోదావరి, నర్మద, కావేరి, కృష్ణ, సరయు, మానససరోవరము కురుక్షేత్రము, పుష్కరతీర్థము, గంగాసాగరసంగమము మొదలగుతీర్థము లందు వానిగుణ, ప్రభావ, తత్త్వ, రహస్య, మహిమలను స్మరించుచు ఆత్మశుద్ధికొరకు శ్రేయస్సుకొఱకు స్నానము చేయవలయును.

3. తీర్థస్థానములలో శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీశివ, శ్రీవిష్ణుప్రభృతి భగవన్మూర్తులను శ్రద్ధాప్రేమలతో దర్శించి, వారిగుణ ప్రభావ, లీలా, తత్త్వ, రహస్య, మహిమాదుల స్మరించుచు దివ్యస్తోత్రములద్వారా ఆత్మోద్ధారము గావించుకొనుటకు స్తుతిప్రార్థనలు గావించవలెను.

4. తీర్థములలో సాధువులను, మహాత్ములను, జ్ఞానులను, యోగులను, భక్తులను దర్శన, సేవా, సత్సంగ, నమస్కార, ఉపదేశ. ఆదేశ, వార్తాలాపములద్వారా విశేషలాభమును బొందుటకు వారిని వెదుకవలెను. శ్రీకృష్ణు డర్జునునితో

శ్లో. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః.

'జ్ఞానులగుతత్త్వదర్శనపరులను జేరి సాష్టాంగదండప్రణామము గావించి, సరళతాపూర్వకముగా ప్రశ్నించి సేవించిన వారు నీకు జ్ఞానము నుపదేశింతురు' అని బోధించెను.

5. కామినీకాంచనాసక్తులు, తమ నామరూపములను బూజ చేయించుకొని ఉచ్ఛిష్టమును (ఎంగిలిని) బెట్టువారు, గౌరవ సమ్మానలోలుపులు, కీర్తికాంక్షులు, ప్రమాదపడువారు, విషయాసక్తులు నగువారు సాధువులుగనున్నను బ్రహ్మచారులుగనున్నను, తపస్వివేషములోనున్నను పొరపాటుననైన వారిసంగము పనికిరాదు. మాంసాహారులను, మత్తుపదార్థముల (సారాయి, కల్లు భంగు, గంజాయి, నల్లమందు, పొగాకు వగైరాలు) సేవించువారిని, పాపులను, దురాచారులను, నాస్తికులను దర్శించనైన దర్శించరాదు.

తీర్థములలో నొకానొకస్థలమునందు పండాలు, పూజారులు, మహంతులు మొదలగువారు యాత్రికుల ననేకప్రకారముల బాధింతురు. ఉదాహరణమునకు యాత్రాసఫలతకై దురాగ్రహపూర్వకముగా ధనమును గ్రహించుట పైసా చెల్లించనిది స్వామిదర్శనము చేయనీయకపోవుట, ఏదో యియ్యనిది స్నానము చేయనీయకపోవుట, యాత్రికులను దబాయించి పాపభయమును జూపి డబ్బును హరించుట, దేవాలయములలో తీర్థములలో భోగభాండారముల పేర అధికముగ లాగుటకు బాధించుట, నిలబెట్టి డబ్బు వసూలు చేయుట, మొదలగు మోసపుకార్యములను గుఱించి యాత్రికులు జాగ్రత్తగ నుండవలెను.

6. సాధువులు, బ్రాహ్మణులు, తపస్వులు, బ్రహ్మచారులు, విద్యార్థులు, సత్పాత్రులు, దుఃఖులు, అనాథులు, ఆతురులు, అంగహీనులు, రోగులు, సాధకులు మున్నగువార

లకు అన్నము, వస్త్రములు, ఔషధము, ధార్మికపుస్తక ములనిచ్చి యథాయోగ్యముగా సేవచేయవలెను.

7. భోగైశ్వర్యము లనిత్యములని యెఱిగి వివేకవైరాగ్య పూర్వకముగా మనస్సును ఇంద్రియములను దనవశమునం దుంచుకొని కేవలము శరీరయాత్రకు తప్ప, విషయముల నుండి మరలించవలెను

8. తమతమవర్ణాశ్రమాచారప్రకారము సంధ్యా, తర్పణ, జప, ధ్యాన, పూజా, పారాయణ, స్వాధ్యాయ, హవన, బలి, వైశ్వదేవములు మొదలగు నిత్యనైమిత్తిక కర్మలను సకాల మునకు చేయ మిక్కిలిప్రయత్నించవలెను. ఏవేని విశేష కారణములచే సమయోల్లంఘనమైనను కార్యోల్లంఘ నము కారాదు.

గీతా, రామాయణ, శాస్త్రాధ్యయనము, భగవన్నామ జపము, సూర్యున కర్ఘ్యప్రదానము, ఇష్టదేవతాపూజ, ధ్యానము, స్తుతి, ప్రార్థన మొదలైనవి అన్నివర్ణాశ్రమ ములలోని స్త్రీపురుషులకును అవశ్యకర్తవ్యములు.

9. కామ, క్రోధ, లోభములకు వశులై యేప్రాణికిని నేవిధ ముగనూడ కించిన్మాత్రమైన దుఃఖమును కలిగించరాదు.

10. కీర్తన, స్వాధ్యాయ సమయములందుగాక మిగిలినసమయ ములందు మౌనము వహించవలెను. మౌనము జపధ్యాన ములకు సహాయకము. పలుకవలసివచ్చిన సత్యము

ప్రియము హితమైనవచనముల పలుకవలెను. శ్రీకృష్ణ భగవానుడు గీతలో [౧౭ అ. ౧౫ శ్లో] వాక్తపములక్ష ణము చెప్పుచు

శ్లో. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.

[ఉద్వేగరహితమును, సత్యమును. ప్రియము, హితము నగు వాక్యముల పలుకుటను. స్వాధ్యాయాభ్యాసమును వాక్కునకు సంబంధించినతపస్సని చెప్పబడుచున్నది.]

11. నివాసస్థానము, పాత్రలుతప్ప నికనేమియుగ్రహింపరాదు. అడుగకున్నను మూల్యమియ్యక గొనరాదు. తీర్థములలో బంధుమిత్రుల ఆతిథ్యమును గ్రహింపరాదు. అనుమతి లేక యితరునివస్తువునుగొనుట చోరీచేసినట్లే. డబ్బియ్యక ఔష ధమును గొనుటకూడ దానమును గైకొనినట్లే.

12. మనోవాక్కాయకర్మల బ్రహ్మచర్యపాలనమందు విశేష దృష్టి నుంచవలెను. స్త్రీలు పరపురుషుని, పురుషులు పర స్త్రీని, దర్శనస్పర్శనాలాపచింతనము లెన్నడును చేయ రాదు. విశేషావశ్యకత గలిగినపురుషుడు స్త్రీని తల్లి యని చెల్లెలని, స్త్రీ పురుషుని తండ్రియని సోదరుడని భావించి తలంచుకొని మాట్లాడవలెను. ఒకవేళ ఎవరి మీదనైన పాపబుద్ధిగలిగిన కనీసము ఒకదినము ఉప వాసము చేయవలెను.

13. భోగకరమును,రుచికరమును, విలాసమునకు సంబంధించిన యేపదార్థసంగ్రహమును జేయరాదు, సేవనముచేయరాదు.

కేవలశరీరనిర్వాహమునకు మాత్రము వైరాగ్యబుద్ధిచే నన్న వస్త్రముల నుపయోగించవలెను.

14. తీర్థములలో స్వార్జితమైనద్రవ్యముచే పవిత్రముగాతయారు చేయబడిన అన్నము, పాలు, పండ్లు, సాత్త్వికపదార్థములు భోజనముచేయవలెను. స్వార్థాహంకారముల వదలి వినయముతోను ప్రేమపూర్వకముగను సాత్త్వికవ్యవహారము చేయవలెను.

15. తీర్థములలో బీడి, సిగరెట్టు, పొగాకు, గంజాయి, భంగు, కాఫీ, టీ, కోకో మొదలగుమాదకవస్తువులను, చిన్న ఉల్లి పెద్దఉల్లి, బిస్కెట్టు, మంచుగడ్డ, సోడా, లిమినేడ్ మొదలగు అపవిత్రపదార్థములను, పాచికలు, చీట్లపేక, చదరంగము మొదలగునవి ఆడుట, నాటకముల సినిమాలను జూచుట, పొరబాటుననైన తిట్లాటలు, నిందలు, ఎగతాళులు, నట్టివాగుడు, ఆక్షేపము, వ్యర్థభాషణము ఇవన్నియు వదలవలెను.

16. గంగాయమునాదేవాలయాది తీర్థస్థానములకు చాలదూరమున మలమూత్రవిసర్జన చేయవలెను. గంగాయమునానదుల తీరములందు మలమూత్రవిసర్జనముచేయుట, వానిలో పలుదోముపుడకలు పాచి వేయుటవలన పుణ్యమునకు బదులు పాపమునే పొందుదురు.

17. కామక్రోధలోభ మోహ మద మాత్సర్య రాగ ద్వేష దంభ కపటప్రమాదాలస్యములు మొదలగుదుర్గుణములను తీర్థములలో వదలవలెను.

18. శీతోష్ణములు, సుఖదుఃఖములు, అనుకూలప్రతికూలపదార్థములు ప్రాప్తించినప్పుడు భగవంతుడు పంపినబహుమానమనుకొని సర్వదా ప్రసన్నచిత్తతతో సంతుష్టితో నుండవలెను.

19. తీర్థయాత్రలలో తనతోడివారిని కామక్రోధభయాదులచే ఒంటరిగా వదలరాదు. యుధిష్ఠిర మహారాజు స్వర్గతిరస్కారముకూడ చేసెను గాని తన వెంటనున్న కుక్కను వదలలేదు. తనవెంట వచ్చినవాడుగాని ఆశ్రితుడుగాని జబ్బుపడినప్పుడు వానిని వదలి తీర్థస్నానమునకు భగవద్దర్శనమునకు ఒంటరిగా వెళ్ళిన భగవంతుడు ప్రసన్నుడగుటయటుండ కోపపడును. ఏలనన 'పరమాత్మయే అందరకు నాత్మ' కావున నాయపద్గ్రస్తుని తిరస్కారము పరమాత్మయొక్క తిరస్కారమే యగును. కాబట్టి విపద్గ్రస్తుడగు తోడివానిని వదలుట పొరబాటునైన బనికిరాదు.

20. తీర్థములలో నొనర్చిన స్నాన, దాన, జప, తపో, యజ్ఞ, వ్రత, ఉపవాస, ధ్యాన, దర్శన, పూజా, పారాయణ, సేవా, సత్సంగము లెట్లు ఫలదాయకములో అట్లే అక్కడ చేసిన కపటము, అసత్యము, దొంగతనము, వ్యభిచారము, హింస మొదలైన పాపకర్మలుకూడ వజ్రపాతమే యగును. కాబట్టి తీర్థస్నానములలో కొంచెమైన పాపముచేయరాదు.

శాస్త్రములలో తీర్థములనుగూర్చి యనేకము లగుమహిమలు చెప్పబడినవి. భారతారణ్యపర్వములో పులస్త్యఋషి యిట్లు చెప్పినాడు.

శ్లో. పుష్కరే తు కురుక్షేత్రే గంగాయాం మగధేషు చ
స్నాత్వా తారయతే జంతుః సప్తసప్తావరాం స్తథా.

పుష్కరతీర్థము, కురుక్షేత్రము, గంగ, మగధలయందు స్నానముచేసినవారేడుతరములవారిని తరింపజేయుదురు.

శ్లో. పునాతికీర్తితా పాపం-దృష్ట్వా భద్రం ప్రయచ్ఛతి
అవగాఢాచ పీతాచ-పునా త్యాసప్తమం కులమ్.

'గంగ' యనునామోచ్చారణముచేతనే పాపముపోవుచున్నది. దర్శనముచేసిన శ్రేయస్సునొసంగును. స్నానపానములు చేసినవారి ఏడుతరములవారిని పవిత్రముచేయును.

ఇటువంటివచనములను కొందఱర్థవాదముగాను రోచకముగాను తలతురు. కాని అట్లు తలపరాదు దీనిలోనిసంపూర్ణ ఫలము కనబడకపోవుట మనపూర్వ సంచితపాపముచేతను వర్తమాననాస్తికవాతావరణముచేతను, పండాల, పూజారుల దుర్వ్యవహారమువలనను, తీర్థములలో పాషండులు, నాస్తికులు, ఘోరకర్మలు చేయువారు నివసించుటచే తీర్థములందు శ్రద్ధాప్రేమలు తగ్గుచున్నవి.

కాబట్టి దుస్సంగము మాని శ్రద్ధాప్రేమలతో జాగ్రత్తగా నియమపాలనముగావించి తీర్థములవలన లాభమును బొందవలెను. ఈనియమపాలనములో నేదైన కొంచెము లోపము జరిగిన పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీలా నిద్రాదులు చేయుచు శ్రీభగవన్నామమును జపిం

చుట, గుణపరిభావలీలలతో గూడిన స్వరూపధ్యానము నిరంతరము చేయవలెను.

21. పెద్దపెద్దపట్టణములు, క్షేత్రములు దర్శించవలసినపుడు సంఘముగా నున్నయందరును కలసి ఒకబస్సు నేర్పరచుకొని ప్రయాణముచేసిన కొద్దివ్యయముతో కొద్దికాలములో సునాయాసముగ క్షేత్ర లేక పట్టణదర్శనము చేయవచ్చును.

22. తాను క్షేత్రములలో స్వామిని దర్శించునప్పుడును, సాధువులను దర్శించునప్పుడును, నదులలో స్నానముచేయునప్పుడును, యాత్రికుడు తనకు ముఖ్య స్నేహితులను, బంధువులను, తనసొంతకుటుంబములోనివారిని స్మరించుచు దర్శన, స్నానాలుచేసిన ట్లింటికి వ్రాయును త్తరములలో వ్రాయుచుండిన నింటిలోనివారును, తదితరులను తృప్తిజెందుదురు.

23. యాత్రికుడు చూచినదెల్ల నింటిలోని మిత్రులకు వెంట వెంటనే విశదముగ జాబులు వ్రాయుచుండుటచే నింటిలోనివా రందరును తాము యాత్రలు చేసినట్లుగ సంతోషించెదరు.

24 బెంగాలు ఓఢ్రదేశమునైపున నుండుబ్రాహ్మణభోజనశాలలలో (Fish) చేపలు, మాంసము వాడెదరు. కాన మన నైపువారు కడుజాగ్రత్తగ (తిననివారు) విచారించి భుజించవలెను; లేక వంటచేసికొనవలెను.

25. రైళ్ళలో ప్రయాణము చేయవలసివచ్చినప్పుడు తాను కూర్చుండుపెట్టెను గుర్తుపెట్టుకొనవలెను. అనగా గార్డు పెట్టెనుండి యిన్నవపెట్టెయనిగాని, యింజనునుండి

యున్నవపెట్టె యనిగాని గుర్తుపెట్టుకొని కూర్చుండవలెను. లేదా ఆపెట్టెమీద సీమసున్నముతో పేరు వ్రాసికొన వచ్చును. లేదా నెంబరును గుర్తుపెట్టుకొవలెను ఇట్లు చేయుటచే భోజనమునకుగాని, ఫలాహారమునకుగాని దిగి నప్పుడు పైగుర్తులు లేనిదే మరల ఆపెట్టెలో నెక్కుట కును, ఒక్కొక్కప్పుడు మనము తొందరలో దిగి మన పెట్టెలు మన బెడ్డింగులు పొరపాటున మరచినను స్టేషను మ్యాస్టరుగారి ద్వారా వైర్ (wire) చేయుట కీలుర్తున్న సులభముగా మనసామానులు గుర్తించి దింపగలరు.

26. పదిమంది కలసి ప్రయాణముచేయునప్పు డందరు కలిసి టిక్కెట్లు తీసికొన్నను రైలులోగాని, ప్లాటుఫారముమీద గాని వెళ్ళి యెవరిటిక్కెట్టు వారు తీసికొనవలెను. మరల దిగినప్పుడు అన్నిటిక్కెట్లను కలిపి టిక్కెట్టు కలెక్టరుకు చూపిన మనసామానులు బరువైనను లగేజిచేయ కయే సరిపోవును.

27. పదిమందికలిసి ప్రయాణము చేయునపుడు ప్రయాణ ములో బండ్లు, ఫలాహారములు టిక్కెట్లు అంతయు ఒక్కరే వాడి అందరిమీద పంచి సాయంతనము వసూలుచేసి కొనుట మంచిది.

28. టిక్కెట్టు తేదీ, నెంబరు, మీనోటుపుస్తకములో వ్రాసి కొనుట మంచిది. ఏలయన మీటిక్కెట్టుపోయినచో నెంబరు చెప్పిన వారు విచారింతురు.

29. క్రొత్తపట్టణములలోగాని సిటీలలోగాని మీరు వీథులగుండ వెళ్ళునపుడు, ఆవీథులగుండ తిరిగివచ్చుటకుగాను, బొగ్గు తోనో సీమసున్నముతోనో గీతలు పెట్టుకొనుచు వెళ్ళిన మరల వానిసహాయముతో సులువుగా మారుపడకుండ బసకు తిరిగి రాగలరు. దారిచూపుటకు ——> బాణము గుర్తును, ఇంకొకబజారుకు పోరాదనుటకు X తిక్కిడి గుర్తును వేయవలెను.

30. ప్రియాణముచేయునప్పుడు సాధ్యమైనంతవరకు ఇంజనుకు ప్రక్క పెట్టెలలో కూర్చుండకుడు. ఏలయన పొగబొగ్గుపొడి కండ్లలో పడుచు చెవులకు మోతగ నుండును. అపాయములు గలిగిన నింజనుతోపాటు దానివెంట నంటియుండు నొకటిరెండుపెట్టెలకుకూడ అపాయము సంభవించును గదా !

31. పండాలగృహములలో దిగవద్దు సత్రిములలో దిగుట ఉత్తమము.

32. సాధ్యమైనంతవరకు నూతనస్థలమును జేరుట సూర్యాస్తమయమునకు బూర్వమును, సూర్యోదయమునకు బిమ్మటను జరిగినచో సరియైనయేర్పాట్లు చేసికొనవచ్చును. అనగా ఉదయము 10 గంటలలోపల, సాయంతనము 5 గంటలు దాటకపూర్వమును చేరవలయును. భోజనాదివసతులకిబ్బంది కలుగకుండును. పెద్దపట్టణములలో 10 గంటలు దాటిన నీటికుళాయిలు కట్టివేయుదురు. స్నానాదుల కిబ్బంది కలుగును. దేవాలయములు మూసివేయుదురు.

33. నదీతీరములందును, సముద్రములలో స్నానముచేయు నప్పుడును, యాత్రికులు జాగరూకతతో నుండవలెను. మనఆంధ్రదేశములో నదీప్రాంతములందు సహితము ఈతరానివారిసంఖ్య హెచ్చుగ నుండును. కాని కాశీ ప్రాంతములో పురుషులేగాక స్త్రీలు గూడ ఈతయందు ప్రవేశముగలిగి యుందురు. రేవులలో తమ బాలబాలికలకు సొరకాయల బుర్రలనుకట్టి యీతనేర్పుట మనము చూడగలము. "ఉన్నయూరివారికి కాటిభయము; పొరుగూరివారికి నీటిభయము" అను సామెతగలదు.

34 రైళ్ళలో ప్రయాణముచేయునపుడు పెట్టెలను మనము కూర్చుండుసీటుకు పొడుగాటి గొలుసుతో తాళము వేయుటచే నితరులు పెట్టెను తీసికొనిపోలేరు.

35. వేడినీరు త్రాగుట మంచిది. స్టేషనులో రైలుఆగినప్పు డింజనుకడకు వెళ్ళి వేడినీరు తెచ్చుకొనవచ్చును. లేక రైల్వేహోటళ్ళలో దొరకును.

36 చాలాదూరము ప్రయాణముచేయవలసివచ్చినపుడు రైలు పెట్టెలలోనుండు పైచెక్కల (Planks) మీద పరుండ వచ్చును. ముందుగ జాగ్రత్తపడవలెను.

37. పెద్దపెద్ద జంక్షన్‌స్టేషనులలో స్నానాల గదు లుండును. (Bathing rooms) తాళముచెవి స్టేషనుమాష్టరునొద్ద గాని లేక హోటల్ మేనేజరుదగ్గరగాని యుండును. అడిగి తాళముచెవి తీసికొని స్నానము చేయవచ్చును.

38 పిల్లలతో ప్రయాణముచేయువారు ముఖ్యముగ తమ యొద్దనున్న మరచెంబులో వేడినీళ్లు సిద్ధముగ నుంచుకొనుట చాల అవసరము.

39. ఆడవారు సాధ్యమైనంతవరకు సొమ్ములను పెట్టుకొనకుండ పయనింపవలెను.

40. భోజనసామగ్రి సాధ్యమైనంతవర కెప్పటికప్పుడు కొని పని గడుపుకొనుట యుత్తమము. ఏలయన ప్రతిక్షేత్రమున అన్ని వస్తువులు దొరకును.

41. యాత్రకు తీసికొని వెళ్లు సామానులు సాధ్యమైనంతవరకు క్లుప్తముగనుండి యెవరికివారు మోయునట్లుండవలయును.

42. సలహాలు కావలసివచ్చినపుడు స్టేషన్ మాస్టరునుగాని పెద్దపెద్ద జంక్షన్‌లలో (Information Bureau) లో గాని ఎంక్వాయిరీఆఫీసులలోగాని కనుగొనవలెను.

43. గుఱ్ఱపుబండ్లు, ఎద్దుబండ్లు, రిక్షాలు మొదలగువానిలో నెక్కుటకుపూర్వము వాని నెంబరు నోటుచేసుకొని యెక్కవలెను.

44. కొన్ని క్షేత్రములందు దిగగనే ధూళిదర్శనము చేయవలెను.

45. యాత్రకు 10 మంది కలిసి వెళ్లునప్పుడు అందొకనిని పెద్దగ నియమించుకొని ఆయన చెప్పుప్రకారము నడువవలయునేగాని యెవరియిచ్చవచ్చినట్లు వారు ప్రవర్తించరాదు. ఆ పెద్ద అన్నియు తెలిసినవాడుగ నుండవలయును. ఆతనిని యాత్రకు వెళ్లుటకు ముందుగనే యెన్నుకొనవలయును.

అందరునుకలసి ఎవరిమనస్సునకు నొప్పిలేకుండగ అన్యోన్యము సోదరభావముతో నుండవలయునేగాని వీరితో పొరపాటున కలసివచ్చితినే యనిగాని డబ్బు వృథావ్యయమైనదే యనిగాని తలంపరాదు.

46. పదిమంది కలిసి యాత్రి వెళ్లునప్పుడు పైకము మొత్త మొకరియొద్ద నెప్పుడు నుంచరాదు. అట్లుచేయుట చాల ప్రమాదకరము. ఆపైక మొకవేళ చోరులచే నపహరింపబడినచో అందరును ఇబ్బందిపడుదురు. ఎవరిపైకము వారు వారి లోపలి జేబులలో పెట్టుకొని పైన నొకపిన్ను గట్టిగ పెట్టుకొనవలయును. లేదా నడుమునకు కట్టునంచి కుట్టించి అందు నోట్లు నలగకుండనుంచి నడుమునకు కట్టుకొనవలయును. దానిపై నొకయంగవస్త్రము చుట్టవలెను. స్నానముచేయునప్పుడు తప్పక నడుమునంచి తీయుట జ్ఞప్తియుంచుకొనవలయును

47 శ్లో. కుంభకోణం సేతుమూలం గోకర్ణం నైమిశం తథా
అయోధ్యా దండకారణ్యం విరూపాక్షం చ వేంకటమ్॥
శాలిగ్రామం ప్రయాగం చ కాంచీ ద్వారావతీ తథా
మథురా పద్మనాభం చ కాశీ విశ్వేశ్వరాలయమ్॥
నద్యః సర్వాః సముద్రశ్చ పర్వతం భాస్కరం స్మృతమ్।
ముణ్డనం, చోపవాసాశ్చ క్షేత్రే ష్వేషు పరికీర్తితమ్॥
లోభా న్మోహా దకృత్వా యః స్వగృహం యాతి మానవః
సహైవ యాన్తి తద్ గేహే పాతకాని చ తేన వై॥

తా. ఈక్రిందితీర్థములలో (క్షేత్రములలో) ముండనము (క్షురకర్మ) గావించుకొని ఉపవాస ముండవలెను. లోభముచేతగాని, అజ్ఞానముచేతగాని ముండనము గావించు కొనకయు, ఉపవాసముండకయు గృహోన్ముఖులైనచో అట్టి తీర్థములలో పాపములు వదలిపోవుటకు బదులు పాపములన్నియు అతనితోపాటు తనయింటికే వచ్చును. ఈపవిత్ర క్షేత్రము లేవియన; కుంభకోణము, రామేశ్వరము, గోకర్ణము (గోవాకు దక్షిణముగా 30 మై.) నైమిశారణ్యము (లక్నోనుండి 45 మై.) అయోధ్య, దండకారణ్యము (భోపాల్ నుండి గోదావరివర కుండుప్రాంతము), విరూపాక్షము (హంపీ) వేంకటము (తిరుపతి) సాలిగ్రామము (నేపాల్‌లో నున్న గండకీనదీ జన్మస్థానము) ప్రయాగ, కంచీ (నేటికంజీవరము) ద్వారక, మధుర (ఉత్తర, దక్షిణమునగలవి), పద్మనాభము, (ట్రివెండ్రము అనెడి అనంతశయనము) కాశీ (విశ్వనాథుడు) అన్ని నదీతీరములు సముద్రతీరము, భాస్కరక్షేత్రము (ఒరిస్సాలోనున్న కొణార్క్)

[ స్కాందములో సేతుమాహాత్మ్యమున బ్రహ్మఖండము 52 ప్రకర 102-105 శ్లోకములు చూడుడు ]

# యాత్రలో ఉత్తరములు, మనియార్డర్లు తెప్పించుకొనువిధానము

ఉత్తరములు తెప్పించుకొనుట:—

మనము యాత్రలు సల్పుటకు దాదాపు మూడునాల్గు మాసములు పట్టునుగదా! అప్పటివరకు మనయింటిసమా

చారములు మనకును, మనసమాచారము లింటియొద్దనుండు వారికిని తెలియవలెనుగదా! యాత్రిలో నుండువారు వారు చూచు విషయములను వారియారోగ్యస్థితిని తెలియ జేయుచు ఉత్తరములు వ్రాయవచ్చును. కాని వారు సిద్ధముగ కార్డుల నోకేపర్యాయము కొనియుంచుకొనవలయును. రైలులోనైన నుత్తరములు వ్రాసి ప్రతిస్టేషనులో నుండు తపాలాపెట్టెలోగాని మెయిల్ట్రైన్ అయిన మెయిల్ వాన్లోగాని వేసిన మనసమాచారము మనయింటికడ నుండు వారికి తెలియగలదు. పోష్టుపేరు ఇంగ్లీషులో వ్రాయవలెను.

ఇంటిసమాచారములు యాత్రిలో నున్న వారికి తెలియవలెనన్న అడ్రిసుకావలయును; గనుక యాత్రచేయు వారు వారముపోజులకుముందు రైల్వేజంక్షనుయొక్క స్టేషను మాస్టరు కేరాఫ్ అడ్రిస్సువ్రాసి యింటికి పంపవలెను. ఇంటి నుండి అదేవిధముగ కేరాఫ్ స్టేషనుమాష్టరుకు వ్రాయుదురు. ఇటువంటియుత్తరము లన్నియు ప్రతిపెద్దస్టేషనులోను స్టేషన్ మాస్టరుగారి గదిప్రక్కన "ఒకగ్లాసుచట్రిము"లో నుంచబడి తాళము వేసియుండును. దానిమీద (Key with the Station Master) అనగా తాళముచెవి స్టేషనుమాస్టరుగారియొద్ద నున్నది, అని వ్రాసియుండును. గ్లాసులోనుండి యుత్తరములు కనుపించుచుండును మనయుత్తరము లందున్నయెడల స్టేషన్ మాస్టరుగారితో చెప్పిన తాళముతీసి మనయుత్తరము మన కిత్తురు. ఇట్లు మనయింటినుండి సమాచారములు సులభముగ మనకు తెలియగలవు. సత్రిము అడ్రిసు నిచ్చిన, మన మా

సత్రములో మన యింటికి వ్రాసిన యుత్తరమునకు జవాబు వచ్చువరకు కనీస మొకవారమురోజు లుండవలసివచ్చును. అప్పటివరకు కాలము వృథాయగును. ఒకయుత్తరమునకే వారముదినములుపట్టిన 4, 5 ఉత్తరముల కాయాక్షేత్రములలో వ్యర్థముగ కాలయాపన మగునుగాన పైవిధమున చేసిన సులువుగ నుండును. ఇట్టే టెలిగ్రాములుగూడ C/o స్టేషను మాష్టరుగారిద్వారా తెప్పించుకొనవచ్చును.

డబ్బు తెప్పించుకొనుట :-

యాత్ర కంతటికి (4 గురు లేక 5 గురు) వెళ్ళిన, వారికి కొన్ని వందలపైకము కావలెనుగదా ! ఇంతపైకము నొకే పర్యాయ మింటినుండి తీసుకొని వెళ్ళిన పరస్థలములలో మార్గములలో పెట్టెలలో నుంచుకొనుట శ్రేయస్కరము కాదు. కనుక వారు తగువరకు ధనమును తీసికొని వెళ్ళి మిగిలినది మధ్యమధ్య తెప్పించుకొనవలెను. ఇది రెండు మూడు విధములుగ తెప్పించుకొనవచ్చును.

1) A. ఒకకవరులో పైకము పెట్టి ఆకవరుకు అంటించవలసిన తపాలాబిళ్ళలను కొంచెము తక్కువగ అంటించి మన కేరాఫ్అడ్రెస్సుకు పంపిన మనకు సులువుగ చేరును. కాని యిది సురక్షితమైనపద్ధతి కాదు.

B. త్వరగా పైకము కావలెనన్న టెలిగ్రాముమనియార్డరు తెప్పించుకొనవలయును. అనగా మామూలుM O ఫారము వ్రాసి దానిలో అడ్డముగ "ఎక్స్‌ప్రెస్" అనిగాని లేక "ఆర్డినరీ" యనిగాని వ్రాయవలెను. విషయములు క్లుప్తముగ వ్రాయవలెను. M. O. చార్జీలు + టెలిగ్రామ్‌చార్జీలు అగును.

డబ్బు కావలెననికూడ యాత్రికుడు "టెలిగ్రామ్" ఇంటికిచ్చి తెప్పించుకొనవలయును. ఎక్కువ అవసరమైన Express wire ఈయవలెను. వెంటనే ఉత్తరప్రత్యుత్తరములు చేసికొన వచ్చును.

2) పెద్దపెద్ద పట్టణములలోని వర్తకులకును, మనపట్టణ ములోని వర్తకులకును వ్యాపారసంబంధమైన ఖాతాలుండును. ఇట్టితరి మనపట్టణములోని వర్తకునికి మనకు కావలసిన ధనము చెల్లించిన, ఆయన ద్వారముగ మన మున్నపట్టణవర్తకునికి ఉత్తరము వ్రాసి, మనకు పైకమిమ్మని యొకయుత్తరము (దీనినే బరాతం అందురు) వ్రాసియిచ్చిన, ఇట్టియుత్తరమును తీసికొని ఒకకవరులో పెట్టి, మనఅడ్రసుకు పంపినగాని, లేక ముందుగనే యాత్రకు వెళ్ళునప్పుడు ఏర్పాటుచేసికొని బరాతం తీసికొనివెళ్ళి యాపట్టణమున నుండువర్తకునకు మనము చూపినగాని మనపేర ఖర్చువ్రాసి పైక మిచ్చును. ఇది సులభ మైన పద్ధతి.

3) స్టేట్‌బ్యాంకు ఉన్న పెద్దపట్టణ మైనయెడల మనపట్టణమునుండి ధనమునకు డిమాండ్‌డ్రాఫ్టు Demand Draft) తీసికొని మనయాత్రలో నున్నపట్టణమునకు కవరులో పెట్టి రిజిష్టరుచేసిన, మన మాడిమాండ్ డ్రాఫ్టుతీసికొని state Bank లో చూపిన ధనము వెంటనే చెల్లించెదరు ఇది మరియొక సులభపద్ధతి.

4) మామూలుపద్ధతి సత్రమునకుగాని, పండాపేరగాని మనియార్డరుద్వారా తెప్పించుకొనుట. ఇందు ఆలస్య మగు

టయేగాక ఒక్కొక్కప్పుడు ఆపండాలు మనకు చేరకుండ మోసముచేయుటయు గలదు. అదియునుగాక పోష్టుజవానులు సాక్షి సంతకము కావలయునని పేచీపెట్టుటచే మనము పైకమున కిబ్బందిపడుటయు గలదు. ఋషీకేష్ వంటి చివర మకాములలో మనియార్డర్లు వచ్చిన 2 లేక 3 మాసముల వరకు నిలువయుంచు పద్ధతి గలదు.

5) Identification Card – (Postal Guide Clause 31 A) పోష్టుద్వారా, మనియార్డర్లు, ఇన్ష్యూర్ కవర్లు, రిజిష్టరుచేసిన యుత్తరములు వగైరా సులభముగ తెప్పించుకొనుటకు "Identification Card" అనుపద్ధతి గలదు. ఈ కార్డు చూపిన దూరదేశమున నున్న మనకు అచ్చటి Post man లేక Post master ఎట్టిసాక్షి సంతకము అవసరము లేక మన మనియార్డర్లు మొదలగువాని నిచ్చెదరు.

అది సంపాదించువిధము :–

---

పెద్దపోష్టాఫీసునందు ఈ కార్డిచ్చెదరు. దీనికి రూ.1-0-0 కట్టవలెను. ఈకార్డు చదువగల్గి సంతకముచేయగలవారికి మాత్రమే ఈయబడును. అం దెవరికిచ్చుచో వారే ఫోటో తీయించుకొని ఆకార్డులో అంటించి దానికి రూ. 1-0-0 చీటి అంటించిన ఆయూరిపోష్టుముద్ర వేయుదురు. అందు ఆమనిషి యొక్క పొడవు, వయస్సు, అడ్రెస్సు వగైరాలు పూర్తిచేయవలయును. ఇది యిచ్చిన తేది మొదలు 3 సం॥ల వరకు పనికివచ్చును.

<u>ఉపయోగించుకొనువిధము :—</u>

మనము దూరదేశమున నున్నపుడు మనము ఫలానా పోష్టాఫీసుకు ఆ C/o పోష్టుమాష్టరుగారికి మనియార్డరుగాని, ఇన్ష్యూరుకవరుగాని పంపుమని యింటికి వ్రాసిన మనవారు అదేవిధముగ పంపుదురు. అప్పుడు ఆపోష్టుమాష్టరుకు మన యొద్దనున్న Identification Card ను చూపిన మన సంతకము చేయించుకొని, సాక్షి సంతకము అవసరము లేకయే యిచ్చివేయుదురు. దీనివలన చాలనుపయోగము గలదు. సంతకముచేయుట చేతగాని (అనగా చదువురాని) వారికీపద్ధతి యేమాత్ర ముపయోగపడదు. <u>సంతకముచేయువారికే యీపద్ధతి యుపయోగించును.</u>

6) C/o Station master address ఇచ్చి యాస్టేషను గాని సత్రమువద్దగాని వదలి మరియొక క్షేత్రమునకు వెళ్లునప్పుడు తనపేరవచ్చు C/o letters తన future address కు పంపుమని అడ్రసిచ్చి Direct చేయుమని instruction ఇచ్చి పోవలయును. (We can drop a card to the old C/o address to redirect it to our future address.)

7) ఇంటికి పూర్తివివరములతో ఉత్తరములు వ్రాయుచుండవలయును. అట్లువ్రాయుటచే నెప్పటికప్పుడే యింటియొద్ద నున్నవారు అన్నిసంగతులు క్షేత్రమహిమలు చదువుకొని చాల ఆనందించి యాత్రాఫలితమును తాముకూడ పొందుదురు. ఆఉత్తరములు తనమిత్రులకు, ముఖ్య బంధువు

లకు చూపుమని యింటియొద్దనున్నవారికి వ్రాయుచుండ వలయును.

8. కైలాస్, బదరి, కేదార్, గంగోత్రి మొ॥ వెళ్లినప్పుడు చివరికామములలో (last camps) లో post offices లేనిచో, P. o. గల చోటినుండియే ముందు ఇంటికి నీవిధముగ వ్రాయవలయును— "నేను పోస్టాఫీసు లేనిప్రదేశ ములకు వెళ్లుచున్నానుగాన 10 లేక 15 దినములవరకు ఉత్త రాలు వ్రాయుట కవకాశముండదు, భయపడవలదు" అని ముందుగనే యుత్తరములు వ్రాయవలెను.

## యాత్రలకగుఖర్చులవివరము

ఖర్చులు వ్యక్తులపై ఆధారపడియుండును. కొందరు మిక్కిలి తక్కువఖర్చుతో సర్దుకొందురు. కొందరు విరివిగ ఖర్చుచేయుదురు. వారివారిస్వభావమునుబట్టి, ధనమును బట్టి యుండును. ఇచ్చట సర్వసామాన్యముగ తప్పనిసరి ఖర్చులుమాత్రము గుర్తింపబడినవి. వానినిబట్టి యెవరివీలు ననుసరించి వారు ఖర్చుచేసికొనవచ్చును.

ఉత్తర దేశము :—

6000 మైళ్ళ ప్రయాణము, సామాన్యమైనవ్యక్తికి అగు ఖర్చు రోజుకు సగటున

| | | | | |
|---|---|---|---|---|
| సగటున | రోజుకు | రైలు | ఖర్చులు | రూ 2– 0–0 |
| ,, | ,, | బండి | ,, | ,, 0– 6–0 |
| ,, | ,, | భోజన | ,, | ,, 1– 4–0 |

| | | |
|---|---|---|
| సగటున రోజుకు సామానులుకొనుటకు | ,, | 1- 0-0 |
| ,, ,, తీర్థవిధికి | ,, | 1- 0-0 |
| ,, ,, దేవాలయ, ధర్మములకు | ,, | 0-14-0 |
| మొత్తము | | 6-8-0 |

ఇది యుత్తర దేశము వెళ్లివచ్చినయొకయాత్రికుని యనుభవము

దక్షిణ దేశము :–

కన్యాకుమారివరకు వైష్ణవ దివ్యదేశములు సేవించిన యొకభక్తుని యనుభవము.

| | |
|---|---|
| రైలుచార్జీలు | రూ 95-0-0 |
| అర్చన, బస్సు, భోజనము వగైరా ఖర్చులు | 52-0-0 |
| దివ్యదేశములకు మాత్రమే అయిన మొత్తము ఖర్చు | రూ 147-0-0 |

ఉత్తర దక్షిణదేశయాత్రి అన్ని క్షేత్రములు:–

| | |
|---|---|
| ఉత్తర దేశము రైలుప్రయాణము 6000 మైళ్లు | రూ 200-0-0 |
| దక్షిణ దేశము ,, 2500 ,, | 80-0-0 |
| ఉత్తర దక్షిణ దేశములలో మోటారుప్రయాణము 700 మైళ్లు | 40-0-0 |
| బండ్లమీద 350 మైళ్లు | 25-0-0 |
| కాలినడక 260 మైళ్లు | |
| స్టేషనులనుండి యాత్రాస్థలములకు బసలోనికి బండ్లబాడుగ | రూ. 50-0-0 |
| స్టేషనులలో లగేజిమోయు పోర్టర్లకు | 30-0-0 |

| | |
|---|---|
| పైప్రదేశములలో యాత్రచేయుటకు 6మాసములైన పట్టును, గాన భోజనమునకు దినమునకు రూ. 1-0-0 చొప్పున (ఒకపూటమాత్రమే) | 200-0-0 |
| దానధర్మములు కొనువస్తువులకు | 150-0-0 |
| తీర్థవిధులు, అన్నశ్రాద్ధములు | 125-0-0 |
| ఉత్తర, దక్షిణయాత్రల కన్నివిధములైన ఖర్చులు మొత్తము | 900-0-0 |

☞ సుమారుగ కొంతహెచ్చును, తగ్గును.

# యాత్రానిధి

ప్రతిమానవుడు జన్మించినది మొదలు అనేక కష్టపరంపరలకు లోనై సంసారమును, చుట్టు నుండు ప్రదేశమును రోసి హిమాలయపర్వతములకో లేక తన కిష్టమగు పుణ్యక్షేత్రములకో వెళ్ళవలెనని వాంఛించుచుండును. కాని యతనికి ఈవాంఛ జనించునాటికి చేతియందు చిల్లిగవ్వయైన నుండక కడువిచారించుచుండును. కనుక తాను యౌవనములోనుండి బాగుగ ధనార్జన చేయునప్పుడే జీవితభీమాఫండు (Insurance) మాదిరిగ ఒక యాత్రాఫండును నిలువచేసియుంచుకొని తనకు పైతలపు కలిగినప్పుడా ధనముతో బయలుదేరి యాత్రలు సేవించుకొని రావచ్చును. ఈడబ్బును దాచుకొనుటకు అనేక మార్గములు గలవు.

(1) ఇంటియందు దేమూలనో సిమ్మెంటుతో ఒకఅడుగు ఎత్తు 6 అంగుళములు వెడల్పున ఒకపాత్రను (దిబ్బెనను)

పోయించి దానిపైన రూపాయిబిళ్ళ పట్టునంత బెజ్జము నుంచి దానిని భూస్థాపితముచేసి పైభాగము మాత్రము కనబడునట్లు చేయించవలయును. అద్దెయిండ్లలో నుండువారు భూస్థాపితము చేయక దేవునిగదిలో నుంచవలెను. అందు నింటిలోనివా రందరును 0–0–3 మొదలు, వారికి అవకాశముకొలది ఆ యాత్రిదబ్బెనయందు వేయునలవాటు చేయ్యవలెను. లేదా వారి సంపాదనలో రూపాయికింత యనిగాని లేదా ఏదో యొక నియమముతో వేయుచుండిన కొంతకాలమునకు యాత్రికు వెళ్ళుటకు నవకాశము గలుగుధన మందు సమ కూడును. ఇట్లు సులభముగ బీదవా రందరును యాత్రలు సేవించి జన్మసార్థక పరచుకొనవచ్చును.

(2) కొందరు ముఖ్యమైనస్నేహితులు (హృదయములు కలసిన యాత్మసోదరులు) కలసి ఒకసంఘముగ నేర్పడి, అందు ప్రెసిడెంటు, సెక్రటరీ, కోశాధికారులను నియమించుకొని ప్రతిసభ్యుడు తనయవకాశముకొలది నెలకు రూ.1–0–0 తగ్గక నియమబద్ధుడై అప్పుడప్పుడు పైకమున్నప్పుడెల్ల కోశాధికారి పేర బ్యాంకులో a/c ప్రారంభించి అందు డిపాజిట్టు చేయు చుండవలెను. సం॥ రూ. 56/– లు చెల్లించిన 16 సం॥ లలో తాను పూర్తిగ ఉత్తర, దక్షిణ పుణ్యక్షేత్రములు (ఆసేతు హిమాలయము) సేవించి వచ్చుటకు అవకాశము కలుగును. 20 సం॥ లేక 25 సం॥ న ఒకడు యాత్రాఫండు కట్టుటకు ప్రారంభించె ననుకొనుము. 16 సం॥ లు అగుసరికి అతనికి 36 లేక 40 సం॥ వయస్సు వచ్చునంత అతడు యాత్రలు చేయ

గలడు. 40 సం॥ దాటగా యౌవనము గడచి వైవాహికవాం ఛలపై రోసియుండును. అప్పు డీపైక ముపయోగపడును. ఈపైకము యాత్రలకు వెళ్లుటకుమాత్రమే యియ్యబడునుగాని యితరవిషయముల కియ్యబడదు. అవసరమైన ప్రెసిడెంటే వచ్చి స్టేషనులో టిక్కెట్టు కొనియిచ్చి మిగిలినపైకము చేతి కిచ్చును. 16 సం॥ లకు బ్యాంకు వడ్డీ రూ100 కి 0-4-0 చొ॥ దాదాపుగా రూ. 34/-, రూ. 40/- వచ్చును. ఈవడ్డీపైక మును యాత్రలు సేవించుకొని వచ్చినతరువాత సమారాధన నిమిత్తముమాత్రమే యీయవలెను. ఇంతపైకము కోశాధి కారియొద్ద నుండుటకు భయపడువారు వారికి తీరిక చిక్కినప్పు డాపైకముతో చుట్టుపట్ల నుండు క్షేత్రములను సేవించి డబ్బును ఖర్చుపెట్టవచ్చును. లేక ఒకపర్యాయము దక్షిణదేశము, మరి యొకసారి యుత్తరయాత్ర సల్పి పైకము ఖర్చు చేయ వచ్చును. పైసంఘమువారు సమావేశమై కొన్నిరూల్సు ఏర్పాటు చేసికొనవలెను. పైకము ముట్టినట్లుగ కోశాధికారి ఒక ప్యాన్ బుక్కులో సంతకముచేసి, ప్రెసిడెంటుచేతకూడ సంతకము చేయించి సభ్యున కీయవలెను. సభ్యు లడిగినప్పుడు కోశాధికారి తనపేరనున్న బ్యాంకు ప్యాసు బుక్కును చూపు చుండవలెను. ఇంటిలో పిల్లలుండిన వారిపేరకూడ తల్లిదం డ్రులు పైకము కట్టుచుండిన యాత్రలు వెళ్ళినపుడు పిల్లలను కూడ తీసికొని వెళ్ళవచ్చును. అందరిఫండు కలిసి యెక్కువగ నున్న సభ్యు లందరు కలసి బ్యాంకువడ్డీ కన్న నెక్కువ వరు మానములు వచ్చు ఆలోచనలు చేసి తాకట్టుమీద వడ్డీ

కిచ్చుటగాని గవర్నమెంటు బాండ్లుకొనుటగాని చేయవచ్చును. ఇట్లనేక సదుపాయములు చేసికొని మనపూర్వులు ప్రాణత్యాగమునకైన వెనుదీయక పాదచారులై, ఆసేతు హిమాచలము సేవి చిన పుణ్యక్షేత్రములనెల్ల ప్రతిభారతీయుడును సేవించుభాగ్యమును బడసి, తన జీవితమును నాధ్యాత్మికముగ మార్చుకొని ధన్యుడు కాదగును.

ధనికులు, విశేష ధనసంపాదన కలవారిటువంటి సంఘముల నుత్సాహపరచుటయేగాక వారుకూడ ఇట్టి సంఘములందుచేరి ఆధనముతో, బీదలగు యాత్రికులను యాత్రలకు తమతోబాటు తీసికొని వెళ్ళినగాని, లేక ప్రత్యేకముగ యోగ్యులుగనుండి ధనలోపముచే యాత్రలు సేవించకపోతినే యనునార్తిగలవారిని పంపినగాని వారికి లభించెడుపుణ్యము వీరికికూడ లభ్యమగును కనుక ధనికులు యాత్రలయందార్తిగల యాత్రికులను తమజీవితములో యాత్రలకు పంపవలెననుదీక్ష బూనవలెను.

## పండాలు

పండాలు స్టేషన్లకు తమ యేజంట్లను పంపి యాత్రికులను రప్పించుకొందురు. సాధారణముగ అద్దెరూపముగ ధనము తీసికొనరుగాని దానధర్మములవలన, ప్రాయశ్చిత్త దక్షిణలక్రిందను, క్షేత్రవాసుల మనుపేరను ద్రవ్యము వసూలు చేయుదురు. వారే గంగాపుత్రులమని వస్త్రములు తమకే రావలయునని కోరుదురు. గంగాపుత్రులే సంకల్పము చెప్ప

వలెనని మనను బలవంతపెట్టుదురు. పండాలు చెప్పినరీతిని మనము నడచుకొననిచో వారు దౌర్జన్యముచేయుదురు. యాత్రికు లెంత నెమ్మదిగానున్నను పండాలు తొందరకలిగించి పోట్లాటలోనికి దింపుదురు.

పండాలు ప్రారంభమున కొద్దిడబ్బున కొప్పుకొని పని ప్రారంభించి డబ్బును హెచ్చుగ లాగుటకు ప్రయత్నింతురు. పండాలు బండ్లవారితోను, అర్చకులతోను కలసి యాత్రికుల యొద్ద పైకము లాగుటకు ప్రయత్నింతురు.

1. పండాలు ప్రతిపెద్దక్షేత్రమున రైలుస్టేషనులకడకు వచ్చి రైలులోనుండి యాత్రికులు దిగగనే తమబసకు రమ్మని పీడింతురు. చాలముందువరకు వెంటవచ్చి అన్నిబండ్లలో దిగు యాత్రికులను చూచి పీడించి పట్టుకొన ప్రయత్నింతురు

2. వారు సత్రములు లేవని గట్టిగ చెప్పుదురు. వారి మాట వినరాదు. క్షేత్రములలో పబ్లిక్ సత్రములలోనో లేదా ఏదైన గృహస్థులయిండ్లలోనో దిగవలయునేగాని పండాలయిండ్లకు వెళ్ళరాదు. వారు చాల మోసములు చేయుదురు. పండాలుచేయు మోసమునుగురించి యెంతైన వ్రాయ వచ్చును.

ఒకచోట బస చూపించెదమని స్త్రీలను సామానులను ఒకయింటిలోదింపి, సరకులకొఱకు మగవారిని బజారునకు తీసికొనిపోయి అటు నిటు త్రిప్పి ఆ పండా అయిపులేకుండ పోయినాడు. అతనిజట్టులోనివా రాడవారియొద్ద సొమ్ములు సామానులుకాజేసి వదలిపెట్టినారు. కొత్తదేశ మగుటచే వా రేమియు చేయజాలక దేవుడాయని యడుగుకొనుచు నింటికి జేరిరి.

ఒకయాత్రికుడు సంచి, మూట తలక్రిందపెట్టుకొని పరుండెను. ఒకదొంగ వచ్చి కాలివేళ్లు కొరికెను. "ఎవడురా వాడు" అని లేచునప్పటికి తలక్రింది మూటల నింకొకడు కాజేసికొని పోయెను.

కొందరు పండాలు బర్వాసాగా పనులన్నియు జేయించి చివరకు అంతులేకుండ అడిగి యియ్యకపోయిన బజారునబెట్టి బాధించుచుందురు. కొందరు పండాలు చూడవలసిన స్థలములలో కృత్రిమస్థలముల నేర్పఱచి, అచట తమవారిని కొందరి నేర్పరచి, అసలుస్థలములు చూపక కానుకలు వేయించుకొని హరింతురు.

## యాత్రావాఙ్మయము

మదారాసు లిటరరీ సంఘము దాదాపు 40, 000 గ్రంథములుగల ఒక గ్రంథాలయమును గలిగియున్నది. అందు పూర్తిగ చరిత్ర, జీవితములు (biography) ప్రయాణము (Travel) లకు సంబంధించినవి యనేక గ్రంథములు గలవు. యాత్రలవిషయము తెలియగోరువారు ఆ గ్రంథాలయమును వినియోగించుకొనవచ్చును. హిందూదేశమున యాత్రలను గురించి కొలది గ్రంథములు మాత్రమే గలవు. అందు దేశ భాషలలో మిక్కిలి కొలదియున్నవనియే చెప్పవచ్చును. అందు ఒకటి రెండు హిమాలయయాత్రలను గురించినగ్రంథములు గలవు పాశ్చాత్యులు హిందూదేశమును గురించి వ్రాసినవి కొన్నిగలవు గాని మనవారు రచించినవి లేవు.

పూర్వము ధనికులు యాత్రలకు బయలుదేరునప్పుడు బాగుగ చదివిన సంస్కృతపండితులను వెంటబెట్టుకొని వెళ్ళి వారు తాము చేయుయాత్రలవిషయము విపులముగ వ్రాయించెడివారు. అట్లు ముఖ్యముగా రాజులు, జమీందారులు చేసెడివారు. కాని రాజభవనములే శిథిలములుకాగా నిక నిట్టి గ్రంథములు నిల్చునా? అయిన నట్టివి యిప్పటికి కొన్ని పురాతనములు దాగియున్నవి అట్టి వ్రాతలు బయటకు వచ్చిన, మనహిందూజాతి పూర్వోన్నత్యము, దేవాలయ శోభలు, ఆనాటి కాలమాన పరిస్థితులు తేట తెల్లమై మన భారతీయులకు శ్రద్ధ, యుత్సాహము గలిగి అట్టిప్రదేశములను చూతమని కోరికజనించి యాత్రలుచేయ ప్రారంభించెదరు. హిందూయాత్రా చరిత్రలు హిందువులచే వ్రాయబడి బయటికిరానిదే మనవారికి యాత్రలుచేయ అభిలాషజనించదు. మనహిందూ విద్యార్థులు పాశ్చాత్యదేశములకు విద్యాభ్యాసముకొఱకు వెళ్ళినప్పుడు, హిందూదేశములో కాశీ ప్రాముఖ్యమునుగూర్చియు, ఆగ్రా, తాజమహల్, అజంతా గుహలు మొదలగువానినిగూర్చియు వారు విననట్టివానిని గుఱించి ప్రశ్నించిన మనవారు వానివిషయము తెలియకయు, చనువకయు, నేదో యూహాగానముచేగాని. లేక రైల్వేవారు అచ్చువేయు కాగితములు చదివిగాని చెప్పుచుందురు. పాపము పాశ్చాత్యులు మనవారు చెప్పువవి విని నిజముగా వారు వారిదేశములోని యాత్రలుసల్పి అన్నియు తేట తెల్లముగా చెప్పుచున్నారని భావించెదరు. ఇట్లు మనవిద్యార్థులు

సరియైన గ్రంథములు మన దేశమునుగుఱించి చదువక పోవు టయు చూడకపోవుటయు, గొప్పలోపమే. కాన నితర దేశము లకు బోవు ప్రతివిద్యార్థియు, యాత్రికుడును (traveller) ఇతర దేశముల చూడబోవువారును, మొదట మన దేశము ఆమూలాగ్రము యాత్రసల్పి వెళ్ళవలెను. అట్లేగదా ! శ్రీమద్వివేకానంద, రామతీర్థాదులు మన దేశము మూల మూల యాత్రలు సల్పి, హిందూ విజ్ఞానము పూర్తిగా బడసి యితర దేశసంచారము గావించినది !

నవీనయుగమున రైల్వేకంపెనీలు అనేక క్షేత్రముల విషయమును. చరిత్రాత్మక పట్టణముల విషయమునుగూర్చి కొన్ని వ్రాతలు తయారుచేయుటయేగాక, వానిని సులభముగ దర్శించుటకు, కాలధన నిర్ణయముల నేర్పాటుచేసి 'మట్టు ప్రయాణపు టిక్కెట్లు' (Round Tour tickets) చౌకగ త్వరితముగ ప్రయాణముచేయు నవకాశములను కల్పించిరి. అందువలన తీర్థయాత్రలకు బయలుదేరుటకును, విద్యార్థులు, ఉపాధ్యాయులు వినోద విహారములకు (Excursions) బయలు దేరుటకు నవకాశములు కలిగినవి.

## దేశాచారములు

1. ఉప్పిలియప్పన్ స్వామికి ఉప్పు కలుపకుండ ఆర గింపు పెట్టెదరు.

2 తిరుచుండూరులోను, మలబారు దేవాలయముల లోను కొబ్బరికాయకు పీచుండరాదు ఆకులలో భస్మముపెట్టి స్వామిప్రసాదముగ నిత్తురు.

3. శ్రీరంగములో స్వామికి నివేదనము చేయుటకు కొబ్బరికాయను తీసికొను నాచారము లేదు.

4. నాగర్‌కోయిల్ దేవాలయములో స్వామిప్రసాదముగ ఇసుక నిత్తురు. (6మాసములు తెల్లగను, 6మాసములు నల్లగ నుండును.)

5 నాగూర్ దర్గాలో నివేదనకు బెల్లము పొడికొట్టి కోసుగా పొడవుగా పొట్లములు కట్టి తీసికొని వెళ్ళవలెను.

6. ఉత్తరదేశమునందంతటను సాధారణముగ స్వామికి మిఠాయీ లెక్కువగా నివేదింతురు.

7 కొన్ని దేవాలయములలోనికి నడుమునకు గుడ్డకట్టు కొని చొక్కాలు లేకుండ పోవలయును. ఇందు నిమిత్తము సింహద్వారముదగ్గఱ పోలీసుల నియమింతురు. వారు మన దుస్తులను, సామానులను జాగ్రత్తపరచెదరు. (తిరువాన్కూరు, శుచీంద్రము, మొ॥)

8. వానమామలైలో స్వామికి ప్రతినిత్యము కొన్ని డబ్బాలనూనెతో అభిషేక మొనర్చెదరు.

9. తిరువాన్కూరు సంస్థానములో వారిప్రత్యేక నాణెములు వాడెడివారు. ఇప్పు డన్నియు చలామణిలో నున్నవి.

10. అనంతశయనగర్భాలయము ముందుండు మంటపముపై నెవరును కూర్చుండరాదు. బ్రాహ్మణేతరులకు ప్రత్యేకస్థలమున పూజారిగాక మరియొక బ్రాహ్మణునిచే తీర్థప్రసాదముల నిప్పింతురు

11. A-తిరువాన్కూరు రాజ్య మంతటను నేతికి బదులు కొబ్బరినూనెను వాడెదరు. (వంటకు, చేతులమీదికికూడ)

B-ఆంధ్రదేశమున గోదావరిజిల్లాలో పప్పునూనె వాడెదరు. (వంటకు, చేతులమీదికికూడ)

12. మలబారునందలి సాధారణస్త్రీలు ఒకయంగ వస్త్రము చుట్టుకొని మరియొకదానిని పైన వేసికొందురు. (చీరెలుగాని, రవికెలుగాని యుండవు)

13. రామేశ్వరమునందు అభిషేకమునకు రూ. 3-0-0 చెల్లించిన గిద్దెడు పరిమాణము గలగంగాజలము (దేవాలయమందు సిద్ధముగ తెప్పించియుంచబడిన) చే రామలింగేశ్వరునకు అభిషేకము చేయుదురు.

14. దేవిపట్టణమున నవగ్రహపూజకు తిలలు, ప్రత్తిగింజలు నగ్గిరా కావలయును. అచ్చటనే దొరకును.

15. అరవదేశ భోజనవిధానమున వారు సాంబారు, రసములతో అన్నము కలుపుకొని కూరలు, పచ్చడులు నంజుకొని తిందురు. పాత్రలను నోట కరచుకొని జలము, కాఫీ మొ॥ త్రాగరాదు.

16. పండరిపురమున భక్తులపై పేలాలు చల్లుదురు. పండరి బుక్కా యను సుగంధ ద్రవ్యములతో చేసిన పొడిని బొట్టు పెట్టుకొందురు.

17. ద్వారక సమీపమునగల గోపీతలావ్ నందు మట్టియే గోపీచందనముగ భక్తులు వాడుకొనుటకు తీసికొని వెళ్లుదురు

18. పండరిపురము, శ్రీశైలము, ప్రయాగ, గయ, కాశి, సోమనాథము, ఉజ్జయినీ మొ॥ కొన్ని మహాక్షేత్రము

లందు నాలుగువర్ణములవారును స్వామిని స్పృశించి పూజా నివేదనములు చేయునాచారము గలదు.

19. నాలుగుధామములలో నొకటియగు శ్రీజగన్నాథములో "సర్వం జగన్నాథం" అను నాణ్యోక్తి గలదు. ఇందు జాతిమత విచక్షణ లేకయే ప్రసాదము వినియోగ పరచెదరు.

20. దక్షిణాది క్షేత్రములలో సాధారణముగ స్వామికి నివేదించిన ప్రసాదము కొద్ది వెలకు అమ్మెదురు.

21. ఉత్తరదేశములలోని దేవాలయములోనికి చర్మ సంబంధమైన ( Money Purse, watch strap, Belt etc ) వస్తువులతో వెళ్లనీయరు.

22. రామేశ్వరమునుండి (ధనుష్కోటినుండి) తెచ్చు ఇసుక (సైకతము) త్రివేణియందు సమర్పింతురు.

23. గంగ తెచ్చువారు ప్రయాగలో నితరనదులు (యమున మొ॥) కలియకమునుపే పట్టవలెను.

24. ఆదేశస్థులు బైలుకు వెళ్ళిన మట్టితో చేతులు, కాళ్లు, చెంబు చాలసేపు శుద్ధి చేయుదురు.

25. ఉత్తరదేశములో అన్ని స్టేషనులలోను, బజారుల లోను "హిందూచా" అనియు, "మహమ్మదీయచా" యనియు వేరువేరుగా అమ్మెదురు.

26. పితరులకు, పిండములు, ముఖ్యముగ గయ, కాశి త్రివేణి, బదరీ (బ్రహ్మకపాలములందు) పెట్టుదురు.

27. ఒరియా, బెంగాలి బ్రాహ్మణులు మత్స్యములు తిందురు.

28. మైసూరుసంస్థానములో నున్న మేల్కోటయందు శ్రీ రామానుజాచార్యులవారిచే గనుగొనబడిన నామునగని నుండి తయారుచేయబడిన 'నామునే' వైష్ణవులెల్లరు స్వరూపముగ ధరింతురు.

## విశేషములు

1. అంబాసముద్రము నొద్ద నున్నపాపనాశన మను క్షేత్రము ప్రక్కగ ప్రవహించు తామ్రపర్ణినదియందు చేపలకు సెనగపప్పు బిస్కట్లు, మరమరాలు ఆహారముగ వేయుదురు. ఇచ్చట కోతులు విశేషము. చేపలకు వేయునప్పుడు కోతులు మీదపడి లాగుకొనిపోవును. అట్టి సమయమున గుప్పెడుపప్పు నేలమీద విసరిన కోతులన్నియు నేరుకొని తినుటకు కొంత వ్యవధి పట్టును. ఈలోపల మనము చేపలకు ఆహారము వేసిన అవి నిర్మలోదకమున చక్కగ కనబడును.

2. సరయూనదిలోను, యమునలోను తాబేళ్లు విశేషముగ నుండును. అయోధ్య, మధుర, బృందావనములలోనే తాబేళ్ళను చూడనగును.

3. పుష్కరక్షేత్రములో మొసళ్లు విశేషముగ నుండును పండాలు గడలతో అదలించుచుండ యాత్రికులు స్నానము చేయుదురు. నేడు వానిసంఖ్య తగ్గినది.

4. గండకీనదియందు సాలగ్రామములు దొరకును. ఇది నేపాల్ దేశమున గలదు.

5. పళని సుబ్రహ్మణ్యస్వామి కొండపైకి వెళ్లునప్పుడు పాలు పొంగునని ప్రతీతి.

6. యమునోత్తరి గంగోత్తరిలలోనుండు తప్తకుండము (వేడినీటిబుగ్గ) లో బియ్యము, బంగాళాదుంపలు మరి యితర శాకములుగాని మూటగట్టి నీటిలో వేసినచో పక్వము లగును.

7. మంటప చతుష్టయము :- 1 భోగమంటపము—శ్రీరంగము; 2 త్యాగమంటపము—కాంచీపురము; 3. పుష్ప మండపము--తిరువేంగడము; 4. జ్ఞానమంటపము - తిరునారాయణపురము.

8. పర్యాయనామములు :- 1. కోయిల్ - నంబెరు మాళ్ళ సన్నిధి—శ్రీరంగము; 2 తిరుమలై-శ్రీ వేంకటాచల పతిసన్నిధి-తిరుపతి ; 3. పెరుమాళ్ కోయిల్-శ్రీవరదరాజుల సన్నిధి-కాంచీపురము.

9. ప్రధానములు:- 1 ప్రయాగలో—త్రివేణీసంగమము లో-ముండనముప్రధానము 2 కాశీలో-భైరవులవద్ద-దండనము ప్రధానము 3 గయలో శ్రీవిష్ణుపాదమునొద్ద-పిండప్రదానము.

10. మాధవత్రయము :- 1 కాశీలో-బిందుమాధవ సన్నిధి 2 ప్రయాగలో వేణుమాధవసన్నిధి 3 రామేశ్వరములో-సేతుమాధవసన్నిధి.

11. బ్రహ్మములు 3:- 1 పండరిపురములో - నాద బ్రహ్మము - సదా సంకీర్తనయందు ప్రీతి; 2 జగన్నాథము (పూరీ)లో-అన్నబ్రహ్మము-సదా అన్నారాధనయందు ప్రీతి; 3 శ్రీమద్గయలో-పిండబ్రహ్మము-శ్రీవిష్ణుపాదమున పిండస్వీకారమునందు ప్రీతి.

12. పంజాబులోని కంగ్రానుంచి పఠాన్ కోటకు పోవు మార్గములో 'అగ్నిమాత' ఆలయం ఉన్నది. అచ్చటి మట్టిని తీసి పాముకాటుపై పుద్దినా లేదా లోపలకు మ్రింగినా పాము విషము పోతుంది. లేదా ఆమట్టినీ. అచ్చట ప్రవహించుచున్న కాలువనీటని కలిపి కాటుపై పుద్దిన పాముడిషము తగ్గిపోవును. ఈవిషయములో ప్రభుత్వము పరిశోధనలు జరుపుతున్నారు.

# రైల్వే తూకము

80 తులములు= 1 శేరు
40 శేర్లు= 1మణుగు

3 రైల్వేమణుగులు=10 సాధారణ మణుగులు

రైల్వేమణుగులను సాధారణమణుగులుగా మార్చుటకు 10చే గుణించి జవాబును 3చే భాగించవలయును. సాధారణ మణుగులుగా మార్చుటకు 3చే హెచ్చించి జవాబును 10చే. భాగించవలయును.

# మదరాసుపడి

1½ గిద్దలు= 1 అళాకు

8 అళాకులు=1½ శేర్లు (తవ్వలు) లేక 1 పడి అందురు.

మద్రాసుకొలతలలో చిన్నది అళాకు, పెద్దది పడి. అరపడి. కాల్పడి మొ॥ కొలతలలో నుండును.

1 శేరుబియ్యము 88 తులముల ఎత్తు (బరువు)తూగును.

# కాశీనుండి స్వగ్రామ ప్రవేశము

కాశీయాత్ర చేసివచ్చి స్వగ్రామము చేరునపుడు ముందుగా తనవారలకు తెలియజేయవలెను ఇంటినుండి తనవారలు బంధుమిత్రులు మొదలగువారితోను, మేళతాళముల తోను ఊరిపెలుపల తమకును గంగామాయికిని ఎదుర్కోలు వచ్చి సగౌరవముగా ఊరేగింపుతో తమ నివాసస్థానమునకు చేర్చవలెను.

అవకాశమున్నవారు బ్రాహ్మణోత్తములతోడను, స్వస్తి వాచనముతోడను, ముత్తయిదువులు బంధుమిత్రులు మొదలగువారితోడను కలసిగాని. భగవన్నామ సంకీర్తనచేయు భజనపరులతో కలసిగాని, గంగను శిరస్సున ధరించియో, కావడిలో నుంచికొనియో తమ నివేశనమునకు చేరవలెను.

ఇంటిని గోమయముతో అలికి రంగవల్లులు తీర్చిన ఉత్తరదిగ్భాగమున పసుపుపూసి, కుంకుమముచే అలంకరించిన ఒక పీఠమునం దుంచి, గంగామాయికి నమస్కరించి భజనచేయవలెను. పిమ్మట ఎదుర్కోలు వచ్చినవారల కందఱకును ప్రసాదము వినియోగించి తాను స్వీకరించవలెను.

యాత్రచేసికొని వచ్చినవారికి కొడుకులు, కోడండ్రు, పిన్నలు, పాదపూజచేసి నూతనవస్త్రములు మొదలగువానితో సన్మానించి వారియాశీర్వచనములను పొందవలెను-ఇది పూర్వమునుండి వచ్చుసంప్రదాయము. పిదప యాత్రావిశేషముల నందఱకును జెప్పవలెను.

యాత్రికులు తమ తీర్థయాత్రాకాలములో అవసరమగు ఏకభుక్త బ్రహ్మచర్యాది దీక్షను వహించుటయేగాక, గంగను పట్టినదిమొదలుకొని, వపనసంస్కారమును మానుట కూడ ఆవశ్యకము.

## సమారాధనములు

కాశీయాత్రనుండి ఇంటికి చేరిన 8 రోజులలోగా ప్రథమమున కాలభైరవసమారాధన చేయవలెను. దీనికి మంగళవారము ప్రశస్తమందురు. ఈసమారాధననాడు దేవాలయమందలి శివునిగాని కేశవునిగాని తాను తీసికొనివచ్చిన గంగాపాత్రలలోని ఒక పాత్రయందలిగంగతో అభిషేకించి పూజించవలెను. స్వామివారికి మహానివేదనకుకూడ ఏర్పాటు చేయవలెను. స్వగృహమున కాలభైరవపూజ చేసి సమారాధన చేయవలెను దీనికి కాలాష్టకమందురు. ఇందు ఎనిమిదిమంది బ్రాహ్మణులకు ఆపోశన మిచ్చి భోజనముచే తృప్తిపరచవలెను. ఈరోజున, మినుప గారెలు పిండివంటతప్పదు. కాలభైరవునివాహనము కుక్క, కాన. ఈనాడొక మగకుక్కను పసుపు, కుంకుమముతో అలంకరించి, తృప్తిగా భోజనము పెట్టవలెను. కొందఱు దానిమెడయందు బేసి సంఖ్య గలగారెలదండను వేయువాడుక గలదు. గంగాభిషేకముగాని కాశీదారములుగాని యాత్రాప్రసాదముగాని యీ రోజున వినియోగించరాదు. కాలభైరవ సమారాధన యాత్రకు పూర్వము, యాత్రానంతరముకూడ చేయుదురు.

ఈ సమారాధన చేయువఱకు ఏకభుక్తము, బ్రహ్మచర్యము, అధశ్శయనము (చాపమీద పరుండుట) పరాయిభోజనము మానుట, శ్రాద్ధాన్నము తినకుండుట, వపనము మానుట ఇత్యాది నియమబద్ధుడై యుండవలెను. తరువాత దీక్షవిసర్జింప వచ్చును.

ఈసమారాధనలోనే కలిపి గంగాసమారాధన (కాశీ సమారాధన) కూడ చేయవచ్చును. అట్లుచేయు నెడల గంగా సహస్రనామములతోగాని, గంగాష్టోత్తరశతనామములతోగాని గంగను పూజించి, బంధుమిత్రులందఱకు గంగాభిషేకము చేసి కాశీదారములు, యాత్రాప్రసాదము వినియోగించ వలెను. కాని కాశీసమారాధనకు బూరెలు (పూర్ణపుబూరెలు) ముఖ్యము ఇట్టిసందర్భమున కాలభైరవ సమారాధనకు నియమించుకొన్న ఎనిమిదిమంది బ్రాహ్మణులకు మాత్రమే గాక ఇంకను యథాశక్తిని బాహుళ్యముగా సమారాధన చేయవలెను. తాను తెచ్చిన, సీలుచేసిన గంగపాత్రలు దర్భాసనములు, చిత్రాసనములు, రుద్రాక్షతావళములు, పటములు మొదలగువానిని, బంధుమిత్రులలో సన్నిధినున్న వారలకు భోజనానంతర మిచ్చి తాంబూలాదులచే సమ్మానించుట ముఖ్యము.

☞ అత్యావశ్యకులైన బంధుమిత్రాదులు దూరస్థలములం దుండి వెంటనే వచ్చుటకు సావకాశము లేనప్పుడు మాత్రము కాలభైరవ సమారాధన, యాత్రనుండి

వచ్చిన 8 రోజులలోగా చేసివేసి, కాశీసమారాధన తమ పిలునుబట్టి వ్యవధిలో అత్యావశ్యకులగు బంధుమిత్రాదులందఱు వచ్చునట్లు నేర్పఱచుకొనవచ్చును.

పై సమారాధనలు యథాశక్తి చేసికొన్నందున లోపము లేదు రామేశ్వరము వెళ్లి శ్రీరామలింగేశ్వరస్వామికి గంగాకలశమును సమర్పించువఱకు నిత్యము గంగాకలశమునకు పూజానివేదనములు జరుపుకొనుచుండవలెను.

శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘము (రిజిష్టర్డు)
గుంటూరు.
1956.

ఇట్లు,
రాగం వెంకటేశ్వర్లు.
గ్రంథకర్త



# యాత్రామార్గదర్శి

## క్షేత్రముల వివరణము

[దక్షిణ భారతక్షేత్రములు-అనగా తిరువాన్కూరు, కొచ్చిన్, మైసూరు, కేరళ, మలబారు, కన్నడ ప్రాంతముల క్షేత్రములనుగూర్చి వ్రాయబడినది.]

### గుంటూరు

ఆంధ్రరాష్ట్ర మను పేర మొదట 11 మండలములతో నేర్పడి, పిదప హైదరాబాదు రాష్ట్రమునుండి 7 మండలములు కలియుటచే నిపుడు 18 మండలములతోడను, 1,10,250 చ. మైళ్లు వైశాల్యముతోడను, 3 కోట్ల, 20 లక్షల, జనసంఖ్యతోడను 1956 నవంబరు 1వ తేదీన నూతనముగ నేర్పడిన 'ఆంధ్రప్రదేశ్' లోని విశాలనగరములలో గుంటూరుగూడ నొకటి.

ఇది గుంటూరుమండలమున ముఖ్యపట్టణము. విశాలమైన పట్టణము. దాదాపు లక్షయేబదివేలు దీనిజనసంఖ్య. బ్రాడ్, మీటరు గేజి రైల్వేలకూడలి. అనేక కళాశాలలు, హైస్కూళ్లు గలవు. రాజకీయరంగములలో పేరుగాంచిన జిల్లా. ఇది పొగాకువ్యాపారమున ప్రపంచఖ్యాతి గాంచెను. భారతమును రచించిన ఉభయకవిమిత్రుడు తిక్కనసోమయాజి గుంటూరువాస్తవ్యుడు.

చూడవగినవి :- అగ్రహారములో అనాదిప్రసిద్ధములైన శ్రీ నృసింహస్వామివారి ఆలయము. (ఇచ్చట నాలాయిరసన్నిధి. అధ్యయనోత్సవములు జరుగును.) శివాలయము, శ్రీ సత్యనారాయణస్వామిమందిరము (మార్వాడీల దేవాలయము) కొత్తపేటయందు ఆంజనేయస్వామివారి ఆలయము (ప్రతి శనివారము విశేషజనులు దర్శనార్థము వచ్చుచుందురు) కన్యకాపరమేశ్వరి అమ్మవారి దేవాలయము, (నవరాత్రములలో వైభవముగ ఉత్సవములు జరుగును.) శ్రీరామనామక్షేత్రము, శ్రీకుసుమ హరనాథమందిరము, జ్యూటు, నూలు, నూనెమిల్లులు మొదలగునవి దర్శనీయములు.

వసతులు :- భోజనశాలలు, రహదారిబంగళా, సత్రములు, సిటీబస్సులు, బండ్లు రిక్షాలు, టాక్సీలు వగైరా సర్వ సౌకర్యములు గలవు.

## శ్రీరామనామక్షేత్రము

స్థాపనము-అభివృద్ధి :- శ్రీసీతారామచంద్రమహాప్రభు కృపచే బాల్యమునుండి శ్రీరామనామసంకీర్తనానందపరుడగు ఒక ఆంతరంగికభక్తునిచే తదనుచరుల భగవన్నామసంకీర్తన ద్విగుణిత్సాహావలంబనమున నీ సంఘము 1926 సంవత్సరమున స్థాపింపబడినది. 4 ఎకరముల స్థలమున అనేక సుందర మందిరములతో, వాపీకూపతటాకములతో, పుష్పవనములతో 'శ్రీరామనామక్షేత్ర' మను పేర సుస్థాపిత మైనది. ఈ ప్రదేశము గుంటూరు రైల్వేస్టేషనుకు దక్షిణముగా సుమారు 2 మైళ్ళదూరములో అగ్రహారమునందు నుండును.

స్థానము:- గుంటూరుపట్టణమున అగ్రహారములో శ్రీకృష్ణతటాకము(నల్లచెర్వు)నకు ఉత్తరభాగమున ఈక్షేత్రము నెలకొల్పబడినది. ప్రకృతిసౌందర్యము కడురమణీయము.



శ్రీరామ నామక్షేత్ర దూరదృశ్యము

కట్టడములు:-శ్రీరామనామక్షేత్రమున మధ్యభాగమున శ్రీకోదండరామప్రభుమందిరము, ఎదురుగా శ్రీప్రపత్త్యాంజనేయమందిరము, ఉత్తరపువైపున శ్రీరామకోటిమందిరము, (ఇందు భక్తులచే వ్రాసి సమర్పింపబడిన దాదాపు 148 కోట్ల నామములగల భగవన్నామ లేఖనగ్రంథములు భద్రపరచబడి అర్చింపబడుచున్నవి) దక్షిణమున భాగవతసేవామందిరము (ఇందు మహాభక్తుల పటములు అలంకరింపబడియుండును) గలవు ఆయాసమయముల ఆయామహామహుల జయంత్యుత్స

వములు జరుపబడుచుండును. ప్రతిశుక్రవారము నిందు స్వామి వారి పవళింపుసేవ జరుగును. ఇందు క్షేత్రపాల మనుపేర ఆసేతుహిమాచలము గలక్షేత్రములందలి భక్తపవిత్రపాదధూళి



శ్రీరామతీర్థము

భద్రపరుపబడినది. ఈ మందిరములకు దక్షిణముగా 'శ్రీరామ తీర్థ' మనుకోనేరును, 'శివకూప' మను పెద్దబావియు, వానికి దక్షిణమున భక్తులజపధ్యానాదులకు ధ్యానకుటీరములును గలవు. శ్రీరామమందిరము వెనుక స్వామివారి పాకశాల, స్టోరు గదులు, అతిథిగృహము గలవు. క్షేత్రసింహద్వారమునకు కుడి

వైపున వివిధకార్యాలయములు, ఆధ్యాత్మిక గ్రంథాలయము, సీతాసదనమును ప్రచురణశాలలో ఆఫీసుభవనమును దాని వెనుక భగవన్నామ ప్రచార శకటపు (Motor Van) శాలయు, ఆఫీసునకు ఎదురుగా సీతారామ పుష్ప వనము, దాని వెనుక సత్రమును గలవు. వీని నన్నిటిని చుట్టి వచ్చు ప్రాకారము నలువైపుల నిర్మింపబడినది. ఈక్షేత్రపరిపాలనము శ్రీ సీతారామ నామసంకీర్తనసంఘము (రిజిష్టర్డు) చే నిర్వహింపబడుచుండును.



క్షేత్రములోని ముఖమంటపము

ప్రేక్షకులు :- ఈపవిత్రక్షేత్రమును అందలికార్యములను దర్శించుటకును, ఆధ్యాత్మికసాధనలు గావించుకొనుటకును భారత దేశము నలువైపులనుండి జిజ్ఞాసువులు. భక్తులు, సాధుపుంగవులు, సన్యాసులు. మఠాధిపతులు తరుచు వచ్చుచుందురు.



వివిధ కార్యాలయములు

అట్టివారికి అనుష్ఠానములకు ధ్యానకుటీరములు, బసకు అతిథి గృహమును, సత్రమును నొసంగబడుచుండును.

క్షే త్ర మం ద లి ని త్య కా ర్య క్ర మ ము

| | | |
|---|---|---|
| 1. స్వామివారి అర్చన-హారతి | ఉ. గం. | 10- 0—11- 0 |
| | రా. ,, | 7- 0— 8- 0 |
| 2. దైవదర్శనమునకు వేళలు | ఉ. ,, | 7-30—11- 0 |
| | సా. ,, | 4- 0— 8- 0 |
| 3. సమష్టి సంకీర్తన (వాద్యములతో) | సా. ,, | 6-30— 7-30 |
| 4. పురాణకాలక్షేపము | పగలు ,, | 2- 0— 4- 0 |
| 5. గ్రంథాలయము తెఱచియుండు వేళ | ,, ,, | 4- 0— 6- 0 |

6. అఖండహరనామసంకీర్తన 24 గం.
నిత్యము అహోరాత్రము జరుగును.

7 ఆఫీసుపనిచేయు కాలము ఉ. గం. 7-30—11- 0
సా. ,, 2-30— 7- 0

8. ప్రతిశుక్రవారము పవళింపుసేవ రా. ,, 8- 0— 9- 0

☞ ప్రతి గురువారము క్షేత్రి ఆఫీసుకు సెలవు.

వార్షికోత్సవములు :- ప్రతిమార్గశిరమున పునర్వసు నక్షత్రము వెలయు దినమున (డిసెంబరు నెల) ప్రారంభించి, ఐదురోజులు శ్రీరామకోటి మహోత్సవము లనుపేర వార్షికోత్సవములు జరుపబడును. ఈ సందర్భమున 103 మందిరములయందు శ్రీరామకోటి లేఖనగ్రంథములపూజ, నగరోత్సవము, సీతాకల్యాణము, పట్టాభిషేకము, తెప్పయుత్సవము, విరామము లేకుండ మహోపన్యాసములు. హరికథలు, పురాణ తరంగ భజనకాలక్షేపములు జరుపబడును. ఇంచుమించు 20 వేలమంది ప్రేక్షకు లిందు పాల్గొందురు.

## ధర్మవైద్యశాల

ఈ క్షేత్రిపక్షమున నొక వైద్యశాల నడుపబడుచున్నది. ఇందు బీదలకు వైద్యసహాయమే గాక, వారి పసిబిడ్డలకు ఆముదము, కొబ్బరినూనె, పాలుగూడ నిత్యము అందజేయబడుచున్నవి. ఆ రోగులకు ఆరోగ్యసూత్రములనుగూడ బోధించుచు మానసిక,వృత్తులు నైతికముగ వృద్ధిపొందులాగున నీ వైద్యాలయము సాయపడుచున్నది.

అఖండసంకీర్తన :- డి. 20—12—1937 శుభదినమున శ్రీశ్రీశ్రీ ప్రభుదత్తబ్రహ్మచారి (ప్రయాగ) మహోదయులచే

# :రజతోత్సవ దృశ్యములు:



శ్రీరామనామక్షేత్ర దృశ్యము.



మోటారు-శకటములపై రజతోత్సవము.



క్షేత్ర సింహద్వారము.



రజతోత్సవమున-మోటారుశకటముల బారు



శ్రీరామతీర్థ తీరము, సంఘభవనములు.



ప్లవమహోత్సవము. (తెప్పతిరునాళ్ల.)

శ్రీ కోదండరామస్వామివారి సన్నిధిన ప్రారంభింపబడిన అఖండసంకీర్తన నేటివరకును విరామము లేకుండ జరుగుచునే యున్నది. ఇందు పాల్గొనువారికి భోజన, వస్త్రముల యేర్పాటు గలదు. నిత్యము సాయంకాలమున గం 6-30 నుండి 7-30 వరకు భక్తబృందముచే వాద్యములతో సమష్టి నామసంకీర్తన జరుగును. ముఖ్యమైన దినములలో పట్టణ వీధులలో నగరసంకీర్తనగూడ గావింపబడును. ప్రతి ఆది వారము ఉపన్యాసములు జరుగును. రెండు మాసములకు ఒక సారి సాధనశాఖాసమావేశము జరుగును.

శుభాశయము:- సర్వస్త్రీపురుషకళ్యాణమునకును దేశ శాంతికిని భగవన్నామసంకీర్తనము, తత్ప్రచారము అత్యావస రము. అందుచే ప్రతిగ్రామమున పవిత్రాశయములతో సంఘ ములు తప్పక యేర్పడి కలిసి సమష్టికృషి చేయుట ప్రస్తుత కర్తవ్యము. అందుచే ప్రతిగ్రామమునందును సంకీర్తన సంఘ

క్షేత్ర ప్రచారశకటము



ములు స్థాపింపబడవలయుననియు, ప్రతివ్యక్తి భగవన్నామము నాశ్రయించవలెననియు, ఇట్లు యావదాంధ్రదేశమున యావద్భారత దేశమున భగవన్నామ ప్రచారము కావింపవలెననియు, చెట్లకు ఆకులు ఎంత ప్రాణాధారమో మానవునికి దైవముపట్ల భక్తివిశ్వాసములుకూడ అంత ముఖ్యమనియు. సంఘసోదరుల శుభాశయము.

మహమ్మదీయభక్తుడు, కీ॥ శే॥ 'కాలేమస్తాన్' దర్గా కడ నేటేటజరుగు ఉరుసు దర్శనీయము. (నగరంపాలెంలో)

చేబ్రోలు

ఇది గుంటూరుజిల్లాలో గుంటూరు నగరమునకు దక్షిణముగా 9 మైళ్లలో పొన్నూరు బస్సుమార్గమున గలదు. పెక్కుబస్సులు గలవు. ఇదియు చరిత్రప్రసిద్ధ మైనగ్రామము. నేడొక పెద్ద పంచాయతీగ్రామముగ నున్నది. గోదావరి జిల్లాలో 'చేబోలు' అనెడిఅపేరుగల మరియొక గ్రామము గలదు. పొరబడరాదు. ఇది చేబ్రోలు - అది చేబోలు.

ఇది శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు బహద్దరువారి అత్తగారి గ్రామము. ఈరాజాగారు 999 గ్రామముల బరిపాలించిరి. వారు పరిపాలించిన ప్రతిగ్రామమునందును నొక్కొక దేవాలయము ప్రతిష్ఠించి వానిపోషణమునకు మాన్యము లిచ్చి, పండితుల కగ్రహారము లొసగిరి. ఒకే లగ్నమున వివిధగ్రామములలో 108 శివలింగప్రతిష్ఠలు గావించిన శివభక్తుడు శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడుగారు. అంతేగాదు వైకుంఠపురము, మంగళగిరి, పొన్నా

రువంటి ప్రదేశములలో వైష్ణవాలయముల నెల్ల పునరుద్ధరించిరి.

చేబ్రోలునందొక చక్కని సరోవరము, అందు మధ్యమున నొక బ్రహ్మాలయమును ఈరాజాగారు నిర్మించిరి. భారత దేశమున గల కొలది బ్రహ్మాలయములలో నిది యొకటి. చేబ్రోలునుగూర్చిన శాసనము లనేకములు గలవు.

ఈగ్రామము పట్టణముగాకున్నను ఊరంతయు ఆలయములే. అన్నియు దర్శనీయములు. ఆంజనేయస్వామి చతుర్ముఖబ్రహ్మ, చంద్రమౌళీశ్వరస్వామి, నాగేశ్వర, శ్రీరాజ్యలక్ష్మీదేవి, శ్రీరంగనాథస్వామి, సహస్రలింగేశ్వర, వేణుగోపాలస్వామి ఆలయములు ప్రధానమైనవి.

చేబ్రోలు పాటిదిబ్బలపై పెసుగు నాటుపొగాకునకును, సన్నితఖద్దరు వస్త్రములనేతకును బహుప్రఖ్యాతి వహించినవి.

ఇచటికి పడమరగా 4 ఫ॥ దూరమున కొత్తరెడ్డిపాలెములో శ్రీ ఆనందాశ్రమము గలదు. దీనిస్థాపకులు శ్రీ లక్ష్మీకాంతానందస్వామివారు. శ్రీస్వామివారి భక్తి జ్ఞాన పరిబోధముల బడయుటకు శిష్యు లనేకులు దూరప్రదేశములనుండి వచ్చుచుందురు. ఇచ్చటి శ్రీఆంజనేయ, పాండురంగ, గాయత్రీ, కాశీవిశ్వేశ్వర, కోదండరామాది ఆలయములు దర్శనీయములు.

## పొన్నూరు లేక గోష్ఠివనము

గుంటూరునుండి బస్సుమార్గముగ 19 మై. బస్సులు గలవు. తెనాలిమీదుగా వాల్తేరు మద్రాసు రైల్వేమార్గమున

వెళ్లి నిడుబ్రోలు స్టేషనులో దిగవలెను. స్టేషనుకు ఒకవైపు నిడుబ్రోలును, రెండవవైపు పొన్నూరును గలవు. ఇదియు పెద్దగ్రామమే. అన్నివసతులు గలవు. భోజనశాలలు, సత్రములు గలవు. ఇచ్చట నొకహైస్కూలును, నొకకళాశాలయు, నొకవేదసంస్కృతపాఠశాలయు గలవు.

## పొన్నూరు శ్రీభావనారాయణాలయము

పూర్వచరిత్ర:- స్థలపురాణమునుబట్టి యిచటిమూర్తి స్వయంవ్యక్తముగా నిశ్చితమగుచున్నది. ఆలయనిర్మాణము ప్రప్రథమమున అవ్వురురాజ్యాధిపతియైన నంద్యాల నారపరాజు గావించినట్లును క్రీ. శ. 1119 లో పరిపాలించిన కులోత్తుంగ చోళదేవమహాచక్రవర్తి వైశాఖోత్సవములకు, అర్చనాది కైంకర్యములకు నైదుగ్రామము లొసగినట్లును, రాచూరు జమీందారులు శ్రీ మాణిక్యారావు జగ్గారావుగారు క్రీ. శ. 1772 లో ప్రాకారాదులు నిర్మించినట్లును తెలియుచున్నది. క్రీ. శ. 1804 ప్రాంతమున శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయనంగారికి సర్వహక్కులతో పొన్నూరు సహితముగ 250 వరహాల రాబడిగల భూమిని శ్రీ రాజ భావయ్య మాణిక్యారాయణింగారు మాతలి వ్రాయించి యిచ్చిరి. శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రినాయుడుగారు రీయాలయ కైంకర్యమునకుగాను విశేషముగ మాన్యము లిచ్చిరి. నేటికిని సేవాకార్యములు వైభవోపేతముగ జరుగుచున్నవి.

చూడదగినవి :— పొన్ను అనగా బంగారము, ఊరు అనగా పురము. దీనికి స్వర్ణపురి యనునామాంతరము కలదు. దీనికి అనావెగ 'గోష్ఠీవన'మను పేరు గలదు. పూర్వ మిచ్చట నొకవన ముండెడిదట. ఆవనములో మహామును లందఱును గోష్ఠిచేయుచుండెడివారట. అందువలన దీనికి గోష్ఠీవన మను పేరు వచ్చినది. ఇప్పుడు పాతపొన్నూరు అనుచోట పూర్వ మొక రా జుండెడివాడట. అతనికి సంతానము లేదు. ఆతని కొక మేనల్లుడు గూనివా డుండెడువాడు ఆతనికి గూనిగోవిందు డని పేరు. ఒకసారి రాజు, రాజుభార్య గూనిగోవిందుడు కాశికి యాత్రకు వెడలిరి. గూనిగోవిందుడు అత్తమామల కనేక కార్యములు చక్కపెట్టుచుండెడివాడు. దానికి సంతోషించి వానినిగూడ కాశికి గొనిపోయిరి. అచ్చట గంగలో స్నానము చేసి రాజు అనేకదానములు చేయుచుండెను. కన్యాదాన సమయము వచ్చెను. అప్పుడు గూనిగోవిందుడు కన్యాదానము తనకు చేయుమనెను. రాజునకు పిల్లలు లేరుకదా! ఎట్టులైన సంతానముకలుగదను నిరాశతో నాకు కూతురు పుట్టిన నీకు పెండ్లిచేయుదు ననెను ఆ సమయమున వీరికి సాక్ష్యముగ శ్రీ భావనారాయణస్వామి, తుంగభద్ర మణికర్ణిక (కోనేరు) పేరులేని పెద్దమ్రాను, శ్రీ భావనారాయణస్వామి దేవేరియు సాక్షులైయుండిరి. ఇంటికి తిరిగివచ్చిన తర్వాత రాజుభార్య గర్భవతియై పుత్రికను గనెను. పిల్లకు పెండ్లియీడు వచ్చెను. ఆమె సర్వాంగసుందరి. గూనిగోవిందున కామె నీయ కాశిలో మామ వాగ్దాన మొనర్చినప్పటికిని గూనివా డగుటచే నీయ

నిరాకరించి సాక్ష్యము తెచ్చుకొనిన నిచ్చెద ననెనట. అంత గూనిగోవిందుడు కాశికి వెళ్లి పైనిచెప్పిన అయిదుగురిని సాక్ష్యము తెచ్చుకొనెనట. వెళ్లినపుడు వెనుకకు దిరిగిచూడ వలదనియును, ఎచట చూచిన నచ్చటనే ఆగిపోవుదుమనియు వారు చెప్పుటచే నాతడట్లే నచ్చెను. కాని యిప్పుడు శ్రీ భావ నారాయణస్వామి ఆలయ మున్నచోటికి వచ్చునప్పటికి వీరు వచ్చుచున్నారో లేదో అనిచూచుటకు వెనుదిరిగి చూచెను. వెం టనే వా రాగిపోయిరి. ఇప్పటికిని శ్రీ భావనారాయణస్వామి, కోనేరు, పేరులేని పెద్దమాను, పాతతుంగభద్ర, స్వామిభార్య అచ్చటనే ఆగిపోయిరి. తర్వాత తుంగభద్ర త్రవ్వబడినది. స్వామిభార్య ఒకానొకదినమున చేపలుపట్టువానిని ఎగ తాళిగా 'నాకొక చేప నిచ్చెదవా' యని యడిగిన, వాడు చప్పున నామెచేతిలో నొక చేప నుంచెను. అంత స్వామి ఆమెను వెలినైచెను ఇప్పు డామె గ్రామదేవతగా నున్నది. ఈ భావనారాయణస్వామి సాక్ష్యమునకై వచ్చినాడు కావున సాక్షి భావనారాయణస్వామి యని పిలువబడుచున్నాడు.

మరల కొన్నాళ్ళకు నిడుబ్రోలులో కమ్మవారగు పాములపాటివారి జొన్నలపాతరలో శ్రీరాజ్యలక్ష్మి అమ్మవారు వెలయగా నామెను శ్రీభావనారాయణస్వామికి భార్యగా జేసి ప్రతిష్ఠించిరి. ఇచ్చట కల్యాణోత్సవములు వైశాఖశుద్ధ సప్తమి మొదలు ఆ పూర్ణిమవఱకు జరుపబడుచున్నవి. చతుర్దశినాడు తెల్లవారుజామున కల్యాణము జరుగును. పూర్ణిమనాడు సాయంతనము రథోత్సవము జరుగును. దీనికి అశేషజనము

వచ్చి దర్శించి పోవుదురు. పాములపాటివారు వచ్చి త్రాడు పట్టినగాని రథము కదల దనుప్రతీతి కలదు. ఇచ్చట కలపకు ప్రసిద్ధి.

ఇచ్చట భావనారాయణస్వామి చాల మహిమ గలవాడు. ఒకసారి దొంగలు స్వామివారి తలుపులు పగులగొట్టి సొమ్ములు దొంగిలించుకొని ఊరిబయట నొకకుంటయొద్ద పంచుకొన బోవుచుండగా నెత్తురు క్రక్కుకొని చచ్చిరట. ఇప్పటికిని ఆకుంటకు నెత్తురుగుంట అని పేరు కలదు.

ఇప్పు డిచ్చట క్రొత్తగా దేవాలయములు కట్టబడుచున్నవి, వానిలో సహస్రలింగస్థాపనము చేయబడును. ఇంకను చాల విగ్రహములు ప్రతిష్ఠింపబడును. షుమారు 6 గజములు ఎత్తుగల (శ్రీ) ఆంజనేయుని విగ్రహము, 8 గజముల ఎత్తుగల గరుత్మంతుని విగ్రహము దశావతారమందిరము చూడదగినవి.

## సింగరాయకొండ (తాతగుడి)

ఇది వాల్తేరు–మద్రాసు లైనులో నొకస్టేషను. గుంటూరు నుండి 100 మైళ్ళ దూరములో నున్నది మూడవతరగతి మెయిలుకు రూ. 3–5–0 చార్జీ అగును, స్టేషనునుండి దేవాలయము 2 మైళ్ళదూరములో నున్నది.

వసతులు :– గుఱ్ఱపుబండ్లు, ఎద్దుబండ్లు గలవు. బండికి సుమారు రూ. 1–8–0 తీసికొందురు. నలుగురు కూర్చుండవచ్చును. స్టేషనుకడ భోజన ఫలాహారశాలలు గలవు. దేవాలయము నొద్ద నొకసత్రము గలదు.

చూడదగు విశేషములు :- దేవాలయము చిన్నతిప్ప మీాద నున్నది. దీనిపైకి సులువుగా నెక్కవచ్చును. వరాహ నృసింహస్వామి ఆలయము గలదు నిత్యము ధూపదీప నైవేద్యములు క్రమముగ జరుగుచున్నవి. దేవాలయమునకు వెనుక దిగువభాగములో నొక చెరువు గలదు. అందుండి గ్రామస్థులు మంచినీరు తీసికొని వెళ్ళుచుందురు. ఇది ఖర దూషణాదులు పాలించినరాజ్యమని ప్రతీతి. ఇచ్చటికి 4 మై. దూరమున పూళ్ళపాలె మనుగ్రామములో ఉప్పుకొఠార్లు గలవు.

## నెల్లూరు

ఇది సింగరాయకొండనుండి 55 మైళ్ళు. రైలుచార్జీ మూడవతరగతిటిక్కెట్టు రూ 1-13-0 అగును. ఇది నెల్లూరు జిల్లాకు ముఖ్యపట్టణము. ఇది పెన్నానది యొడ్డుననున్న యొక పెద్దపట్టణము.

వసతులు :- అన్నివసతులు గలవు. సత్రములు, రహదారిబంగళా వగైరాలు కలవు.

చూడదగినవి :- పెన్నానదియొడ్డున శ్రీరంగనాయక స్వామ్యాలయము ముఖ్యమైనది. అందద్దాలమండపము విశేష ముగా యాత్రికులు దర్శింపదగినది. 'పెన్న దాటిన పెరు మాళ్ళసేవ' యనుసామెత గలదు. అనగా దాటుచుండగనే హఠాత్తుగ వరద వచ్చునని భావము. నెల్లూరువద్ద పెన్నపై రోడ్డువంతెన నిర్మాణముతో మద్రాసు, కలకత్తా మార్గముపైన నెల్లూరుజిల్లాలోని ఒక పెద్ద అడ్డంకి తొలగినట్లే. వంతెన

దక్షిణ భారతదేశములోనికెల్ల మంచి వెడల్పయినది. నెల్లూరు జిల్లా వారికి చాల ఉపయోగకారియైన వంతెన. పెన్నార్ వంతెన వెడల్పు 32 అడుగులు. ఇందులో 22 అడుగుల వెడల్పు రోడ్డు—అటూ ఇటూ కాలిబాటలు కలవు. దీని నిర్మాణం డిశంబరు 1949 లో ప్రారంభమయినది. 1955 లో పూర్తి అయినది.

ఆంధ్రచరిత్రలో ప్రసిద్ధిగాంచిన రణతిక్కన నెల్లూరు సీమవాడే. తిక్కనసోమయాజి భారతము నాంధ్రమున వ్రాయుట కిచటనే ప్రారంభించిరట. నవాబుపేటలో ఉడేవర్ల (రామానుజులవారి) సన్నిధి గలదు. స్టేషనునుండి 2 మైళ్ళ దూరములో నున్నది. బండ్లు గలవు.

## వేదగిరి

నెల్లూరునుండి 10 మైళ్ళలో పెన్నానదీతీరమున వేదగిరి క్షేత్రము గలదు. వేదగిరియొద్ద పెన్నలో బడినయెముకలు నెల్లూరు వచ్చులోపల శిల లగుననియు. తదితరస్థలముల అట్లు కావనియు ప్రతీతి.

వేదగిరినుండి 1 మైలుదూరములో జొన్నవాడక్షేత్రము గలదు. అచ్చట శ్రీమల్లికార్జునస్వామి, కామాక్షి అమ్మవారు అధిష్ఠానదైవములు. జొన్నవాడసమీపములో పెన్న. బొగ్గేరు, చెయ్యేరుసంగమ మగుచోట సంగమేశ్వర దేవాలయముగలదు.

## శ్రీకాళహస్తి

నెల్లూరునుండి గూడూరువరకు వచ్చి అచ్చట రైలు బండి మారి రేణిగుంటవైపు వెళ్లుబండిలో నెక్కి 38 మైళ్ళ

ప్రయాణముచేసిన ఆరవస్టేషనే కాళహస్తి. రూ. 1-4-0చార్జీ యగును. గూడూరునుండి రేణిగుంటవరకు బ్రాడ్ గేజీలైను వేయుచున్నారు. ఇది చిత్తూరుజిల్లాలో నున్నది. 20వేలజనాభా గలపట్టణము ఇది శివక్షేత్రము. రైలుస్టేషనునుండి దేవాలయమునకు రోడ్డుమార్గము 1½ మై. దూరముండును. బండ్ల వసతి గలదు. అడ్డదారిన నడిచివెళ్ళిన 6 ఫర్లాంగు లుండును. బండికి అ. 0-6-0 లేక అ. 0-8-0 తీసికొందురు. ఇది సువర్ణముఖీనదీతీరమున గలదు. ఇచ్చట నది ఉత్తరవాహినిగా ప్రవహించుచున్నది.

వసతులు :- భోజనశాలలు, సత్రములు, పెక్కు వసతులు గలవు. బస్సులు గలవు. గూడూరు మొదలగు ప్రదేశములకు బస్సులపై వెళ్ళవచ్చును. బస్సులు దేవాలయముకడ ఆగును.

చూడదగినవి :- శ్రీకాళహస్తీశ్వర దేవాలయము. ఇది సుప్రసిద్ధ శివక్షేత్రము, అమ్మవారిపేరు జ్ఞానప్రసూనాంబ.

పంచ (భూత) లింగములు - అవి యున్న క్షేత్రములు.

| పృథివి | జల | అగ్ని | వాయు | ఆకాశ |
|---|---|---|---|---|
| కంచి | జంబుకేశ్వరము | అరుణాచలము | కాళహస్తి | చిదంబరము |

పంచలింగములలో. నిది వాయులింగము. దేవాలయము చాల పెద్దది. అందులోనికి గాలి పోవుటకు వీలు లేకున్నను. అది యేమిచిత్రమోకాని మూలవిరాటుకుపైన వెలిగించబడిన జ్యోతి కదలుచుండును. ఇదియే వాయులింగ మనుటకు నిదర్శనము

శ్రీకాళహస్తి అను పేరు కలుగుటకు శ్రీ అనగా సాలెపురుగు; కాళము అనగా నాగేంద్రుడు; హస్తి అనగా ఏనుగు — ఈ మూడు పూర్వము స్వామిని సేవించి మోక్షమును పొందుటచేత శ్రీకాళహస్తి అను పేరు కలిగెను. చరిత్ర అందరకు విశదమే.

☞ ఈ క్షేత్రమునకు సరియైన యాదాయము లేదు. అందుచేతనే గాబోలు దేవాలయములోనికి ప్రవేశించు ప్రతి యాత్రికునియొద్ద అణా వసూలుచేయుదురు. 3సం॥ నుండి 10 సం॥ వయస్సు గలపిల్లలకు అరటిక్కెట్టు వసూలుచేయుదురు.

అర్చనాదుల రేట్లు

| | | | |
|---|---|---|---|
| హారతి | రూ 0-1-3 | సహస్రనామార్చన | రూ 8-8-0 |
| అర్చన (హారతితో) | 0-5-3 | క్షీరాభిషేకము | 3-0-0 |
| భోగములు పచ్చకర్పూర అభిషేకం | 6-0-0 | పంచామృతాభిషేకము (నైవేద్యముతో) | 25-0-0 |

ప్రత్యేకభోగములు

| | | | |
|---|---|---|---|
| పులిహోర | రూ 8-0-0 | పొంగలి | 12-0-0 |
| దధ్యోదనము | 6-0-0 | | |

అలంకారసేవ

| | | |
|---|---|---|
| అనేకోత్సవాలంకారసేవ | రూ 30-0-0 | |
| సేవోత్సవము | 108-0-0 | పట్టణములో నాల్గు వీధులలో |
| ఐరావతిసేవ | 25-0-0 | పట్టణములో నాల్గు వీధులలో |
| అధికారనందీశ్వరసేవ (దేవాలయములో) | 12-0-0 | |
| నిత్యమంటపసేవ (దేవాలయములో) | 10-0-0 | |

అమ్మవారిని సేవించినస్త్రీలు తమదుష్టగ్రిహములను పోగొట్టుకొందురని ప్రతీతి. ఇచ్చట శివరాత్రికి గొప్పయుత్స వము జరుగును. ఆయుత్సవమునకు దాదాపు 50 వేలు యాత్రి కులు వచ్చెదరు. ఇది ఇత్తడి, కంచు లోహపునామానులకు ప్రిసిద్ధి. గాజులుగూడ తయారగును.

చుట్టుప్రక్కల చూడదగినవి:— ఈ దేవాలయము నుండి ½ మై. దూరములో భరద్వాజతీర్థము గలదు. ఇది నాల్గు వైపుల పర్వతరాజములచే చుట్టబడి రమణీయమైనప్రికృతి శోభ వెదజల్లుచుండును.

కన్నప్పదేవాలయము:— కైలాసగిరి కొండపై గలదు. చుట్టుకొండలు గలవు. కన్నప్పభక్తునిచరిత్ర అందరకు తెలిసినదే.

## ఏ ర్పే డు

ఇది శ్రీకాళహస్తినుండి 9 మై. దూరములోని రైలు స్టేషను- అనగా కాళహస్తిప్రక్కస్టేషను. ఏర్పేడుస్టేషనునుండి దాదాపు 6 ఫర్లాంగులదూరములో శ్రీవ్యాసాశ్రిమము గలదు. ఈఆశ్రిమమును శ్రీమళయాళస్వామివారు స్థాపించి ప్రిజలలో ఆధ్యాత్మిక చైతన్యమును కలిగించుచు గొప్పసేవ చేయు చున్నారు. ఆశ్రమవాసు లోకసంప్రదాయమునకును, క్రిమ శిక్షకును లోబడి భావిజీతములో వారు తరించుటకు గొప్పకృషి చేయుచున్నారు. ఆశ్రిమవాసులసంఖ్య 140.

వసతులు:— ఆశ్రిమములో నుచితధర్మశాలలు గలవు. పోస్టాఫీసు గూడ గలదు.

ఉత్సవములు:— వ్యాసపూజ మాఘశుద్ధత్రియోదశి, చతుర్దశి, పూర్ణిమ (ఫిబ్రివరి నెలలో) జరుగును. ఉత్సవము



శ్రీ మళయాళస్వామివారు

నకు దాదాపు రెండు వేలమంది శిష్యులు, అభిమానులు, పరిచితులు వత్తురు.

ఆశ్రమములో చూడదగినవి :–
1. కాశీబుగ్గతీర్థం
2. శ్రీవ్యాసమందిరము, 3. సంస్కృతపాఠశాల,
4. కన్యాగురుకులము

ఆశ్రమ నిత్య కార్యక్రమము:–

1. ప్రాతఃకాలమున 4 గంటలకు స్నాన మాచరించి 4–30 గంటలనుండి గీతాపారాయణ ప్రార్థనాదులు ప్రారంభించి 6 గంటలకు పూర్తిచేయబడును. ఈ సమయమున ఆనుకూల్యమునుబట్టి శ్రీసద్గురు స్వాములవారు కొన్ని . ధర్మబోధముల జేయుదురు.

2. తర్వాత 8 గంటలవరకు ధ్యానాదులుండును. అత్తరి ముఖ్యమగు కార్యక్రమముండినవారు భోజనమునకు ముందుగా

1 గంట సమయము ధ్యానము, ఉపనిషత్పారాయణాదులు జేయవల యును.

3 8 గంటలనుండి 10 గంటలవరకు "బ్రహ్మవిద్యా పాఠశాల" యందు చదువదలంచువారు సంస్కృతము చదువు కొనవచ్చును. తక్కినవారు తమ కేర్పడియుండు కార్యముల జేసికొనవచ్చును.

4. 11 గంటలపైన 12 గంటలకు లోపల భోజనము జరుగును. తర్వాత 2-30 గంటలనుండి 4-30 గంటలవరకు "బ్రహ్మవిద్యాపాఠశాల" యందు ప్రస్తుతము శ్రీమద్భగవద్గీత, కఠోపనిషత్తు, పాతంజలయోగదర్శనము మొదలగు వానిలో నేదైన పఠింపనగును. 4-30 గంటలనుండి 5-30 గంటల వరకు గ్రంథకాలక్షేపము జరుగును. అత్తరి శ్రీసద్గురుస్వాములవారిధర్మబోధ యుండును. తర్వాతకాలకృత్యములు నిర్వహించుకొని 8 గంటలవరకు ధ్యానాదుల జేసికొని వారివారికి నేర్పరచుకొనిన ఆహారముల జేయవచ్చును సమయ మున్నపుడెల్ల ఆశ్రమమునకు సంబంధించినకార్యములను, లోక సేవాకార్యములను జేసికొనవచ్చును.

5 ఇచట నుండువారు ధ్యానముతోసహా బ్రహ్మ విద్యకు సంబంధించిన శాస్త్రములకూడ నభ్యసించవలసి యుండును

సూచన:- వైష్ణవసంప్రదాయానుసారముగ ఆళ్వారులచే మంగళాశాసనముచేయబడినక్షేత్రములను వారు దివ్యదేశములు లేక దివ్యతిరుపతులు అని పిలుచుచుందురు. ఆ సంప్ర

దాయస్థు లీదివ్యదేశములనుమాత్రమే హెచ్చుగ సేవించు చుందురు. ఈ దివ్యదేశములు 108 గ నిర్ణయించబడినవి. అవి తొండమండలమునందు 22, మధ్యమండలమునందు 2 చోళ మండలమునందు 40, పాండ్యమండలమునందు 18, మళయాళ దేశమునందు 13, ఉత్తరదేశమునందు 12, శ్రీవైకుంఠము 1 యు మొత్తము 108 దివ్యదేశములు.

ఈ 108 సంఖ్య శ్రీరంగమునుండి ప్రారంభింపబడి వాడుకలో నున్నది. కాని యీ గ్రంథములో తిరుపతినుండి దివ్యదేశములసంఖ్య ప్రారంభింపబడినది. దక్షిణదేశపు యాత్రామార్గదర్శిగాన నిందు 97 దివ్యదేశములనుగురించియే వ్రాయబడినవి. మిగిలిన 11ని గూర్చి 'ఉత్తరభారత-హిమాలయ ప్రాంతములు' అను యాత్రామార్గదర్శియందు వ్రాయబడినది.

చోళదేశము :- ఆర్కాడు, తంజావూరు, తిరుచినాపల్లిజిల్లాలు.

పాండ్యదేశము :- మధుర, రామనాథపురము, తిరునల్వేలి జిల్లాలు.

మళయాళదేశము:- తిరువాన్కూరు, కొచ్చిన్, ఎర్నాకుళం, స్వదేశ స్థానములు.

మధ్యదేశము :- ఆర్కాడుజిల్లా.

తొండదేశము :- చెంగల్పట్టు, ఆర్కాడుజిల్లాలు.

## తిరుపతి

ఇది యొక దివ్యదేశము. ఇది కాళహస్తినుండి రేణిగుంటమీదుగ 5వ స్టేషను. 20 మైళ్ళదూరము. రైలుచార్జీ

0-10-0. తిరుపతి యీస్టుస్టేషనులో దిగవలెను. ఇది రెండుభాగ ములుగ నున్నది. 1. దిగువతిరుపతి, 2 ఎగువతిరుపతి.

దిగువతిరుపతి :- తిరుపతి యీస్టుస్టేషనుకు సమీప ములో తిరుమలతిరుపతి దేవస్థానమువారిసత్రము గలదు. ఇది చాలవసతి గలసత్రము. ఇట్టిసత్రములను మనము చాల కొద్దిచోట్ల చూడగలము. చక్కని మేనేజిమెంటు. యాత్రికు లకు సర్వవిధముల సౌకర్యము కల్పించుటే కమిటివారి ముఖ్యోద్దేశము. యాత్రికులకు వంటసామానులతో ఉచితముగ గదు లిచ్చెదరు ప్రత్యేకముగ కోరువారికి పైభాగమున విశేష సౌకర్యములతో దినమునకు గది 1కి రూ. 1-8-0 చొ॥ అద్దెకు కూడ నిచ్చెదరు. ఎగువతిరుపతికి వెళ్లువారు వారిబరువైన సామానులను సామానులఅర (Luggage Room)లో పెట్టు కొని రసీదు తీసికొని వెళ్ళి తిరిగివచ్చి వారికి రసీదువాపసు చేసి, సామానులు తీసికొని వెళ్ళవచ్చును. సత్రములలో 3 దినము లుండవచ్చును. దిగువతిరుపతి రైలుస్టేషనులోనికి ప్రతి ప్యాసెంజరుబండి చేరుసరికి దేవస్థానసత్రజవానులు వచ్చియాత్రి కులను సత్రమునకు పిలుచుకొని పోవుదురు. వారికి ప్రత్యే కముగ డబ్బియ్యవలసిన పని లేదు.

దిగువతిరుపతిలో శ్రీ గోవిందరాజస్వామి దేవాలయము. (ఇట 1936 లో రూ. 97,700 ఖర్చుచేసి బంగారునీరు పోసిన ధ్వజస్తంభమును ప్రతిష్ఠించిరి.) శ్రీ కోదండరామస్వామి దేవా లయము ముఖ్యముగా చూడదగినవి. కపిలతీర్థములో స్నానము చేయనగును.

తరుచానూర్ లేక అలివేలుమంగాపురము :- ఇది 2 మైళ్ళ దూరమున నున్నది. బస్సులు, బండ్లు గలవు. అమ్మ వారి దేవాలయము తప్పక చూడదగినది.

అమ్మవారికి అర్చన రేట్లు

| | | | |
|---|---|---|---|
| తులసి అర్చన | అ. 0-4-0 | గజవాహనము | రూ 21-0-0 |
| కుంకుమ ,, | 0-8 0 | త్రిచివాహనము | 8-8-0 |
| సహస్రనామము ,, | రూ. 5-0-0 | హారతి | అ. 0-4.0 |
| గరుడవాహనము | 27-0-0 | పంచామృతాభిషే | రూ. 1-8-0 |



తిరుచానూర్ - అమ్మవారి దేవాలయము



ఎగువతిరుపతి (బస్సుస్టాండు)

ఎగువతిరుపతి :- ఎగువతిరుపతికి వెళ్లువారు కపిలతీర్థములో స్నానముచేసిపోవలెనని చెప్పుదురు. ఈ క్షేత్రము సముద్రమట్టమునకు 2500 అడుగులయెత్తున నున్నది. కొండ క్రిందనుండి పైకి దేవాలయమునకు 5¾ మై. దూరము. మెట్లు గలవు. డోలీలు గలవుగాని బస్సు లేర్పడినతర్వాత వానిమీద పోవువారు లేరు. మొదటిపర్వతము, ఆరవపర్వతము ఎక్కుట కష్టము మొత్తము 7 కొండలు గలవు. ఈఏడుకొండలు ఆదిశేషునితలలుగను, దానిపైన శ్రీ మహావిష్ణువైన శ్రీ వేంకటేశ్వరస్వామి యున్నట్లుగను చెప్పుకొందురు.

70 సం॥ల క్రిందట గొప్పప్రపంచయాత్రికుడైన ఫర్గుసన్ ఈవిధముగ వ్రాసెను. Mr Fergusson says, "This was certainly the most sacred of all the temples in the Presidency" (ఈ రాజధానిలోని అన్ని దేవాలయములలో నిది మహాపవిత్రమైన దేవాలయము.) ఇట్లే అనాదికాలమునుండి

మహాపండితులు, విజ్ఞానవేత్తలు, భక్తులు, జ్ఞానులు పలువిధములుగ శ్లాఘించిరి.

ఘాట్‌రోడ్డు-బస్సు:- యాత్రికులసౌకర్యార్థము 1945వ సంవత్సరమున కొండపైకి (ఘాట్‌రోడ్డు) వేయబడినది. రైలు స్టేషనునుండి కొండపైకి 15 మైళ్ళదూరము. ప్రతిఅరగంటకు బస్సులు కొండపైకి దేవస్థానముసత్రమునుండి బయలు దేరును. కొండ యెక్కునప్పుడు 1 గం. 30 ని. లును, దిగునప్పుడు 1 గం. 15 ని. లును ప్రయాణకాలము పట్టును ఉదయము 5 గం||ల నుండి రాత్రి 9గం||ల వరకు బస్సులు తిరుగుచుండును. మామూలుబస్సుచార్జీ 1-4-0; మొదటితరగతి బస్సుచార్జీ రూ 2-0-0 మొదటితరగతిబస్సులో వెళ్ళిన స్వామి ధర్మదర్శనవేళకు జేరవచ్చును

ప్రయాణికు లొక్కొక్కరు 10 పౌనులబరువుగల సామాను లుచితముగా తమవెంట బస్సులో తీసికొనివెళ్ళవచ్చును. అంతకుపైన ప్రతి 10 పౌనులు, అంతకు తక్కువ బరువునకైనను 0-5-0 చెల్లించవలెను.

ప్రత్యేకముగ సొంతకార్లలో కొండపైకి వెళ్లువారు రూపాయి చెల్లించి రసీదు పొందవలెను.

తిరుపతినుండి కొండపైకి టాక్సీకార్లు.

| | |
|---|---|
| దిగువతిరుపతినుండి ఎగువతిరుపతికి రానుపోను టాక్సీ | రూ. 35 |
| ఒకప్రయాణమైన (వెళ్లుటగాని, వచ్చుటగాని) | 25 |
| కొండపైకి గాక మైదానములలో మైలుకు చార్జీ (లేక నిమిషమునకు అ.2 లు) | అ. 12 |
| నిలుపు (Detention) చార్జీ. గంటకు (మినిమము 12-8-0) | రూ. 1-8-0 |

## మదరాసునుండి తిరుమలకు (రేణిగుంట, తిరుపతి తూర్పు స్టేషన్లద్వారా) తిరుగుప్రయాణపు (అనగా పోవుటకు తిరిగివచ్చుటకు) చార్జీలు.

| | రోడ్డుపై బస్సులో ప్రయాణముచేసేపక్షములో | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పెద్దవారికి చార్జి | | | | | | | | బిడ్డలకు చార్జి | | | | | | | |
| | మొత్తం | | చార్జి భాగముల వివరములు | | | | | | మొత్తం | | చార్జి భాగముల వివరములు | | | | | |
| | | | రైలు చార్జి | | (రోడ్డు) బస్సు | | యాత్రి పన్ను | | | | రైలు చార్జి | | (రోడ్డు) బస్సు | | యాత్రి పన్ను | |
| | రు. | అ. | రు. | అ. | రు. | అ. | రు. | అ. | రు. | అ. | రు. | అ. | రు. | అ. | రు. | అ. |
| 1వ తరగతి | 20 | 4 | 17 | 8 | 2 | 8 | 0 | 4 | 10 | 4 | 8 | 12 | 1 | 4 | 0 | 4 |
| 2వ తరగతి మెయిల్/ఎక్స్‌ప్రెస్ | 13 | 0 | 10 | 6 | 2 | 8 | 0 | 2 | 6 | 10 | 5 | 4 | 1 | 4 | 0 | 2 |
| 2వ తరగతి ఆర్డినరి | 11 | 12 | 9 | 2 | 2 | 8 | 0 | 2 | 6 | 0 | 4 | 10 | 1 | 4 | 0 | 2 |
| 3వ తరగతి మెయిల్/ఎక్స్‌ప్రెస్ | 8 | 7 | 5 | 14 | 2 | 8 | 0 | 1 | 4 | 5 | 3 | 0 | 1 | 4 | 0 | 1 |
| 3వ తరగతి ఆర్డినరి | 7 | 9 | 5 | 0 | 2 | 8 | 0 | 1 | 3 | 13 | 2 | 8 | 1 | 4 | 0 | 1 |

ఈటిక్కెట్లు, అమ్మిన తేదీ నుండి 4వ రోజు అర్ధరాత్రి లోపువరకూ తిరుగుప్రయాణము పూర్తిచేసుకొనుటకు చెల్లును. ఈ టిక్కెట్లతో ప్రయాణము చేయువారు (తిరుపతికి) పోవు ప్రయాణములోగాని, తిరుగుప్రయాణములోగాని, తిరుగ్దణిలో 24 గంటలకాలము మజిలీ చేయవచ్చును.

భోజనవసతులు :- ఎగువతిరుపతి

దేవస్థానసత్రములలో దిగువారికి వంటచేసికొనుటకు పాత్రిసామగ్రి నిచ్చెదరు. భోజనశాలలు గలవు. లేదా దేవస్థానమువారిప్రసాదములు పగలు 2 పూటలు రాత్రి ఒకపూట ఉచితముగా లభించును.

సత్రములలో మైసూరుమహారాజాగారిసత్రములో పగలొకపూటయు, (బ్రాహ్మణులకుమాత్రము) శ్రీపరకాలస్వామి మఠమున వైష్ణవులకుమాత్రమును, శ్రీఅహోబలమఠమున నల్లూరు వైష్ణవులకును, శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానములో మూడుపూటల నాల్గువర్ణములవారికి ప్రసాదము లభించును.

ఎగువ తిరుపతి దేవస్థానము :-

పగలు నిత్యకార్యక్రమము (గురు, శుక్రవారములుతప్ప)

| | అర్చన | దర్శనరుసుము | | కాలము గం. ని. |
|---|---|---|---|---|
| 1. | సుప్రభాతము | ప్రవేశము లేదు | ఉ॥ | 7— 0 |
| 2 | విశ్వరూపదర్శనము | ధర్మదర్శనము | ,, | 7—30 |
| 3. | తోమాలసేవ | రూ13/-కు 5గురు సేవించవచ్చును | ,, | 9— 0 |
| 4. | కొలువు | ప్రవేశములేదు కాని దూరము నుండి చూడవచ్చును | ,, | 10— 0 |
| 5. | సహస్రనామార్చన | రూ7/-లకు 4గురు సేవించవచ్చును | ,, | 10—30 |
| 6. | నైవేద్యము | ప్రవేశము లేదు | మ॥ | 12— 0 |
| 7. | ధర్మదర్శనము | ఉచితము సర్వులకు | ,, | 1— 0 |
| 8. | సహస్రనామార్చన | రు7/-కు 4గురుమాత్రం వెళ్లవచ్చును | ,, | 3— 0 |
| 9. | నైవేద్యము | ప్రవేశము లేదు | సా॥ | 4— 0 |
| 10. | ప్రత్యేక ధనము చెల్లించిన ఉత్సవములు | — | ,, | 5— 0 |

### రాత్రి

| | | |
|---|---|---|
| 1. నైవేద్యము | ప్రవేశము లేదు | రా॥ 8—30 |
| 2. ధర్మదర్శనము | ఉచితము (సర్వులు) | ,, 9— 0 |
| 3. ఏకాంతసేవ లేక పాన్పు రూ13/-కు 5గురు సేవించవచ్చును | | ,, 10—30 |

### గురువారము

రాత్రి ధర్మదర్శనము ప్రతివ్యక్తి రూ. 1/- చెల్లించిన అవకాశము కలదు.

### శుక్రవారము

| | | |
|---|---|---|
| విశ్వరూపదర్శనము అయిన తరువాత ధర్మదర్శనములేదు | ప్రత్యేకముగ రు 1/-చెల్లించిన దర్శించవచ్చును | మ॥1— 0 |
| తోమాల అర్చన | రూ. 13/-లకు ఐదుగురు | 4— 5 వరకు |
| ధర్మదర్శనము | ఉచితము | సా॥ 6 దాటినతరువాత |

రాత్రి ధర్మదర్శనము లేదు.

### ఉత్సవములు

1. సంవత్సరాది-(తెలుగు). 2. నిత్యోత్సవము-సంవత్సరాదినుండి 40 రోజులు జరుగును, 3. దక్షిణాయన పుణ్యకాలోత్సవము (అనివరోత్సవము), 4. దీపావళి, 5. తెప్పయుత్సవము (ఇది విజయనగరప్రభువగు సాలువభూపాలునిపేర జరుగుచున్నది), 6. బ్రహ్మోత్సవము (నవరాత్రదినములలో) 7 దినములు వాహనములు, 8వ రోజున రథోత్సవము జరుగును, 7. ధనుర్మాసము వైకుంఠైకాదశి, 8. అధ్యయనోత్సవము 9. రథసప్తమి.

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి దేవస్థాన ఆర్జిత విశేషముల రేట్లు

| | | | |
|---|---|---|---|
| పూలంగి దర్శనం | రూ. 1 | గంబూరా గిన్నె | రూ. 250 |
| పూలంగి సేవ | ,, 60 | పునుగుచట్టం గిన్నె | ,, 85 |
| పులికాపు దర్శనం | ,, 1 | కస్తూరి గిన్నె | ,, 50 |
| పులికాపు సేవ | ,, 450 | జాఫరా గిన్నె | ,, 65 |

| | |
|---|---|
| సహస్ర కలశాభిషేకం | రు. 1500 |
| పూరా తిరుప్పావడ | 2000 |
| అర తిరుప్పావడ | 1000 |
| కోవిలాళ్వార్ తిరుమంజనమ్ | 500 |
| ఆమంత్రణోత్సవం | 100 |
| తోమాల సేవ | 13 |
| ఏకాంత సేవ | 13 |
| తులసీ అర్చన | 7 |
| పొంగలి | 70 |
| చెక్కెర పొంగలి | 80 |
| పులిహోర | 60 |
| దధ్యోదనం | 56 |
| శీరా | 160 |
| కేశరీభాత్ | 125 |
| సాకరభాత్ | 120 |
| పాయసం | 80 |
| అవల్ దర్జా బ్రహ్మోత్సవం | 1,500 |
| రెండవదర్జా | 750 |
| వసంతోత్సవం | 2,000 |
| కల్యాణోత్సవం | 500 |
| వజ్రకవచంసహా సర్వభూపాలవాహనం | 72 |
| కల్పవృక్షవాహనం | 72 |

వజ్రకవచం లేని వాహనములు:- సర్వభూపాల వాహనం, కల్పవృక్షవాహనం, పెద్ద శేషవాహనం, సూర్యప్రభ వాహనం, పాలకివాహనం, పుష్పరథం, ముత్యప్పందిలి, 1కి రూ 62

| | |
|---|---|
| బంగారు గరుడవాహనం | 62 |
| వెండి | 32 |
| హనుమంత వాహనం, చిన్న శేషవాహనం, చంద్రప్రభావాహనం, ఏనుగువాహనం, గుఱ్ఱపు వాహనం, సింహవాహనం, హంస వాహనం, రెండితిరిచి వాహనం, 1కి | 32 |
| చక్కెర లడ్డు పడి | 125 |
| జిలేబి పడి | 125 |
| వడ | 80 |
| మనోహరం | 70 |
| అప్పం | 60 |
| పోళి | 40 |
| తేనె తోల | 55 |
| సుఖియ | 60 |
| దోసె | 50 |
| ఊరకాయపచ్చడి గూన | 5 |
| హారతి | 1 |

నిత్యసేవలు:-

| | |
|---|---|
| నిత్యకర్పూర హారతి | 21 |
| నిత్యనవనీత | 42 |
| నిత్యఅర్చన | 42 |

1 నిత్యసేవలకుగాను మొదటి సం॥లో లిష్టులోని పైకమును రెట్టింపుగా కట్టవలెను. వర్తనకుగాను వాహనములు సంవర్భముబట్టి గుడిలోపలను బైటను జరుపబడును. 2. వాహన హోర్డులు వగైరాలకు ప్రత్యేకముగా 1 రూ



ఎగువ తిరుపతిగోపురము

చెల్లించవలెను. 3 ఉగ్రాణములోని సామానులనుబట్టి ప్రసాద పణియార ములకు ఆజ్ఞితపైకము కట్టుకొందురు.

## అర్చన రేట్లు

| | | |
|---|---|---|
| 1. హారతి | రూ. | 1 |
| 2. తోమాలసేవ | ,, | 13 |
| 3. అర్చన | ,, | 7 |
| 4. ఏకాంత సేవ | ,, | 16 |
| 5. పూలంగిసేవ | ,, | 1 |
| 6. అభిషేకము | ,, | 1 |

సూచన:- హారతి, అర్చన సేవలకు టిక్కెట్టుకు ఐదుగురు చొప్పున, తోమాలసేవకు టిక్కెట్టు ఒకటికి 4 చొ॥న, ఏకాంత సేవ, పూలంగి సేవలకుమాత్రము ఒక్కొక్కరు చొప్పున దర్శన అనుమతి యిచ్చెదరు.

హిందువులు కానివారు కొండమీద దేవాలయములో ప్రవేశించక అక్కడి ఆచారవ్యవహారాలకు అనుగుణముగా ప్రవర్తించుచు, మూడురోజులకంటె హెచ్చుగా బసచేయ మని అంగీకరించెడిపక్షములో తిరుమల, తిరుపతి దేవస్థానపు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ నుంచి ముందుగా అనుమతి పొంది కొండ ఎక్కవచ్చునని ఆంధ్రప్రభుత్వము ప్రకటన చేసినది.

చూడదగినవి:- గోపురము, వేయి స్తంభముల మంటపము; బంగారపుధ్వజస్తంభము, పాపనాశనము, వరాహ పుష్కరిణియందుస్నానము, ఆకాశగంగ, గోగర్భతీర్థము మొదలైనవి.

పాపనాశనము:-ఇది యెగువతిరుపతి కుత్తరముగ 3 మై. దూరములో నుండును. ప్రకృతిదృశ్యములు తప్పక చూచితీర వలయును. అరుణకోమల మగులతలతోను వృక్షములతోను దట్టముగ పెనవేసికొని అందు పక్షులు తమసహజస్వర ములతో కిలకిలధ్వనులు చేయ, 'పాపనాశన' జలపాతము క్రిం

దకు పడునప్పు డేర్పడు ఓంకారనాదముతో మిళితమై యాత్రి కునిహృదయము పరమానందము జెంది నిశ్చేష్ట మగును. ఇచ్చట స్నానముచేయునపుడు, జారిపడకుండ గొలుసు లేర్పాటుచేయఁబడినవి. కోతులు విశేషముగ నుండును. ఇచ్చట భిక్షుకులు, సాధువులు తమనివాసముల నేర్పరచు కొనియుందురు. భయ మేమియు నుండదు. ఇచ్చటనుండి తిరుమలైకు నీటి సౌకర్యము గలిగించిరి. రోడ్డుమార్గముగూడ నేర్పాటగుచున్నది.

బ్రహ్మరాక్షసిచే ఆవరించబడి తన్నివారణకై తిరుగుచు సుమతి అను బ్రాహ్మణబాలు డీజలపాతముక్రింద స్నానమాడిన తోడనే ఆబ్రహ్మరాక్షసినుండి విముక్తుడయ్యెనట. ఇట్లే అనేకగాథలు గలవు.

ఆకాశగంగ :- పాపనాశనమునుండి వచ్చుదారిలో ఆకాశగంగ గలదు. ఇచ్చటి ప్రకృతిసౌందర్యము వర్ణనా తీతము. ఇది స్వామిపుష్కరమునకు 2మై. దూరమున నున్నది. స్వచ్ఛమైనజలము ధారగా పడుచుండును. స్వామివారి అర్చనకు నిత్య మిచ్చటనుండి 3 బిందెలతీర్థము తీసికొనివచ్చెదరు. ఈ తీర్థమున అంజనాదేవి 12 సం॥ దీర్ఘతపస్సుగావించెనని చెప్పుదురు.

గోగర్భము:- ఇది దేవాలయమునకు కడుసమీపములో నున్నది 'క్షేత్రపాలగుండు' అను నీరాయి పూర్వము శ్రీ వేంకటేశ్వరస్వామివారియెదుట నుండు ధ్వజస్తంభము నొద్ద నుండెడిదట. అర్చకులు దానిపై ఆభరణములపెట్టి,

తాళముచెవు లుంచెదరట. ఆరాయి దేవాలయముచుట్టును రాత్రులు తిరుగుచు ఆతాళముచేతులను కాపాడుచుండెడిది. ఒకనాటిరాత్రి అర్చకులు తమకుమారుని మరచి లోపలపెట్టి గుడితాళము వేసి వెళ్లుటచే ఆరాయి యీకుర్రవానిమీదుగా పోయి పిల్లవాడు చనిపోయెననియు అప్పటినుండి యీరాతిని తీసి యిచ్చోట అనగా గోగర్భతీర్థమునొద్ద వేసినట్లును చెప్పెదురు. ఇప్పటికి నర్చకులకుగాని యితరపార్టీలకుగాని భేదాభిప్రాయములు వచ్చినప్పు డీరాయికడకు వచ్చి శ్రీవేంకటేశ్వరస్వామిసాక్షిగ ప్రమాణములుచేసి తగాదాలు తీర్చుకొందురు. ఎవడైన అసత్యప్రమాణముచేసిన వాడు మరణించుటో లేక గొప్ప ఆపదలు పొందుటో నేటికిని జరుగుచున్నది.

ఇతర తీర్థములు :-

పాండవతీర్థము – ఈశాన్యముగ 1 మైలు.
జాబాలితీర్థము – ఉత్తరముగ 2 మై.
శ్రీ వైకుంఠతీర్థము – ఈశాన్యముగ 2 మై.
చక్రతీర్థము – వాయవ్యముగ 2 మై.
రామకృష్ణతీర్థము–ఉత్తరముగ 6 మై.
కుమారతీర్థము–వాయవ్యముగ 3 మై.
తుంబురుతీర్థము–ఉత్తరముగ 10 మై.

నందనవనము:— ఇది దాదాపు 2 ఫర్లాంగులవిస్తీర్ణము గలది. ఇందు పుష్పములు, పండ్లు, మొదలగునవి స్వామికి అలంకారమునకు, నివేదనకును, వినియోగించుచుందురు.

దేవస్థానమువా రన్ని భాషలలో క్షేత్రవివరములు వివరించినగ్రంథములు ప్రచురించిరి.

తిరుపతి - మొదటి దివ్యదేశము

శ్రీ 108 దివ్యదేశములు తిరుపతి మొదలుకొని గణించుదురు.

శ్లో॥ వైకుంఠలోకాదానీతో విష్ణోః క్రీడాచలో మహాన్
గరుత్మతా వేగవతా స్వర్ణముఖ్యాస్తటే శుభే
వర్తతే దేవసంఘైశ్చ ఋషిసంఘైశ్చ పూజితః
తస్మిన్ వేంకటశైలేంద్రే సాక్షాన్నారాయణస్స్వయం
లక్ష్మీదేవ్యాచ భూదేవ్యా నీళాదేవ్యా సమాన్వితః
వర్తతే వేంకటేశశ్చ సాక్షాన్మోక్షప్రదాయకః.

(వామనపురాణము)

శ్రియఃపతికి లీలోపకరణ మగుగొప్పపర్వతము గరుత్మంతునిచే వైకుంఠమునుండి గొనిరాబడి సువర్ణముఖీతీరమునం దుంచబడినది. ఆ వేంకటాద్రియందు శ్రీమన్నారాయణుడగు తిరువేంగడ ముడైయాను. శ్రీభూనీళాసహితుడై దేవతలచేతను ఋషులచేతను నారాధింపబడుచు మోక్షప్రదాతయైయున్నాడు

ఈపర్వతమునందు కృతయుగమున వృషభుడను రాక్షసుడు తపంబొనర్చుచుండుటచే వృషభాద్రి యనియు. త్రేతాయుగంబున అంజనాదేవి తపంబొనర్చుటచే అంజనాచలమనియు, ద్వాపరయుగమున ఆదిశేషుడు వాయుదేవునిచే భంగపడి యీపర్వతమున మరుగుపడియున్నందున శేషాచల

మనియు, కలియుగమందు పాపములను బోగొట్టుపర్వత మను నర్థముగల వేంకటాచలమనియు నామములు వెలసియున్నవి.

తొండరడిప్పొడియాళ్వా రొకరుదప్ప మిగిలినఆళ్వారు లందరును పాశురములను బాడిరి.

## వెల్లూరు లేక రాయవేలూరు

తిరుపతినుండి నేరుగ పాకాలజంక్షనుకు వెళ్లి అచ్చట మారి కాట్పాడిపోవు రైలెక్కి కాట్పాడిలో దిగవలెను. తిరుపతినుండి కాట్పాడి 65 మై. రూ 2-2-0 చార్జీ. కాట్పాడి నుండి వెల్లూరు 4 మై. చక్కనిసిమ్మెంటురోడ్డు గలదు. జట్కాలు గలవు. మనిషికి 0-4-0 మొదలు 0-8-0 వరకు తీసికొందురు. లేదా రైలుమీదనైన వెళ్లవచ్చును రైలు స్టేషను సమీపమున మసిలముని మొదలియార్ ధర్మశాల గలదు. ఇది పెద్దబస్తీ భోజనశాలలు కలవు. బండ్లు, బస్సులు, కార్లు గలవు.

---

రాయవేలూరు - కోట, కందకము



చూడదగినవి :- కోట, అందులోని దేవాలయము.

దక్షిణ దేశములో గల ముఖ్యమైనకోటలలో నిది యొకటి. కోటగోడ లెత్తుగను, మందముగను గట్టిరాతితో మధ్య మధ్య అందముగా గుండ్రముగా ముందుకు పొడుచు కొనివచ్చునట్లు కట్టబడి చూపర నాకర్షించుచుండును. దీని కొక్కవైపు పాలారునది ప్రవహించుచున్నది. ఈకోటగోడచుట్టు శత్రువుల కభేద్యమగులాగున కందకము ఈకందకములోనికి 'సూర్యగుండము' అను చెఱువునుండి నీరు కలిపి నిరంతర ముండునట్లు చేసిరి. దీనిని 1274 లో బొమ్మిరెడ్డి అనుప్రధాన నాయకుడు భద్రాచలమునుండి వచ్చి కట్టినట్లు చెప్పుదురు

దేవాలయము :- ఈ కోటలో నీశాన్యముగ రమణీయ మైన దేవాలయ మొకటి యున్నది. కాని ఈ దేవాలయమున విగ్రహము లేదు. అర్చన జరుగుట లేదు. ఈ దేవాలయము నానుకొని చక్కనిశిల్ప నైపుణ్యముగల కళ్యాణమంటపము

రాయవేలూరు కోటలోని కల్యాణమంటపము



గలదు. దాని స్తంభములపైనను కప్పులోపలిభాగమునను రాతిలో గొప్పశిల్పచాతుర్యము చూపబడినది. ఈ శిల్పము మధుర దేవాలయశిల్పమును పోలియున్నది.

సెంట్రల్ జైలు :— వెల్లూరుజైలులో ఇత్తడి, రాగి, నవారునేత, వడ్రింగము, తివాచీనేత, డేరాలు మొదలగునవి తయారుచేసి ప్రత్యేకముగ నేర్పరచిన అమ్మకపుగదులలో నుంచి అమ్ముచుందురు.

## అరుణాచలము లేక తిరువణ్ణామలై

వేల్లూరునుండి బస్సులు పోవును. రైలుమీదనైన పోవచ్చును. 51 మై. 1-11-0 చార్జీ యగును. ఇది తాలూకా ముఖ్యపట్టణము. ఇందు 30 వేలజనాభా గలదు. 40 సత్రములు గలవు. కొన్ని సత్రములలో 3 దినములవరకు భోజనము పెట్టెదరు. ఇచ్చట ప్రతిమంగళవారము సంత జరుగుచుండును.

## అరుణాచలేశ్వర దేవాలయము

ఒకానొకప్పుడు బ్రహ్మ సనత్కుమారునితో నిట్లనెను. ఓసనకా ! నీ కరుణాచలమహాత్మ్యమునుగూర్చి చెప్పెదను వినుము. ఒకానొకప్పుడు నేను, విష్ణువు నిలుచుండియుండగా మానడుమ నొకయగ్నిమయమగు తేజోలింగ ముద్భవించినది. అది ఊర్ధ్వమున సప్తలోకములు దాటిపోయెను. భూమి కధోభాగమున నెంతో యుండెను. అది అగ్నివలె ప్రజ్వలించుచుండెను. నేనును, విష్ణువును ఆ తేజోలింగమును స్తుతించితిమి. ఇంతలో ఆ తేజస్సునుండి పరమశివుడు ప్రత్యక్షమయ్యెను.



అరుణాచలేశ్వరదేవాలయము

మా యిద్దరకును వరము నొసంగెదనని పలుకగా విష్ణు విట్లనెను :— "స్వామీ! మీ దివ్యరూపమునకు నమస్కారము. మీ తేజము దుర్నిరీక్ష్యముగ నున్నది ఈ తేజము నుపసంహరించి సర్వలోకమునకు పూజించుకొనుటకు వీలగు అరుణాచలరూపమును మీరు ధరింపవలయును. స్థావరలింగ మగుచో భక్తులు మిమ్ము పూజించుటకు వీలగును." ఇట్లు పలుకగా శంకరుడు తథాఽస్తు అని అరుణాచలముగ నయ్యెను. ఆ యరుణాచలమును విష్ణువు, బ్రహ్మ అనేకవిధముల స్తుతించిరి.

ఈ యరుణాచలక్షేత్రము పృథివికి హృదయము. ఇది మూడుయోజనముల విస్తీర్ణమున్నది. దీనికి దక్షిణమున ద్రవిడదేశము కలదు. శివుడాక్షేత్రమును దనహృదయములో బెట్టుకొనును. ఇది మేరు. కైలాస, మందరములకంటె శ్రేష్ఠమైనది. ఇచ్చట శరీరపరిత్యాగ మొనర్చిన సింహ, వ్యాఘ్రాది పశువులుకూడ ముక్తినిబొంది, శివసేవకులగుదురు. పూర్వము ఉమాదేవి అచ్చట తపస్సు చేసి శివుని వామార్ధభాగిని యయ్యెను. ఆమెయే యిప్పటిలింగమును స్థాపించెను. అచ్చటనే దుర్గచే బూజింపబడిన పాపనాశనలింగమును కలదు.

(స్కాందపురాణమున నుసరించి)

ఇది శివక్షేత్రము. పంచలింగములలో నిది తేజోలింగము (జ్యోతిర్లింగము). దేవాలయము కొండ నానుకొని యున్నది. చాల పెద్దదేవాలయము. నాలుగు పెద్దగాలిగోపురములు నాలుగువైపులనున్నవి. ఒక్కొక్కగోపురము 9 లేక 11 అంతస్తులు కలిగియున్నది. భారతదేశములోని పెద్దదేవాలయ

ములలో నిది యొకటి. ఇందలిగాలిగోపురము నొకదానిని 1560 లో శ్రీకృష్ణదేవరాయలు కట్టించెననియు చెప్పెదరు. ఇందు గణపతిదేవాలయము ముఖ్యముగ చూడదగినది. ఇందు గొప్ప శిల్పము చూపబడినది 1000 స్తంభములమంటపము గలదు. ఇప్పు డీమంటపములో దేవాలయపు ఏనుగులను కట్టివేయు చున్నారు.

ఉత్సవములు :- కిర్తిగాయ్ లేక కార్తికదీప మను నుత్సవము 10 దినములు జరుగును. చివరిదినమున అనగా కార్తికపూర్ణిమనాడు కొండపై పెద్దదీపము వెలిగింతురు. ఆదీపమునందు మొక్కుబడులవారు నేతిని, కర్పూరమును విశేషముగ సమర్పించెదరు అందుచేత ఆదీపము 2 లేక 3 దినములవరకు వెలుగుచుండును.

సుందరపుష్కరిణి - అరుణాచలము



శ్రీరమణమహర్షి ఆశ్రమము:- ఈఆశ్రమము శ్రీరమణ మహర్షి వారిచే స్థాపింపబడినది. వారి కిచ్ఛ లేకున్నను భక్తాదులు, అభిమానులు వచ్చియుండుటచే అదియే యొకఆశ్రమముగ నేర్పాటయ్యెను. ఇది పట్టణమునకు దక్షిణముగా నొక మైలుదూరములో కొండ నానుకొని యున్నది గుఱ్ఱపుబండ్లు పోవును. బండికి 0-12-0 మొదలు 1-0-0 వరకు పుచ్చుకొందురు. మహర్షులవా రెవ్వరితోడను మాట్లాడెడివారు కారు. కాని వారిచూపు సాధకులపై ప్రసరించినంతమాత్రమున సాధకు లనుగ్రహమును పొందిన ట్లానందించుచుండెడివారు.

---

శ్రీరమణాశ్రమము - దూరదృశ్యము



అట్లు బాగుపడినవా రెందరో గలరు. వారిదర్శనార్థము భారతదేశమునలుమూలలవారేగాక పాశ్చాత్యులు సైతము వచ్చి వారిఅనుగ్రహమును పొందుటకు నివాసము లేర్పరచుకొని అచ్చట నుండెడివారు.

పాల్‌బ్రిన్‌టన్, విదేశీయుడు రమణాశ్రమమునకు వచ్చి మహర్షి వారిని దర్శించి అచ్చట కొంతకాల ముండెను. ఆయన ప్రసిద్ధినొందిన "A Search in Secret India" అను ఆంగ్లగ్రంథమును రచించెను.

Paul Brunton writes, "The spiritual radiations which emanated from him were all-penetrating- I learnt to recognise in this person the sublime truths which he taught while I was no less hurshed into reverence by his incredibly sainted atmosphere. He possessed a deific personality which difies description. I might have taken short-hand notes of the discourses of this sage. I might even print the record of his speech; but the most important part of his utterances, the subtle and silent flavour of spirituality which emanated from him can never be reported. If, therefore, I burn literary incense before his bust, it is but a mere fraction of the tribute I ought to pay to him."

భక్తు లుండుట కనేకభవనములు కలవు. పుస్తకశాలలు, భోజనశాలలు, పోస్టాఫీసు వగైరాభవనములు గలవు. వారిగ్రంథములు తెలుగు, అరవము, ఇంగ్లీషునందును అనేకములు గలవు.



శ్రీ రమణమహర్షులవారు

శ్రీ మహర్షులవారిటీవల శివకైవల్యమును పొందినను పెక్కుమంది భక్తులు వచ్చుచు వారిఅనుగ్రహమునకుపాత్రులగుచున్నారు. మాతృభూతేశ్వరి అమ్మవారిదేవాలయమును బహురమణీయముగ నిర్మించిరి. అనేకులాశ్రమదర్శనార్థము వచ్చుచుందురు.



శ్రీ మహర్షివారు (కొండపైకి షికారు)

మహర్షులవారు 14-4-1950 న సిద్ధినొందిరి. అనంతర మొకట్రష్టీ యేర్పడి శ్రీవారి అమృతోపదేశములను, వారిజీవిత విశేషములను తెలుపుచు ఆశ్రమముతరపున 'The Divine Call' అనునొక మాసపత్రిక నింగ్లీషున నడుపుచున్నారు.

## తిరుక్కోవలూర్

ఇది 2వ దివ్యదేశము. తిరువన్నామలైనుండి 21 మై. 0-11-0 చార్జీ అగును. స్టేషనునుండి 2 మై. దూరము. ఇది 18 వేల జనాభా గలపట్టణము. అన్నిసౌకర్యములు గలవు.

వసతులు:- భోజనశాలలు, జట్కా-బండ్లు. ఒంటెద్దు బండ్లు, ధర్మశాలలు గలవు. సన్నిధిని ప్రసాదము లభించును. రామానుజకూటము గలదు. అర్చనకు 0-4-0. దారిలో పెన్నా నది గలదు. వర్షాకాలమున పడవలసహాయమున దాటనగును

వైభవము :- త్రివిక్రమస్వామి, ఆయనార్, శ్రీకర విమానము, కృష్ణతీర్థము, తూర్పుతిరుముఖమండలము, చిన్న తిరుక్కోవలము, మృకండుమునికి బలిచక్రవర్తికి ప్రత్యక్షము. పొయ్గై. పూదత్తా,తిరుమ గయాళ్వార్ల మంగళాశాసనములు.

చూడదగినవి:- శ్రీరఘూత్తమస్వామిగళ్ ఆశ్రమము. మాధ్వసంప్రదాయము.

ఉత్సవములు:- పంగుని నెలలో ఉత్తరానక్షత్రదినముతో చివరకు 10 దినములు జరుగును.

☞ తిరిగి మరల తిరువణ్ణామలై చేరవలెను.

## తిరుత్తని

ఇది అర్కోణమునుండి 8. మై. 0-4-0 చార్జీ. సుబ్రహ్మణ్యస్వామిక్షేత్రము. 'తిరుప్పొగళ్'అను అరుణగిరిసాధువు పాడుకీర్తన లీదేవాలయప్రభావమును కీర్తించుట లోకవిదితమే. కృత్తికాయియుత్సవము జనవరినెలలో జరుగును. ఆ యుత్సవములకు విశేషముగ యాత్రికులు వత్తురు. అన్ని వసతులు గలవు. దాదాపు 300 సత్రములు గలవు. మద్రాసు నుండి 51 మై. 1-11-0 చార్జీ.

## తిరుత్తని

ఇది ఆంధ్రమున చిత్తూరు జిల్లాలోనిది. సుబ్రహ్మణ్యస్వామివారి ఆరుక్షేత్రములలో నిది యొకటి. దీనినే సంస్కృ

తమున 'శాంతిపురి' అందురు. ఇది అర్కోణం-రేణిగుంట మధ్య గలరైల్వేస్టేషను అర్కోణమునుండి 8 మై. శ్రీసుబ్రహ్మణ్యస్వామి ఆలయము కొండపైన గలదు. స్టేషనునుండి పశ్చిమముగా 6 ఫ. చక్రనిర్ఘోష్టు గలదు. కొండదిగువన 'కుమారతీర్థ' మనునొకకొలను గలదు. ఇచ్చటనుండియే కొండమెట్లు ప్రారంభమగును. 365 మెట్లెక్కవలెను కొండపై మార్గమధ్యమున కుడివైపున 'బ్రహ్మతీర్థము' గలదు. దాని నానుకొని బ్రహ్మలింగాలయము, వినాయకాలయము గలవు.

కొండపై ఇంద్రతీర్థము గలదు. ఇందు కాళ్లు పెట్ట నియ్యరు. ఈజలము స్వామిఅభిషేకాదికార్యములకు వినియోగింతురు. స్వామికి సమర్పించిన చందనము 'శ్రీపాదరేణు' వని ప్రసిద్ధిగాంచినది. ఇది సర్వవ్యాధి నిర్మూలక మనిప్రతీతి. ఇచట గంధముతీయు గొప్పసాన దర్శనీయము.

కొండపైనున్న ఆలయములను 1948 లో భక్తుల ధన సహాయమున మరమ్మతు గావించి మహావైభవముగ మహాకుంభాభిషేక మొనరింపబడెను. ఈ ఆలయమునకు పెక్కు జమీందార్లు దానపత్రములద్వారా సమర్పించిన భూముల నుండి ప్రతిసంవత్సరము రు. 80, 000 వరుమానము వచ్చును. స్వామికి అమూల్యాభరణములు గలవు.

## కంజివరము (కంచి)

ఇది 3వ దివ్యదేశము. తిరువన్నామలైనుండి కాట్పాడికి 58 మై. కాట్పాడినుండి అర్కోణము 38 మై. అర్కో

ణమునొద్ద బండి మారి చెంగల్‌పట్టునకు వెళ్ళుబండిలో 18మై. వెళ్ళిన కంజివరము లేక కాంచీపురము చేరగలరు. మొత్తము తిరువన్నామలైనుండి కంజివరమునకు రూ. 3-12-0 చార్జీ యగును. స్టేషనుకు 2 ఫర్లాంగులదూరములో రెష్టుహౌస్ గలదు.

ఇది చెంగల్‌పట్‌జిల్లాలో కంజివరముతాలూకా ముఖ్య పట్టణము. రెండులక్షలజనాభా గలపట్టణము. 9వ శతాబ్దమున శ్రీతిరుమంగాళ్వారులు దర్శించినక్షేత్రము. శ్రీశంకర, రామానుజులు వారిదిగ్విజయయాత్రలలో నీక్షేత్రమును దర్శించి వారి స్థానముల నేర్పాటుచేసికొనిరి. కాంచీకామకోటిపీఠ మిచ్చట నే యుండెడిది కాని 1743లో కుంభకోణమునకు మార్చబడినది. చైనాయాత్రికుడైన హోయన్‌సాంగ్ 8వ శతాబ్దమున నీక్షేత్రమును దర్శించి దానిఔన్నత్యమును దెల్పుచు, కంజివరము బుద్ధునినాటికే యుండెననియు, ఆయనయే అచ్చటి ప్రజలను బౌద్ధులుగ మార్చెననియు, ధర్మపాలుడు కంచిలో జన్మించెననియు, అశోకుడు చాలస్తూపముల నిర్మించెననియు, తన గ్రంథములో వ్రాసెను. ఇది దక్షిణదేశమున ముఖ్యమైన క్షేత్రము, మోక్షదాయకమైన సప్తపురులలో నిది ఆరవది. కాంచీపురమున 108 శివక్షేత్రములును, 18 విష్ణుక్షేత్రములును గలవని చెప్పుదురు.

ఇది పెద్దకంచి (శివకంచి) యనియు, చిన్నకంచి (విష్ణుకంచి) యనియు రెండుభాగములు.

పెద్దకంచి (శివకంచి) ఇది స్టేషనుకు 1½ మై. సిటీబస్సు గలదు. అనేకసత్రములు గలవు.

చూడదగినవి :- 1. ఏకాంబరేశ్వర దేవాలయము, 2. కామాక్షి అమ్మవారి దేవాలయము. ఏకాంబరేశ్వర దేవాలయము పంచలింగములలో పృథ్వీలింగము. ఇది యైదు ప్రాకారములు గలిగియున్నది మొదటిప్రాకారప్పు పైగోపురమును శ్రీకృష్ణదేవరాయలు 1509 లో కట్టించినట్లు చెప్పుదురు ఇది 188 అ. ఎత్తున 10 అంతస్తులు గలిగియున్నది. 1000 స్తంభములమంటపము, అందమైనమెట్లతో అమర్చబడినకోనేరు, దేవాలయములో నొకఆమ్ర (మామిడి) వృక్షము గలదు. దానిక్రింద పార్వతీదేవి తపస్సుచేసెనని చెప్పుదురు. దీనిచరిత్ర వినదగినది ఈ దేవాలయము మొత్తము 25 యకరముల విస్తీర్ణము గలస్థలములో నిర్మింపబడినది. ఇందు 13 తీర్థములు గలవు. అందు సరస్వతీతీర్థము ముఖ్యమైనది.

అర్చన:- అష్టోత్తరము 0-4-3, హారతి 0-2-0, సహస్రనామము 1-4-0.

కామాక్షి అమ్మవారి దేవాలయము:- ఇది అష్టాదశ పీఠములలో రెండవది. ఈ ఆలయమునకు 3 గోపురములు గలవు. అమ్మవారి దేవాలయమునకుముం దుందుధ్వజస్తంభముమీాద సింహము గలదు సింహ మమ్మవారివాహనముగాన ధ్వజస్తంభముపై నుంచబడెను. అమ్మవారు త్రినేత్రి (3కండ్లుగలది) మధ్య నేత్ర మగ్ని నేత్రము. మిగిలినరెండును సూర్యచంద్రులకు

పోల్చి చెప్పవచ్చును. 9వ శతాబ్దమున అమ్మవారి రత్యుగ్ర మైనశక్తితో వెలుగుచు నరబలులు కోరుచుండుటచే ఆమెను శాంతిపరచుటకు శ్రీశంకరాచార్యులవారు శ్రీచక్రము నీదేవాలయమునందు స్థాపించిరట అందుచే నేటికిని పౌర్ణమినాడీ శ్రీచక్రమునకు ప్రత్యేకపూజలు జరుగుచుండును. జ్ఞాపకార్థము శ్రీ శంకరాచార్యులవారి ప్రతిమను (విగ్రహమును) గూడ దేవాలయములో ప్రతిష్ఠించియుంచిరి.

(ఊరగం, నీరగం, కారగం, కార్వానం, కళ్వనూర్, పాడగం, నీలాత్తింగళ్, తుండం మొదలగు దివ్యదేశములు గలవు. అచ్చటివైష్ణవుల నడిగి చూడనగును )

అమ్మవారిదేవాలయముదగ్గర వామనదేవాలయము. విశ్వరూపములు గలదేవాలయములు గలవు. వామనదేవాలయములోని విగ్రహము చాలపెద్దది. చిన్న తాటిచెట్టు ప్రమాణము గలది. అర్చకు లొకముల్లుగర్రకు కాగడాదివిటీ వెలిగించి స్వామిముఖము, హస్తములు, బలిచక్రవర్తి మొదలగునవి చూపెదరు. (అనగా ముల్లుగర్రకన్న చాలనెత్తుగ నున్నదని అర్థము.)

చిన్నకంచి (విష్ణుకంచి) :- ఇది పెద్దకంచికి 2 మైళ్ళ దూరములో నున్నది. బండ్లు గలవు. ఒక్కొకనికి 0-4 0 తీసికొందురు. ఇది 20 గ. యెత్తుగల కరిగిరి అనునొక తిప్పమీద కట్టబడినది. దీనినే హస్తిగిరి యందురు పైన శ్రీవరదరాజస్వామివారి ఆలయము, క్రింద నృసింహస్వామివారి ఆలయము కట్టబడియున్నవి. శ్రీవరదరాజస్వామి, తిరువెక్కా, తిరుత్తణ్కా, అష్టభుజం, వేళుక్కై యనుదివ్యదేశములు గలవు.

అర్చన రేట్లు :- సహస్రనామము 1-0-0, అష్టోత్తరము 0-4-0, కేశవనామము 0-2-0, హారతి 0-1-0 ఇస్తే అమ్మ వారి యర్చన రేట్లుకూడ.

చూడదగినవి :— శతస్తంభములమంటపము ప్రతి స్తంభము కళాన్వైపుణ్యమును చాటుచున్నది. ఈమంటపముపై నాయన విచిత్రముగ రాతిలో గొలుసు చెక్కబడి వ్రేలాడు చున్నది. ఇచటిశిల్పము తప్పకచూడదగినది శ్రీవరదరాజస్వామి ఆలయములో బంగారు, వెండిబల్లులు గలవు. వానిని తాకుటకు అణా రుసుము. వానినితాకిన వారిపై బల్లిపడినను దోషము లేదు. అట్టివారిని తాకుటవలన బల్లి తగిలిన దోషము పోవును. స్వామి వారి కనేకవాహనములు, పురాతనపు బంగారునగలు గలవు.

చరిత్రాంశములను శిల్పకళను పరిశోధనచేయు తలంపు గలవారికి కంజీవరముచుట్టుపట్ల అనేక దేవాలయములు చూడ దగియున్నవి వానిలో శిధిలమైన జైన, బౌద్ధమతములు, దేవా లయములు, స్థూపములును, వైకుంఠనాథ దేవాలయము, కైలా సనాథదేవాలయమును ఏకాంబరనాథదేవాలయము గోడలపై చెక్కబడిన శాసనములును దర్శనీయములు. అర్థశాస్త్రమున ప్రవీణుడైన చాణక్యుడు లేక కౌటిల్యు డిచ్చటనే జన్మించెను.

కంచి పట్టుచీరెలకు, ఇత్తడిసామానులకు ప్రసిద్ధికెక్కి నది. మే నెలలో గరుడోత్సవము జరుగును. దానాపు 40 వేల యాత్రికులు వత్తురు. శ్రీత్యాగరాజస్వామివా రీయుత్సవ మును దర్శించియే "వినతాసుతవాహనుడై వెడలెను కంచి వరదు" డనుకీర్తనను పాడి, ఆనందించిరట.

| దివ్యదేశ వ. నెం. | దివ్యదేశము పేరు | మార్గము | వసతులు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 4 | తిరువెక్కా-యథోక్తారి సన్నిధి | చిన్నకంచిలో వరదరాజస్వామి సన్నిధికి 1½ మై॥ దూరము | బంగ్లా గలవు | ఫాల్గున మాసములో 10. ది బ్రహ్మోత్సవము |
| 5 | అష్టభుజం | నెం. 4 దేవాలయమునకు 2 ఫ॥ | ,, | |
| 6 | తిరువేళుక్కై | స్టేషనుకు తూర్పుగా 2 మైళ్లు | ,, | భృగుమహర్షికి ప్రత్యక్ష[ము |
| 7 | తిరుత్తణ్గా | 5వ ది. దేశమునకు 1½ ఫ॥ | ,, | |
| 8 | పాడగమ్ | పెద్దకంచిలో పడమరగా 1 మై॥ | ,, | |
| 9 | నిలాత్తింగల్ తుండం | ఏకాంబరేశ్వర దేవాలయంలో | ,, | ఒకటవ ప్రాకారములో |
| 10 | తిరుపవళవణ్ణార్ | కామాక్షి దేవాలయానికి ¼ మై. | ,, | పచ్చవణ్ణార్ చూడనగును |
| 11 | ఊరగమ్ | ,, సమీపము | ,, | |
| 12 | కారగమ్, నీరగమ్ | 11 ది. దే. ఉత్తర ప్రాకారములో | నడచి | |
| 13 | పేరగం | ,, | ,, | |
| 14 | కార్వానం | ,, | ,, | |
| 15 | తిరుకళ్వానూర్ | కామాక్షి అమ్మవారి గుడిలో | ,, | దీనిని శైవులారాధింతురు |
| 16 | వైకుంఠపెరుమాళ్ | స్టేషనుకు ¾ మై. | ,, | |
| 17 | తిరుప్పుట్కుళి | పెద్దకంచినుండి 7 మై. | బంగ్లా | సత్రము గలదు. |

తోండదేశపు దివ్యదేశములు 22. అందు కాంచీపుర ములో 14 గలవు. వాని వరుసనెంబర్లు 4, 5. 6, 7. 8, 9. 10. 11, 12, 13, 14, 15, 16, 17. ఈదివ్యదేశములలో చిన్నకంచిలో 4, 5, 6, 7 దివ్యదేశములున్ను, పెద్దకంచిలో 11, 12, 13, 14 (యీనాలుగు వామనావతార్ సన్నిధిలో గలవు) 8. 9, 10, 15, 16; 17 దివ్యదేశములును గలవు. ఈనెంబర్ల వివరము, ఆదివ్యదేశములనుగుఱించి విశేషములు నీగ్రంథమునందు ముందు గాంచనగును.

## తి రు వ ళ్లూ రు

కంజివరమునుండి తిరువళ్ళూరు 33 మై. దూరములో నున్న రైల్వేస్టేషను. రూ 1-2-0 చార్జీ యగును. స్టేషనునుండి 2 మై. దూరములో ఊరు గలదు. 20 వేలు జనాభా గలపట్ట ణము. ఇది 19వ దివ్యదేశము

ఇచ్చట శ్రీవీరరాఘవస్వామివారి దేవాలయము, ప్రసిద్ధి యైనకోనేరు కలదు 'సవిహోత్రి'మునికి దర్శన మిచ్చుటకై స్వామి యిచ్చటికి వచ్చి నిలచిపోయెనని చెప్పుదురు.

ఇచటికోనేటియందు యాత్రికులు మణుగులుమణు గులు బెల్లము కలుపుదురు. స్వామికి మ్రొక్కున్నవారు చేతికి కడియము ధరింతురు. ఇచట ప్రతిఅమావాస్యనాడు గొప్ప ఉత్సవము జరుగును. తై, చైత్రిమాసములలో గొప్పబ్రహ్మో త్సవములు జరుగును అమ్మవారు కనకవల్లితాయారు.

అర్చన:- అష్టోత్తరము 0-2-6. సహస్రనామము 1-8-0 స్థలపురాణము అరవములో 0-4-0కు దేవస్థానఆఫీసులో లభిం చును. అహోబిలమఠస్వామివారిదేవాలయట్రిష్టీగా నుండి

కార్యములు నడిపింతురు. ఈ క్షేత్రము తిరుపతి, శ్రీరంగము వలె అనాది దేవాలయములు గలది.

### తిన్ననూరు

ఇది స్టేషనుకు 1 మైలుదూరములో నున్నది. ఇది 18వ దివ్యదేశము. బండ్లు, సత్రములు, భోజనశాలలు గలవు. దేవాలయములో ప్రసాదము లభించును. స్వామి భక్తవత్సలుడు. ఎన్నైపెత్తతాయార్. శ్రీనివాసవిమానము, వరుణపుష్కరిణి శ్రీతిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

### శ్రీపెరుంబుదూర్

తిరువళ్లూరునుండి 10 మై. బస్సుమార్గము. దీనిని 'భూతపురి' అనియు నందురు. విశిష్టాద్వైతమతస్థాపకులైన శ్రీరామానుజాచార్యులవారి జన్మస్థానము. ఇచ్చట కేశవ పెరుమాళ్ళ దేవాలయము శ్రీభాష్యకార్లస్వామి దేవాలయము లేక ఉడయవర్ స్వామి దేవాలయములు గలవు. సన్నిధిలో ప్రసాదము దొరకును. భోజనశాలలు గలవు. చిత్రిమాసములో ఆర్ద్రానక్షత్రమున గొప్ప ఉత్సవము జరుగును.

ఇచ్చటికి సమీపములో, 1. పూందమల్లై, 2. మొదలియాండాన్, 3. తిరుమళిశై, 4. పచ్చెపెరుమాళకోవెల, 5. మధురాంతకం గలవు.

### మద్రాసు లేక చెన్నపట్టణము

శ్రీపెరుంబుదూరునుండి 25 మై. లో చెన్నపట్టణము కలదు. బస్సుకు 0-12-0 తీసికొందురు. ఇది చెన్నరాష్ట్రమునకు ముఖ్యపట్టణము. ఈరాష్ట్రము 5,170 చ. మై. విస్తీర్ణము, సముద్రమట్టమునకు 22 అ. ఎత్తున గలదు. భారతదేశము

లోని పెద్దనగరములలో నిది 3వది. ఇది49. 74 చ. మై. విస్తీ
ర్ణము గలనగరము. 14 29 లక్షలజనాభా గలమహానగరము.
కార్పొరేషన్‌కు సాలుకు 200 లక్షలు ఆదాయము వచ్చును.

వసతులు:- ఇది దక్షిణరైల్వేమీద నున్నది సెంట్రల్ స్టేషను, ఎగ్మోర్ స్టేషను ప్రధానమైనవి. ఒకస్టేషనుకు మరియొక స్టేషనుకు రైల్వేలైను కలసిలేదు. కనుక ఒకస్టేషను నుండి మరియొకస్టేషనుకు వెళ్ళువారు వేరేబండ్లమీద సిటీ బస్సులమీద వెళ్ళి ఆయాస్టేషనులలో రైళ్లనెక్కి ప్రయాణము చేయవలెను. దక్షిణదేశమునకు పోవుబండ్లు చిన్నబండ్లు. మీటర్ గేజి (METRE GAUGE) అనేకభోజనశాలలు, సైకిలురిక్షాలు, బస్సులు, వగైరా వసతులు గలవు సెంట్రల్ స్టేషనుకు 50 గ. దూరములో శ్రీరాజారామస్వామి మొదలియార్ సత్రము గలదు. ఇది చాలసౌకర్యము కల్గియుండును. ఇది పై రెండుస్టేషనులమధ్య నుండును. చిన్నపల్లెయైన ఈపట్టణమీనాటిమహానగర మగుటకు 312 సంవత్సరములు పట్టినది.

ముఖ్యముగ చూడదగినవి :- కళాశాల (School of Arts) 1850 లో స్థాపింపబడినది. ఇది ఎగ్మోరుస్టేషనుకు సమీపము. ఇచ్చట చిత్రలేఖనము, లోహముపైనను, కొయ్యపైనను, మోల్డింగు, మూల్డింగు. తివాచీనేత, అల్యూమినియమ్ పని. పాటరీమేకింగు మొదలైనవి నేర్పెదరు.

గవర్నమెంటుమ్యూజియం-కెన్నమెరాలైబ్రరి :- ఇది పన్‌థియోన్ రోడ్డులోనున్నది. ఇదికూడ ఎగ్మోర్ స్టేషనుకు సమీపములో నున్నది. ఇది 1851 లో స్థాపింపబడినది. మ్యూజియములో పురాతనరాజులచే వాడబడిన ఆయుధములు, కవచ

ములు, ఫిరంగులు, పలువిధములైన నాణెములు, ఆభరణ ములు. శిల్పమును చాటు రాతిచెక్కడములు మొదలైన వెన్నియో చూడనగును.

కెన్నమెరా లైబ్రరీ:-ఇందు దాదాపు ఒకలక్ష గ్రంథములు అతిరమ్యముగ నమర్చబడియున్నవి. ప్రశాంతముగా చదు వరులు చదువుకొని వెళ్లుచుందురు. చక్కనియేర్పాట్లు చేసిరి.

పైరెండును శుక్రవారముతప్ప మిగిలినదినములలో ఉదయము 7 గంటల నుండి సాయంత్రము 5 గంటల వరకు దర్శించవచ్చును కాని హిందూ ఘోషాస్త్రీలు చూచుటకు గాను శనివారము ఉదయము 12 గంటలనుండి ప్రత్యేకమైన యేర్పాటు గలదు.

పీపుల్సుపార్కు - మదారాసు



విక్టోరియాపబ్లిక్ హాలు:-నాటకములు, సభలు, సంగీతకచ్చేరీలు మొదలగునవి ఇచ్చట జరుగును. ఇది1887 లో 1,79,000 వెచ్చించి దీనిని నిర్మించిరి. ఇందులో ఒకేపర్యాయము 14 వందల మంది కూర్చుండ వచ్చును.

పీపుల్సుపార్కు :- సెంట్రల్ స్టేషనుకు

సమీపముగానున్నది. ఇది 116 యకరముల భూమిలో 5 సరస్సులతో కళకళలాడుచుండును. ప్రతి బుధవారము సాయంత్రము 6 గంటలనుండి 7 గంటలవరకు మిలిటరీ బ్యాండు వాయించెదరు. ఇందు జంతుప్రదర్శనశాల గలదు. దీనియందు పెద్దపులులు, ఏనుగులు, విచిత్రమైనకోతులు, జిరాఫి, నిప్పుకోళ్లు మొదలగు జంతువులు సృష్టిలో మానవునికి ఆశ్చర్యముకల్పించు మృగములు, పక్షులు, పాములు మొదలగునవి కలవు.

మోరుమార్కెట్టు :- ఇదియు నీపార్కుభూములలో గలదు. ఇం దనేకవస్తువు లమ్మకమునకు దొరకును. దుకాణములు విశాలముగను, అందముగను అమర్చబడియుండును.

రిప్పన్‌భవనములు :- ఇందు కార్పొరేషన్ ఆఫీసులు గలవు. చాల అందముగ కట్టబడినది.

హైకోర్టు, లైట్‌హౌస్ :- ఇది పెద్దభవనము. ఇది 19వ శతాబ్దమున 16 గుమ్మటాలవంటి శిఖరాలతో అందముగ నిర్మించబడినది. నేడు రూ. 30 వేల వ్యయముతో ఈ గుమ్మటములకు రంగులు, భవన మరమ్మత్తులు ప్రారంభించిరి. ఇందు హైకోర్టు, స్మాల్‌కాజ్‌కోర్టు, సిటీసివిల్‌కోర్టు గలవు. దీనిపైన 160 అడుగులయెత్తున దీపగృహము గలదు. దీనిపైకి నెక్కవచ్చును. రుసుము 0-2-6 పుచ్చుకొందురు. దీనిపై కెక్కిన నిత్యము పెరుగుచున్న మహానగరమును, అపారముగ నీలవర్ణముగ గంభీరముగ భీతినిగొల్పుసముద్రమును పెద్దపెద్దఓడలతో గాననగును. ఈదీపము 18,000 కాండిల్‌పవర్ గలిగియున్నది.

హార్బర్ :- ఇది 200 యెకరముల విస్తీర్ణమైనదై వ్యాపారాభివృద్ధికి ముఖ్యమై యున్నది. ఇది 37 అడుగుల లోతు గలిగియున్నది.

పార్థసారధికోవెల :- ఇది తిరువళ్ కేళిలో గలదు. ఇచ్చట పెద్ద దేవాలయము గలదు. ఇది 19వ దివ్యదేశము. ఇది సెంట్రల్ స్టేషనుకు 2 మై. దూరమున గలదు. అన్నివసతులు గలవు.

చైనాబజారు సమీపమున బైరాగిమఠము (శ్రీ వెంకటేశ్వరస్వామి కోవెల) శ్రీ చెన్నకేశవపెరుమాళ్లకోవెల, ఉడయవర్లసన్నిధి దర్శనీయములు.

మైలాపూర్ :- కపాలేశ్వర దేవాలయము. (పెయ్యాళ్వారులసన్నిధి) కేశవపెరుమాళ్ళసన్నిధి, మాధవపెరుమాళ్లు చూడనగును. పెయ్యాళ్వారుల అవతారస్థలము.

---

శ్రీకపాలేశ్వరాలయము - మైలాపూర్




తెప్ప - కపాలేశ్వరాలయము, మద్రాసు.

శ్రీ రామకృష్ణ మఠము:- ఈ మఠము మైలాపూరులో శ్రీ కపాలేశ్వరస్వామి దేవాలయమునకు సమీపమున గలదు. ఇది ప్రపంచ విఖ్యాతి వహించి మాధవసేవ, మానవసేవ చేయుచున్న సంస్థలలో నొకటై కలకత్తా బేలూరున నున్న శ్రీరామకృష్ణ మఠమున కొక శాఖ. ఆధ్యాత్మిక సేవ చేయుటయే గాక విద్యాప్రచారము, కళాపోషణము, వైద్యసేవ ఇత్యాది కార్యక్రమములతో మిక్కిలిచక్కగ నడపబడుచున్నది.

గౌడియామఠము:- రాయిపేట హైరోడ్డులో లాయడ్సు రోడ్డులో దిగిన ఒకఫర్లాంగుదూరములో నీమఠము గలదు. చాలప్రశాంతముగ నుండును. చాలపెద్దభవనము. ఇది 400 సంవత్సరము క్రింద భారతదేశమున బెంగాలులో అవతరించి, భగవన్నామభక్తిప్రభావము నలుమూలల మారుమ్రోగునట్లు

ప్రచారమొనరించిన ప్రేమమూర్తి యైన శ్రీగౌరాంగమహాప్రభు సంప్రదాయమునకు చెందిన కలకత్తామఠమునకు ప్రాంచి. ఇందు రాధాకృష్ణులవిగ్రహములు ప్రతిష్ఠించిరి.

అడయారు :- దివ్యజ్ఞానసమాజమువారిభవనములు, పాఠశాల, గొప్పగ్రంథాలయము 200 × 160 అ. వైశాల్యముగల్గుటచే ప్రపంచమున మూడవది యైనమఱ్ఱివృక్షము, చూడదగినవి. ఇది ప్రపంచవిఖ్యాతసంస్థ. సంవత్సరమున కొకసారి జరుగుఉత్సవములకు ప్రపంచమునలుమూలలనుండి దివ్యజ్ఞానసభ్యులు వచ్చెదరు.

మీనంబాకం:- ఇచ్చట విమానాశ్రయము గలదు. వైర్ లెస్ స్టేషను గలదు. ఇచ్చటనుండి Air Mails (విమానటపాలు) పంపుచుందురు.

## పెరంబూరు

మద్రాసులోని పెరంబూరు రైలుపెట్టెల కర్మాగారము 1952 లో స్థాపింపబడినది. దీనికి 4 కోట్ల రూపాయలు ఖర్చు చేసిరి. ఇందు సాలీనా 350 కొత్తరకము లోహపు రైలు పెట్టెలు తయారగుచున్నవట.

మద్రాసుతీరపు షికారు (MARINA) బహు ఆకర్షణీయము. ప్రపంచమారీనాలలో నిదిగూడ పేరెన్నిక గన్నది. సాయంతనమున వందలకొలది కార్లు బారులుతీర్చి షికారుకు వెళ్ళుదృశ్యము ఆనందమును కలిగించును.

ఇవిగాక, మెమోరియల్ హాలు, సెనెట్ హౌస్, లా కాలేజి, సెయింట్ జార్జికోట, గవర్నమెంటు హాస్పిటల్,



మద్రాసు సముద్ర తీరము (MARINA)

బీచి, చైనాబజారు, హైకోర్టు, కర్నాటిక్ మిల్సు, అగ్గి పెట్టెలుచేయు కర్మాగారము, బిస్కెట్, పెన్సిలు, గ్లాసు చేయు కర్మాగారములు మొదలైనవి దర్శనీయములు.

## Madras City Transport

(మద్రాసుపట్టణ బస్సుసర్వీసు వివరము)

| రూట్ నెం. | నుండి | వరకు | ద్వారా |
|---|---|---|---|
| 1 | ట్రిప్లికేన్ | పారీస్ | సెంట్రల్ |
| 2 | ,, | మింట్ | ,, |
| 2 A | హైకోర్టు | ,, | ,, |
| 3 | మైలాపూర్ | పారీస్ | ,, |
| 4 | ,, | తండయార్ పేట | ,, |
| 4 A | ట్రిప్లికేన్ | ,, | ,, |
| 5 | అడయార్ | పారీస్ | మైలాపూర్ |
| 5 A | మైలాపూర్ | సైదాపేట | అడయార్ బ్రిడ్జి |

| | | | |
|---|---|---|---|
| 6 | M. V. C. | తండయార్ పేట | రాయపురం |
| 6 A | ,, | మేదేగార్ సత్రంరోడ్డు | |
| 7 | పారీస్ | పెరంబూర్ | పి. బారక్సు |
| 7 A | ,, | ,, | పురుషవాకం (చెరువు Tank) |
| 7 B | పారీస్ | విల్లివాకం | పి. బారక్సు |
| 8 | పారీస్ | పెరంబూరు | జేపిన్ బ్రిడ్జి |
| 8 A | మింటు | పెరంబూర్ | జి 3 పోలీసుస్టేషను |
| 9 | టి. నగర్ | పెరంబూరు | ఎగ్మోర్ హైరోడ్డు |
| 10 | టి. నగర్ | పారీస్ | పాన్‌థోన్ రోడ్డు |
| 11 | ,, | ,, | మౌంటురోడ్డు |
| 12 | ,, | లేడీ (Lady) వెల్లింగ్టన్ కాలేజీ, | లజ్, చెప్పాక్‌రోడ్డు |
| 12 A | ,, | మైలాపూర్ | ,, |
| 13 | ,, | ట్రిప్లికేన్ | పైక్రాఫ్ట్సు రోడ్డు |
| 14 | కెల్లీస్ (Kellys) | మింట్ | సాల్టుకోటార్సు |
| 15 | అమింజికరై | పారీస్ | Periament |
| 16 | కెల్లీస్ | పారీస్‌బ్రిడ్జి | ఎగ్మోర్ |
| 17 | వడపళని | పారీస్ | ఎగ్మోర్ |
| 19 | బ్రాడ్ వేబ్రిడ్జి | లాట్టిన్ | మౌంటురోడ్డు సైదాపేట |
| 21 | పారీస్ | తుండవెల్లి | రాయిపేట |
| 21 B | పారీస్ | అడయార్ | దక్షిణబీచ్ రోడ్డు |
| 22 | కెల్లీస్ | ట్రిప్లికేన్ | ఎగ్మోర్ స్టేషన్ |
| 23 | మైలాపూర్ | ఎగ్మోర్ | రైల్వేస్టేషను |
| 23 A | అడయార్ | ఎగ్మోర్ రైల్వే స్టేషన్ | మీనంబాకం హైరోడ్డు |
| 24 | అమింజికరై | Q. M. C. | పెరెక్స్‌రోడ్డు |
| 25 | ట్రిప్లికేన్ | వడపళని | మీనంబాకం హైరోడ్డు |

| | | | |
|---|---|---|---|
| 26 | పారీస్ | విల్లివాకం | క్లైవ్స్ |
| 27 | అమింజకరై | ట్రిప్లికేన్ | ఎగ్మోరు |
| 28 | ఎగ్మోర్ రైల్వేస్టేషన్ | తండియార్ పేట | సెంట్రల్, మింట్ |
| 29 | పెరంబూర్ రైల్వేస్టేషన్ | మౌంటురోడ్డు | ఎగ్మోర్ రైల్వే స్టేషన్ |
| 30 | చాకలిపేట | ఐస్‌హౌస్ | మౌంటురోడ్డు |
| 31 | పారిస్ | బార్‌బర్స్‌బ్రిడ్జి | సెంట్రల్ |
| 51 | ఫ్లవర్ బజారు | అలందూర్ | సైదాపేట |
| 56 | మింట్ | తిరువత్తూర్ | తండియార్ పేట |
| 56 A | మింట్ స్ట్రీట్ | ఎగ్మోర్ | తిరువత్తియూర్ |
| 57 | మింట్ | రెడ్ హిల్సు | వ్యాసరపాడి |
| 101 | ,, | తిరుపతి | కాళహస్తి |
| 102 | బ్రాడ్వే | తిరుపతి | తిరుత్తని |
| 103 | సంగంపేట | ,, | చంద్రగిరి |
| 103 A | రేనిగుంట | ,, | తిరుచానూర్ |
| 104 | మింట్ | ,, | పుత్తూర్ |
| 105 | ,, | వెల్లూరు | తడ |
| 106 | బ్రాడ్వే | కాంచీపురము | |
| 107 | మింట్ | తిరుపతి | సత్యవేడు |
| 108 | బ్రాడ్వే | కాంచీపురము | పామూర్ |
| 109 | ,, | పదప్పాయి | తాంబరం |
| 110 | మింట్ | వెంకటగిరి | నాయుడుపేట |

పైబస్సురూట్లన్నియు మద్రాసుగవర్నమెంటువారిచే నడుపబడుచున్నవి ఆయానెంబర్లుగలబస్సు లెక్కిన వాని కెదురుగా చూపినప్రదేశములగుండా తీసికొనిపోవును.

## చోళంగిపురం లేక ఘటికాచలము

ఇది 21వ దివ్యదేశము. చెన్నపట్టణమునకు 40 మైె. దూరములో నున్నచోళంగిపురం స్టేషనుకు 8 మైె దూరమున గలదు. లేక అర్కోణంస్టేషనులో దిగి బస్సుమీద 18 మైె. పోయిన యీదివ్యదేశము చేరవగును. బస్సుకు 0-10-0చార్జీ. బస్సుమీదనే సులభము. అన్నివసతులు గలవు. సంవత్సరం పొడుగు ను యాత్రికులు వచ్చుచుందురు. ఇది వ్యాధిగ్రస్తు లకు గ్రహబాధితులకు గొప్పగుణకారియైన క్షేత్రము. ఈ దివ్య దేశమున ఒక్కగడియకాలమైనను నిర్మలమనస్సుతో దైవ ధ్యానము గావించిన సకలవిధపురుషార్థములు లభించును. అందుకనియే దీనికి 'ఘటికాచల'మని పేరువచ్చెను.

యోగానందనృసింహస్వామి, అమృతవల్లినాచ్చియార్, శింగకోష్ఠతవిమానము, అమృతతీర్థము, శ్రీ యోగాంజనేయ స్వామికి ప్రత్యక్షము, (సమీపమున చిన్నకొండపై నీయో గాంజనేయస్వామి గలదు.)

## తిరునీర్మలై లేక తోయగిరి

ఇది 22వ దివ్యదేశము. దీనినే ఖండారణ్యక్షేత్రమని కూడ అందురు. ఇది ఎగ్మోరుస్టేషనునుండి 12 మైళ్ళలో నున్న పల్లావరంస్టేషనులో దిగి దక్షిణముగా 2½ మై పోయిన చేర గలము. మదాసునుండి బస్సుమీదనైన పోవచ్చును. అన్ని వసతులు గలవు.

తిరుముఖమంటపము, నీర్ వణ్ణర్, మంగనాంచారు, తోయగిరివిమానము, తొండదేశపురాజుకు, భృగు, మార్కండేయులకు ప్రత్యక్షము.

సూచన :– ఇప్పుడు మనము ప్రయాణముచేయునది దక్షిణరైల్వే మీటరుగేజిమీద; అనగా చిన్నబండి ఈబండ్లన్నియు మద్రాసు ఎగ్మోరుస్టేషనునుండి బయలుదేరును. బీచి స్టేషనునుండి తాంబరంవరకు అనగా 18 మై. (డబుల్ లైన్సు) జంటపట్టాలమీద విద్యుచ్ఛక్తిచేత నడచుబండ్లు (Electric trains) పోవుచుండును (అనగా నీబండ్ల కింజను లుండవు. విద్యుచ్ఛక్తిచే నడుపబడును ఇది చూచువారికి విచిత్రముగ నుండి ఆశ్చర్యము కలిగించును. వచ్చుబండి వచ్చుచుండగా వెళ్ళుబండి ప్రక్కపట్టాలమీద వెళ్లుచుండును. 6 నిమిషముల కొకబండిచొప్పున దినమునకు 150 బండ్లు నడచుచుండును.

## వందలూరు

ఇది ఎగ్మోరునుండి 19 మై. ఉండును 0–10–0 చార్జీ. విశిష్టాద్వైతమతస్థాపకులైన శ్రీరామానుజాచార్యులవారి జన్మస్థానమగు శ్రీపెరుంబుదూరు వెళ్లువారిచ్చట దిగవలెను. స్టేషను నుండి శ్రీపెరుంబుదూరుకు బస్సులు గలవు. మద్రాసునుండి యైన బస్సులు వెళ్లుచుండును. ఈ క్షేత్రమునుగూర్చి వెనుకనే వ్రాయబడినది.

వందలూరులో విజయనగర వంశీయులచే కట్టబడిన దేవాలయములు చూడదగినవి

## శింగపెరుమాల్ కోయిల్

ఇది వందలూరునుండి 10 మై. ఇది రైల్వేస్టేషను. 0–6–0 చార్జీ యగును దేవాలయము స్టేషనునుండి మైలు దూర ముండును. ఇది విష్ణుక్షేత్రము. ఇది యొకపెద్దతటాకము

ప్రక్క నున్నది. వివాహములు మొదలగు శుభకార్యములు చేసికొనుటకీ దేవాలయమునకు జనులు విశేషముగ వచ్చుచుందురు. ఈస్వామికల్యాణోత్సవమునకు యాత్రికులు వేలకు వేలు వచ్చెదరు.

## పక్షితీర్థము లేక తిరుకురకుండ్రము

ఇది పై స్టేషనునుండి 6 మై. దూరములో గల చెంగల్ పట్ స్టేషనులో దిగవలెను అచ్చటనుండి 9 మై. దూరము బస్సుమీాద వెళ్లిన పక్షితీర్థము చేరనగును. బస్సుకు 0-6-0 చార్జీ యగును. స్టేషనుకడకే బస్సులు వచ్చును.

వసతులు:— చెంగల్ పట్ స్టేషనుసమీాపమున సత్రము గలదు. అందు 3 దినము లుండవచ్చును. భోజనవసతులు గలవు. ఇది జిల్లాముఖ్యపట్టణము. పక్షితీర్థమునొద్ద అనేక సత్రములు గలవు. అన్నివసతులు గలవు ఇచ్చటినుండి అన్ని వైపులకు బస్సులు పోవుచుండును.

చూడవలసినవి:— కొండక్రింద భక్తవత్సలేశ్వరుడు, త్రిపురసుందరీదేవాలయములు గలవు ఇవి చాల విశాల దేవాలయములు. నాలుగువైపుల ఎత్తైనగోపురములు గలవు. దేవాలయములో పెద్దకొలను గలదు. లోపల దక్షిణముగా పెద్దకళ్యాణమంటపము విచిత్రమైనశిల్పములో చెక్కబడి చూపర నాకర్షించును. ఇచ్చటకు 3 ఫర్లాంగులలో శంఖతీర్థము గలదు. ఇందు యాత్రికు లందరు స్నానముగావించి దేవాలయములకు వచ్చెదరు. ఇందు 12 సంవత్సరముల కొకసారి యొకశంఖము పుట్టుననియు, అందుచేతనే శంఖతీర్థ

మందురనియు చెప్పుదురు ఇచ్చట అంతయు అరవభాష మాట్లాడుదురు.

☞ క్రిందిదేవాలయములు దర్శించి సత్రమునందు వంట చేసి సిద్ధముగ నుంచుకొని (భోజనము చేయకుండ) కొండపైకి వెళ్ళి పక్షుల దర్శించి తిరిగి క్రిందికి వచ్చి భోజనము చేయవలెను.

కొండపైన దేవాలయము : పక్షులదర్శనము:- కొంత దిగ మెట్లు నెక్కవలెను. చక్కనిత్రోవ. కొండపైన వేదగిరీశ్వరదేవాలయము కలదు. స్వామిపేరు వేదగిరీశ్వరుడు. అమ్మవారు చొక్కాలమ్మ. ఈగిరిని వేదగిరి అందురు. వేదములే భగవంతు నిచ్చట ఆరాధించెనట. అందుచేతనే వేదగిరి అను నామము సార్థకమందురు ఈ కొండ 500 అడుగులయెత్తుండును కొండపైనుండి తూర్పుగా చూచిన మహాబలిపురము, సముద్రము, దీపగృహము (Light house) చూడనగును.

పక్షులఆహారము:- కొండమీద దేవాలయము నానుకొనియున్న యొకతిప్పమీదికి రెండుపక్షు లెన్నియో సంవత్సరములనుండి నిత్యము మధ్యాహ్నవేళకు వచ్చి అచ్చట అర్చకునిచే నీయబడుఆహారమును భుజించి పోవుచుండును ఈవిషయము రెండువందలయేండ్లక్రిందటినుండి చెంగల్‌పట్ జిల్లారికార్డులలోను డచ్చిదేశస్థులు మనదేశమునకు వచ్చినప్పుడు వారి రికార్డులలోను, డచ్చివైజ్ఞానికుడు హావర్టు (HAVART) 1681 లో నీవిషయమునే తనగ్రంథమునను వ్రాసెను. ఇట్లే పెక్క

వేదగిరికొండలలోగూడ గుర్తించబడియున్నది. కాన నీపక్షులనాదిగ వచ్చుచున్నట్లు తెలిసినది. ఈరెండుపక్షులు చాలవృద్ధదశలోనున్నవి. శరీరమంతయు తెల్లగనుండి తోకలు కొంచెము నలుపుగ నుండును. అర్చకుడు దినము 11 గంటలకు కొండపైకి వచ్చి యొకఆసనముపై కూర్చుండి జపముచేయును పదినిమిషములలో ఆకాశమునైపు చూచి సాష్టాంగనమస్కారము గావించి పక్షులకు ఆహారము పెట్టుటకు తెచ్చినఖాళీ గిన్నెను కొండపై మెల్లగా కొట్టి శబ్దముచేయును. మరియొక అర్చకుడు ప్రసాదము (పాయసము) తెచ్చి సిద్ధముగ నుంచును. అంతలో ఆకాశమున అనేకపక్షు లున్నను [చాలగ్రద్ద లెగురుచుండినను] ఆరెండుపక్షులే మెల్లగ అర్చకునిసమీపమునకు వచ్చి ఆయన గిన్నెలలో పెట్టుఆహారమును భుజించి, నీరు త్రాగి పైకి వెళ్ళి దేవాలయముచుట్టు 3 ప్రదక్షిణములుచేసి వెళ్లును. ఇది అంతయు యాత్రికులు తమకేర్పరచినయొకహాలులో కూర్చుండి చూచుచుందురు అర్చకులు మిగిలినపాయసమును ప్రసాదముగ యాత్రికులకు కొద్దిగెల కమ్ముదురు. యాత్రికు లందరును ప్రసాదమును కొని భుజించెదరు. ఆరెండుపక్షు లెంతకాలమునుండి యున్నవో, పూర్వపురెండుపక్షు లీరెండుపక్షుల నేర్పాటుచేసిపోయినవో, లేక యిన్ని వందల సంవత్సరములనుండి యీరెండుపక్షులే వచ్చుచున్నవో దైవమునకే తెలియవలెను. చూచువారి కాశ్చర్యము, ఆనందము కల్గించును. ఈరెండుపక్షులు కాశీరామేశ్వరయాత్రచేయుననియు మార్గమున నిట ప్రసాదమున కాగుననియు చెప్పుదురు.

[పక్షులు సాధారణముగా గంటకు 40 మై. నుండి 60 మైళ్ళ వేగముతో నెగిరిపోవుననియు, నెచటను నిలువక 5 6 గంటలవఱకు పోగలవనియు, ఆర్కిటిక్ అంటార్కిటిక్ సముద్రములపై నెగిరెడి 'టెర్న్' మొ॥ పక్షులు పది వేలమైళ్ళ వఱకు విశ్రాంతిగొనక ఎగురగలవనియు శాస్త్రజ్ఞులు వివరించి యుండుటచే ఈపక్షులు నిత్యము కాశీరామేశ్వరములు తిరిగివచ్చుననిన, అనుమానింప బనిలేదు.] ఆక్షేత్రమాహాత్మ్యగ్రంథ మాక్షేత్రముననే లభించును. పక్షులకు భోజనము చేయించుటకు రు. 1-4-0 తీసికొందురు.

## మహబలిపురము

ఇది 23వ దివ్యదేశము. ఇది పక్షితీర్థమునకు 10 మై. మోటారుబస్సుకు 0-8-0 చార్జి గుర్రపుబండికి రూ 2-0-0 తీసికొందురు. ప్రతిఆదివారము మదాసునుండి మహాబలిపురమునకు ప్రత్యేకము బస్సు బయలుదేరును. స్థలశయన పెరుమాళ్ళు, నీలమంగై నాచ్చియార్, పూదత్తె, తిరుమఙ్గై యాళ్వారుల మంగళాసనములు, భుజంగ శయనము, గరుడనది, గఘనాకృతివిమానము. మాఘామావాస్యనాడిచ్చటికి సముద్రస్నానమునకు యాత్రికులు విశేషముగ వచ్చెదరు.

వసతులు:- రహదారిబంగళా గలదు. సత్రము కలదు. భోజనమున కన్నిసామానులు లభించును. చిన్నయూరు. పోస్టాఫీసు గలదు. భోజనశాలలు గలవు.

చూడదగినస్థలములు :- మహాబలిపురము [దీనినే Seven Pagodas అందురు] పల్లవులచే కట్టబడినకోట. ఇది

2000 సం॥ లకు పూర్వమే యున్నదనియు, సముద్రతీరమున నున్న దేవాలయ విమానగోపురము బంగారుడోము కలిగి యుండెననియు, అది సూర్యకాంతికి మెఱియుచు సముద్రమున పోవునోడలకగుపడుచుండెడిదనియు పాశ్చాత్యుల గ్రంథములలో వ్రాయబడియున్నది. ఇచ్చటి శిలాశిల్పమును చూచుటకు హిందూయాత్రికులే గాక యితరఖండములనుండికూడ తరచుగ వచ్చుచుందురు. ఇవి అన్నియు చూచుటకు వీలుగ ఆర్కిలాజికల్ డిపార్టుమెంటువారొకసన్న నిరోక్షున కిరుప్రక్కల సున్నము కొట్టినరాళ్లు పెట్టి దార్లు చూపిరి. ఆదారుల వెంట వెళ్ళిన అన్నియు చక్కగ చూడనగును లేదా యిచ్చట కొద్దిఫీజుకో గైడ్సు [చూపువారు] లభింపగలరు. వారు 0-8-0 నుండి 5-0-0 వరకడుగుదురు.

సముద్రతీర దేవాలయము :- (Sea Shore Temple)

ఇది సముద్రము నానుకొనియున్న శివాలయము. ఇందు 16 ముఖములు గలశివలింగము గలదు నేడర్చన లేక శిథిలావస్థలో నున్నది. ఈలింగము పైకప్పునందు పెద్దదూలములు గలవు అవి గంధపుదూలములని చెప్పెదరు. దేవాలయము నెదుట సముద్రపుటలలమధ్య ఒక స్తంభము గలదు. బహుశః అది దీపస్తంభమని యూహింపబడుచున్నది. గాని గవర్నమెంటువారు దానినిదాటి యింకకొంతపై భాగమువరకు సముద్రమును పూడ్చి చక్కగ రాతితో కట్టి, కూర్చుండుటకు బెంచీల నేర్పాటుగావించిరి. దేవాలయవిమానముపై నున్న 'కలశము' గాక మిగిలినరాతికట్టుబడి యంతయు సముద్రపుటుప్పు

గాలికి తినబడినది. విమానము దాదాపు 60 అడుగులయెత్తున నున్నది. అనేక నందులు తుల్యశిల్పమున బయటిగోడలపై పెట్టబడియున్నవి. ఈ దేవాలయమంతయు నిసుకలో కప్పబడి యుండుటచే 1911 లో గవర్నమెంటువారు శుభ్రపరచి జాగ్రత్తగ కాపాడుచుండిరి.

అర్జునతపస్సు:- ఇది యొకపెద్దకొండను తొలిచి దాని పై భాగమున మహాబలియొక్క దర్బారు, ఐదు రథములు, సింహములు, పెద్దపులులు, చిరుతపులులు, లేళ్ళు, బుద్ధవిగ్రహము, ఒకఋషి, నాగేంద్రుడు, ఏనుగులు, మొదలగువాని విచిత్రచరిత్రను చాటుచిత్రములు చెక్కబడియున్నవి. దీనిని గూర్చి డాక్టరు హంటర్ ఇట్లు వ్రాసియున్నాడు.

Dr. Huntur, late of the Madras School of Arts thus describes the great bas-relief which goes by the name of 'Arjuna's penance"

"One point of great importance in these early rock sculptures is that they represent scenes of peace, with men and their wives, a single wife accompanying each, and the animals, garudas and birds in fairs, while the Rajah Mahabali is accompanied by dwarfs, and other rajahs, whose rank is indicated by umbrella bearers, have each his wife beside him. The ascetics, of whom there are five or six have no wives It appears to me that the story is one which represents the establishment of the Buddist religion or one of peace, goodwill, toleration and kindness to all men and to animals and birds"

'అర్జునునితపస్సు' అనిపిలువబడు ఒకఉబుకుచిత్రమును వర్ణించుచు మద్రాసు చిత్రకళాశాలాధ్యాపకులయిన డాక్టరు హంటరు ఇటుల నుడివిరి

ప్రాచీనశిల్పము అత్యంతముఖ్యమయిన శాంతిసందేశము నొసగుదృశ్యములను రూపొందించునదిగా నున్నది. ఈశిల్పము నందు, భర్తల ననుసరించుభార్యలు, గరుత్మంతుడాదిగాగల పలురకముల పక్షిజాతులు ప్రదర్శింపబడినవి.

"వారివారి అంతరమునకు తగినటుల ఛత్రచామరముల గొని రాజరాజగుమహాబలిని అనుసరించువామనులు, సామంత రాజులు భార్యాసమేతులుగ చిత్రింపబడిరి. ఐదారుగురు విరాగులనుకూడ శిల్పమున చూడనగును. వీరలు బ్రహ్మ చారులుగనే చిత్రింపబడిరి. ఇందలి కథాసందర్భము శాంతి, సహనము, సౌభ్రాత్రము, ప్రేమ, భూతదయలకు మూల మైనబౌద్ధధర్మప్రచారమును విశదపరచునదిగా నున్నది."

గోవర్ధనగిరి, వెన్నముద్ద మహిషాసురమర్దని, పుండరీకతీర్థము. వినాయకదేవాలయము, పాతఅర్జునతపస్సు, దీప గృహము మొదలగునవేకములు చూడదగినవి.

రాతిరథములు:— ఇవి పాండవరథములని పిలువబడును. పాండవు లైదుగురుగాన ఒక్కొక్కరి కొక్కొక్కటిగా దొలువ బడియున్నవి. ఇవి అన్నియు ఒకేకొండనుండి తొలిచినట్లు చెప్పుదురు. మొదటిరథముమాత్రము పూర్తియై సున్నితముగ చెక్కబడియున్నది. తక్కినవి పూర్తికా లేదు.

మొదటినాల్గురథములు నొకేవరుసలో నున్నవి. ఐదవది దూరమున నున్నది.

మొదటిది : 11 అడుగులుచదరముగ నుండి 16 అడుగులయెత్తుగ నున్నది. బయటపని పూర్తి అయినది. లోపల విగ్రహ మేమియు లేదు.

రెండవది : 11 × 16′ × 20′ ఎత్తు ; మొదటిదానినే పోలియున్నది.

మూడవది 42′ × 25′ × 25′ పూర్తిగావింపబడినది గాని దానిపైన క్రాక్ యిచ్చినది. అది భూకంపమువలన నని కొందరందురు. మొత్తముమీద పనిమాత్రము నిరుత్సాహమువలన ఆపబడినది. దీనిపైకి ఎక్కవచ్చును.

నాల్గవది : 27′ × 25′ × 34′ ఎత్తు పైభాగ మంతయు చెక్కబడినది. లోపల ఒకేరాయివలె నున్నది.

Mr. Fergusson, in his history of India and Eastern Architecture, says :—

పాండవరథములు (మహాబలిపురము)



"It may be that, frightened by the crack in the last named rath, or from other cause, they desisted, and it still remains in an unfinished state."

"I see no reason for doubting the inference drawn by Sir Walter Elliot from their inscriptions that the excavations could not well have been made later than the sixth century. Add to all this that the Raths are certainly very much like Buddist buildings, as we learn to know them from the early caves, and it seems hardly to admit of doubt that we have here petrifactions of the last forms of Buddist architecture and the first forms of that of the Dravidian."

"భారతదేశచరిత్రి మఱియు ప్రాచ్యశిల్పము" అను గ్రంథమున ఫెర్గూసన్‌గారు ఇట్లుల ఉద్ఘాటించిరి.

చివరరథమున నేర్పడినపగులు మూలముననో మఱి యే కారణముననో అత్యుత్తమ మగుభారతీయశిల్ప చాతుర్యప్రతిబింబమయిన ఈమూర్తి యంతయు నైకల్య మొందినది."

"శాసనముల నాధారముగ గొని భావింపబడిన సర్ వాల్టరు ఎలియట్ ఊహను శంకించుట నిరాధారమయినది. భూగర్భ చారిత్రికాధారములను త్రివ్వుట ఆరవశతాబ్దముననే జరిగియుండును. రథములు బౌద్ధవిహారములు, స్థూపముల బోలియుండుట నిస్సందేహము. ఇట్టిఆకారములే ప్రాచీన గుహాలయందు కానవగును. ఆధునికబౌద్ధశిల్పము, ప్రాచీన ద్రావిడశిల్పములసమ్మేళనమే ఈఉత్కృష్టద్రవ్య మనువాదము సరికాదు."

దీని నేరాజు శంకుస్థాపనచేసెనో యేశిల్పి యీకొండలను స్వాధీనము చేసికొనెనో మన మీనాక్షీపురమును చూచి సంతోషమును, విచారమును చెందవలసియున్నది. ఇంతగొప్ప శిల్పమును చెక్కినశిల్పిని, అతనిని, పోషించినరాజును పొగడెదముగాని వారు సంకల్పించినపని పూర్తికాలేదనువిచారము మాత్రము ప్రతివానిహృదయమునకు నాటును. పూర్తియైన నింకెంత ఆశ్చర్యమును కల్పించియుండెడిదోగదా!

## తిరువిడవెన్దై

ఇది 24వ దివ్యదేశము. ఇది మహాబలిపురమునుండి 6 మైళ్ళ దూరములో నున్నది. నిత్యకల్యాణులు, కోమలవల్లి తాయార్, కల్యాణవిమానము, కల్యాణతీర్థము, తూర్పుతిరు ముఖమండలము, నిన్న తిరుక్కోలము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము. ఇది చిన్నగ్రామ మగుటచేత నెట్టివసతియు లేదు.

## తిరుపోరూర్

ఇది మహాబలిపురమునుండి 7 మైళ్ళు. బండ్లేర్పాటుచేసికొని (TIRUPORUR) పోవలెను. ఇది సుబ్రహ్మణ్యస్వామి క్షేత్రము.

వసతులు :- దాదాపు 64 సత్రములు గలవు. ఊరంతయు సత్రములే. అన్నిసామానులు దొరకును. పోస్టాఫీసు గలదు. ఇచ్చట ప్రతివారము సంత జరుగును. ఇచ్చటనుండి

పక్షితీర్థము 13 మై. చెంగల్‌పట్టు 16 మై. బస్సులు గలవు. 0-8-0, 0-10-0 చార్జీ యగును.

చూడదగినవి:- దేవాలయమునకు దక్షిణముగా సర్వతీర్థము గలదు. ఇందు ప్రతిసంవత్సరము మాఘబహుళవిదియనాడు తెప్పయుత్సవము జరుగును. కొండమీద నొకశివాలయము గలదు దేవాలయము నవీనపద్ధతులలో నడుపబడుచున్నది. దేవాలయ మంతయు విద్యుద్దీపములతో నలంకరించబడియున్నది. గొప్పరథములు గలవు.

☞ చెంగల్ పట్టుకు తిరిగివచ్చి అచ్చటినుండి 41 మైళ్ళలో తిండివనము రైలుమీద చేరవలెను. రైలు చార్జీరూ 1-5-0

## తిండివనము

ఇచ్చటనుండి 17 మై. లో జింజీకోట గలదు. మంచి మోటారురోడ్డు గలదు. స్టేషనునుండి మోటారుబస్సులు పోవుచుండును. జింజీ మూడువైపుల కృష్ణగిరి, చంద్రగిరి, రాజగిరి, యనుకొండలచే చుట్టబడియున్నది. కోట రాజగిరిపైన గలదు. ఇది 600 అ. ఎత్తున నున్నది. ఇది విజయనగరరాజులకాలమునుండి ప్రాముఖ్యములోనికి వచ్చి క్రమముగ మొగలుచక్రవర్తులు, మహారాష్ట్రులు, ఫ్రెంచివారు, తరువాత బ్రిటిషువారి క్రిందకు వచ్చినది. అన్నియు శిథిలావస్థలో నున్నవి. రాజా దేశింగ్ ఈజింజీపరిపాలకుడు. (ఇతనిజననము 1693) కర్ణాటకనవాబు సాదుత్తుల్లాఖాన్ చేతిలో గొప్పపరాజయమును పొందెను. 1677 లో దక్కన్‌సుల్తానులనుండి (1665

విజయనగర రాజ్యపతనముతో అది సుల్తానులకు దక్కినది) శివాజీ వశమైనది. మహారాష్ట్రులు బలీయులగుటచే ఓర్వలేని ఔరంగజేబ్ కోటను 1690 లో ముట్టడించి చివరకు 1698 లో వశపరచుకొన్నాడు. 1750 లో అది ఫ్రెంచివారికి చిక్కినది. 1761 లో అది యింగ్లీషువారి స్వాధీనమైనది 1780 లో దానిని హైదరాలి జయించెను. అటుతరువాత ఇది ప్రాముఖ్యములోనికి రాలేదు.

వసతులు:- తిండివనము పెద్దపట్టణము. భోజనశాలలు గలవు. జింజికడ లోకల్ ఫండువారి బంగళా కలదు. వ్యక్తికి 24 గం॥ లకు 0-8-0 చార్జి యగును. అచ్చట నెయ్యి, పాలు, పెరుగు దొరకును. ఇచ్చటి శిథిలము లన్నియు చూడవలె నన్న 3 దినములు పట్టును.

చూడదగినవి :- ఈశిథిలములు హంపిలోమాదిరిగ నుండును. రాజగిరిపై నున్ననీటిబుగ్గలు, కల్యాణమంటపము, గజంఖానా, ప్రేక్షకులహాలు. ధాన్యపుకొట్లు, ఖైదీలబావి, పిశాచములద్వారము. కొలను. జంజితుపాకి, రాజులు స్నానము చేసెడిబండ (15' చదరము 5 మందము గలిగియుండును) దర్బారుమధ్య 8 అంతస్తుల నలుపలుకలగోపుర మున్నది. దీని యెత్తు 80 అ.

## పాండిచేరి లేక పుదుచ్చేరి

తిండివనము స్టేషనునుండి విల్లిపురంస్టేషనుకు రావలెను. 23 మై. 0-12-0 చార్జి యగును. ఇది పెద్దరైల్వేకూడలి.

6 ప్లాటుఫారములు గలవు ఇచ్చటనుండి తిరువన్నామలై వెళ్లువారు వెళ్ళవచ్చును. పాండిచేరి ఫ్రెంచివారిపట్టణము. ఫ్రెంచి గవర్నరుండుస్థానము. 40, 000 జనాభా గలిగి అందముగ సముద్రతీరమున నుండును. నేడిది భారతప్రభుత్వమున గలసిపోయినది.

వసతులు :- పాండిచేరి వెళ్ళువారు విల్లిపురంస్టేషనుకు 2 ఫర్లాంగులదూరములో నుండుసత్రములో దిగి సామాను లచ్చట పెట్టుకొని గదికి తాళమువేసికొని వెళ్లుట మంచిది. లేనియెడల పాండిచేరి వెళ్లునప్పుడు, తిరిగివచ్చునప్పుడు, దారిలో చిన్నబాబుసముద్రముస్టేషనునొద్ద రైలుబండిని ఆపి కస్టమ్సు ఉద్యోగులు తనికీచేసి క్రొత్తవస్తువులకు కస్టమ్సు డ్యూటీ వేయుచుండెడివారు. మనయొద్ద క్రొత్తవస్తువు లున్న వెళ్ళునప్పుడా వస్తువులను వారికి చూపి రసీదు పొందవలసి యుండెడిది. నేడీబాధ లేదు పాండిచేరిస్టేషనుకు 2 ఫర్లాంగులలో 'అమ్మనివాసం' అను భోజనశాల గలదు. గదులు కావలసిన 0–8–0 తీసికొందురు. అన్నివస్తువులు చాలచౌకగ దొరకెడివి కాని ఫ్యాన్సీవస్తువులమీద 50% డ్యూటీ వేసెడివారు.

చూడవలసినవి :- ఇది హిందూదేశములో గల ఫ్రెంచి రాజ్యస్థానములకు గవర్నరుండెడివాడు. ఇచ్చటికి ఫ్రెంచి Mail Steamer వచ్చుచుండును 1. పయర్ (Pier) ఇది సముద్రములోనికి 150 మీటర్లపొడవున కట్టబడియుండును. ఇచ్చటికి స్టీమర్లు వచ్చి ఆగును. సామాను లచ్చటినుండి చిన్న

తొట్టిబండ్లలో వేసికొని పట్టాలమీదుగా నెట్టుకొని ఒడ్డునకు చేర్చెదరు. ఈ యేర్పాటు చూచుటకు విచిత్రముగ నుండును హార్బర్లు లేని వోట్ల నిట్లు వాడెదరుగాబోలు. 2. దీపగృహము. 3. డూప్లేవిగ్రహము (ఈ విగ్రహము జింజికోటలోని దేవాలయమునుండి తేబడిన స్తంభములపై నిలువబెట్టబడినది.) 4. గవర్నమెంటుభవనము, 5 ఉద్యానవనము. 6 గ్లాసుతో తయారుగాబడినగృహము (Glass house) గ్లాసుతో చేయబడి చూచువారికి ఆశ్చర్యమును కలిగించును, 7. పెద్దచెర్చిలు, 8. పురమందిరము(Town Hall,) 9.ఫ్యాక్టరీలు. 10. పెద్దబజారు.

## శ్రీ అరవిందాశ్రమము

ఈయాశ్రమ మొకానొక ప్రణాలిక ననుసరించి, బుద్ధిచే ముందుగా నిశ్చయింపబడి పెరిగినసంస్థ కాదు. అం





శ్రీ అరవిందులు  శ్రీ మాత

గాంగములలో కూడన ప్రాణి సహజముగా పెరిగినట్టులే వృద్ధి కాంచిన యొకసంస్థ యిది; శ్రీ అరవిందులవ్యక్తిత్వమును అభివ్యక్తపఱచు సజీవావిర్భావనమే యిది. శ్రీ అరవిందులు వంగదేశమునుండి 1910వ సంవత్సరమున పాండిచేరికి విచ్చేసిరి. శ్రీ మాత ఫ్రాన్సునుండి 1914వ సంవత్సరమున పాండిచేరికి మొదటిసారిగా విచ్చేసి, కొంతకాల మున్నతర్వాత మరలిపోయి, 1920వ సంవత్సరమున తిరిగివచ్చి, శ్రీ అరవిందులకార్యమునందు వారికితోడునీడయై, పాండిచేరి యందే ఆనాటినుండి నిలిచిపోయినది. ఈ యాశ్రమము 1926వ

శ్రీ అరవిందాశ్రమము



గారు ఆశ్రమములో గొప్పవ్యక్తులు. వారే ఆశ్రమములో నున్న వెయ్యిమందికి మార్గదర్శకురాలుగా నున్నారు.

☞ పాండిచేరినుండి తిరిగి విల్లిపురము చేరవలెను. విల్లిపురము చేరి సత్రములో నుంచినసామానులను తీసికొని ప్రయాణము సాగించవలెను.

### పాండిచేరి పరిసరములలోని ఆలయములు

పొదుకి, అరికమేడు :- ఈ రెండు ప్రదేశములలోను శిల్పమున గొప్పఆలయములు శిథిలావస్థలో నున్నవి కాని యివి వివిధశిల్ప విధానములలో పల్లవ, చాళుక్య, చోళరాజుల నాటివిగ నేటికిని ప్రకాశించుచున్నవి.

తిరుభువనము:- ఇదియు పాండిచేరిప్రాంత గ్రామమే. చోళరాజులపాలనక్రింద నుండిన గ్రామము బాహూరులో పల్లవులకళాశాల యుండినట్లు చోళులసంస్కృతికళాశాల యిచ్చట నుండెడిదట. సంస్కృతవిద్యాయోగ్యతా పత్రము లిచ్చట నిచ్చెడివారట. విష్ణ్వాలయ మొకటి ఇచ్చట గలదు.

తిరువందర్ కోయిల్ :- ఇది శివక్షేత్రము. ఇది పల్లవ రాజ నిర్మితము. తిరుజ్ఞానసంబంధర్ వారుగూడ నీఆలయమును గీర్తించినట్లు శైవగ్రంథములలో గలదు. తదుపరి యీఆలయమునకు చోళులు మరమ్మత్తుల చేసినట్లు గన్పించుచున్నది.

మదగాడిపట్టు :- ఇచ్చట చోళరాజ నిర్మిత మైన యొకశివాలయము గలదు. ఈఆలయమును 'ఒడయార్ కోవిల్' అందురు. ఇందలిస్వామిని 'తిరుకుందన్ కంజేశ్వరార్'

అని పిలుతురు. ఈఆలయము పునాదులనుండి నల్లరాతిశిల్పముతో మహాబలిపురమున సముద్రపుఒడ్డున నున్న (Sea-Shore Temple) ఆలయ శిల్పము ననుకరించును. ఈ ఆలయమును ప్రొఫెసర్, కె. ఎ. నీలకంఠశాస్త్రిగారు మూడుసం॥ల క్రితము దర్శించి అంతరాలయము పునాదులు, స్థాను చోళకాల ప్రారంభము నాటివిగ గన్పించు చున్నదని అభిప్రాయమిచ్చిరి.

## తిరువయిందపురము

ఇది 25వ దివ్యదేశము. దీనికి రెండుమార్గములు గలవు. వర్కాల్ పట్టస్టేషనులో దిగి కాలినడకన మైలుదూరము వెళ్ళిన ఈదివ్యదేశము చేరవచ్చును. రెండవమార్గము కడలూరు లేక తిరుప్పాపులియూర్ స్టేషనులో దిగి (New Town) 3 మై. బండ్లపైన వెళ్ళిన యీ దివ్యదేశము చేరవచ్చును. అన్ని వసతులు గలవు. విల్లిపురమునుండి తిరుప్పాపులియూరుకు 29 మై. 1-0-0 చార్జి అగును. మరల కడలూరు చేరి నేరుగ చిదంబరము వెళ్ళవలెను. దైవనాయకిపెరుమాళ్లు, వైకుంఠనాయకి, గరుడనది, శేషతీర్థము చంద్రునికి గరుత్మంతునికి ప్రత్యక్షము.

కడలూరు జంక్షనుస్టేషనునుండి చిదంబరము వెళ్ళు లైనులో రైలు కడలూర్ జంక్షనులో బయలుదేరిన 5 నిమిషములలో కుడిచేతివైపున చూచుచుండిన పెద్దమఱ్ఱిచెట్టుక్రింద నీటుకరాతితో కట్టబడినవిగ్రహములు చూడనగును.

## వృద్ధాచలము

కడలూరుస్టేషను మార్గములో నదలూరు కలదు. ఇచ్చట మహాత్మారామలింగముయొక్క మఠము గలదు. మహాత్మా రామలింగము దక్షిణదేశములో మహాజ్ఞాని. వారిఫోటో ప్రతి యింటిలోను, అంగడిలోను అలంకరింపబడియుండును. విమల ప్రతిష్ఠితమగు వృద్ధాచలేశ్వరాలయము గలదు. నదీతీరము. పంచగోపురములు గలవు.

## చిదంబరము లేక 'చిత్తంబలం'

విజ్ఞానవాతావరణము కలదిఅని పేరున కర్థము. ఇది కడలూరుజంక్షనునుండి 24 మై 0-13-0 చార్జీ. దక్షిణార్కాడు జిల్లాలో చిదంబరంతాలూకాకు ముఖ్యపట్టణము. 25,084 జన సంఖ్య గలదు.



చిదంబరదేవాలయదృశ్యము

వసతులు :- దేవాలయము స్టేషనునుండి ½ మై. దూర ములో కలదు. జట్కాలు, ఎద్దుబండ్లు కలవు. దేవాలయము నకు 0-4-0 లు తీసికొందురు. అనేక భోజనశాలలు, సత్రి ములు గలవు నాటుకోటివారిసత్రిములో బ్రాహ్మణులకు భోజనపు ఏర్పాటు గలదు.

ఉత్సవములు :- 1. తిరుమంజనోత్సవము ఇది జూన్ నెలలో జరుగును. 2 ఆర్ద్రోత్సవము డిశంబరు నెలలో జరు గును. ఈ యుత్సవములకు దాదాపు 40 లేక 50 వేలయాత్రికు లన్ని వైపులనుండి వచ్చెదరు.

ముఖ్యముగ చూడదగినవి:- ఇట శివకేశవులకు భేదము లేదని తెలుపుటకో యనునట్లు రెండాలయములు నొకదాని నొకటి అనుకొని శివదర్శనము చేయువారికి విష్ణువును, విష్ణు దర్శనము చేయువారికి శివుడును గనిపించును. ఇచ్చట పంచ లింగములలో నొకటి యగు ఆకాశలింగము గలదు. దీనినే 'చిదంబర రహస్య' మందురు. దీనిని చూపుటకు రూ 1-4-0 రుసుము తీసికొందురు. ఆకాశలింగముగనుక లింగాకార ముండదు. దేవాలయపుగోడయందు బంగారపు రేకుపై యంత్రి ములో బిగించబడియుండును దానియెదుట తెర వేసియుం డును. రుసుము చెల్లించువారి కాతెర తెరచి చూపుదురు. నటరాజస్వామి. శివకామసుందరి ; వైకుంఠవాసులు, చిత్రి కూటము, శ్రీదేవి భూదేవి గలరు. నటరాజస్వామికి నిత్యము అన్నాభిషేకము జరుగును.

ఈ దేవాలయము పట్టణమధ్య నున్నది. దాదాపు 40 యెకరములవిస్తీర్ణత గలభూమిలో 5 ప్రాకారములు గలిగి అందు మొదటిరెండుప్రాకారములు 30 అడుగులఎత్తు గలిగి, మొదటిప్రాకారముపై నాలుగువైపుల పెద్దగోపురములచే యాత్రికుల నాకర్షించుచుండును. ఆగోపురములు 122 అడుగులయెత్తున గట్టబడినవి. నాలుగువైపుల సింహద్వారములు 40 అడుగులఎత్తు 5 అడుగుల వెడల్పు గలవకాండపురాళ్లతో నిర్మించబడినద్వారములను గలిగియున్నవి. చూచువారి కాశ్చర్యము గలిగించును.

మొదటిప్రాకారము :- కొంతకాళీగాను కొంత పిచ్చిమొక్కలతోడను, కొంత వనములతోను వృథాగా నుంచబడినది. దీనితూర్పు పడమరగోపురములపై నాట్యకళను బోధించు 108 విధానములతో బొమ్మలు చెక్కబడియున్నవి.

రెండవప్రాకారము :- తూర్పుద్వారమువైపు 1000 స్తంభములమంటపము గలదు. ఇది 340' × 190'. దీనిలోపలి గోడల పైభాగమందు పెక్కురంగులతో బొమ్మలు చిత్రింపబడియున్నవి. దీనిముందర దాదాపు 70 స్తంభములు నిలువబెట్టబడినవి ; కాని పని పూర్తియైనట్లు లేదు. ప్రస్తుతము ఉత్సవసమయములలో ఆ స్తంభములపై పందిరివేసెదరు. ఇట శివునివాహన మైననంది కలదు. దానిమెడయందు గంటలు, దానిపై జీనువగైరా చూడదగినవి. ఇది హిందూదేశములోని నందులలోనికెల్ల పెద్దది.

## కొళము లేక 'శివగంగ'

ఇది 1000 స్తంభములమంటపమునకు పడమటగా నున్నది. 160 'పొడవు 100' వెడల్పు గలిగి చక్కగ చెక్క బడినరాతితో దీనికి మెట్లు కట్టబడినవి. యాత్రికుల యుపయోగార్థము దానిచుట్టును మంటపము గలదు. ఇందు పూర్వము ఎన్ని కుక్రి డనురాజు స్నానము చేయగా నతనిని బాధించుచున్న రోగము పోయి శరీరము సువర్ణచ్ఛాయ నొందుటచే నీకొళమునకు 'సువర్ణకోనేర'ను పేరు గలిగెననియు, ఈ దేవాలయ మారాజుచే వృద్ధిగావింపబడె ననియు చెప్పెదరు.

సుబ్రహ్మణ్యదేవాలయము :- పెద్దనెమిలివిగ్రహము (మయూరవాహనము) చెక్కబడియున్నది. ఈ దేవాలయపు హాలులో నున్న స్తంభములపై భక్తులయొక్కయు, సంగీత విద్వాంసులయొక్కయు విగ్రహములు రకరకములుగా చెక్కబడియున్నవి. దానికి కుడిప్రక్కన పార్వతీదేవాలయము గలదు. ఈ దేవాలయముముందర గంధపు ముద్దలతో చేయబడి బంగారు రేకులతో తొడుపు వేయబడినధ్వజస్తంభము గలదు. దేవాలయపుహాలులోని స్తంభములపైనను, దూలములపైనను భక్తుల యొక్కయు, ఋషులయొక్కయు, దేవతలయొక్కయు జీవిత గాథలు చెక్కబడియున్నవి.

వినాయకదేవాలయము :- ఇది 2వ ప్రాకారములో నైరృతిమూలగ నున్నది. ఈ దేవునికి 'మూడుమానికల బియ్యము తినుగణేశ్వరుడ'ని పేరుకలదు. ఇంతపెద్దవిఘ్నేశ్వరుడు హిందూదేశములో మరెచ్చటను లేడందురు. ఇచ్చటి

స్తంభములపై ద్వారపాలకుల చెక్కుటలో వెలయుశిల్పనైపుణ్యము చూడదగినది. ఇచ్చటికి కొంచెముదూరములో దక్షిణాముఖముగా నుండునట్టిది దక్షిణామూర్తి దేవాలయము. దక్షిణద్వారముకడ మరి యొకనంది కలదు. రెండవప్రాకారమును వదలి 3వ ప్రాకారములోనికి రావలెను.

3వ ప్రాకారము:- ఇందు ద్రావిడశిల్పమున నొప్పెడు లక్ష్మీదేవాలయము, వాహనమంటపము, వంటశాలలు, స్టోరుగదులు, మూలస్థానము (అనగా శివుని రాతివిగ్రహము గలస్థానము) యాత్రికు లుండుమంటపములు కలవు.

4వ, 5వ ప్రాకారములు:- ఈప్రాకారములలో నటరాజస్వామి, పెరుమాల్‌కోయిల్ కలవు. ఇవి 9వ శతాబ్దమునసే యున్నట్లు గలదు. ఈదేవాలయగర్భాలయముపై నున్న విమానము, కలశములు, బంగారు రేకుతో కప్పబడినవి. ముఖ్యముగ చూడదగినవి. ఇందు 'నాట్యసభ' అత్యద్భుత శిల్ప నైపుణ్యమును ప్రదర్శించును. దీనినిగూర్చి హైందవ కళారసికులలో నగ్రగణ్యుడని చెప్పదగుపాశ్చాత్యుడు ఫెర్గూసన్ దొర యిట్లు వ్రాసియున్నాడు.

Mr. Ferguson writes thus of this Sabha –

"The oldest thing now existing here is a little shrine in the inmost enclosure, Porch of 56 pillars about 8 feet height and most delicately carved resting on a stylobate ornamented with dancing figures, more graceful and eligently executed than any other of their class, so far I know, in South

India. At the sides are the wheels and horses, the whole being intended to represent a chariot.''

ఫెర్గూసన్‌గారు ఈసభనుగూర్చి ఈవిధముగ తెలియ జేయుచున్నారు.

"ఆవరణములచే పరివృతమయిన ఈచిన్నారిముఖమం టపము అత్యంతప్రాచీన మయినది. ఈముఖమంటపమున నేబది ఆరు స్తంభములు కలవు. ఎనిమిదిఅడుగుల ఎత్తుగల ఈ స్తంభములు కడుసొంపుగ చెక్కబడి, శిల్పకళాలాలిత్య మును వెల్లివిరియుచు, అనేకనృత్యభంగిమల ప్రకటించు అత్యంతసుందర మయిన స్త్రీవిగ్రహములచే మోయబడు చున్నందున, అతిగంభీరమయిన ఈమంటపము దక్షిణభారత మున ప్రముఖస్థాన మాక్రమించుచున్నది. ప్రక్కభాగము లందు చక్రములు అశ్వములు చెక్కబడినందున మంటప మంతయు ఒకరమణీయ రథాకారమును బోలియున్నది."

మొత్తము పంచసభలు గలవు. చిత్సభ, కనకసభ, రాజసభ, నర్తనసభ, దేవసభ. అడిగి తెలిసికొని వానిని చూడనగును. కనకసభ—ఇది ద్రావిడశిల్పమునకు మేటియై ప్రకాశించుచున్నది. ఇచ్చటనే శివ, కేశవులకు భేదము లేదన్నట్లుగా నొకదానిప్రక్క నొకటి అమర్చబడియున్నవి.

చిదంబరనటరాజస్వామి పండరిపురపాండురంగనివలె అనేకభక్తవరులను, కవీశ్వరులను, కాపాడి స్వీయసాన్నిధ్య మున కనాదినుండి చేర్చుకొనుచుండిరి. వారిచరిత్ర వ్రాసిన గ్రంథము పెద్దదగును. 'తిరువాచక' మనుద్రావిడగ్రంథమును

వ్రాసినమణికవచుడు శ్రీనటరాజస్వామి అనుగ్రహముచే బౌద్ధ మతదూత నీక్షేత్రమున నోడించెను. 'అరుణమోలి దేవర' అను పంచమభక్తుడు 'పెరియపురాణ' మను ఉత్తమగ్రంథమును రచించిన దీస్వామికరుణచేత నే. 'తిరువరుత్పాయన్' ను, కోయిల్ పురాణమును, చిదంబర దేవాలయ చరిత్రను వ్రాసిన ఉపపతి శివాచారియు చిదంబరవాసి యే. అనపాయ చోలుడను రాజు వైరాగ్యముతో తనజీవిత శేషమును చిదంబర దేవాలయమున గడపెను. ఆయనగౌరవార్థము చిదంబర 'కొళము'న కుత్తరపువైపున 'జ్ఞానవాపి' యను చిన్న దేవాలయమును నిర్మించిరి. దీనిని నేటికిని చూడనగును. ఇట్లెందరో రాజులు, భక్తులు, యోగులు, పండితులు ఈస్వామిఅనుగ్రహమునకు పాత్రులై సిద్ధిపొందినట్లు చరిత్రలు గలవు

ఈ దేవాలయము రెండునదులమధ్య గలమైదానములో నిర్మించబడినది. ఇది అద్భుతమైనకళాసృష్టి. చుట్టుపట్ల 40 మైళ్ళలో నిర్మాణానికుపయోగపడునల్లరాయి లేకపోయినను ప్రాకారపు గోడలపైభాగ నల్లరాయి; లోపలిప్రాకారపు నేల యంతయు రాయి ; ద్వారములన్నియు రాతిమయమే. వెయ్యిస్తంభములమంటపము మొదలైనవాని కుపయోగించిన రాయి యెచ్చటనుండి తేబడినదో యూహింపరాదు. లోపలి ఆలయము 10, 11 శతాబ్దములలో నిర్మించబడినది తూర్పు గోపురము మాత్రము సుందరపాండ్యునిచే క్రీ. శ. 1250 లో నిర్మించబడినది. పార్వతీదేవాలయము 14, 15 శతాబ్దము

లకు చెందినదై యుండవచ్చును. ఉత్తరపుగాలిగోపురము క్రీ. శ 1520 లో శ్రీకృష్ణదేవరాయలచే నిర్మించబడినది.

తిల్లైఅమ్మన్ దేవస్థానము :- ఇది యీ దేవాలయమున కీశాన్యముగ ½ మై. దూరములో నున్నది. నటరాజస్వామి వారి అమ్మవారి దేవస్థానము తప్పక దర్శింపదగినది.

అర్చనలు :- అష్టోత్తరము రూ. 1-4-0, సహస్ర నామము రూ 3-8-0, అభిషేకము రూ. 5-4-0, చిదంబర రహస్యము రూ. 1-4-0.

అన్నామలై విశ్వవిద్యాలయము :- ఇది చిదంబరము రైల్వే స్టేషను కు 5 ఫర్లాంగులదూరములో నున్నది. ఇది శ్రీరాజా అన్నామలై చెట్టియార్ గారి ద్రవ్యసహాయముతో నెలకొల్పబడినది. ఇచట చక్కనినగరము నిర్మింపబడినది. అందమైన తారురోడ్లు, విద్యుద్దీపములు, అనేక నవీనభవనములతో విరాజిల్లుచున్నది. ఇందు ముఖ్యముగ చూడదగినవి. యూనివర్సిటీలైబ్రరీహాలు, శ్రీనివాస్ లెక్చర్ హాలు, (ఇది అంతయు విశాలముగ చలువరాతితో కట్టబడినది. దీని కెదురుగ నుండు విశాలమైన భవనములలో క్లాసులయేర్పాటు, దీనికి కుడిప్రక్క విద్యార్థులభోజనశాల, దానికి వెనుకవైపు అధ్యాపకులగృహములు, దీని కీ శా న్య ము గ నొకచిన్న గ్రామము, అందొక అందమైనశిల్పముతో చెక్కబడినదేవాలయము, పోస్టాఫీసును గలిగి నవీననగరములలో నొకటివలె గాన్పించును.

## తిరుచ్చిత్రకూటము

ఇది 26వ దివ్యదేశము. శ్రీగోవిందరాజపెరుమాళ్లు, పుండరీకవల్లితాయారు, సాత్వికవిమానము, భోగశయనము, దేవతలు కొలువుంచబడినక్షేత్రము. కుల, తిరుమంగయాళ్వార్లు మంగళాశాసనము.

ఇది చిదంబరదేవాలయములో శివాలయములో నున్నది.

ఇచ్చటనుండి 24 మై. దూరములో అష్టస్వయంవ్యక్తములలో చేరినశ్రీముష్ణ మున్నది. సాలగ్రామశిల యందురు. స్వామి వరాహరూపి. పురుషాకారముగ సేవ. 16 మై. దూరములో కాట్టుమన్నారు కోవిలయు నున్నవి బస్సులు గలవు.

## షి. యా ళి

ఇది చిదంబరమునుండి 11 మై. 0-6-0 చార్జి. భోజన వసతులు గలవు. దీనినే బ్రహ్మపుర మందురు. ఇది కలియుగమున గొప్పవ్యక్తులైన 'తిరుజ్ఞాన సంబంధర్'వారిజన్మస్థానము. వీరినే ఆదిశంకరులు తమసౌందర్యలహరిలో 'ద్రవిడశిశువు' అని కీర్తించిరి. ఇచ్చటి శివాలయ, విష్ణ్వాలయములు చూడదగినవి. సత్రములు, భోజనశాలలు, బండ్లు మొదలగు అన్ని సౌకర్యములు గలవు. పెద్దపట్టణము.

☞ ఇచటినుండి తిరువాంగూర్ 11 దివ్యదేశములను దర్శింపదగును.

## తిరువాంగూర్

ఇది 27వ దివ్యదేశము. షియాళిస్టేషనునుండి 7 మై. బస్సు గలదు. బండ్లును గలవు. బండికి 1-8-0 తీసికొందురు.

ఇచ్చటనే 6 దివ్యదేశములు గలవు. ముందుగ చెప్పినచో దేవాలయములో ప్రసాదము లభించును. నందవిళక్కుపెరుమాళ్లు, నరనారాయణులు, పుండరీకవల్లి నాయ్చ్చియార్, ప్రణవ విమానము. ఇంద్రపుష్కరిణి, కూర్చున్న స్వామి. ఇచ్చట సత్రము గలదు. పదార్థములు దొరకవు. ఇచ్చట మాఘ శుక్లవిదియనాడు 12 గరుడసేవలు మహావైభవముగ జరుగును.

## తిరువైకుంఠవిణ్ణగరం

ఇది 28వ దివ్యదేశము. ఇది తిరునాంగూరుకు ½ మై. దూరములో నున్నది. వైకుంఠనాథులు, తామరక్కణ్ణుడైయపిరాన్, వైకుంఠవల్లినాంచియార్, ఆనందవర్ధకవిమానము, లక్ష్మీపుష్కరిణి, విరజా, కూర్చున్న స్వామి, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

## వణ్ పురుషోత్తమమ్

ఇది 29వ దివ్యదేశము. తిరునాంగూరులో నున్న 6దివ్యదేశములలో నొకటి. పురుషోత్తమపెరుమాళ్, అమృతవల్లి నాయ్చ్చియార్, పంచగ్రహావిమానము, తిరుప్పాఱ్కడల్ తీర్థము, నిలుచున్న స్వామి.

## శెంబోయ్‌కోయిల్

ఇది 30వ దివ్యదేశము. ఇదియు తిరునాంగూరులోనే యున్నది. పేరరుళాళప్పెరుమాళ్, అల్లిమామలర్ నాయ్చ్చియార్, నిత్యవిమానం. కనకతీర్థం, నిలుచున్న స్వామి, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

## తిరుత్తెత్తియంబలం

ఇది 31వ దివ్యదేశము. ఇదియు తిరునాంగూరులో నున్నది. శంగణ్ మాల్, శెంగమలవల్లి నాంచియార్, వేద విమానం, సూర్యపుష్కరిణి, భుజంగశయనం, తిరుమంగ యాళ్వారు మంగళాశాసనము.

## అరిమేయవిణ్ణగరం

ఇది 32వ దివ్యదేశము ఇది తిరునాంగూరు మణిమాణ కోయిలకు 200 గజములదూరములో గలదు. కుడమాడ క్కూత్తపెరుమాళ్, అమృతఘటవల్లి నాయ్చ్చియార్, ఉచ్చ శృంగవిమానము, కోటితీర్థం, కూర్చున్న స్వామి.

## కిళైచ్చాలై

ఇది 33వ దివ్యదేశము. ఇటకు తిరునాంగూరు చేనిగట్ల మీదుగా 1 మై. దూరము పోవలెను. దైవనాయప్పెరుమాళ్, కడళమహాళ్ నాయ్చ్చియార్, శోభనవిమానం, శోభనపుష్క రిణి, నిలుచున్న స్వామి.

## తిరువెళ్ళికుళ్ళం

ఇది 34వ దివ్యదేశము. ఇది తిరునాంగూరునుండి 1½ మై. దూరములో నుండును. కణ్ణన్, నారాయణులు, పూవార్ తిరుమకళనాయ్చ్చియార్, తత్త్వవిమానము, వెళ్ళ క్కుళతీర్థం, నిలుచున్న స్వామి, తిరుమంగయాళ్వార్ల ధర్మపత్ని యీ క్షేత్రమునందు గల 'వెళ్ళక్కుళ' కోనేటియందు జన్మిం చినదని చెప్పుదురు.

## తిరువాలి, తిరునగరి

ఇది 34వ దివ్యదేశమునుండి 3 మై. ఇవి రెండును కలసి 35వ దివ్యదేశము. రామానుజకూట మున్నది. సన్నిధిలో ప్రసాదము లభించును.

వయలాలిమణవాళన్ స్వామి, అమృతఘటవల్లినాయ్చ్చియార్, శ్రీమదష్టాక్షరవిమానము, అలాతనీపుష్కరిణి, కూర్చున్న స్వామి, తిరువాలినుండి తిరునగరికి 2 మై. దూరము.

## కురకూర్ లేక మంగైమఠము

ఇది తిరునగరినుండి 12 మై. తిరుమంగయాళ్వారుల జన్మస్థానము.

## కావళంబాడి

ఇది 36వ దివ్యదేశము. ఇది మంగైమఠమునుండి 2 ఫర్లాంగు లుండును. గోపాలకృష్ణుడు (స్వామి) మడవరల్ మంగై నాయ్చ్చియార్, వేదామోదవిమానం, నిలుచున్న స్వామి.

## తిరుమాణిక్కూడం

37వ దివ్యదేశము. ఇది 36వ దివ్యదేశమునకు దక్షిణముగా 3 మై. దూరము. మాణిక్కూడనాయకులు, తిరుమామగళ్ నాంచారు, కనకవిమానము, చంద్రపుష్కరిణి, నాంగూరుకు 1 మై. దూరము.

## తిరుప్పార్తన్పళ్లి

ఇది 38వ దివ్యదేశము. ఇది తిరునాంగూరుకు దక్షిణముగా 2 మై. దూరమున నున్నది. కేశవపెరుమాళ్, తామరైనాయకి, నారాయణవిమానము, శంఖసరస్సు.

## శ్రీరామవిణ్ణగరమ్

ఇది 39వ దివ్యదేశము. ఇది షియాళిస్టేషనుకు ½ మై. దూరము. అన్ని వసతులు గలవు. తాడాళన్ స్వామి, త్రివిక్రమ మూర్తి. మట్టవిళుంకుళలినాయ్చ్చియార్, చక్రతీర్థం, నిలుచున్న స్వామి.

## తలైచ్చంగాడు

ఇది 40వ దివ్యదేశము. ఇది షియాళిస్టేషనునుండి ఆగ్నేయముగా 16 మై. దూరము. చక్కనిరోడ్డు గలదు. లేక ఆక్కూరుస్టేషనుకు 2 మై. నాణ్ మదియ ప్పెరుమాళ్, వేణ్ శుడర్ పెరుమాళ్, తలచ్చంగైనాయ్చ్చియార్, శెంగమలవల్లితాయార్, చంద్రవిమానము, చంద్రపుష్కరిణి, నిలుచున్న స్వామి.

## మాయవరం

కావేరీతీరము. ఇది షియాళిస్టేషనునుండి 12 మై. 0-7-0 రైలు చార్జీ. ఇది తంజావూరుజిల్లాలో మాయవరం తాలూకాకు ముఖ్యపట్టణము. 28,617 జనసంఖ్య గలపట్టణము. మాయవరం - ట్రాంకోబార్ లైనులో నున్న శాన్ స్టేషనులో దిగిన శివాలయము సమీపము. స్టేషనులోనికే దేవా

లయ గోపురములు కనిపించును. ఈ దేవాలయములోని ప్రాకార శిల్పము చిదంబర దేవాలయపు 4వ ప్రాకారములోని శిల్పమును పోలియుండును. శిల్పము ముఖ్యముగ చూడదగినది. దాదాపు 1½ మై. దూరములో విష్ణ్వాలయము గలదు.

## కొర్నాడు

ఇది జంక్షన్ స్టేషనుకు 1 మై. దూర ముండును. ఇచ్చట పట్టుచీరెలనేత యెక్కువ. ఈచీరెలు గట్టిగ నుండుట ప్రసిద్ధి. కొర్నాడుచీరె లందురు. ఇచ్చట అక్టోబరు నెలలో జరుగుచున్న సమునకు దాదాపు 80 వేలయాత్రికులు వచ్చెదరు.

## తిరువళందూర్

ఇది 41వ దివ్యదేశము. మాయవరం స్టేషను కుత్తర ముగా 3½ మై. దూరములో నున్నది. అన్ని వసతులు గలవు. సుగంధవననాధుడు, చంద్రశాపవిమోచననాచ్చియార్, వేద చక్రవిమానము.

## తేరళందూర్

ఇది 43వ దివ్యదేశము. మాయవరమునుండి 6 మై. దూరములో నున్నకుత్తాళం స్టేషనులో దిగిన (చార్జీ 0-4-0) ఆగ్నేయముగా 3½ మైళ్ళదూర ముండును. సత్రములు బండ్లు గలవు. క్షేత్రమున స్వామిప్రసాదము లభ్య మగును. కుత్తా ళముస్టేషనులో భోజనశాలలు, బండ్లు, సత్రములు గలవు.

ఆమరవియప్పన్. శెంగమలవల్లితాయార్, గరుడ విమానము, దర్శపుష్కరిణి, నిలుచున్నస్వామి, ద్రావిడకవు

లలో గొప్పవాడయినకంబకవిజన్మస్థాన మిదియే. ఈయూరికి కంబర్ మేడని పేరు గలదు. పూర్వ ముపరిచరవసువుయొక్క ఆకాశవిమానము ఋషులశాపముచే నీదేవాలయముయొక్క గుంటలో పడి అణిగిపోయినందున నీయూరికి తేరళుందూరని పేరు గలిగెను.

## తిరువడమారుదూర్

ఇది కుత్తాళమునుండి 9 మై. అ. 0-5-0 రైలు చార్జి. ఈ స్టేషనుసమీపములో గొప్పశివాలయము కలదు. ఇచ్చట నొక యతీశ్వరునిచే స్థాపింపబడినయొకమఠము గలదు. ఈ యతీశ్వరునికి దేశ మంతటను శిష్యవర్గము గలదు. ఈ మఠమునకు గొప్పస్థితి గలదు.

## సారక్షేత్రము

ఇది 43వ దివ్యదేశము. ఇది కుత్తాళముస్టేషనునుండి 11 మై. దూరములో నున్న 'తిరునాగేశ్వరం' అనుస్టేషనులో దిగవలెను. చార్జి 0-6-0. ఇది స్టేషనునుండి 4 మై. బండ్లు గలవు. స్వామిప్రసాదము లభ్యమగును సారనాథపెరుమాళ్లు, సారనాయకితాయారు అమ్మవారు. తిరుమంగైయాళ్వారుల మంగళాశాసనము

## తిరువెళ్ళియంగుడి

ఇది 44వ దివ్యదేశము ఇది తిరువడమరుదూరుస్టేషను కుత్తరముగా 5 మై. దూరము. కోలవల్లిరాములు, మరకతవల్లితాయారు, బ్రహ్మతీర్థము, తిరుమంగైయాళ్వారులమంగళా

శాసనము ఈ స్వామిని సేవించిన 106 పెరుమాళ్ళను సేవించి నంతటిఫలము కలుగును. కావుననే యిచ్చట గరుడాళ్వారు శంఖచక్రములతో సేవ సాయించెదరు.

## కుంభకోణము

తిరునాగేశ్వరమునుండి 3 మైళ్ళు 0-2-0 చార్జీ. ఇది అరసలార్ కావేరీనదులమధ్య నున్నది 92 వేలజనాభా గల మ్యూనిసిపల్ పట్టణము. తంజావూరుజిల్లాలో కుంభకోణము తాలూకాకు ముఖ్యపట్టణము. దేవాలయములు, స్టేషనునుండి ఒకమైలుదూర ముండును. ఇది 3 మై. పొడవు, 1½ మై. వెడల్పు గలిగియున్నది 7వ శతాబ్దమున దీనిని చోళరాజులు ముఖ్యపట్టణముగ పరిగణించిరి. దీనినే ఆంగ్లేయులు 'Oxford of Southern India' అని అందురు. ఇందు దాదాపు 40 దేవాలయములు గలవు. అన్నియు ముఖ్యములే. అందతి ముఖ్యమైనవి 12 శివాలయములు, 4 విష్ణ్వాలయాలు, బ్రహ్మ దేవాలయము. 'మహామాఘం' అనుకోళను యావద్భారత దేశమున ప్రసిద్ధిచెందినది. కుంభకోణమునకు 5 మై. దూర ములో ప్రసిద్ధిచెందిన దేవాలయము లనేకములు గలవు.

వసతులు:- పట్టణమునిండ అనేకసత్రములు గలవు. రైల్వేస్టేషను నానుకొని పెద్దసత్రము గలదు. అనేకభోజన శాలలు గలవు. స్టేషనుకుత్తరముగా 1 మై. దూరములో రహ దారిబంగళా గలదు. కొన్నిసత్రములలో బ్రాహ్మణులకు భోజ నము, బైరాగులకు సదావర్తి యిచ్చెదరు. బ్రాహ్మణులకు శ్రీశంకరాచార్యులవారిమఠము (కామకోటిపీఠము) నందును,

సారంగపాణి దేవాలయమునందును, చక్రపాణి దేవాలయము నందును, భోజనము పెట్టెదరు. స్టేషనుకడ బండ్లు, టాక్సీలు, దొరకును. స్టేషనుకు సమీపములో సత్రము లనేకము గలవు.

ఉత్సవములు:- సారంగపాణి, కుంభేశ్వరస్వామి, చక్రపాణి, రామస్వామి దేవాలయములలో సామాన్యముగ ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ నెలలలో బ్రహ్మోత్సవములు జరుగును. ప్రతి 12 సం॥ లకు 'మహామాఘి' ఉత్సవము జరుగును. అందు స్నానముచేయుటకు భారత దేశమునలుమూలలనుండి దాదాపు 10 లక్షల యాత్రికులు వచ్చెదరు. 1956 లో ఫిబ్రవరిలో ఈ మహామాఘి జరిగినది. ప్రతి నెల యుత్సవములు జరుగుచుండును. మాఘ, సప్తస్థానోత్సవములు ముఖ్యమైనవి. మాఘోత్సవమునకు దాదాపు 1 లక్షయాత్రికులు వత్తురు.

సారంగపాణి దేవాలయము :- ఇది 45వ దివ్య దేశము. సారంగపాణిపెరుమాళ్, 'ఆ రా వ ము త న్' కోమలవల్లి తాయార్లు, వేదవిమానము, హేమపుష్కరిణి ఉద్యోగశయనము (ప్రక్కనుంచి లేచుచున్న స్వామి) ఆళ్వారులమంగళాశాసనము. ఇది కుంభకోణపట్టణమున మధ్యభాగమున గలదు. దీనిని నాయకప్రభువులు నిర్మించిరి. ఈ దేవాలయసింహ ద్వారముపై నున్నగాలిగోపురము 12 అంతస్తులు కలిగి దాదాపు 160 అడుగుల ఎత్తున నున్నది. శిల్పనైపుణ్యములో అనేకవిగ్రహములు గోపురమంతట చెక్కబడియున్నవి. ఇతర ద్వారములపై చిన్నగోపురములైదు గలవు. రెండు గొప్ప రథములు గలవు. అందొకటి ఈ జిల్లాలోకెల్ల గొప్పది. వసంత

మంటపము చూడదగినది. వాహనములు వెండితో చాలనిపు ణతతో చేయబడినవి.

కుంభేశ్వరస్వామి ఆలయము :- ఇది శివాలయము. కుంభేశ్వరస్వామి, అమ్మవారు మంగళాంబిక. ఇట అష్టవిధ లక్ష్మీరూపములు గలవు. (ఆది, వీర, విజయ, గజ, ధాన్య, ధన, సంతాన, సౌభాగ్యలక్ష్మీరూపములు.) దేవాలయము లోనికి వెళ్లుటకు ముందు 330 అడుగుల పొడవు 15 అడుగుల వెడల్పును గల యొకహాలునుండి పోవలెను ఈ హాలులో రెండువైపుల పెద్దదుకాణములు గలవు. ఈ దేవాలయగోపు రము 10 అంతస్తులుగలిగి 127 అడుగుల యెత్తున కట్టబడినది. కుంభేశ్వరుని 'పానువట్టము' చతుర్భుజాకారముగ నుండును. అమృతకలశము (ఘటము) యొక్క పగిలినభాగముల నొక పేటికయం దుంచినట్లు మనగ్రంథములవలన తెలియుచున్నది. లింగోపరిభాగము కుండమూతిని బోలియుండును. ఈరూపము మరెచ్చటను గానరాదు. ఈ లింగమును తాకిన నునుపుగ నుండును ఈ లింగమునకు అభిషేకాదులు నేటికిని జరుగవు; గాని పునుగు వగైరా సుగంధపదార్థలేపనము జరుగును. పానువట్టమునకే పలువిధములైన అభిషేకాదులు గావింతురు. అనేక వాహనములు గలవు. దేవాలయముముందు 5 రథ ములు గలవు. అర్చనకు 0-2-0 చెల్లించవలెను. ప్రత్యేక భోగము 1-0-0 నుండి శక్తికొలది చేయించవచ్చును ఆభరణ ములతో అలంకారసేవకు 1-0-0 చెల్లించవలెను. దేవాలయ

చరిత్రను తెలుపుపుస్తకము అరవలిపిలో దేవస్థానఆఫీసులో 0-2-0 కు లభించును

రామస్వామి దేవాలయము :- ఇదికూడ పై దేవాలయమునకు సమీపమున నున్నది. ఇందు శ్రీకోదండరామస్వామి, సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు, హనుమంతుడు నిలుచుండి సేవ యిచ్చుచున్నారు. వెండికిరీటములతో చూచుటకానందము గలిగించుచు. భక్తులహృదయముల నాకర్షించుచుండును. 'రఘునాథ'అను తంజావూరు ప్రభువుదరసురామునొద్ద 16వ శతాబ్దమున చెరువును త్రవ్వించుచుండ అందుపై మూలవిరాటు దొరకినట్లు చెప్పుదురు. మంటపములలో చెక్కబడిన స్తంభముపై రాజుయొక్క విగ్రహముగూడ చెక్కబడినది కుంభకోణదేవాలయములో శిల్పవైభవము లేనిలోటు నీదేవాలయమంటపములు పూర్తిగ తీర్చినవి. స్తంభములపై దశావతారములు రామాయణగాథలు చెక్కబడియున్నవి ప్రతిస్తంభము ఒకేశిలనుండి చెక్కబడినది. గర్భాలయముచుట్టు కొంతఖాళీస్థలము వదలి ఆవల నొకప్రత్యేకమంటపముచుట్టును నిర్మింపబడియున్నది. ఈమంటపముగోడల మీద రామాయణమంతయు కడుచిత్రముగ చిత్రింపబడినది.

చక్రపాణిదేవాలయము :- చక్రపాణిస్వామి, విజయవల్లితాయారు. స్వామివారిచేతిలో నుండుసుదర్శనము చూడదగినది. మాఘమాసములో బ్రహ్మోత్సవము జరుగును.

నాగేశ్వరస్వామిదేవాలయము :- ఇదియు పెద్దదేవాలయము. ఇందు నటరాజమంటపము చూడదగినది. ఈమంటు

పమునకు రెండువైపుల పెద్దరాతిచక్రములు చక్కని పనితనముతో చెక్కబడి యీ మంటపమునకు తగిలించబడి, ముందర చక్కని శిల్పనైపుణ్యముతో చెక్కబడినగుఱ్ఱము లీరథమును (మంటపమును) లాగుచున్నట్లమర్చబడియున్నది ఇందు లింగము చాలచిన్నదిగ నుండును. సంవత్సరములో 3 సార్లు సూర్యకిరణములు నేరుగ మూలవరులున్న గర్భాలయముపై బడునట్లు గోపురమున గవాక్షములు అమర్చబడినవి. అనగా సూర్యుడు ఆరాధించున నెడిభావము స్ఫురించును.

కామకోటిపీఠము : ఈమఠము కావేరీతీరమున నున్నది. అద్వైతమతాచార్యులగు శ్రీశంకరభగవత్పాదులవారి మతసంప్రదాయమును భారతదేశములో నలుమూలల ప్రచారార్థము స్థాపించిన మఠములలో కామకోటిపీఠ మొకటి. ఇది కంచిలో స్థాపింపబడినను 1743 లో తంజావూరు మహారాజావారి ప్రత్యేక విజ్ఞాపనము ననుసరించి కుంభకోణమునకు మార్చబడినది.

శ్రీ శ్రీ శ్రీ కామకోటిపీఠాధిపతులు



ఇచ్చటి గ్రంథాలయమున అమూల్యమైన సంస్కృతగ్రంథములు గలవు. ఇటీవల సిద్ధినొందిన 'మౌనపరదేశి' అను స్వామి గౌరవార్థము నిర్మించినమఠమును దర్శనీయము. ఆయన ఆజన్మమౌనిగా నుండెనట.

మహామాఘము లేక మాఘకోళం:- ఇది దక్షిణదేశములో గలకోనేళ్లలోనికెల్ల మహాపవిత్రమైనది. దీనివిస్తీర్ణము 20 యకరములు. నాల్గువైపుల చక్కనిమెట్లు గలిగి పైమెట్టు మీద చుట్టును 16 మంటపములను కలిగియున్నది.

ప్రతి సం॥రము మాఘమాసములో నిందు స్నానము ప్రధానము. 12 సం॥ కొకపర్యాయము మహామాఘి యుత్సవము జరుగును. గతమహామాఘిఉత్సవము 1956 ఫిబ్రవరి 26 తేదీన జరిగెను. మహామాఘియనగా ఉత్తరదేశమున కుంభమేళామాదిరిగను, 12 సం॥ల కొకసారి మహానదులలో పుష్కరములయందు నదులపొడవున స్నానముచేయురీతిగ నీమాఘకుళోత్సవము (కుంభకోణములో) బృహస్పతి, సింహరాశిలో చేరినప్పు డీమహామాఘుస్నానము ప్రసిద్ధి. గత స్నానమునకు దాదాపు 10 లక్షలయాత్రికులు భారతదేశము నలుమూలలనుండి వచ్చియుండిరి.

ఈస్నానదినములలో నిటకనేకులు రాజులుకూడ వచ్చినట్లు శాసనములు గలవు. 'నగలపుర'మం దున్న శాసనమును బట్టి చూడ శ్రీకృష్ణదేవరాయలుకూడ ఆపవిత్రమైనదినమున స్నానముకావించినట్లు గలదు. కృష్ణదేవరాయలతరువాత రాజ్యమునకు వచ్చిన అచ్యుతదేవరాయలు తులాభారము

తూగినట్లును. ఆధనమును బ్రాహ్మణులకు, గొప్పగొప్ప పండితు లకు వచ్చినట్లును, ఈకోనేటిగట్టుననున్న 16 స్తంభముల మంటపముపై కప్పునందు చెక్కబడియున్నది.

కుంభకోణమున బ్రహ్మదేవాలయము కలదు. అడిగి తెలిసికొని దర్శింపవలెను ఇట్టిబ్రహ్మదేవాలయములు కొద్ది ప్రదేశములలోమాత్రమే గలవు.

తయారగువస్తువులు:- ఈపట్టణము పట్టు, లేసు, వస్త్ర ములకు, సీమసున్నముకోవులకు, రాగి, యిత్తడి, కంచు సామానులచేతకు ప్రసిద్ధి. ఇచ్చట వరి, కొబ్బరికాయలు, తమలపాకులు, అరటిపండ్లు, ముఖ్యమైనపంటలు.

## దరసురామ్

ఇది కుంభకోణమునకు 2 మై. దూరమున గలదు. స్వామిపేరు ఐరావతేశ్వరుడు. ఈస్వామి రాక్షసుని శాప ముచే శరీరతాపముతో బాధపడుచున్న యముని బాధనివారించె నట. ఏకోలనులో స్నానమాచరించుటచేత యమునిశరీర కంపము పోయెనో ఆకోలనుకు 'యమతీర్థ'మని నేటికిని పేరు గలదు. ఈకోలనుకు కావేరినుండి శుద్ధజలము వచ్చును. ఇది 228 అడుగుల వెడల్పు గల్గి యాత్రికుల నాకర్షించును. ఇచ్చటిశిల్పములు దర్శనీయములు.

## తిరు ఆదనూరు

ఇది 46వ దివ్యదేశము. స్వామిమలైస్టేషనునుండి 1 మై. కాలిదారి, బండ్లదారి 4 మై. ఉండును. చిన్న

గ్రామము. సత్రము లేదు. వస్తువులు దొరకవు. దీనినే వడమాలసన్నిధి యందురు. ఆండళక్కు మెయ్యన్, శ్రీ రంగ నాయకితాయార్ (అమ్మవారు), ప్రణవవిమానము, సూర్య పుష్కరిణి, శేషశాయి.

## తిరుప్పుంబూదంగుడి

ఇది 47 వ దివ్యదేశము. ఇచ్చట సేవసతియు లేదు. ఇది పైస్టేషనుకు 2 మై. దూరములో నున్నది. వల్ విలిరాములు. పొత్తామరై నాంచియార్. శోభనవిమానము. గృధ్రతీర్థము. జటాయువునకు శ్రీరాముడు మోక్ష మిచ్చినస్థలము. ఇది అహోబిలమఠముక్రింద నున్నది.

## ఉప్పిలియప్పన్‌సన్నిధి

ఇది 48వ దివ్యదేశము. ఇది కుంభకోణముస్టేషనుకు తూర్పుగా 3 మై. దూరము. సత్రి మున్నది భోజనశాలలు లేవు. ఇది తంజావూరుజిల్లాలో 'తిరుపతి'వలె వెలయుచున్నది. ఇచ్చటికి ప్రతినిత్యము వందలకొలది యాత్రికులు వచ్చుచుందురు. ఇచ్చటను మొక్కుబడులు చెల్లించుట, వెండ్రుకలు తీయించుట జరుగును.

ఈ దేవాలయములోనికి తినుటకు ఉప్పు నెవరు తీసికొని వెళ్లరు. స్థలచరిత్ర ననుసరించి స్వామికిని నేటికిని ఉప్పు లేని ఆహారమునే నివేదించెదరు. ఉప్పు మొక్కులు తీర్చు నాచారము గలదు.

## నాచ్చియారుకోవెల (సుగంధగిరి)

ఇది 49వ దివ్యదేశము. ఇది కుంభకోణమునకు 6 మై. దూరము. అన్నివసతులు గలవు. నంబి, నంబిక్కై నాంచియార్, శ్రీనివాసవిమానము, మణిముక్తానది, నిలుచున్న స్వామి. స్వామికి కిరీటము లేకుండుటకును నదికి అట్టిపేరు గల్గుటకును చిత్రగాథ గలదు.

ఈ క్షేత్రమునందు రాతిగరుడవాహన మున్నది. ఇట్టి వాహనము మరెచ్చటను లేదు. ఈ రాతివాహనముమీదనే ముక్కోటియేకాదశిదినమున బ్రహ్మోత్సవము కాలమున 32 మంది బ్రాహ్మణులీవాహనమును తెచ్చి ఉత్సవముజరుపుదురు. వాసుదేవ, సంకర్షణ, అనిరుద్ధ ప్రద్యుమ్నవ్యూహ చతుష్టయముతో సేవయొసంగుచున్నారు.

## నాథన్‌కోయిల్

ఇది 50వ దివ్యదేశము. ఇది 49వ దివ్యదేశమునకు 3 మైె దూరములో నున్నది. భోజనవసతులు లేవు. విణ్ణగర ప్పెరుమాళ్, జగన్నాథులు, నాథనాథపెరుమాళ్లు, చంపకవల్లి తాయారు, మందారవిమానము, నందితీర్థము.

## కపిస్థలము

ఇది 51వ దివ్యదేశము. ఇది పాపనాశనముస్టేషనుకు 2మైె. దూరములో నున్నది. దారిలో రెండు, మూడునదులు దాటవలెను. క్షేత్రమున ప్రసాదము లభ్యమగును. వర్షా కాలమున నీనదులను పడవలమీద దాట నగును.

గజేంద్రవరదులు. రమామణినాంచారు, పొత్తామ్రై యాళ్ నాంచార్, గఘనాకృతివిమానము గజేంద్రపుష్కరిణి, కపిలతీర్థము.

### కూడలూరు

ఇది 52వ దివ్యదేశము. అయ్యంపేటస్టేషనుకు ఆరుఫర్లాంగులదూరము. ప్రసాదము లభ్యమగును వైయంకాత్తపెరుమాళ్ళు, పద్మాసనవల్లినాంచియార్, శుద్ధసత్వవిమానము, చక్రతీర్థము వసతులు తక్కువ.

### తంజావూరు

ఇది కుంభకోణమునుండి 24 మైం. 0-13-0 చార్జి. దారిలో దివ్యదేశములకు సంబంధించినస్టేషనులలో దిగుచు తంజావూరు రావలెను. ఇది కూడలిస్టేషను. తంజ అను రాక్షసుని సంహరించినస్థలము గనుక తంజావూరని పేరు కలిగెనట. ఇది 66,889 జనసంఖ్య గలపట్టణము జిల్లాకు ముఖ్యపట్టణము. దీనిని 'The granary of the East' అని అందురు. (తూర్పుకుధాన్యపురాశి) అనగా పంటలు విశేషమని అర్థము.

తంజావూరు క్రీ. శ. 900 – 1150 వరకు చోళవంశరాజులపరిపాలనలో నుండిన చివరముఖ్యపట్టణము. ఆతరువాత విజయనగరరాజులపరిపాలనక్రింద నాయక్ గవర్నరుచేత పాలింపబడెను. 1656-1675 లో మహారాష్ట్రులచేత జిక్కెను. వారినుండి 1779 లో బ్రిటిషువారు పొందిరి. 1855 శివాజీ మరణాంతమున బ్రిటిషుగవర్నమెంటులోనికి వచ్చెను. తంజా

పూరుపరిభువు రాజకీయముగను. వైజ్ఞానికముగను, ఆధ్యాత్మికముగను దక్షిణభారతమున ప్రసిద్ధిగాంచిరి.

వసతులు:- ఇందనేకసత్రములు గలవు. భోజనశాలలు గలవు. స్టేషనునొద్ద రైల్వేవారివిశ్రాంతిగదులు గలవు. బండ్లు జట్కాలు మొదలగునన్ని వసతులు గలవు. చరిత్రాత్మకపట్టణమంతయు చూపు guides (మార్గదర్శకులు) స్టేషనునొద్దకే వత్తురు. వారు రూ.1-0-0 మొదలు 2/- వరకు అడుగుదురు. ఇచ్చటినుండి పుదుకోట 36మై. తిరువాడి 7మై బస్సులు పోవుచుండును.

బృహదీశ్వరాలయము - తంజావూరు



చూడదగినది:- బృహదీశ్వరాలయము. ఈయాలయము రాజరాజచోళునికాలమున నిర్మింపబడెను. స్వామి బృహదీశ్వరుడు అమ్మవారు బృహన్నాయకి ఇది కోటలోనున్న దేవాలయము. కోటకు 15 అ. ఎత్తున గోడయు, దానిముందరచుట్టు

3 మై. పొడవున 15 అ. లోతుగల కందకమును కలవు. కోటకు సమీపమున కావేరీనదినుండి పంటకాలువ ప్రవహించుచున్నది. బృహదీశ్వరాలయము 13వ శతాబ్దిచివరభాగములో రాజరాజచోళుడు కట్టించినట్లు చెప్పుదురు. ఈ దేవాలయ శిల్పము, గోపురనిర్మాణము ప్రపంచమం దంతటను ప్రసిద్ధి పొందియున్నవి. ఈ దేవాలయముపై విమానము గోపురము వలె 216 అడుగుల ఎత్తున కట్టబడినది. ప్రథమప్రాకారముపై గోపురము చిన్నదిగను గర్భాలయముపై విమానమే గాలి గోపురముగ నింతయెత్తున కట్టబడినగోపురములు దక్షిణదేశమున కొద్దిచోట్లమాత్రమే గలవు. (అట్టివి గంగయికొండ, చోలాపురము, తిరుభువనము, దరసురాం) ఇవియు తంజావూరు ప్రాంతముననే. దీనిప్రధానభాగము 190 అ. పొడ వున్నది. 180 అడుగులవరకు సాధారణముగా నుండి సూచీముఖమైన గోపురమువలె పైకి నిర్మించిరి. అది ఆద్యంతము నిర్దుష్టమైన విధానములో నిర్మించబడినది. ఈ విమానము భారతీయ శిల్పకళకు గీటురాయి యనక తప్పదు.

గోపురముపై అంతస్తుమీద నాలుగువైపుల 6అ. × 4 అ. నందులు నల్లరాతిలో చెక్కి స్థాపింపబడినవి. గోపురోపరిభాగమున కలశమునకుగాను 25½ చదరపుఅడుగుల ఏకాండపురాతిలో తొలువబడి అమర్చబడియున్నది. ఇది దాదాపు 80 టన్నులబరు వుండునని అంచనా వేయబడినది. ఇంతగొప్ప బరువు గలరాయి ఆకాలములో అంతయెత్తున కెట్లు గొంపోబడినదో వినుటకు గూడ చిత్రముగా నుండును.

ఈ గొప్ప కలశమును దేవాలయమునకు దాదాపు 4 మై. దూరమున నుండు 'సరప్పళ్లం' అను గ్రామమునుండి ఏటవాలుగ 216 అ. యెత్తున నున్నశిఖరమువరకును మట్టితో మెరక వేసి ఆమెరకమీదుగా కూలీలచే దొర్లించుకొని వెళ్ళి నట్లుగా చెప్పెదరు. ఈగ్రామ మిప్పటికి నున్నది. ఈ దేవాలయమును నిర్మించినది కంజివరంవాస్తవ్యుడైన 'సామవర్మ' అను శిల్పియని దేవాలయముగోడలపై గలశాసనములు తెలుపుచున్నవి. దీనిని నిర్మించుటకు 12సంవత్సరములు పట్టెనని చెప్పెదరు. గోపుర మంతయు నల్లరాతితో కట్టిరి గోపురము మీద దక్షిణభాగమున దాదాపు సగమునకుపైన నొకదొర గారివిగ్రహము కనబడును. ఇదిచూడ అప్పుడు దేవాలయము కట్టుటకు వచ్చి దేశస్థుడైనశిల్పి సహాయముచేసియుండుటచే ఆయనజ్ఞాపకార్థ మాడచ్చిదొరవిగ్రహమును చెక్కి గోపురముమీద స్థాపించియుండవచ్చును. ఈకలశము, రాతిడోము యొక్కనీడ క్రిందపడదు. దీనిని గమనించదగును. గర్భాలయమున కుత్తరపువైపున స్వామికి అభిషేకోదకము వచ్చుట కొకపెద్దరాయి గొప్పశిల్పముతో చెక్కబడియున్నది. యాత్రికు లిందుండివచ్చుఅభిషేకోదకమును శిరస్సుపై చల్లుకొందురు.

ఆగ్నేయమూలలో ప్రాకారపుపంచ నానుకొని రెండు వినాయకవిగ్రహములు గలవు. ఒకటి రాతిమోత, రెండవది కంచు (లోహపు) మోత మ్రోగును. రాయియే యిట్టి మోతలు మ్రోగుట విచిత్రము. తూర్పుప్రాకారపుపంచ నడుమ 6½ అ. యెత్తుగలనంది గలదు. అది గోపురముపై

శిఖరముమీద 4 వైపుల పెట్టుటకు చేసినవానిలో నొకటి సరిగా లేనందున దానిని వదలి యింకొకటి చేసి గోపురముపై పెట్టిరి దీనివలన ఆనందులు దూరమునకు చిన్నవిగ కనుపించి నను విడిచిపెట్టిననందినిబట్టి చూచిన అవి యెంతపెద్దవో తెలియగలదు

గొప్పనంది :- ఈ దేవాలయము ముందర గొప్పనంది గలదు. ఇది 16 అ. పొడవు, 12 అ. ఎత్తు. అడ్డముగా 7 అ. గలిగి యేకాండపునల్లరాయిలో అందముగ చెక్కబడినది. ఇది 25 టన్నులబరు వున్నదని గణించిరి. ఈనందిని దాదాపు 400 మై. దూరమునుండి తెచ్చినట్లు చెప్పెదరు. దీనిపైవిచిత్ర మైనశిల్పము చూపబడినది. ఇది యద్దమువలె మెరయుటకు నూనె పూయుదురు. ఇంతపెద్దనంది భారతదేశములో కొద్ది చోట్ల చూడనగును ఈనంది దినదినము పెరుగుచుండుటచేత దానికై నిర్మించినమంటపము నెత్తు చాలకపోవుటచే దాని శిరస్సుపై మేకు కొట్టిరట. అప్పు డది పెరుగక యంతతో ఆగెనని చెప్పెదురు.

ఇచ్చట శైవ, వైష్ణవదేవాలయములు దాదాపు 50 గల వని చెప్పెదురు. బృహదీశ్వరాలయమునకుదక్షిణభాగముననొక వేపచెట్టుక్రింద నొకచిన్న మంటపముమాదిరిమందిర ముండును. దానిక్రింద నొకగొప్పఋషీశ్వరుని సమాధిచేసినట్లు చెప్పె దురు. బృహదీశ్వరాలయలింగప్రతిష్ఠ యైనతరువాత ఆలిం గము కదలుచుండగా నీఋషీశ్వరుడు దానిని కదలకుండచేసె

నట. అందువలననే ఆఋషీశ్వరుని సమాధియొద్దకు నేటికిని ప్రజలు వచ్చి నమస్కరించి భస్మము తీసికొని వెళ్లుచుందురు. అచ్చట నెప్పుడును ధూపము వేయుచుందురు.

108 లింగములు :- పై వేపచెట్టునకు వెనుక మంటపము మీద 108 శివలింగములు గలవు. దానితరువాత గోడలమీద దైవసంబంధ మైనలీలల చూపు 64 చిత్రములు చిత్రించబడి యున్నవి.

సుబ్రహ్మణ్యస్వామి దేవాలయము:- ఇది పై వేపచెట్టున కెడమనైపున నున్నది. ఈ దేవాలయము 55 అ. ఎత్తున్నది. దీనిక్రింది భాగము నలుచదరముగా నుండును. ఇది వెనుక పొడుగైన చావడిద్వారా తూర్పునగల మరొకమంటపముతో కలుప బడినది. ఈఆలయ మెల్లఖండములలోని శిల్పకళా చాతుర్యమున కాచార్యస్థానముగ నెన్నవచ్చును. ఈ దేవాలయమునుగూర్చి Mr. Fergusson says "As exquisite a piece of decorative architecture as is to be found in South India."

ఈమంటపమునందలి శిల్పసంపదకు చకితులయిన ఫెర్గూసన్‌గారు, 'ఈశోభాయమాన మగుమంటపము ఆభరణము చందమున దక్షిణాది శిల్పసంప్రదాయమునకు అలంకార మును గూర్చుచున్న'దనిరి.

ఈ దేవాలయముచుట్టును, గర్భాలయపు గోడలమీదను స్తంభములమాదిరిని గొప్పశిల్పనైపుణ్యముతో చెక్కబడినవి. ఈ దేవాలయశిల్పము స్పష్టముగను, విశదముగ నీదినమే శిల్పకారుడు తయారుచేసిపెట్టినట్లు (తాజ్ మహాల్ మాదిరిగా)

కనబడును. దీనిపైనున్న 55 అ. విమానము శిల్పముతో గుప్పింపబడినది. దీనిముందర నున్నచిన్నమంటపముగూడ చూడదగియున్నది.

ఈ దేవాలయ ప్రాకారమునకు పడమరగా 'శివవనము' (Siva garden) అనునొక పెద్దతోట గలదు. పూర్వపురాజులీతోటలోనికి షికారుగ వచ్చుచుండెడివారట. దీనిలో శివగంగ యనునొక పెద్దకోనేరు గలదు. పట్టణమున మ్యునిసిపల్ నీరు సప్లయి లేనప్పు డూరంతయు దీనినీరే వాడుకొనుచుండెడివారట. ఈకోటకు దక్షిణద్వారమునొద్ద 'అరసు' అనువృక్షము శాఖోపశాఖలతో నుండ దానిక్రింద నాగేంద్రవిగ్రహములు పెట్టబడియున్నవి.

రాజభవనములు :– ఇవి పెద్దకోటలో గలవు. స్టేషను నుండి 6 ఫర్లాంగు లుండును ఈభవనము 5 అంతస్థులు గల పురాతనపుకట్టడము. దర్బారుహాలులో గోడలపై భాగమందు సున్నపుపనిలో గొప్పశిల్పనైపుణ్యమును గాంచనగును. అందు మధ్య నెత్తుగ నుంచబడినదిమ్మపై ఛత్రపతి శివాజీయొక్క విగ్రహము చలువరాతితో చేతులు జోడించుకొని నమస్కరించుచు దర్బారునకు వచ్చువారి నాహ్వానించుచున్నట్లుగ చెక్కించి ప్రతిష్ఠించిరి. నేల అంతయు చలువరాళ్లు పరచిరి. లార్డు పిగోట్ (Lord Pigott) యొక్కయు, లార్డు నెల్సన్ (Lord Nelson) యొక్కయు ఫోటోలు శివాజీమహారాజునకు బహూకరించబడిన యితరచిత్రములుగూడ ననేకము గలవు. పల్లవులకాలములోవలెనే చోళరాజులకాలములోగూడ చిత్ర

కళ వన్నె కెక్కినది. కాంచీపుర కైలాసనాథ దేవాలయములో వలెనే ఇచ్చటకూడ చిత్రములు (Paintings) లున్నవి. వీనిని పాడు గాకుండ తగుశ్రద్ధతో కాపాడుచున్నారు,

మహారాష్ట్రదర్బారు :— ఇదికూడ నీభవనములోనే కలదు. దీనిగోడలపై మహారాష్ట్ర రాజులచిత్రములు గలవు. దర్బారు శిథిలమైనదికాని యొకపెద్దకుర్చీ వేసియున్నది. (సింహాసనమును చూపుటకుగాను) చిట్టచివరరాజైన శివాజీరాజు నడుమను, అతనిప్రధానకార్యదర్శి కుడివైపునను, దివాన్జీ యెడమవైపునను నున్నట్లు ఈహాలు నందు చిత్రింపబడి యున్నవి



కోటలోని శివాజీ విగ్రహము

సరస్వతీమహాలు లైబ్రరీ:— తంజావూరు మహారాజులు గొప్ప శిల్పనిపుణులే గాక గొప్ప సంస్కృతవిజ్ఞానాసక్తి గలవారగుటచే నీసరస్వతీగ్రంథాలయమునం దితర గ్రంథములు గాక

దాదాపు 20,000 వ్రాతప్రతుల నుంచిరి. అందు 8,000 తాళపత్రములపై వ్రాయబడియున్నవి. ఈ ప్రతు లన్నియు గాడ్రేజ్ బీరువాలలో భద్రపరచియుంచిరి. ఇందు కొన్ని శిథిల మగుచుండుటచే కొందరు పండితుల నియమించి వారిచే తిరుగ వ్రాయించుచుండిరి. ఈగ్రంథాలయపుగోడలపైగూడ తంజావూరు రాజులయొక్క చిత్తరువులు కొన్ని గలవు.

రహస్యప్రమార్గములు:- ఇవి లైబ్రిరీకి సమీపముననే కలవు. వీనిని చూచుటకు (Guide) కోట నంతయు చూపు వానిని తీసికొని వెళ్ళవలెను. ఆగైడ్చుకడ దీప ముండును. దాని సాయమున నతడు లోనికి తీసికొని వెళ్లును. మనమును టార్చిలైటు తీసికొని వెళ్లుట మంచిది. ఒకసొరంగమునుండి కొంతదూరము పోయిన తనుపరి దారి ప్రక్కలకు చీలిపోవును లోపలికి చక్కనిగాలి వీచుచుండును. గోడలు నునుపుగ కోడిగ్రుడ్డురసముతో పాలిష్ చేసినట్లు చెప్పుదురు. ఇవి 20 మై. లేక 30 మై. పొడ వుండునని చెప్పుదురు. రాజు లాపత్సమయములలో తప్పించుకొని ప్రాణరక్షణ గావించుకొనుటకీమార్గము లుపయోగపడును. సొరంగములు కొద్దిదూరము వరకే బాగుగ నున్నవి. మిగిలినభాగము పూడిపోయినదట. ఇవి చూపినందుకు 0-8-0 పుచ్చుకొందురు.

ఆయుధశాల:- ఇదియు పైభవనములోనే యున్నది, ఇందు పూర్వరాజు లుపయోగించినయనేకవిచిత్రాయుధములు గలవు. బంగారు, వెండి పిడులు గలిగినకత్తులు,

పిస్తోళ్లు, ఏనుగుపై వేయుహౌడాలు, ఏనుగుల కలంకరించు బంగారుఆభరణములు, లేసుతో మనుజులకు, జంతువులకు కూడ నుపయోగపడుదుస్తులు మొదలగునవి అనేకములు గలవు. తూర్పుద్వారమునొద్ద నున్న 'తాస మొదు' అను కాలము (Time) ను తెలుపుదానిని. దానికి దగ్గరగ నున్న 25 అడుగులు పొడవు 2 అ. వెడల్పము గలఫిరంగి (Cannon) ని చూడనగును. కోటబయట 1883 లో తంజావూరు రాణిచే నిర్మించబడిన గంటలగోపురము (Clock - tower) ను చూడనగును. ఇవి అన్నియు చూచినతరువాత ప్రతియాత్రికునిమనస్సునకు చరిత్రి సంబంధమైన విషయములు, ఆనాటిశిల్పము, పాండిత్యము, నాగరికత గ్రాహ్యమగును. అట్టిధీరులు, యోధానుయోధులు సహితము నశించిరే; మనసాధారణజీవితముల విషయ మేపాటిది అని వైరాగ్య ముదయించును.

1779 అక్టోబరు 25 తేదీన జరిగినసంధి (treaty) ప్రకారము బ్రిటిషుగవర్నమెంటువారిపరంపరగా వచ్చు రాజకుటుంబమునకు (Liberal provision)'ఉదారభృతి' ఏర్పాటు చేసిరి. ఆరాజవంశస్థుల నిప్పటికిని గవర్నమెంటు తమపోషణ క్రింద నీభవనములలో నివాసము చేయించుచున్నారు.

తయారగువస్తువులు :— పట్టు, తివాచి, లేసు, మొదలగు వానిలో ప్రసిద్ధి. సెంట్రల్ జైలులోనవారు, చాపల నేత, త్రాళ్లు ఖైదీలచే చేయించి సరసమైనధరలకు విక్రయించెదరు. ఇచ్చట వరిపంట ముఖ్యమైనది. తంజావూరు పుష్పములకు ప్రాముఖ్యము. ఎఱ్ఱగులాబి, మల్లెదండలు గుచ్చి

బజాఋలలో విశేషముగ అమ్ముదురు. సాయంకాలములందు బజారు లీపుష్పవాసనలతో నిండియుండును. బెండుపనిలో కూడ నిది ప్రసిద్ధి.

## తంజమామణికోయిల్

ఇది 5౨వ దివ్యదేశము. ఇది తిరునైయ్యారుపోవుదారిలో 3 మైం. దూరములో నున్నది. పెన్నానదీతీరము. బస్సులు గలవు. నీలమేఘపెరుమాళ్లు, శెంగమలవల్లితాయారు, సౌందర్య విమానము, అమృతతీర్థము, కన్నికాపుష్కరిణి, కూర్చున్నసేవ.

## కండియూర్

ఇది 5౨వ దివ్యదేశమునకు ఉత్తరముగా 3మైం. దూరమున గలదు. బండ్లు గలవు. బస్సుమార్గము 6మైం. ఇది 54వ దివ్యదేశము. సత్రమున్నది. క్షేత్రమందు ప్రసాదము లభ్యమగును. హరశాపమును తీర్చినస్వామి, కమలవల్లినాంచియార్ కమలాకృతి విమానము, కపాలమోచనతీర్థము. నిలుచున్నస్వామి. రుద్రునికి కపాలమోక్ష మొసంగినస్థానము.

## తిరువాడి లేక తిరువయార్

ఇది శివక్షేత్రము. కావేరీనదీతీరమున నున్నది. తంజావూరునుండి 7 మైం. చక్కనిరోడ్డు గలదు మోటారుబస్సు గలదు. బస్సుచార్జి 0-8-0. ఈజిల్లా సంగీతమునకు పుట్టినిల్లు. అందీగ్రామము ముఖ్యాతిముఖ్యము. సంగీతమూర్తులును, 96 కోట్ల రామనామము జపించినభక్తశిఖామణియునైన శ్రీత్యాగ

రాజస్వామి నివసించినతావు. భక్తిని సంగీతమును మేళగించి తాను మోక్ష మలంకరించుటేగాక అనేకులకు భక్తి, భుక్తి, ముక్తులకు మార్గదర్శకులుగ నుండి తనయావజ్జీవితము శైవ చింతనయందే గడపి యీ గ్రామముననే సమాధియైరి. ఇది



శ్రీ త్యాగరాజులవారి సమాధి – కావేరీతీరము

కావేరీతీరమున గలదు. త్యాగరాజకృతు లిచ్చటినుండియే వుట్టినవి. త్యాగరాజస్వామి ఆంధ్రుడనిమాత్రము మఱవ రాదు. ఆంధ్రుడయ్యు ద్రవిడదేశమున గొప్పపేరు గణించెను. వారికృతులను శిలలపై చెక్కి క్షేత్రమున భద్రపరచు చున్నారు.

వృద్ధు లీక్షేత్రమునకు వచ్చి వారిజీవితశేషము నిచ్చట గడపిన మోక్షప్రాప్తి గలుగునని ప్రతీతి. అందుచే అనేకులు వచ్చి యిచ్చట ప్రశాంతముగ జీవితములు గడపుచుందురు.

ఈ పట్టణమున 3/4 వంతు బ్రాహ్మణులే. ఈ క్షేత్రమును గూర్చి 70 శాసనములు గలవు.

వసతులు :- ఇది పెద్దపట్టణము. అనేక భోజనశాలలు గలవు. బస్సుస్టాండున కెదురుగ నాటుకోట చెట్టియార్ సత్రము కలదు. అందు బ్రాహ్మణులకు భోజన మిడుదురు. అన్నివస్తువులు దొరకును. సత్రములో గదు లిచ్చెదరు.

చూడదగినవి :- పంచనందీశ్వరాలయము ఇది పెద్ద ఆలయము. ప్రాకారమంటపముగోడలమీద అనేక శివకథాపటములు చిత్రింపబడియున్నవి. ఎదుట పెద్దమంటపము గలదు. ఇందు రమ్యమగువాహనశాల గలదు. దేవాలయమంతయు నిటీవల మరమ్మత్తు గావించబడెను. ఈ దేవాలయము చోళ రాజుల అభిమానదేవాలయము. అందుచే వారే చాల భాగము వృద్ధిపరచిరి. ఈ దేవాలయము కట్టుటకు నందీశ్వరుని పాదముక్రింద త్రవ్విన ధనము లభించునని యొకఋషికి స్వప్నమునందు స్వామి తెలుపగా అదేరీతి నచ్చట త్రవ్వగా ధనము లభించెనట. నేటికిని త్రవ్వినగుంటలను యాత్రికులకు చూపెదరు. అర్చకుల నడిగి తెలిసికొననగును. అనేకులు భక్తులు, రాజులు, పండితు లీస్వామిని సేవించి తరించిరి. శివపంచాక్షరి జపించు ప్రత్యేకమంటపము గలదు. దానికి ముక్తిమంటప మనిపేరు. ఇట్టిది కాశియందు గలదు. అప్పయార్ కీర్తనలలో నీస్వామినిగూర్చిన విశేషములు గలవు.

ధర్మాంబదేవాలయము :- పంచనందీశ్వరాలయమున కీశాన్యముగ నీ త్రిపురసుందరి అమ్మవారి ఆలయము గలదు.



శ్రీ త్యాగరాజస్వామివారి సమాధి

గలదు. ఈ దేవాలయ మిటీవల (15 సం॥ ల క్రింద) నాటు కోటిచెట్టియార్లచే చిదంబర దేవాలయపు 3వ ప్రాకారము మాదిరి స్తంభములతో శిల్పనైపుణ్యముతో నిర్మింపబడినది. గర్భాలయమంతయు నల్లపాలిష్‌రాయితో గట్టబడినది. ఈ రాతి నద్దముమాదిరిగ పాలిష్‌చేసిరి. ఈరాళ్ళను తిరువన్నామలైనుండి తెచ్చినట్లు చెప్పిరి. దేవాలయ మంతయు విద్యుద్దీపములతో నలంకరించిరి. ఇది పూర్తియగుటకు 10సంవత్సరములు పట్టైననియు 10 లక్షలు వ్యయమయ్యె ననియు

చెప్పిరి. గోపురముపనితనము చూడదగినది. ఈ కాలములో కూడ నింతటి శిల్పకళాకోవిదు లుండుట. వారి నాదరించి పోషించుధనికవర్గ ముండుట అభినందించదగినది.

శ్రీత్యాగరాజస్వామి గృహము నేటికిని గలదు. అందు వారు ప్రతిదినము పూజించి, 96కోట్ల రామనామమును జపింప నేగదియందు శ్రీరామచంద్రదర్శన మయ్యెనో ఆపరమపవిత్ర మైనగది నేటికిని గలదు. ప్రతియాత్రికుడు ఆగదిని దర్శించి ధన్యులగుదురుగాక! వారిసమాధికడ నిటీవల 1938లో కీ॥ శే॥ బెంగుళూరి నాగరత్నంగారు పెద్దఆలయమును కావేరీతీరమున కట్టించిరి. ఇచ్చట ప్రతివత్సరము వారిజయంతికి గానసభలతో నుత్సవాదులు జరుగును. అందు పాల్గొనుటకు గొప్పగొప్ప విద్వాంసు లనేక ప్రాంతములనుండి వచ్చి ఈ గురుస్థానమున గానసభలు కథాకాలక్షేపములు గావించిపోవుచుందురు. శ్రీత్యాగరాజస్వామివారు స్వయముగ నర్చించిన దేవతార్చన నేటికిని ఈ యాలయమున నుంచి వారిమనుమనిచే పూజింప బడుచున్నది.

## మన్నార్ గుడి

దీనినే రాజమన్నార్ కోవెల అందురు. తంజావూరు నుండి 19 మై. లోనున్న నీడామంగలంజంక్షన్‌లో దిగవలెను. అచ్చటినుండి 8 మై. రైలుప్రయాణముచేసిన మన్నార్‌గుడి స్టేషను చేరగలము. ఇది యీ బ్రాంచిలో ఆఖరు స్టేషను. తంజావూరునుండి 0-15-0 చార్జి. 22 వేల జనాభా గలది.

ఇది తాలూకాముఖ్యపట్టణము. ఇది వెన్నార్ నదియొడ్డున నున్నది. దీనినే దక్షిణద్వారక యనియందురు.

వసతులు :- స్టేషనునుండి దాదాపు 1½ మై. రెండు రహదారిబంగళాలు గలవు. అనేకసత్రములు గలవు. భోజనశాలలు గలవు. అన్నిసౌకర్యములు గలవు. రెండు హైస్కూళ్లు గలవు

ఉత్సవములు :- ఇచ్చట మార్చినెలలో బ్రహ్మోత్సవమును, జూన్ నెలలో తెప్పయుత్సవమును జరుగును. ఒక్కొక్క ఉత్సవము 10 దినములు జరుగును. ఈ యుత్సవములకు దాదాపు 30 వేల మంది యాత్రికులు వచ్చెదరు.

చూడదగినవి :- ఇందు 9 పురాతన దేవాలయములు గలవు. అందు నాలుగు విష్ణ్వాలయములు, 5 శివాలయములు గలవు. అన్నిటిలో శ్రీరాజగోపాలస్వామివారి దేవాలయము గొప్పది, చూడదగినది. అమ్మవారు చంపకలక్ష్మి. ఇచ్చట 1,158 అ. పొడవు, 837 అ. వెడల్పుగల 'హరిద్రనాథ్' అను గొప్పకోళము గలదు ఇందు యాత్రికులు స్నానము చేయుదురు.

ఇది శిల్కువస్త్రములకు, రాగి, యిత్తడిసామానుల చేతకు ప్రసిద్ధి.

## తిరువారూర్

ఇది శివక్షేత్రము మన్నారుగుడిస్టేషనునుండి తిరిగి నిడామంగలంజంక్షనుకు వచ్చి అచ్చటినుండి తూర్పుగా 15 మై. ప్రయాణముచేసిన తిరువారూర్ జంక్షన్ వచ్చును అ.0-13-0

చార్జీయగును ఇది నాలుగురైళ్ళకూడలి. ఇది 24 వేల జనాభా గలమ్యునిసిపల్ పట్టణము.

వసతులు :- రహదారిబంగాళా గలదు. అనేక సత్రములు, భోజనశాలలు గలవు. కొన్ని సత్రములలో బ్రాహ్మణులకు భోజనమును, బైరాగులకు సదావర్తియు నిచ్చెదరు. అన్ని సౌకర్యములు గలవు.

చూడదగినవి :- ఇది శివక్షేత్రము. వల్మీకనాదర్, అమ్మవారు కమలాంబిక. ఇది చాలగొప్ప దేవాలయము ఇది స్టేషనునుండి 1½ మై. దూరములో నున్నది. బండ్లు గలవు. దేవాలయములో పుట్ట యుండుటచే 'వల్మీకనాదర్' అని పేరుగలిగెను.

దేవాలయములో వేయి స్తంభములమంటపము గలదు. ఈఆలయమంతటను ముఖ్యమంటపములలో పైభాగమున కథా చిత్రములు చిత్రింపబడియున్నవి. ఇచ్చట పెక్కు పెద్దపెద్ద రాళ్లు పని పూర్తికాకపోవుటచేగాబోలు పడియున్నవి. పూర్తియైనంత వరకు శిల్పము చూడదగినది. దేవాలయమునకు తూర్పున గొప్పరథము గలదు. ఇంతపెద్దరథము దక్షిణదేశములో మరెచ్చటను లేదని చెప్పుదురు. రథముపై కొయ్యమీాద చక్కని శిల్పము చెక్కబడియున్నది. దానిచక్రములు 2½గ. వ్యాసము గలిగియుండును. దీనిని లాగుటకు 6 అంగుళముల మందముగలత్రాళ్లుపయోగించెదరు. ఈరథముచుట్టు పెద్దరేకులపెడ్డు వేసిరి దానికొకవైపు ద్వారమేర్పరచిరి. అది యెప్పుడును తెరచియుంచెదరు. ఆద్వారముగుండ లోనికి వెళ్ళి

చూడనగును. ఇంతపెద్దరథమును భగవంతుడే కదల్చునేమో యని తోచును.

ఈ దేవాలయమునకు వెనుకప్రక్క 'కమలాలయ' మను గొప్పకోనేరు గలదు. దీనినడుమ నొకలంకయు అందొక దేవాలయమును గలవు. అచ్చటికి వెళ్లుట కొకపడవ యుండును. ఈకోనేరు మనము చూచినవానిలో పెద్దదనియే చెప్పవచ్చును.

రాతిరథము :— దీని కీశాన్యముగ నొకరాతిరథము గలదు. దానియొకచక్రముక్రింద ఒకపిల్లవాని విగ్రహమును, దానికిదగ్గరగ ఒకచచ్చిన ఆవుదూడయు దానితల్లియగు ఆవును రాతితో చెక్కబడినవి. దీనిపూర్వచరిత్ర యిట్లుచెప్పిరి. ఆపట్టణమును పూర్వము 'మనునీతిచోలన్' అనురాజు పాలించుచుండెనట. ఈతని న్యాయబుద్ధిని పరీక్షింపగోరి శివు డావుగను, యముడు దూడగను వచ్చి ఆపురవీధులలో మేయుచుండ రాజకుమారుడు రథముపై వెళ్లుచు చూడక తనరథము నావుదూడమీదుగా తోలెను. వెంటనే అది చనిపోయెను. రాజు విని యీగోహత్యాదోష మెట్లుపోవునాయని పండితుల రావించి అడుగగా ఆయావు తనదూడకొరకు కెంతదుఃఖించుచున్నదో అదేవిధమైనదుఃఖమును రా జనుభవించిననే యీగోహత్యాదోషము పోవునని చెప్పిరి. (అనగా తనముద్దుకుమారుని రథముక్రింద పడవైచి చంపవలెనని అర్థము) రాజు పండితులనిర్ణయమునకు వెంటనే సమ్మతించి రథముపోవుచుండగా తన కుమారుని దానిక్రింద పడవేసి చంపెను. రాజుయొక్క సత్యమునకు, న్యాయబుద్ధికి, ధర్మనిష్ఠకును మెచ్చి శివుడు ప్రత్య

క్షమై ఆవుదూడను, రాజకుమారుని బ్రతికించి వారి నందరను కైలాసమునకు గొనిపోయెను. ఈచరిత్రను తెలుపుటకే అచ్చట రాతిరథము, రాజకుమారుడు, ఆవు, దూడ మొదలగునవి శిలలో చెక్కబడినవి.

## తిరుకణ్ణమంగై

ఇది 55వ దివ్యదేశము. ఇది తిరువారూర్ స్టేషనుకు దాదాపు 5మై. దూరములో నున్నది. భక్తవత్సలపెరుమాళ్లు అభిషేకవల్లితాయారు. ఉత్పలవిమానము, దర్శనపుష్కరిణి.

వసతులు:- బండ్లు గలవు సత్రములు, భోజనశాలలు లేవు. క్షేత్రమునందు ప్రసాదము లభ్యమగును.

ఈయాలయమందు ఋషులు తేనెటీగలరూపములను దాల్చి స్వామిని సేవించినట్లు చెప్పుదురు. అందుచేతనే నేటి కిని తేనెటీగలగూటిని పూజించెదరు.

## తిరుకణ్ణపురము

ఇది 56వ దివ్యదేశము ఇది తిరువారూర్ జంక్షను నుండి మాయవరం రైల్లైనులో 9 మై. దూరములో నున్న నన్నిలంస్టేషనులో దిగవలెను. 0-5-0 రైలుచార్జీ. అచ్చట నుండి దాదాపు 4 మైళ్ళలో నీదివ్యదేశము గలదు.

ఈ దేవాలయము శ్రీరంగదేవాలయమంత పెద్దది. ఉత్పలావర్తకవిమానము, నిత్యపుష్కరిణి. క్రిమికంఠచోళుడు కాయచ్చీరామవిణ్ణగరము, చిత్రకూటము, తిరువారూర్, తిరువణ్ణామలై మొదలగు విష్ణుక్షేత్రములను (ఆలయములను)

పడగొట్టించి వానిస్థానమున లింగప్రతిష్ఠలు గావించి శివాలయములుగ మార్చెను. అట్లే ఈక్షేత్రమునగూడ 6 ప్రాకారములు పడగొట్టి తిరుమగల్, తిరుప్పుగలూర్ మొదలగు శివాలయములను కట్టించి చివరదియగు 7వ ప్రాకారమునుగూడ పడగొట్టబోవుసమయమున ఆపురస్వామియైన అరయగుస్వామియెదుట చేతులుజోడించి ద్రావిడప్రబంధమును గానము చేసి దీనముగా స్వామిని ప్రార్థించగా స్వామి సమాధానమియ్యనందున 'నీకు కండ్లు లేవా మౌనముగా నున్నావేల' యని భజనతాళము స్వామిముఖముపైకి విసరిరి. ఆదెబ్బతో స్వామి అనుగ్రహించి తనచేతనున్న చక్రాయుధమును విసరెను. అది పోయి క్రిమికంఠచోళుని శిరస్సు ఛేదించి తిరిగి వచ్చి స్వామిహస్తము నలంకరించెను. ఇందుకు నిదర్శనముగా నిప్పటికి నిచ్చట స్వామికి తగిలినదెబ్బచే నేర్పడినబొబ్బ కనుపించు విగ్రహము గలదు. అర్చకుల నడిగి చూడనగును.

వసతులు:— సత్రము కలదు. భోజనవసతి ప్రత్యేకము చేసికొనవలెను. క్షేత్రమున ప్రసాదము దొరకును. ఇచ్చటి అధ్యయనోత్సవము ముఖ్యముగ సేవింపదగినది.

## శిరుప్పులియూరు

ఇది 57వ దివ్యదేశము. నన్నిలంస్టేషనునుండి మాయవరం వెళ్ళురైలుమీద 7 మైం. వెళ్ళిన కొల్లుమాన్‌గుడిస్టేషను వచ్చును నన్నిలంనుండి 0-4-0 చార్జీయగును. మాకడల్ పెరుమాళ్. తిరుమగళ్‌నాంచారు పైస్టేషనునుండి 1 మైలు దూరములో నీక్షేత్రము గలదు ఇతరసౌకర్యములు లేవు.

ప్రసాదము క్షేత్రమున లభ్యమగును. నందవర్థనవిమానము, అనంతసరస్సు. ఉత్సవర్లకు కృపాసముద్రస్వామి, దయానాయకి నాంచియార్ అనిపేర్లు. స్వామి బాలాకారములో సేవ గైకొనుచున్నారు.

☞ ఇచ్చటినుండి తిరిగి మరల తిరువారూర్ జంక్షనుకు రావలెను. అచ్చటినుండి నాగూర్ లైనుకు ప్రయాణము చేయవలెను.

## తిరుక్కణ్ణంగుడి

ఇది 58వ దివ్యదేశము. ఇది తిరువారూర్ నుండి నాగూర్ వెళ్లుదారిలో 8 మై. దూరములో (చార్జీ 0–5–0) కీవళూర్ స్టేషనులో దిగవలెను. అచ్చటినుండి మట్టిరోడ్డు మార్గముగ 2 మై. వెళ్ళిన నీక్షేత్రము చేరవచ్చును. ఈ క్షేత్రమునే కృష్ణారణ్యక్షేత్రమనియు పిలుతురు. శ్యామలమేనిప్పెరుమాళ్, అరవిందవల్లి నాంచియార్, ఉత్పలవిమానము, రావణపుష్కరిణి.

వసతులు :— ఇచ్చట నేవసతులు లేవు. వంట చేసికొనుట మంచిది. ముందుగ క్షేత్రమునందు తెలిపిన ప్రసాదము లభ్యమగును.

విశేషములు :— (1) రాత్రులందు ముడుచుకొనని ఆకులు గలచింతమ్రాను (ఉఱంగాప్పుళి) (2) పువ్వులు వికసించి పూయనిపొగడవృక్షమును ప్రసిద్ధములు. (3) తిరుమంగైయాళ్వారు నాగపట్టణమునుండి సువర్ణబౌద్ధవిగ్రహమును శ్రీరంగనాథునికైంకర్యమునకై తెచ్చుచు దారిలో నొకచేనిలో దాచెను. ఆచేనియజమాని అది చూచి ఆళ్వా

మునకు ప్రొద్దుపోవువరకు వాదవివాదము తెంపులేకుండ (తీరని) జరిగెను. అందువలననే యీదివ్యదేశమునకు తీరావఱుక్క-అన్నియు దానిరూపమే 'తిరుక్క-ణ్ణంగుడి' యని వాడబడుచున్న దనియు చెప్పుదురు. (4) తిరుమంగైయాళ్వారు తనహస్తములో రాతిని విసరివేయగా అది పడినచోట మంచినీటిజల గలిగినది నేటికిని అది తప్ప ఆగ్రామములో మిగిలిన నీరంతయు ఉప్పగా నుండుట ప్రసిద్ధమే. దీనికి 'ఊరాకిణర్' అనునామము గలదు.

## నాగపట్టణము

ఇది కీచలూరునుండి 7 మై. 0-4-0 చార్జి. ఇది 58 వేల జనాభాగలపురాతనపట్టణము. ఇది తంజావూరుజిల్లాలో నాగపట్టణతాలూకాముఖ్యపట్టణము ఇది దాదాపు వందసంవత్సరములు డచ్చివారిపరిపాలనలో నుండి దక్షిణభారతమున ఓడవ్యాపారమునకు ప్రాముఖ్యము వహించినది. అరేబియాదేశ భూగోళశాస్త్రజ్ఞులు దీనిని 'మేల్‌వట్' అని అందురని కలనల్ యూలేగారిభావము. క్రీ. శ. 1778 న డచ్చివారినుండి బ్రిటీషువారి హస్తగత మయ్యెను. సముద్రము పట్టణము నానుకొని యున్నది.

వసతులు:- భోజనశాలలు, సత్రములు, బండ్లు గలవు. ఈపట్టణమునకు రెండురైల్వేస్టేషనులు—1. బీచ్, 2. వెలిప్పాలైయమ్. ఇచ్చటనుండి సిలోను, బర్మా, పెనాంగు, స్ట్రేట్సు సెటిల్ మెంట్సుకు వెళ్లుట కేర్పాట్లు గల్గుటచే విశేషముగ వెళ్లుచుందురు. ఇచటికి సుమా రొకమైలుదూరములో స్టీమ

రాగును. అచ్చటి నుండి 160 పడవలమీద సామానులను, ప్రయాణికులను నాగపట్టణమునకు చేర్చుచుండును.

తయారగువస్తువులు:- ఇచ్చట స్టీలు రోలింగుమిషను గలదు. స్టీలుపెట్టెలు మొదలగునవి తయారగును.

చూడదగినవి :- దీపగృహము (Light house) ఇది నల్లరాతితో కట్టి తెల్లనిరంగు పూయబడియున్నది. ఇది 14మై. దూరములో నున్నస్టీమర్లకు మార్గదర్శిగ నుండును. ఇచ్చట నొకశివాలయము, విష్ణ్వాలయము గలవు. బజారునకు హాలెండువీధి యనిపేరు.

ఇది 59వ దివ్యదేశము. స్టేషనునుండి మైలుదూర ముండును. సౌందర్యపెరుమాళ్, సౌందర్యవల్లితాయారు, సౌందర్యవిమానము, సారపుష్కరిణి, తిరుమంగైయాళ్వారు ఇచ్చటనుండి సువర్ణబుద్ధవిగ్రహము నపహరించుకొని వెళ్లి యాద్రవ్యముతో శ్రీరంగదేవాలయప్రాకారమంటపాదులు నిర్మించెనని చెప్పుదురు.

## నాగూర్

ఇది నాగపట్టణమునుండి 4మై. 0-3-0 చార్జి. ఇంతటితో తంజావూరు-నాగూర్ రైల్వేలైను ముగియును. ఈనాల్గు మైళ్లు రైలు సముద్రము నానుకొనిపోవును. దృశ్య మానందకరముగ నుండును. ఇది సముద్రతీరమున నున్నగ్రామము.

వసతులు:- స్టేషనుకు పదిగజములదూరములో నొక మంచివసతిగలధర్మశాల గలదు స్టేషనునుండి దర్గావరకు తారు

రోడ్డు గలదు. గుఱ్ఱపుబండ్లు, భోజనశాలలు గలవు. మహమ్మదీయపండాలు స్టేషనుకడకు వచ్చి యాత్రికులను తీసికొని వెళ్ళెదరు వారికి ఫీసు మీయవలసియుండును.

చూడదగినవి :- రెండు పురాతనహిందూ దేవాలయములు గలవు. ఒకటి శివాలయము. రెండవది విష్ణ్వాలయము. ముఖ్యముగ చూడదగినది హజరత్ మీరాన్ సుల్తాన్ సయ్యద్ షహబ్దుల్ హమీద్ అనుగొప్పమహమ్మదీయ ఫకీరు యొక్క సమాధి. ఇది దాదాపు 300 సం॥ ల క్రింద తంజావూరు రాజావారిజబ్బు నయము చేయుటచే నీఫకీరునందు గురి యేర్పడి స్థలమిచ్చి తరువాత దర్గా కట్టించినారు. ఈదర్గాకు 5 గోపురములు గలవు. అందొకటి 124 అడుగులయెత్తు గలిగి మంచిపనితనములో నిర్మించబడినది. ఈగోపురములు సముద్రముమీద పోవుస్టీమర్లకు పడవలకు చాలదూరము వరకు కనిపించును. వారు వాని నచ్చట నిలిపి యీదర్గాకు

నాగుల్ మీరాసాహెబ్ దర్గా - నాగూర్



నమస్కారములు చేసెదరు. ఈ దర్గాలోపలిభాగ మంతయు చలువరాతితో నిర్మించబడి, విద్యుద్దీపములచే నలంకరించబడి యున్నది. దర్గాద్వారములకు వెండి రేకు తొడుపు వేయ బడినది

ఈమహాత్మ్యదీయ ఫకీరు గొప్పమహిమ గలవారు. ఇచ్చటి కన్నిజాతులవారు వేలకువేలు వచ్చుచుందురు. దర్గాకు వెనుక వైపున పెద్దకోనేరు గలదు ఈ దర్గాయం దెన్నో వేలపావుర ములు గలవు. వాని కన్నిటికిని రెండుమూడుబస్తాల మర మరాలు మొదలగునవి ఆహారముగ వేయుదురు. ఆదృశ్య మానందకరముగ నుండును. దర్గా ఉదయము 11 గం. నుండి సాయంతనము 6 గంటలవరకు మూసియుండును. ఈఫకీరు చరిత్రియు, మహిమయు వినదగియుండును ఇచ్చట అంద మైన బట్టలు, ఆటవస్తువులు కొబ్బరి, మొగలి ఆకులతో తయారుచేసి దర్గాముందర అమ్ముదురు.

☞ ఇచ్చటినుండి తిరిగి మరల తిరువారూర్ జంక్షనుకు చేరవలెను

నాగూర్ దర్గాలోని పావురాళ్లు



## వేదారణ్యము

(దీనినే నిగమవన మందురు) తిరువారూర్ నుండి దక్షిణ ముగా వెళ్లుతిరుత్తురైపూండిజంక్షనుమీదుగా పాయింట్ కాలి మర్ కు వెళ్లుదారిలో 21 మై. లో నున్న వేదారణ్యంస్టేషనులో దిగవలెను. మొత్తము తిరువారూర్ నుండి 37 మై. రూ. 1-4-0 చార్జీయగును. ఇది 15 వేలజనాభా గలపట్టణము. సముద్ర తీరము.

వసతులు :- అనేకసత్రములు గలవు ఇచ్చట రామే శ్వరములోవలె ప్రతిదినము సముద్రస్నానము చేయవచ్చును.

చూడదగినవి :- ఇచ్చట గొప్ప దేవాలయము గలదు. ఇందుండుస్వామిని వేదములే స్వయముగ అర్చించెనట. అందు చేతనే ఈస్వామి కిట్టి ప్రసిద్ధి. ద్రవిడభక్తుడైన 'తైమన్నవార్' జన్మస్థానము.

ఈ క్షేత్రమునుండి 7 మై. దూరములో 'నలువేదపతి' అనుక్షేత్రములో వేదము లవతరించెనని చెప్పుదురు. వేదము లను ప్రసాదించినదినమున అనగా మార్గశిరమాసమందు గొప్పయుత్సవము జరుగును. ఈ దేవాలయములో నొక వినా యక విగ్రహముగూడ గలదు. శ్రీరాముడు రాక్షససంహార మున విఘ్నములు కలుగుచుండ నీవినాయకుని సేవించి, విఘ్న రహితు డయ్యెనని చెప్పుదురు

విశ్వామిత్రాజ్ఞానుసారముగ శ్రీరాము డిచ్చట నొక శివలింగమునుగూడ బ్రతిష్ఠించెను. రామచంద్రుడు సంచ రించిన పురమును 'అగ్రామ్' లేక 'రామచంద్రపుర' మను

నది వేదారణ్యమునుండి ఆగ్నేయముగ 6 మైళ్ళ దూరమున గలదు.

వేదారణ్య దేవాలయములో అగస్త్యమహర్షికి పార్వతీ పరమేశ్వరకళ్యాణదర్శన మయ్యెనని చెప్పుదురు. దేవాలయ గర్భాలయములోపలిగోడపై నీదృశ్యమును పోలిన విగ్రహము చెక్కబడియున్నది.

## పాయింట్ క్యాలిమేర్

వేదారణ్యమునుండి 7 మైళ్ళు 0-4-0 చార్జీయగును. రైలు వేదారణ్యమునుండి అడవిమార్గమున పోవును. ఇది సముద్రతీరము. మొదట శ్రీరాము డిచ్చటినుండి వారిధి కట్టవలెనని ప్రయత్నించెననియు, అనుకూలముగ లేనికారణమున మానివేసెననియు చెప్పుదురు. సముద్రతీరమున నొక దేవాలయము గలదు.

☞ ఇచ్చటినుండి తిరిగి తిరుతురైపూండిజంక్షనుకు వెళ్ళి అటునుండి అరంతాంగిలైనువైపు ప్రయాణము సాగించవలెను.

## తిలైవిలాగం

ఇది తిరుతురైపూండి జంక్షనునుండి 9 మై. దూరము. 0-5-0 చార్జీ. ఇచ్చట దాదాపు 50 సం॥ల క్రింద సీతారామ, హనుమ ద్విగ్రహములు భూమిలో దొరకుటచేత వాని ప్రతిష్ఠార్థము గొప్పదేవాలయము నవీనముగ నిర్మింపబడినదని చెప్పుదురు.

## అరన్తాంగి

ఇది పైస్టేషనునుండి 50 మై. దూరములో నున్నది. రూ. 1-11-0 చార్జి.

వసతులు:- భోజనశాలలు గలవు. 2 ఫర్లాంగులలో జిల్లా బోర్డువారిధర్మశాల గలదు. ఇటనుండి పుదుకోట 19 మై. దేవకోట 20 మై. బస్సులు గలవు. పురాతనమైనకోట శిథిలమై కనిపించును.

## అవడయార్ కోవిల్

ఇది అరన్తాంగిస్టేషనునుండి 8 మై. దారి గరపనేల. ఇసుక తగులును. దేవాలయము చిన్నదైనను నిందలిశిల్పము మాత్ర మత్యద్భుతము.

వసతులు :- ఎద్దుబండ్లు, గుఱ్ఱపుబండ్లు దొరకును. ఈ ప్రయాణము 2 గం॥ పట్టును. వెల్లారునదీతీరమున దేవాలయాధిపత్యమున నొకబంగళా గలదు. దీనికి అద్దె లేదు. కాని వంటయేర్పాటు ప్రత్యేకముగ చేసికొనవలెను. హిందువులకు 3 సత్రములు గలవు. అందొకదానియందు నిత్యము భోజనము పెట్టెదరు. మిగిలినవానిలోగూడ నుత్సవసమయములలో భోజనము పెట్టెదరు. విడిదినములలో గదుల నిచ్చెదరు.

చూడదగినవి:- ఇది శివక్షేత్రము. ఇందు శివలింగము బంగారుకప్పుతో కప్పబడి దానికి 5 తలలు గలనాగేంద్రుడు చుట్టబడియు, అమ్మవారివిగ్రహమునకు బదులుగా అమ్మవారి బంగారుపాదుకలును మాత్రము ప్రతిష్ఠింపబడి యున్నవి.

ఈ దేవాలయము 3 ప్రాకారములు గలిగి ఒక్కొక్క ప్రాకారము 25 అడుగలయెత్తు గలిగి యున్నవి. రెండవప్రాకారము లోని విస్తీర్ణ మంతయు కప్పువేయబడియున్నది. ప్రథమ ప్రాకార సింహద్వారముపై నున్నగోపురము 200 అ॥ ఎత్తు గలిగియున్నది

మానకవాచక దేవాలయము (నందీశ్వర దేవాలయము:-)

ఇది ప్రధానగోపురమునకు బయట నున్నది. ఇందుండు నేకాండపురాతిలో మండపము చెక్కబడిన స్తంభములలో నొకదానిపై 8 హస్తములు గలవీరభద్రవిగ్రహము గలదు. ఇది గొప్పశిల్పనైపుణ్యమున చెక్కబడినది. ఈమంటపముకప్పు అడుగుభాగమున రావణుడు కైలాసము నెత్తున ట్లద్భుతముగ చెక్కబడియున్నది.

పంచాక్షరీమంటపము :- దీనిపై కూర్చుండి పంచాక్షరీ మంత్రమును జపింతురు. ఈమంటపము 50 స్తంభములు గలిగి అందు దేవాలయపూర్వచరిత్రను తెలుపువిగ్రహములు-మనక వాచక. శివుడు గుఱ్ఱముపై నున్నట్లును, పాండ్యదేశపురాజైన 'అరిమూర్తైన్' గలవు. ఈమంటపముకప్పు అడుగుభాగమున హిందూరాజులచిత్రములు మిక్కిలి తేజోవంత మైనరంగులలో చిత్రించబడియున్నవి. ఈ మంటపములలోని స్తంభములు, దూలములు మొదలగునవి కచ్చితముగ మూలలు కలసి యెన్నటికిని చెదరకుండున ట్లున్నవి. ఈ స్తంభము లన్నియు నేకాండపు నల్లచలువరాళ్ళను పోలియుండును. ఈ రాళ్ళ నిచ్చటికి 5 మైళ్ళదూరమున గలకొండలనుండి తెచ్చినట్లు

చెప్పెదరు. ఈ శిల్పమును చూచిన నీ నాడే యీ మంటపము లను తయారుచేసినట్లు కనుపించును ఇం దొక గ్రంథాలయము గలదు అందు తాళపత్రిగ్రంథములుగూడ గలవు

పై మంటపమునకు పడమరగ సెయల్ పిల్లియాన్ మంటపము గ ల దు. ఇది శిథిలమైనను మరల మరమ్మతు చేయించిరి. ఈ మంటపమునకు వెనుక 200 గ. పొడవు 150 అ. వెడల్పుగల కోనేరు గలదు. ఈ కోనేటిచుట్టు నీటిమట్టము నుండి యాత్రికులు నిలుచుండుటకు. స్నానముచేయుటకు వీలుగ మంటపము కట్టబడియున్నది. ఈ కోనేటి కీశాన్యముగ అందముగ చెక్కబడిన స్తంభములతో నిర్మింపబడినత్యాగరాజ మంటపము గలదు. దీనికప్పు 10 అడుగులచదరముగ నేకాండపుబండనుండి వ్రేలాడు గొలుసులు రాతిలో లింకులతో సహా చాల సున్నితముగ చెక్కబడి చూచువారి కాశ్చర్య మును ఆనందమును కలిగించును. ఈమంటపమునకు నుత్తరపు గోడకు మధ్య 'గురంత' చెట్టును పోలినట్లు రాతిలో చెక్కబడియున్నది. వెండివాహనము లుండు మంటపముగూడ సమీపముననే గలదు. ఇం దర్చకులు నంబియార్లు.

☞ ఇచ్చటినుండి పుదుకోటకు బస్సుమీద వెళ్ళవలెను.

## పు దు కో ట

ఇది పుదుకోటసంస్థానమునకు ముఖ్యపట్టణము. స్టేషను నుండి 1½ మై.దూరములో నుండును. ఇది అందమైనపట్టణము.

వసతులు :- స్టేషనునుండి రైల్వేఔట్ఏజన్సీ (Out Agency) బస్సుగలదు. స్టేషనునుండి పట్టణములోనికి 0-2-0 తీసికొందురు. మన మేబసకు వెళ్ళదలచిన ఆబసకు తీసికొని వెళ్ళి విడుతురు. మరల అటులనే మన మేర్రైలుకు వెళ్ళదలచినది వారికి తెలిపిన ఆయావేళలకు వచ్చి యెక్కించుకొని వెళ్లుదురు ఇది చక్కనియేర్పాటు జట్కాలుగూడ గలవు. దాదాపు 25 సత్రములు గలవు. అనేకభోజనశాలలు గలవు. ప్రతిశుక్రవారము సంత జరుగును. ఆనాడు కళాశాలలు, హైస్కూళ్ళు మూసివేయుదురు. పట్టణములో చూడదగినవన్నియు చూపి స్టేషనునొద్ద దింపుటకు గుఱ్ఱపుబండికి షుమారుగా 2-0-0 లు తీసికొందురు.

చూడదగినవి :- ఈ పట్టణమున 11 లేక 12వ శతాబ్దములలో జైనులు బౌద్ధులు నివసించిన ట్లనేకచిహ్నములు

ఆనందబాగ్ - పుదుకోట



గలవు. కళాశాల, పురాతనపు కోటగోడలు, పురాతన, నవీన రాజభవనములు (Palaces, old & new,) ఆనందబాగ్, తిరుగోకర్ణము. మ్యూజియము, జిల్లాకోర్టు, బౌద్ధ, జైనసంబంధమైన శిథిలవిగ్రహములు మొదలగునవి.

నూతనరాజభవనము :- ఇది పట్టణమధ్య నున్నది. దాదా పరమైలుపొడవున ప్రహరి కలిగి, మూడంతస్తులలో గోపురములతో నందముగ గట్టబడియున్నది. దీనిని చూచుట కనుమతి పొందవలెను.

ఆనందబాగ్:- ఇది బెంగుళూరులోని 'లాల్' బాగ్‌ను బోలియుండును. ఇది చూచుటకు నాకర్షణీయముగ నుండును. చెట్లు చిత్రవిచిత్రములుగ కత్తిరించబడియు, గడ్డి అనేకరూపములుగ పెంచబడియు నున్నది ఆంగ్లమున 'Welcome' అను మాటను, దక్షిణదేశరథమును, కొన్ని కొంగలుగను గనుపడునట్లు గడ్డినే బహురమణీయముగ కత్తిరించిరి.

## తిరుగోకర్ణము

ఇది శివక్షేత్రము. ఈక్షేత్రము పట్టణమునుండి పడమరగా నొక మైలుదూరమున నున్నది. అన్నివసతులు గలవు. విశాలమైనదేవాలయము. స్వామిని భగదారనాల్ అనియందురు. ఆలయమునకు వెనుక ముందు కోనేళ్లు కలవు. ఈ ఆలయ మొకచిన్నతిప్పపై నిర్మింపబడియున్నది.

మ్యూజియము :- ఇది దేవాలయమునకు 100 గ. దూరమున నున్నది. ఇం దనేకపక్షుల, జంతువుల శరీరములు,

అనేకవిధములైన శిలలు, పురాతనాభరణములు, ఆయుధములు మొదలగున వెన్నియో చూడనగును.

ఇచ్చటనుండి 13 మై. దూరములో తిరుమయమును, 9 మై. దూరములో 'సితన్న వాసల్' అనుబౌద్ధ జైనశిల్పము, కప్పుక్రింది భాగమున వనమూలికలపసరులతో రంగులు వేసిన చిత్రములు చూడనగును. ఇచ్చట బల్లపరుపుగా నున్న రాళ్లు గలవు వానిపైన జైనులు పరుండి ప్రార్థనచేసెడివారని చెప్పుదురు. కప్పున చిత్రించినచిత్రములను బాగుగ పరిశీలించిన పూర్వజైనులకాలపుదుస్తులు ఆభరణములు, కళలు, వారి నాగరికత గ్రాహ్యమగును.

## శ్రీ రంగము

ఇది 60 వ దివ్యదేశము. ఇందు 25 వేల జనసంఖ్య గలదు. పుదుకోటనుండి తిరుచునాపల్లిజంక్షన్‌కు వచ్చి అచ్చట నుండి మోటారుబస్సులో శ్రీరంగమునకు చేరవచ్చును పుదుకోట నుండి తిరుచునాపల్లిజంక్షన్‌కు 33 మైళ్లు. రు 1-2-0 చార్జీ అగును స్టేషనునుండి శ్రీరంగమునకు సిటీబస్సు గలదు. 0-3-6 పుచ్చుకొందురు. లేక జంక్షన్‌నుండి వృద్ధాచలము లైనులో 8 మై. దూరములో 5వ స్టేషనే శ్రీరంగము. 0-3-0 చార్జీ అగును ఇది కావేరీనదిచే చుట్టబడిన యొకద్వీపము. తంజావూరువైపునుండి వచ్చువారు (Golden Rock) గోల్డెన్ రాక్ స్టేషనులో దిగి అచ్చటనుండి శ్రీరంగమునకు పోవలెను. కావేరీనదిపైన ఒక్కొక్కఆర్చి 49 అడుగులపొడవున 32

ఆర్చీలు గలయొక వంతెన తిరుచినాపల్లిని శ్రీరంగమును కలుపుచున్నది. దానిపై మనుష్యులు కార్లు బండ్లు తెంపు లేకుండ వచ్చుచుపోవుచుండును. 108 దివ్యదేశములలో నిది ప్రధానమైనది.



శ్రీరంగనాథాలయము - శ్రీరంగము

వసతులు :- స్టేషనుకడ బండ్లు కూలీలు దొరకును. స్టేషనునుండి దేవాలయ మరమైలుదూరమున నుండును. సన్నిధియందు ప్రసాదము విశేషముగ దొరకును. భోజన శాలతో పనిలేదు. అనేక సత్రములు గలవు. వానిలో 12 ముఖ్యమైనవి. రామానుజకూటములుగూడ కలవు. భోజన శాలలు గలవు. అన్ని వస్తువులు దొరకుదుకాణములు గలవు. ఈ క్షేత్రమున తీర్థశ్రాద్ధముగాని హిరణ్యశ్రాద్ధముగాని పెట్ట

వలెను. ప్రాయశ్చిత్తమునకు రూ. 1-4-0, హిరణ్యశ్రాద్ధమునకు రూ. 1-4-0. క్షురకర్మకు అ. 0-4-0 ఇవి కనీసపు రేట్లు, కాని వారు మితములేకుండ అడుగుదురు.

శ్రీరంగమును భూలోకవైకుంఠ మందురు. విభీషణుడీస్వామిని నిత్య మర్ధరాత్రమున పూజచేయునట. ఇచ్చట ముక్కోటికి గొప్పయుత్సవము జరుగును

దేవాలయము:- దాదాపు 4000 సంవత్సరములనుండి యున్నట్లు తెలుపునాధారములు గలవు. ఈదేవాలయ మలెగ్జాండరుదండయాత్రలకు పూర్వమే యున్నట్లు చరిత్రలవలన దెలియుచున్నది రంగనాథుడు చోళరాజుల కులదైవముగా నుండెను. కులశేఖరమహారాజు దేవాలయమును చాలభాగము మరమ్మతుచేయించెను. విశిష్టాద్వైతమతస్థాపకులైన శ్రీరామానుజాచార్యులవారు శ్రీరంగమున నివసించినట్లు చెప్పుదురు. వారు 120 సంవత్సరములు జీవించిరట. నాల్గవప్రాకారములో 1000 స్తంభములమంటపమున కెదురుగా వారిపేర నిప్పటికిని వారిసన్నిధి యున్నది.

ఈ దేవాలయము 7 ప్రాకారములు గలిగి 15 గోపురములతో పెక్కు కొబ్బరి. అరటితోటలమధ్య రమణీయముగ నిర్మించబడినది. అం దేడవప్రాకారపు (బయటినుండి మొదటిది) గోడ 3072 అడుగులపొడవున, 2521 అ. వెడల్పున 20 అ. 8 అంగుళముల ఎత్తున 6 అడుగులమందమున నల్లరాతితో కట్టబడియున్నది. గర్భాలయ ముందు మొదటిప్రాకారము 240 అ.పొడవు, 181 అడుగుల వెడల్పు గలిగియున్నది. ఈపట్టణము

కర్ణాటకనవాబులనుండి 1801 జులై 31వ తేదీన బ్రిటీషువారి హస్తగత మైనవి.

ప్రథమప్రాకారము:- ఇందు గర్భాలయము గలదు. దీనిని తిరువగు డెయని అందురు. ఈప్రాకారము 240అ. x181అ. ఆగర్భాలయమందు రంగనాథుడు శయనించినట్లు చాలపెద్ద విగ్రహ ముండును కర్పూరహారతి నిచ్చిన స్వామిదర్శనము బాగుగానగును. అర్చకున కొకఅణా యిచ్చిన అతడు (నేతి కాగడ) దివిటీ వెలిగించి స్వామిదర్శనము చేయించును. ద్వారములు వెండి బంగారు రేకులతో చేయబడియున్నవి. గర్భాలయముపై నున్నవిమానము (డోము) బంగారుతో మలాము చేసిన రేకులతో నిర్మించబడిన ప్రణవాకారవిమానము సప్తవేద శృంగములతో విలసిల్లుచున్నది. ఈ సప్తవిధనామములను శ్రీ అల్లూరు వేంకటాద్రిస్వామివారు తనకీర్తనలయందు పాడుకొనియున్నారు. ఈ బంగారపుపను లన్నియు కొంతవరకు 'జటవర్మసుందర' అనుమధురరాజు క్రీ. శ. 1260లో చేయించి నట్లు చరిత్ర గలదు. తిరిగి 1943లో 12 కలశములు గర్భాలయముపై విమానము బంగారుతో మలాముచేయించిరి. స్వామికి కొబ్బరికాయ నివేదనకు తీసికొనుఆచారము లేదు. గర్భాలయ విమానప్రదక్షిణచేయుప్రాకారపుగోడ యందు 108 దివ్యదేశముల స్వాములచిత్రములు చిత్రించబడియున్నవి. బంగారుధ్వజస్తంభము చూడనగును. గర్భాలయముమెట్ల కెదురుగా నున్న మంటపము చందనమండప మందురు. దానియం దద్దాలఅర కలదు. ఈ ప్రాకారములో కనకసీత గలదు. రంగనాథునిఅంత

రంగికభక్తులైన విజయరంగ, చొక్కనాథనాయకులకుటుంబ ప్రతిమలు గలవు. విభీషణాచార్యులగుహా శయన మొదలిఆళ్వారులగుడికి వెనుక కలదు ఎడమవైపున ధనుర్మాససేవలు మున్నగునవి చేయు పెద్దమంటపము గలదు. దీనికే రేవతి మంటపము, చిలకలమంటపము, పహాల్ పత్ మంటప మను పేర్లు గలవు.

2వ ప్రాకారము :- ఈప్రాకారమును విరజవటి యని అందురు. ఇందు డోలోత్సవము జరుగుమంటపము, పాకశాల, ఆంజనేయ దేవాలయము మొదలగునవి గలవు. ఈప్రాకారము 503 అడుగులపొడవు, 240అ. వెడల్పు గలిగియున్నది స్వామి వెనుక ఉత్తరద్వారము కలదు. దీనిని వైకుంఠైకాదశికి రంగులతో చిత్రించి స్వామి నాద్వారమున బయటకి కొనివత్తురు బంగారుధ్వజము గలదు. ఒంటిగరుడ స్తంభము గలదు. దీనిని దర్శించియే రంగనాథుని దర్శించెదరు.

3వ ప్రాకారము :- ఇది 767అ. పొ. 295 అడుగుల వెడల్పు కలిగియున్నది. దీనికి ఆవినాడ తేరువీథి యని పేరు. ఇందు శ్రీకోదండరామాలయము గలదు. ఈస్వామికి బంగారు తొడుపు కలదు. స్వామి నిలబడి రెండుగజములయెత్తుండును. ప్రక్కల చంద్రపుష్కరిణి గలదు. ఈప్రాకారములోనికి పంచములను రానీయరు. కొండ్రిమల్లనాయ డను ప్రభువు గొప్పకైంకర్యములు చేయుటచే ఆయన విగ్రహములు ద్వారము ప్రక్కన గలవు. కోదండరామస్వామిఆలయము ప్రక్కన భూలోకవైకుంఠమను విష్ణుమూర్తి శ్రీదేవి, భూదేవి,

నీళాదేవులతో వేంచేసియుందురు. ఆదినారాయణస్వామ్యాలయము గరుడాళ్వారువారి మంటపము ప్రక్కన గలదు. పట్టాభిషేకరామచంద్రమూర్తి ఆలయములో స్వామిప్రక్కన విభీషణాళ్వారులు గలరు. వరదనారాయణస్వామిమందిరము పడమటిద్వారములో మూయబడినది గోపురము లేదు ప్రసాదములు విక్రయించుశాల గలదు. ప్రధానద్వారమున కెదురుగా పెద్దగరుడాళ్వారు విగ్రహముతోగల విశాలమంటపము గలదు. దీనిప్రక్కన సూర్యపుష్కరిణి గలదు. (వాడుకలో లేదు) ఢిల్లీవిజయ స్తంభము గలదు (అనగా రామానుజుల వారు ఢిల్లీనుండి అనేకకష్టములకు గురియై రంగనాథుని తీసికొనివచ్చినవిధానము చిత్రింపబడినది.)

శ్రీరంగనాథస్వామివారి ఆభరణములు లక్షలకొలది విలువగలిగియున్నవి. వానిపనితనమున శతాబ్దములనుండి శిల్పక్రమమును చూడనగును ప్రకాశమునందును. విలువయందును కోహినూరువజ్రమును పోలినవజ్ర మొకటి యుండెడిది; కాని యీ వజ్రము నొకఫ్రెంచిదేశస్థుడపహరించి పరిష్యాదేశస్థుడైన సీజర్‌కు అమ్మినట్లు చెప్పుదురు. 1875 లో ఏడవఎడ్వర్డు ప్రిన్సుఆఫ్‌వేల్సుగా నుండుచు హిందూదేశమును దర్శించవచ్చినప్పు డీదేవాలయమును దర్శించి యొకబంగారు పళ్ళెమును స్వామి కర్పించెను. ఈ విలువగలయాభరణములను చూచుటకు దేవస్థాన కమిటికి ముందుగ తెలుపవలెను. వాహానములను, సొమ్ములను దర్శించుటకు రు.50 కట్టవలెను.

4వ ప్రాకారము:- ఈప్రాకారమునకు ఆళ్వార్ తిరుచ్చి యనిపేరు. ఇది 1235 అ॥ పొడవు 849 అ॥ వెడల్పు గలిగి యున్నది. ఈనాల్గుగోడలపై మూడుగోపురములుమాత్రమే గలవు. పడమటివైపు ద్వారముగుండ దొంగలు (అట నివసించు యిండ్లవారే) వచ్చి దేవునిసొమ్ముల నపహరించుటచేత ఆద్వారము మూసినట్లు చెప్పుదురు. తూర్పువైపుగోపురమును శ్వేతగోపురము 'వెల్లైగోపురము' దాదాపు 160 అ॥ ఎత్తుగలిగి శిల్పసౌందర్యమున తులదూగుచున్నది. ఈ గోపురము దాటి లోపల ప్రవేశింపగనే 450 అ॥ పొడవు 130 అ॥ వెడల్పుగల 1000 స్తంభములమంటపము కలదు. కాని యిందు 940 స్తంభములుమాత్రమే గలవు. మిగిలిన 60 స్తంభములు ఉత్సవ సమయములలో దూలములతో పందిరివేసి పెక్కు చెట్లతోను తోరణములతోను చిత్రవిచిత్రములుగ నలంకరించి 1000 స్తంభములు పూర్తిచేసి వేయిస్తంభముల మంటపము పేరు సార్థకపరచెదరు. ఈ రాతిస్తంభములు ఏకాండపురాతిలో గుండ్రముగ చెక్కబడియున్నవి. ఈ మంటపమున కెదురుగ శేషారాయర్ మంటపము గలదు. ఇందు నేకాండపురాతిలో కడుసున్నితమైన భాగములుగూడ కనుపించులాగున గుఱ్ఱములు, సింహములు, చెక్కబడియున్నవి. ఈశిల్పియొక్క శిల్పకళానైపుణ్యము దర్శనీయము. ఈవిగ్రహములు 7వ ప్రాకారములోని గోపురముపై ప్రతిష్ఠించుటకు తయారైనవి. కాని ఆ గోపురమును నిర్మించుచున్న విజయనగరప్రభువులు ఓడి, తద్రాజ్యపతనమగుటచే నీగోపురనిర్మాణము నిలిచిపోయినది.

శ్రీ ఉడయవరుల (శ్రీ రామానుజాచార్యుల) వారి చర్మ సమాధి గలదు. శ్రీవారు సమాధికాగానే అందుండి విగ్రహము పైకి వచ్చినదట. వారికి తిరుమంజనము (స్నానము) జరుపబడదు. గంధలేపననే సమర్పింతురు.

చక్రివర్తిఆళ్వార్ (చక్రిదేవత) పెద్దఆలయము గలదు. ఇంతవరకు (నాల్గవప్రాకారమువరకు) పంచములు వచ్చి నమస్కరించుకొని వెళ్ళవచ్చును. (నోటీసుబల్లలు కట్టబడియున్నవి.) దక్షిణద్వారముప్రక్కన తాయారు [ఆండాళ్లమ్మవారు.] సన్నిధి గలదు. వాహనమంటపము గలదు. వసంతోత్సవమంటపము, ఉయ్యాలమంటపం అమ్మవారి సన్నిధి చుట్టు చిత్రింపబడిన మంటపము గలవు. తెలుగులో పటముల వివరములు గలవు. దీనినిబట్టి చూడ తెలుగు రాజుల పరిపాలన కాలములో చిత్రిములు చిత్రింపబడినట్లు తెలియుచున్నది. పుష్పవనము గలదు.

శేషరాయర్ మంటపశిల్పము - శ్రీరంగము



శ్రీరంగనాంచార్ [అమ్మవారి దేవాలయము చాల పెద్దది.] శ్రీదేవి, భూదేవి శిలావిగ్రహములు, రంగనాయకిలోహ విగ్రహములు చూడనగును. దీని ప్రక్కన పెద్దమంటపము గలదు. దానిపై కప్పు అడుగుభాగమున, గోడలకు పురాతన చిత్రములు చిత్రింపబడి తెలుగులో వివరములు వ్రాసియున్నవి. కంబన్ రామాయణముచెప్పినమంటపము అమ్మవారిసన్నిధికి నెదురుగా నున్నది ఆయుర్వేదశాల, శ్రీకృష్ణసన్నిధి మంటపముతో, పెర్యేవాంచాన్ పళ్ళేసన్నిధి. శ్రీకోదండరామస్వామి [చిన్నది] తోతాచార్య, పార్థసారథిసన్నిధులు చూడదగినవి గోశాల గలదు. దాదాపు నలువదిఆవులు గలవు. యాత్రికులు గోవులకు అవిసిఆకులు ఆహారముగ తెచ్చి వేయుచుందురు.

శ్రీరంగవిలాస్:- దీనినే ప్రేక్షకహా లందురు. ఇందు తిరువణి, తిరుచూర్ణములు, పేముబుట్టలు, వింజామరలు, మడి సంచులు, తిరుచూర్ణముబుర్రలు, కొయ్యబొట్టుపెట్టె మొదలగునవి అమ్మదుకాణములు గలవు దీనిపైన ముందుభాగమున తిరుమంత్రము, శ్రీరామ, వరహ, గీతాచరమ శ్లోకములు విగ్రహరూపముగ నమర్చబడియున్నవి. నరనారాయణ తిరుమంతార్థముగూడ విగ్రహరూపమున గలదు. దీని కెదురుగ దేవస్థానము ఆఫీసు గలదు. ఆఫీసు నానుకొని గ్రంథాలయము, మ్యూజియము గలవు. మ్యూజియమునందు అనేకాయుధములు, చిత్రములు మొదలగునవి అమర్చబడియున్నవి.

5వ ప్రాకారము :- దీనికి ఉత్తరవీథి యని పేరు. ఇది 1653 అ పొడవు 1270 అ. వెడల్పు గలిగియున్నది. ఈప్రా

కారమందు జనులు నివసించునిండ్లు. వీథులు 5 బాటలు తీర్చియున్నవి. దేవాలయప్రాకారములలో నిట్లిండ్లతో నొక పెద్దపట్టణ ముండుట భారతదేశములో మరెచ్చటను లేదని చెప్పవచ్చును. రాజ్యపాలనావిధానమును, దైవసేవావిధానమును అన్యోన్యసహాకారముతో నడుపు నిట్టిపద్ధతిపై ఏసిప్రాజ్ఞుడైన యింజనీరు ప్లాను తయారుచేసెనో వాని నేర్పునకును, చాతుర్యమునకును ఆశ్చర్యము గలుగకమానదు. దేవాలయమునుండి స్వామి ఊరేగింపున కీవీథులగుండా పోవునపుడు ప్రతియింటిముందర చక్కగ ముగ్గులుదీర్చియుంచి ఆబాలగోపాలము వచ్చి, ఉత్సవములో మొదట వేదముపఠించుచు వచ్చువారికి నమస్కరించి తదుపరి స్వామికి సాష్టాంగనమస్కారములు గావించు టెంతయు ఆనందకరముగ నుండును. ఈప్రాకారమునందు శ్రీరంగనారాయణజియ్యర్ వారి, కందాడ వారి, వానమామలైమఠమువారి రామానుజకూటములు గలవు. వైశ్యులసత్రములు మొదలగుననేకసత్రములు గలవు. దక్షిణపువైపున గుడ్డలుఅమ్ముదుకాణములు గలవు. ఉత్తరపువైపున పెరుగు, కూరలు అమ్ముదురు.

6వ ప్రాకారము:- ఇది 2108 అ. పొడవు 1846 అ. వెడల్పు గలిగియున్నది. ఈప్రాకారమునకు చిత్రవీధి యని పేరు. చైత్రిమాసమందు (చిత్రిమాసమందు) జరుగు బ్రహ్మోత్సవ మీప్రాకారముగుండ వెళ్లునుగాన దీనికి చిత్రవీధి యని పేరు వచ్చెను. ఈప్రాకారమునందుకూడ జనులు నివసించుటకు నిండ్లు బారుతీర్చియున్నవి. దీనికి ఉత్తరమువైపున నాటు

కోటుశెట్టియార్లసత్రము గలదు. ఈప్రాకారదక్షిణద్వారము నకు కొంచెము ప్రక్కగ పోష్టాఫీసు గలదు. తూర్పువైపున అహోబిళజియ్యర్ గారి మఠము ను సాతానిరామానుజ కూటము, మనవాళ్ళమహామునిసన్నిధియు గలవు.

7వ ప్రాకారము:- ఇది 3072 అ. పొడవు 2521 అ. వెడల్పు గలిగియున్నది దీనికి అడైయవళైంజాన్‌వీధి అని పేరు. దీనినే సాతానులవీధి అనియు అందురు. ఇదియే చివర ప్రాకారము ఇందుకూడ జనులు నివసించుటకు నిండ్లు, మేడలు బాగులు తీర్చియున్నవి. తూర్పుద్వారముగుండ వెళ్ళిన శ్రీరంగమురైల్వేస్టేషను వచ్చును. ఉత్తరద్వారముగుండ వెళ్ళిన కొల్లడమునకు వెళ్ళవచ్చును. స్నానమునకు అను కూలము. కొల్లడ మనగా పాపములను నశింపజేయునది యని అర్థము. ఈనదిఒడ్డున తిరుమంగయాళ్వారులకు ప్రత్యక్ష మైన దశావతారమూర్తుల దేవాలయము, మంటపము గలవు.

1806 లో కృష్ణాజిల్లాలో అల్లూరుగ్రామమున జన్మిం చిన శ్రీ అల్లూరు వేంకటాద్రిస్వామి శ్రీ తూము నరసింహ దాసుగారి సాంగత్యమహిమచేత శ్రీ వేంకటాద్రిస్వామి జీవి తము ప్రహ్లాదుని భక్తిమార్గమున నడచినది. శ్రీరంగము లోని శ్రీరంగనాథునకు ఆయనఅమూల్యములైన ఆభరణ ములు చేయించిరి. ఈఆభరణాలంకారములను ఆనాడు మద్రాసుగవర్నరు లార్డు నేపియర్ దొర చూచి, వాని నెవరో హిందూరాజులు చేయించిరికాబోలు అనుకొనిరి. కాని అవి శ్రీ వేంకటాద్రిస్వామి చేయించిరని విని ఆయనను

దర్శించి ఆశ్చర్యమునొంది మూరు జీసెన్ కైస్తులాగా నున్నా రని ప్రశంసించసాగిరి.

ఆంధ్రభక్త మహాశయులైన శ్రీ అల్లూరు వేంకటాద్రి స్వామివారి సమాధి (తిరుపళి) గూడ నిచ్చటనే గలదు. అచ్చట మాఘబహుళ సప్తమి వారితీర్థ దినారాధన మహా వైభవముగ జరిపెదరు. ఆదేదినమున శ్రీ వేంకటాద్రిస్వామి వారి జ్ఞాపకార్థము శ్రీరంగనాథునకును, అమ్మవారికిని శ్రీ వేంకటాద్రిస్వామివారు సమర్పించిన అమూల్యాభరణ ములను అలంకరించి ఉదయము మొదలు రాత్రి తలుపులు మూయువరకును దర్శింప నవకాశము కల్పింతురు. పడమర ద్వారముగుండ వెళ్లిన తెప్పకొళము (కోనేరు) వచ్చును. ఇందు మాసి (మాఘ) మాసమందు తెప్పఉత్సవము జరు గును. అనగా నీటిమీద నొక పెద్దమేడవలె అందముగ కొబ్బరి, అరటి, చిత్రవిచిత్రమైన మొక్కలతో అలంకరింతురు. తెప్ప అంతయు పూలమాలలతో అలంకరించి అందు స్వామి నుంచెదరు దేదీప్యమానముగ ప్రకాశించు రంగులవిద్యు ద్దీపములచే నలంకరించెదరు. కోనేటిమధ్య నున్న మంటపము చుట్టును నెమ్మదిగ ప్రదక్షిణము చేయించెదరు. తెప్పయందు చక్కనిపాటకచ్చేరియో లేక నాగస్వరమో లేక భజనకాల క్షేపమో యేర్పాటుగావించెదరు. మధ్యమధ్య యెత్తైన చెట్ల నుండి బాణసంచా కాల్చుచుందురు. ఈ వేడుకను నేత్రా నందముగ దర్శించుటకు ప్రజలు తండోపతండములుగ వచ్చు చుందురు. ఇవి అంతయు రాత్రివేళ జరుగును గాన కడువేడు

కగా నుండును. దక్షిణద్వారముగుండ వెళ్లిన కావేరి వచ్చును. కాని యిది 1½ మైలు దూర ముండును. ఈ ద్వారముగుండ కొద్దిదూరము వెళ్ళిన బస్సుస్టాండు వచ్చును. బస్సుస్టాండుకు ప్రక్కన చిన్నఆలయము గలదు అందు శ్రీమాన్ అల్లూరు వేంకటాద్రిస్వామివారి అర్చావతారవిగ్రహము, చిత్రపటము ప్రతిష్ఠింపబడియున్నది. ప్రతిసంవత్సరము శ్రీ వేంకటాద్రి స్వామివారితీర్థ దినమున దేవస్థానమర్యాదలతో నగరోత్స వముల జరుపుచుందురు. ఈమార్గములోనే శంకరమఠము గలదు. కావేరీనదీతీరమున మధురకవి నందనవనము గలదు. దీనిని శ్రీరామానుజదాసువారు పోషించుచున్నారు. ఇది దాదాపు 20 యకరములవనము. ఇందు యకరముకొలది పుష్పజాతులు పెంచబడుచుండును. శ్రీరంగనాథస్వామికి ప్రతి నిత్యము పూలమాలలు కట్టి పంపుచుందురు. పూలమాలలు కట్టుటకు ప్రత్యేకపుగది గలదు. ఆగదిని మహాపవిత్రముగ నుంచుదురు.

దక్షిణద్వారమునకు రాయగోపురమని పేరు. దీనిని విజయనగరప్రభువైన అచ్యుతరాయలు కట్టించినట్లు చెప్పు దురు. దీనిశిల్పకళ చూడదగినది. శేషరాయర్ మంటపమున గల యేకాండపురాతి స్తంభములలో చెక్కబడిన గుఱ్ఱము లీగోపురమునకే తయారుకాబడినవి. కాని విజయనగర సామ్రాజ్యపతన మగుటచే నీపని యంతయు నసంపూర్తిగ విడిచిపెట్టబడినది. ఈ గోపురము పునాదినిబట్టి ఇది 300 అడు గుల యెత్తువరకు కట్టదలచియుండవచ్చునని తెలియుచున్నది.

దీనిలోపల సన్నని మెట్లు గలవు వానిమీదుగ ద్వారముపై కెక్కిన శ్రీరంగద్వీపముయొక్కయు, దేవాలయముయొక్కయు పూర్తిదృశ్యము కనుపించును.

భూలోకవైకుంఠమును బోలియున్న ఈ క్షేత్రమును ప్రతిభారతీయుడును తనజీవితములో నొక్కసారియైన స్వామి వైభవము, దేవాలయప్రాకారాదినిర్మాణములలోని ఇంజనీరింగు నేర్పరితనము, శిల్పకళావైభవము ప్రత్యక్షముగ దర్శించి ఆనందించవలెను. యుగములు మారినను, ప్రభువులు మారినను దేవాలయశోభ వైభవోపేతముగ నుండుట ఆనాటినిర్మాతల సద్భావబలమేయని చెప్పక తప్పదు.

ఉత్సవములు:- ధనుర్మాసములో (డిశంబరులో) వచ్చు వైకుంఠఏకాదశికి గొప్పఉత్సవము జరుగును ఆనాడు స్వామిని దర్శించిన సకలపాపములు పోవునని యాత్రికులు కడుదూర ప్రాంతములనుండి 50 లేక 60 వేలు వత్తురు. ఆనాడు స్వామికి రత్నకవచముక్తాకవచముల ధరింపజేయుదురు. ఈయుత్సవ వ్యవస్థ శ్రీరామానుజాచార్యులవారి కట్టుబాట్లప్రకారమే జరుపబడును. ప్రదక్షిణములో స్వామి సింహ, గజ, సర్ప, మండూక. మర్కటాదిగతులలో (నడకలలో) చూడనగును.

పుష్యమాసమున పునర్వసునక్షత్రముతో ముగియునట్లు పదిదినములు బ్రహ్మోత్సవము జరుగును. ఈయుత్సవమయోధ్యలో నుండగ శ్రీరాముడే యేర్పాటుగావించెనట. మాఘములో జరుగు బ్రహ్మోత్సవము శ్రీరామానుజా

చార్యులవారేర్పరచిరట. ఇవిగాక ప్రతిమాసములో నుత్సవములు జరుగుచుండును. ప్రతిఏకాదశికి, అమావాస్యకు తిరుమంజనము జరుగును.

పూజలరేట్లు:- సహస్రనామము 1-0-0, అష్టోత్తరము 0-4-6, కర్పూరహారతి 0-2-0. వాహనములు, ఆభరణములు చూచుటకు రు 50/- ఇచ్చుట తీర్థవిధులు పెట్టవలెను. దక్షిణకావేరి, తిరువంజనకావేరి, ఉత్తరకావేరి (కొల్లడం) లలో స్నానములు ముఖ్యము.

ప్రణవాకృతివిమానము, వేదశృంగము. చంద్రపుష్కరిణి. పొన్నవృక్షము, భుజంగశయనము. దక్షిణతిరుముఖమండలము, ధర్మవర్మకును, రవివర్మకును. విభీషణాచార్యులకును ప్రత్యక్షము.

శ్రీరంగముస్టేషనునుండి 1 ఫ. దూరములో నృసింహస్వామ్యాలయము గలదు. ఈదేవాలయవ్యయముగూడ శ్రీరంగదేవస్థానమువారిదే.

## జంబుకేశ్వరము

ఈక్షేత్రమునే తిరువనైకాడు తిరువన్నాయక్ కోయిల్ అందురు. ఇది గొప్పశివక్షేత్రము. శ్రీరంగమునుండి తిరుచునాపల్లి వెళ్లురోడ్డులో శ్రీరంగమునుండి 6 మైళ్ళదూరములో గలదు. ఇది పంచలింగములలో నొకటియగు ఆపోలింగము; అనగా జలలింగము. ఈ లింగమునుండి నిరంతరము నీరూరుచుండును. ఈక్షేత్రముకూడ శ్రీరంగద్వీపములోనిదే. ఈశ్వరునికి జంబుకేశ్వరుడనియు, అమ్మవారికి అఖిలాండేశ్వరి యనియు

పేస్లు. ఇదియు అనాది దేవాలయము కాని శిల్పవిషయమున శ్రీరంగదేవాలయముకన్న మిన్నయని చెప్పకతప్పదు.

వసతులు:- బండ్లు, సత్రములు గలవు. చక్కనిరోడ్లు గలదు. అన్ని వస్తువులు దొరకును.

దేవాలయము : ఇది ఐదు ప్రాకారములు గలిగియున్నది. గర్భాలయమునందు నిరంతర మెడతెగక (మున్నూటఅరువది యైదుదినములు) నీటిఊట వచ్చుచుండును. దీని వెనుక జంబూ (నేరేడు) వృక్షము కలదు. ఈ వృక్షముయొక్క ఆకులతో స్వామి నర్చించెదరు. శివుడు నేరేడుచెట్టుక్రింద కూర్చుండి భగవంతునిగూర్చి తపస్సుగావించి బ్రహ్మహత్యాపాపమును బోగొట్టుకొన్న పుణ్యభూమి.

మొదటిప్రాకారము:- ఇది 126 అ. పొడవు, 123 అ. వెడల్పు గలిగి 30 అ. ఎత్తున నున్నది. (లోపలనుండి మొదటిది) ఇందు గర్భాలయము కలదు.

2వ ప్రాకారము:- 306 అ. పొడవు 197 అ. వెడల్పు గలిగి 35 అ. ఎత్తున నున్నది. ఇందు కొన్ని మంటపములు గలవు. వాహనములకొట్లు గలవు.

3వ ప్రాకారము:- ఇది 745 అ. పొడవు, 197 అడుగుల వెడల్పు గలిగి 30 అడుగుల ఎత్తున నున్నది. ఇందు 100 అడుగుల ఎత్తు గలగోపురము గలదు. రెండవగోపురము 70అ. యెత్తుండును. ఈ ప్రాకారములోని శిల్ప మద్భుతము. ముందు భాగమును నూతనముగ నిర్మించిరి. నాలుగుముందు స్తంభములందు గొప్పపనితనము గలదు. ఆధ్వజ స్తంభమునొద్ద గల

మంటపముయొక్క నాలుగు స్తంభములు విచిత్రశిల్పముతో చెక్కబడియున్నవి. ఈ శిల్పమునుగూర్చి ఫెర్గుసన్ మున్నగు విదేశస్థు లాశ్చర్యపడుచు వ్రాసిరి.

చిన్నకోనేరు గలదు. 3వ ప్రాకారమునుండి ఉత్తరమున ద్వారముగుండా వచ్చిన అఖిలాండేశ్వరీ అమ్మవారిఆలయము, పెద్దమంటపము గలదు. గర్భగుడి నల్లని పాలరాళ్లు కప్పునకు కాండిల్ లాంపులతో అందముగ నుండును. అమ్మవారిబొట్టు నకుగా మాణిక్యము గలదు. విలువగల నగలు గలవు. అమ్మ వారు మిక్కిలి ఆకర్షణీయమై యుండును.

4వ ప్రాకారము:- ఈప్రాకారము 2436 అ. పొడవు, 1493 అ. వెడల్పు గలిగి 35 అ. ఎత్తున 6 అ. మందము కలిగియున్నది. చుట్టు తిరుగుటకు వీలులేదు. వెనుకగోపురము నొద్ద కొబ్బరితోట, కోనేరు గలవు.

5వ ప్రాకారము :- ఈప్రాకారమునం దిండ్లవరుసలు గలవు. దేవాలయమునం దంతటను గోడలపై నీదేవాలయమున కిచ్చినభూములు, జాగీరులు మొదలగువానిని తెలుపు ననేక శాసనములు గలవు. పెద్దతెప్పకోనేరు, దానిముందర 500 స్తంభములు గలమంటపమును గలవు.

## తిరుచునాపల్లి

ఇది గొప్పచారిత్రాత్మకమైనపట్టణము. జంబుకేశ్వరమునుండి దాదాపు 2 మై. దూర ముండును. బస్సుకు 0–1–9 చార్జీ యగును. వినోదముగ కావేరీనదిని దాటుచు కులాసాగా చల్లగాలికి నడిచి వెళ్ళవచ్చును. ఇది

1,43,000 జనసంఖ్య గల్గిన మ్యునిసిపాలిటీపట్టణము ఇది చెన్నరాజధానిలో 3వ పెద్దపట్టణము. 1. మదరాసు. 2. మధుర. ఇది కావేరీనదియొడ్డున నున్నది. ఇది తిరుచునాపల్లిజిల్లాకు ముఖ్యపట్టణము. ఇందు నాల్గురైల్వేస్టేషనులు గలవు తిరుచునాపల్లిజంక్షను – ఇది కంటోన్‌మెంటుకు సమీపము; 2. తిరుచునాపల్లి ఫోర్టు. ఇది పట్టణమునకు సమీపము. Goods-traffic అంతయు నిచ్చటనే జరుగును. 3. ట్రిచి టౌన్—ఇది పట్టణమునకును, కంటోన్‌మెంటునకును సమీపము. 4వది గోల్డెన్‌రాక్ (Golden Rock)—శ్రీరంగము రైలుమీద వెళ్లుటకు నిచ్చట దిగి మరల ఆబండి నెక్కవలెను. తంజావూరు నుండి వచ్చువారీస్టేషనుప్రక్క నున్న దక్షిణారైల్వేవారివాగనులు, పెట్టెలువగైరాల చేయుగొప్పకర్మాగారమును చూడనగును. కొన్నిలక్షలు వెచ్చించి, యిందు నవీన యంత్రములను స్థాపించిరి. ఇందు దాదాపు 5,000 నిపుణులచే పని సాగించుచున్నారు. జంక్షనుస్టేషనుప్రక్కన ద. Ry. వారి ప్రధాన కార్యాలయములు గలవు. 'తిరుచునాపల్లికోట' అనెడి మాట మాత్రమేకాని కోటగోడ లన్నియు తీసివేసి కందకము పూడ్చి వేయబడినది

వసతులు :- కావేరీసమీపమున సత్రములు గలవు. అనేకభోజనశాలలు, జట్కాలు, రిక్షాలు, టాక్సీలు వగైరా గలవు. జంక్షన్‌స్టేషనునొద్ద పట్టణమంతయు చూపుటకు గైడ్లు (Guides) ప్రతిరైలుకు వచ్చి యాత్రికులను కలిసికొందురు. ఈపనికి వారికి కొద్దిరుసు మియ్యవలెను. స్టేషనులో రిటైరింగు

రూములు గలవు స్టేషనులో Cloak Room (క్లోక్ రూమ్) గలదు. దీనియందు మనసామానులు భద్రపరచి శ్రీరంగపరిసర క్షేత్రములు దర్శించి వచ్చి మనసామానులు తీసికొనివెళ్ళ వచ్చును. దీనికి వస్తువుకు 0-2-0 వసూలుచేయుదురు. 'సామయపురం'లో ప్రతియేట డిశంబరు, జనవరి, మార్చి నెలలలో గొప్పపశువులసంత జరుగును.

చూడవలసినవి:- కొండమీద మధ్యభాగమున స్వామి మాతృభూతేశ్వరుడు. అమ్మవారు సుగంధికుంతలాంబిక వారి ఆలయము [శివాలయము] గలదు. దేవాలయపుముందుభాగ



మాతృభూతేశ్వర, మార్కండేయాలయము (తిరుచునాపల్లి)

మున శివచరిత్రసంబంధమైన అనేకచిత్రములు గలవు. పెద్ద బజారునకు పైనాబజారు కలియుకూడలికి సమీపమున కొండ పైకి వెళ్లుదారి కలదు. దీనిగర్భగుడి బజారుమట్టమునకు 273అ.



తెప్పకొళము (Rock-Temple) - తిరుచునాపల్లి

యెత్తున నున్నది. సముద్రపుమట్టమునకు 503 అ. యెత్తున నున్నది. ఈ దేవాలయము పల్లవులచే 11వ శతాబ్దమున నిర్మించబడినట్లు చెప్పుదురు. శివాలయమునకు పైన చిట్టచివర Tip-top) గణేశ్వరాలయము గలదు. ఇచ్చటి నుండి చూచిన తిరుచునాపల్లి పట్టణ మంతయు బారులుతీర్చి కనుపించును. కొబ్బరి చెట్లమధ్య శ్రీరంగద్వీపము. అందలి గోపురములు చూపరులమనస్సుల కానందము కలిగించకమానదు. కావేరీనదియు దానిపై పోవురైలుబండిదృశ్యము కడువిచిత్రముగ నుండును. మరియొకవైపున పట్టణ మంతయు ప్లానుగీచినట్లు చక్కనిదృశ్యమున

గోచరించును. వినాయక దేవాలయమునుండి దిగివచ్చుదారిలో గంటలు కొట్టుగది గలదు. (Bell house) 0-0-3 వేసిననే పైకి పోనిత్తురు ఉదయము 7 గం॥ నుండి సా॥ 6 గం॥ వరకు పోనిత్తురు.

తెప్పకొళం: కొండక్రిందిభాగమున పెద్దకోనేరు గలదు. అందు మధ్యలో మంటపము గలదు ఈ కోనేటికి సమీపమున క్లైవు నివసించినబంగళా గలదు. ఇం దిప్పుడు కళాశాలను నడుపుచున్నారు.

నవాబుభవనములు:- ('The Navab's Palaces ఇం దిప్పుడు ఠానుహాలు, తాలూకాఆఫీసు, రిజిష్ట్రారాఫీసులు మొదలగునవి గలవు. అయినను ఇవి తప్పక చూడదగినవి.

చందాసాహెబుటూంబ్:- ఇది ఫోర్టుస్టేషనుకు సమీ



నగర, ఆలయ, తెప్పకొళముల దృశ్యము-తిరుచునాపల్లి

ఃమున గలదు. ఇది హిందూదేవాలయముల సామానులతో [స్తంభములు దూలములు మొదలగునవి] తానే సొంతముగా నిర్మించినట్లు చెప్పుదురు. చరిత్రిసంబంధమైన అనేకభవనములు చూడనగును.

ఉత్సవములు :- ఆగష్టునెలలో నీశ్వర, గణపత్యాలయములలో గొప్పఉత్సవములు జరుగును. అప్పుడు యాత్రికులు విశేషముగ వత్తురు.

తయారగువస్తువులు:- ఈ పట్టణము రత్నవ్యాపారము (Rubies) లో ప్రపంచప్రఖ్యాతి గాంచినది. ఇచ్చట శిగరెట్టు ఫ్యాక్టరీ గలదు. వెండిబంగారములలో గొప్ప పనితనముతో చేయుపనివాండ్రు విశేషముగ గలరు. ధాన్యము, అరటి, కొబ్బరి మామిడి విశేషముగ దొరకును.

## అన్బిల్ లేక ప్రేమపురము

ఇది 61వ దివ్యదేశము. శ్రీరంగమునుండి వృద్ధాచలము లైనులో దిగి 5మై పోవలెను. ఎట్టియేర్పాట్లు లేవు. ప్రత్యేకముగ వంటచేసికొనవలెను. ముందు తెలిపిన దేవాలయములో ప్రసాదము లభించును. తిరువడివళగియనంబి, అళగియవల్లి నాంచారు. మండూకపుష్కరిణి.

## తిరుప్పేర్నగర్

ఇది 62వ దివ్యదేశము ఇది అన్బిల్ క్షేత్రమునుండి 2 మైళ్ళదూరములో నున్నది. బండ్లు, సత్రిములు గలవు. గ్రామమునకన్న ఆలయము అనాది. ఇది 20 అ. యెత్తున

నున్నది. అప్పక్కొడుత్తార్ పెరుమాళ్, కమలవల్లి తాయార్, ఇంద్రతీర్థము. ఇచ్చటికి 5 మైళ్ళదూరమున కావేరీనదిపైన 'విల్లింగ్డన్' డాము చూడదగినది.

## కదంబనూర్

ఇది 63వ దివ్యదేశము. శ్రీరంగమునుండి కొల్లడం దాటిన దాదాపు 2 మైళ్ళలో నీక్షేత్రము గలదు. బండ్లు గలవు. భోజనశాలలు లేవు. క్షేత్రములో ప్రసాదము దొరకును. ఇచ్చట పురాతనమైన శివాలయము, బ్రహ్మాలయము. అరటి చెట్లు చూడదగినవి. పురుషోత్తముడు. పూర్వాదేవినాంచారు, కదంబతీర్థము.

## తిరువెళ్ళరై

ఇది 64వ దివ్యదేశము. కదంబనూరునుండి 7 మై. దూరముండును. బండ్లు గలవు. సత్రములు లేవు. క్షేత్రములో ప్రసాదము లభ్యమగును. పంగుని [ఫాల్గున] మాసములో బ్రహ్మోత్సవము జరుగును. పుండరీకాక్షులు, పంకజవల్లి నాంచారు, కుశలతీర్థము మొదలగు 8 తీర్థములు గలవు.

## ఉఱైయూర్

ఇది 65వ దివ్యదేశము. దీనినే బీబీనాంచార్ దేవాలయమందురు. ఇది తిరుచునాపల్లినుండి మైలుదూరములో నున్నది. బస్సులు గలవు. పూర్వమొకప్పుడిది చోళరాజులముఖ్యపట్టణముగ నుండెను. కాని యిప్పుడాచిహ్నము లేవియు కనుపించవు. రాళ్ళపైనను, దేవాలయపుగోడలపైనను కొన్ని

శాసనములు గలవు. బండ్లవసతి గలదు. సత్రములు లేవు. భోజనశాలలు గలవు. తిరుప్పాణాళ్వార్ అవతరించినస్థలము. బస్సులు కలవు. ఈ దేవాలయవ్యయ మంతయు శ్రీరంగదేవాలయమునుండియే నడచును. పూర్వ మొకకోడి యేనుగును జయించుటచేత నీయూరికి 'కోళియూర్' అనుపేరు కలిగెను.

☞ ఇచ్చటినుండి తిరుచునాపల్లిజంక్షనుకు వచ్చి మానమధురమీదుగా రామేశ్వరము వైపునకు ప్రయాణము సాగించవలెను.

## నార్తుమలై

ఇది తిరుచునాపల్లిజంక్షనుకు 23 మైళ్ళు 0-12-0చార్జీ. ఇది స్టేషనుకు సమీపము. ఈనార్తుమలై చుట్టు నెనిమిదిపర్వతములచేత చుట్టబడి జైనశిల్పముతో నలరారు గుహాలతో దర్శనీయమై యుండును. ఈ గుహాలశిల్పము 9వ శతాబ్దమునాటి దందురు. ఇచ్చట మారియమ్మదేవాలయము గలదు. ఇందు వార్షికపుష్పపూజ చాలవిశేషముగ జరుగును.

## తిరుమెయం లేక సత్యగిరి

ఇది 66వ దివ్యదేశము ఇది నార్తుమలైనుండి 20 మై. రైలుకు 0-11-0చార్జీ. ఇచ్చట శివాలయము, విష్ణ్వాలయము, రెండు నొకేమాదిరిగ నొక గుహయందు నిర్మించబడినవి. కొండపై నున్నకోట చూడదగినది. దేవాలయములు కొండ గుహాలలో గలవు.

వసతులు :- బండ్లు భోజనశాలలు గలవు. నాటుకోటు చెట్టియార్లసత్రము గలదు. అన్నివసతులు గలపట్టణము. వైశాఖమాసమున 10 దినములు బ్రహ్మోత్సవము జరుగును.

## తిరుకొట్టియూర్ లేక గోష్ఠిపురము

ఇది 67వ దివ్య దేశము. ఇది తిరుమెయ్యంనుండి దాదాపు 20 మై. దూరము. లేక మానామధుర స్టేషనునుండి 20 మై. బస్సులు గలవు. ఈ దేవాలయగోపురముపై కెక్కి, తా నొకడు నరకమునకు పోయినను సర్వప్రజలతరింపుకొరకు, శ్రీరామానుజాచార్యులవారు తిరుమంత్రార్థమును వెదజల్లిరట. శ్రీరామానుజాచార్యులవారి కిచ్చట ప్రత్యేకాలయములు గలవు. ఇంత పెద్దగోపురము మరెచ్చటను లేదందురు.

హిరణ్యకశిపువలనిబాధలకు తాళలేక దేవత లీప్రదేశమున సమావేశమై గోష్ఠి చేసినందున నీయూరికి గోష్ఠీపురమను నామము గలిగెను.

వసతులు :— సత్రములు, భోజనశాలలు గలవు. క్షేత్రమున ప్రసాదము లభించును. బస్సులు, బండ్లు గలవు. చైత్రమాసమందు 10 దినము లుత్సవములు జరుగును

## చెట్టినాడ్, కారైక్కుడి

అదేలైనుమీద నున్నస్టేషనులలో చెట్టినాడ్, కారైక్కుడి ముఖ్యమైనవ్యాపారపట్టణములు. ఇది దాదాపు 30 వేల జనాభాగలపట్టణము. చెట్టినాడులో నాటుకోటిచెట్టియార్లనెడి యొకగొప్ప తెగవారు గలరు. వీరు గొప్పధనికులు. వీరు దక్షిణ భారతమున వ్యాపారములలో ప్రవీణులు. వీరు బర్మా, రంగూన్, శింగపూర్ మొదలగుతావులలో విశేషవ్యాపారము సాగించెదరు. వీరు ధనమునకుతోడు విశేషదైవభక్తి, భూతదయ గలవారగుటచే దేశములో ననేకజీర్ణ దేవాలయముల నుద్ధరిం

చియు, నూతన దేవాలయముల నిర్మించియు, అనేక క్షేత్రములలో యాత్రికులసౌకర్యార్థమై సత్రముల నిర్మించి అందు నిరంతరాన్నదానములను సాగించుచుందురు. అన్నామలై చెట్టియార్ వంటి మహనీయులు విద్యాభిమానులు చిదంబరములో లక్షలు వెచ్చించి 'అన్నామలైయూనివర్సిటి' నెలకొల్పి వారి విద్యాభిమానమును ప్రకటించిరి.

వీరు స్వయముగ నివసించుభవనములు దేవేంద్రభవనముల పోలియుండును. ఆకసము నంటుచున్నట్లు రైలులో పోవు యాత్రికులను సైతమాకర్షించును.

వసతులు : చెట్టినాడుస్టేషనుకు సమీపమున సర్ అన్నామలై చెట్టియార్ విశ్రాంతిగృహములు (Retiring rooms) గలవు. ఇచ్చటినుండి దేవకోటకు దక్షిణరైల్వేవారి ఔట్ ఏజన్సీ బస్సుసర్వీసు గలదు.

## రామనాథపురము (రామనాడు)

కారైక్కుడినుండి మానేమధురజంక్షను దాటి (ఇచ్చటనుండి ఒకలైను రామేశ్వరమువైపునకు, మరియొకలైను మధురవైపునకును పోవును.) 75మై. రైలుమీద ప్రయాణముచేసిన రామనాడుస్టేషను చేరుదుము. రైలుకు రూ. 2-8-0 అగును. ఇది దాదాపు 20 వేలు జనసంఖ్యగలపట్టణము. ఇది రామనాడుజిల్లాకు ముఖ్యపట్టణము. రామేశ్వరమునుండి పండాలమేజంట్లిచ్చటికి వచ్చి యాత్రికులను వేధించి తమబసలకు గొని పోవుదురు.

వసతులు :- స్టేషనుకు 2 ఫర్లాంగులదూరములో సత్రములు గలవు. భోజనశాలలు గలవు. స్టేషనుకడ బండ్లు, జట్కాలు, బస్సులు గలవు సత్రమునకు నడచి వెళ్ళవచ్చును.

చూడదగినవి :- నవీనప్రపంచమున హిందూదేశాధ్యాత్మిక జ్యోతిని ప్రకాశింపజేసిన శ్రీమద్వివేకానందస్వామి అమెరికానుండి తిరిగి భారతదేశమునకు వచ్చునప్పుడు రామనాడుమహారాజావారు స్వామివారికి ఘనస్వాగత మిచ్చి వారి దిగ్విజయయాత్రాచిహ్నముగ నొక స్తంభమును నెలకొల్పిరి. దీనిని గాంచనగును. పురాతన, నూతనరాజభవనముల చూడనగును. నూతనభవనములో రామనాథ్ మందిరము గలదు. అందు శ్రీరాముని పాదుకలు పెట్టి పూజించెదరు. దీనియందు గోడలకు సేతుపతుల పరంపరఫోటోలు, ఇతరప్రభువులచిత్రములు అలంకరించబడియున్నవి. ముఖ్యముగ రాజభవనములో 'రామలింగవిలాస్' అనుహాలునందు శ్రీరామచంద్రునిచే రాజ్యాభిషిక్తుడైన సేతుపతిని [గుహుని] కూర్చుండబెట్టినశిల ఉన్నది. గుహునిసంతతివారే సేతుపతులని తెలుపుదురు. వారినే మార్వారు లనియు పిలుతురు.

☞ ఇచ్చటనుండియే దర్భశయనము, నవపాషాణములకు వెళ్లి తిరిగి రామనాడు వచ్చి, రామేశ్వరమునకు ప్రయాణము సాగించవలెను.

## దర్భశయనము

శ్లో. శ్రీదర్భశయనస్థానే - దర్భసుందరదైవతమ్ ।
దర్భశయ్యాశయానం చ - శ్రీరామం సానుజం భజే.

శా॥ దర్భశయన మనెడిస్థలమున దర్భశయ్యపై బవళించినట్టియు, దర్పకాం
దమువలె సుందరమూర్తియైనట్టియు, తమ్ముడగు లక్ష్మణునితో చేర
యున్నట్టి శ్రీరామచంద్రమూర్తిని సేవింతును.

శ్రీరాముడు లంకకు బోవుటకు సముద్రమధ్యమున సేతువును గట్టదలచి, యెంతప్రార్థించినను సముద్రుడు మార్గమీయనందున, బాణ మెక్కుపెట్టగా భయపడి సాక్షాత్కరించి, సేతువు గట్టునుపాయ మెరిగింప నీలాదివానరులచే నట్లు నిర్మింపించెనట.

ఇది రామనాడుస్టేషనునుండి దాదాపు 6 మైళ్లుండును. అచ్చటినుండి సముద్రమునకు 3 మై. దూరము కలదు ఇది యొకచిన్న గ్రామము. ఇది 68వ దివ్య దేశము. దీనినే 'తిరుపుల్లు' అందురు. రామేశ్వరమునుండి తిరిగి వచ్చునప్పు డీక్షేత్రమును దర్శించునాచారము గలదు రామేశ్వరయాత్ర పూర్తియైనట్లుగ నిచ్చట కొంతకలాపము గావించెదరు.

వసతులు:- చక్కనికంకరరోడ్డు గలదు. బండ్లు, బస్సులు గలవు. బస్సులో వెళ్ళునెడ సౌకర్యము లేదు. రాను పోను సముద్రమువరకు బండ్లు మాట్లాడుకొని తిరిగి రామనాడులో దించులాగున నేర్పాటు చేసికొనవలెను. బండికి 1-0-0 మొదలు 2-0-0 వరకు తీసికొందురు. గ్రామములో దేవాలయమునకు ముందర, రోడ్డుప్రక్కన జిల్లాబోర్డువారిసత్రము గలదు. గదులిచ్చెదరు. గ్రామమున భోజనశాలలు గలవు. సముద్రతీరమున నున్న బావికడ ముందు స్నానముచేసి పిదప సముద్రస్నానము చేయవలెను. పండాకు 0-4-0 మొద లెంతయైన దానము చేయవచ్చును.

చూడదగినవి:— సముద్రస్నానముచేసి మరల 3 మై. వెనుకకు వచ్చి దేవాలయములో ఆదిశేషునిపై శయనించి నట్లున్న శ్రీరాముని సేవింపవలెను. గర్భాలయమునకు బయట విభీషణ సుగ్రీవవిగ్రహములుగలవు. జగన్నాథస్వామిఆలయము గూడ గలదు. అమ్మవారికి ప్రతిశుక్రవారము కల్యాణము జరుగును. ఈ దేవాలయము వెనుక గొప్పఅశ్వత్థవృక్షము గలదు. దానిక్రింద ఋషీశ్వరులు తపస్సుచేసినట్లు చెప్పెదరు. ఇచ్చట నాగప్రతిష్ఠచేసిన తప్పక సంతానముకలుగునని ప్రతీతి. ఇందుకు రూ 11–1–6 చెల్లించిన నాగప్రతిష్ఠకు సంబంధించిన దంతయు దేవాలయమువారే జరిపెదరు. ఈ వృక్షముక్రింద అనేకనాగప్రతిష్ఠలు చేయబడియున్నవి. ఇచ్చట స్వామికి నివే దించినపాయసము యాత్రికులు తప్పక స్వీకరించవలెను. తిరిగి రామనాడుకు రావలెను.

☞ బరువుగలసామానులు లేనివారు రానుపోను బస్సుపై వెళ్ళుట మంచిది. సామానులు గలవారు రానుపోను బండ్లమీద వెళ్ళుట మంచిది. దైవదర్శనానంతరము వంటచేసికొని భుజించి బయలుదేరి రామనాడుకు చేరవలెను. అచ్చటినుండి బండిమీద దేవీపట్టణము నకు వెళ్లి తిరిగి రామనాడు చేరి రామేశ్వరమువైపు ప్రయాణము సాగించవలెను.

## దేవీపట్టణము లేక నవపాషాణము

రామనాడునుండి యీశాన్యముగ 10 మై. దూరమున దేవీపట్టణము గలదు. చక్కనికంకరరోడ్డు గలదు. రామేశ్వర యాత్ర చేయువారు ముందు దేవీపట్టణము వెళ్లి అచ్చటినుండి

రామనాథుమీాదుగా రామేశ్వర రామలింగేశ్వరుని సేవించు కొని తిరిగినచ్చుమార్గములో దర్భశయనము సేవించు సంప్రదాయ మొకటి కలదు. దేవీపట్టణమునొద్ద సముద్రము తరంగములు లేక, మోకాటిని మించులోతు లేక ప్రిశాంతముగ నుండును

వసతులు :- ఇచ్చట సత్రము కలదు. అన్నివసతులు కలవు. బ్రాహ్మణులకు సత్రములో నుచితభోజనవసతి కలదు. ముందుగ చెప్పిన భోజనశాలలలో భోజనవసతి లభించును. నవగ్రహపూజకు కావలసినవస్తువు లన్నియు అచ్చటనే దొరకును. రామనాథునుండి బండికి రానుపోను 1-0-0 తీసికొందురు. ప్రితిబుధవార మిచ్చట సంత జరుగును. బస్సులు కూడ కలవు.

## నవగ్రహములు

శ్రీరాముడు సీతాన్వేషణము చేయుచు వచ్చినప్పుడు శన్యాదిగ్రహానుగ్రహమునకై ఇచ్చట నవగ్రహముల పూజించినట్లు చెప్పెదరు. ఆనవగ్రిహచిహ్నముగ నిప్పటికిని సముద్రిములో దాదాపు 100 గజములదూరమున నీటినడుమ తొమ్మిది పాషాణస్తంభములు ప్రితిష్ఠించబడియున్నవి. ఈనవగ్రహముల పూజించుటకుముం దొడ్డున నున్న కోనేటియందు స్నానము చేయుదురు. అందు స్నానముచేయువారు దిబ్బెనలో అణా తప్పక వేయవలెను. తరుపరి యాత్రికులు సముద్రిములోనికి వెళ్ళి నవగ్రిహములను పూజింతురు. పండాకు 0-4-0 మొదలు



నవగ్రహములు – నవపాషాణము

శక్తికొలది యెంతయైన దాన మియ్యవచ్చును. పూజాదులు గావించి తిరిగి రామనాడుస్టేషనుకు రావలెను.

## కిలకరాయ్

ఇది రామనాడునుండి 9 మై. దూరమున ఆగ్నేయముగ తూర్పు దక్షిణముగ నున్నది. ఇది దాదాపు 15 వేల జనసంఖ్య గల పట్టణము. ఇది పూర్వము పాండ్యరాజులకు ముఖ్యపట్టణముగ నున్నట్లు చెప్పుదురు. ఇచ్చట సముద్రమునందు గవ్వలు, శంఖములు మొదలగునవి విశేషముగ దొరకును. ఈ వ్యాపారమునం దీపట్టణము ప్రసిద్ధి. రామేశ్వరమునం దమ్మెడిపలురకముల గవ్వలు, శంఖములు మొదలైనవన్నియు నిచ్చటినుండి తేబడినవే. సముద్రతీరమునం దిసుకలో పురాతనపు రోము, పాండ్య, డచ్చి, ఇండోఫ్రెంచి దేశపునాణెములు దొరకుటచేత

పూర్వ మీపట్టణము రాజధానీనగరముగ నుండెననియు, నితర దేశములతో వ్యాపారసంబంధము గల్గియుండె ననియు తెలియు చున్నది. నేటికి నిది తీరవ్యాపారములోను రంగూన్ వ్యాపారములోను ప్రఖ్యాతి వహించినది.

## మంటపము

ఇది రామనాడునుండి 22 మై. 0-12-0 రైలుచార్జీ అగును. ఇచ్చట సిలోన్ గవర్న మెంటువారు సింహళ దేశమునకు వెళ్ళదలచు మూడవతరగతిప్రయాణికుల యారోగ్యపరిశీలనకై యిచ్చట సిలోన్ గవర్న మెంటువారి క్వారెంటెయిన్ (Quarantine Camp) క్యాంపు గలదు. ఇచ్చట నుండుసిలోన్ గవర్న మెంటు ఆఫీసువారి హెల్తుసర్టిఫికెట్ పొందిననే సిలోనుకు పోనిచ్చెదరు.

వసతులు:- సత్రము గలదు. అందు బ్రాహ్మణులకు భోజనవసతి కలదు. ఇచ్చట సంవత్సర మంతయు చల్లగ నుండును.

## పాంబన్ జంక్షన్

ఇది మంటపముస్టేషనునుండి 5 మై. 0-3-0 చార్జీ. వచ్చుదారిలో ప్రయాణికులు జాగ్రత్తగ ప్రక్కన చూచు చుండవలెను రామేశ్వరము ద్వీపము; అనగా అన్నివైపుల సముద్రజలముచే చుట్టబడియున్నది. ఆద్వీపమును రైల్వేమీద ప్రవేశించుటకు గాను సముద్రముపై 1½ మైళ్లు పొడవుగల రైలువంతెన (Scharzer Roller Bridge) 1914 సంవత్సరములో రైల్వేవారిచే నిర్మించబడినది. యాత్రికుల కీదృశ్యము

SCHARZER ROLLER BRIDGE.



పాంబన్ బ్రిడ్జి

కనుపించును. ఈ వంతెన యేర్పాటులోనితమాషా యేమన వంతెనమధ్యభాగములో దాదాపు 200 గజముల పొడవున నుండు రెండుపట్టాలును యంత్రమూలమున నెత్తుగా లేపబడును అప్పుడు స్టీమర్లు పోవుటకు మార్గమేర్పడును. స్టీమర్లు వెళ్ళినతరువాత మరల నది వాలి రైల్వేలైనుగా నేర్పడును. ఇది చూచుటకు కడువిచిత్రముగ నుండును పాంబన్ స్టేషను నుండి దాదాపు 1½ మైలులో నీబ్రిడ్జి కలదు. నడచి వెళ్ళి ఈ బ్రిడ్జి నంతయు జూడవచ్చును

## రా మే శ్వ ర ము

ఇది యొకద్వీపము. ఇది దాదాపు 25 మై. పొడవు, 8 మైళ్ళు వెడల్పు గలిగి బాబుల్ అనెడిగొడుగు ఆకారముగా నుండు పొదలచేతను, కొబ్బరి, తాటిచెట్లతోడను దివ్యద్వీపముగ వెలయుచున్నది. ఈ ద్వీపము సముద్రముచే చుట్టబడియున్నది. ఇది దాదాపు 8000 జనసంఖ్య గలిగి కొబ్బరి తాటిచెట్లచే కళకళలాడుచుండును. ఇందు దేవాలయమున కుత్తరముగ పెద్దబజారు గలదు. అన్ని వస్తువులు దొరకును. దేవాలయములో విద్యుద్దీపములు గలవు. ఇది ద్వాదశజ్యోతిర్లింగములలో నొకటి ఈపట్టణము 1½ మై పొడవు, ½ మై. వెడల్పున నున్నది.

ఈక్షేత్రము నాలుగుధామములలో నొకటి.

అవి యేవన—

| 1. రామనాథ్ | 2. ద్వారకనాథ్ | 3. జగన్నాథ్ | 4. బదరీనాథ్ |
|---|---|---|---|
| \| | \| | \| | \| |
| రామేశ్వరము | ద్వారక | పూరీజగన్నాథము | బదరీనాథము |

ప్రతిభారతీయుడు తనజీవితములో ఒక్క పర్యాయమైన గంగాజలముతో రామలింగేశ్వరునికి అభిషేక మొనరించిన జాలు; సర్వపాపవిముక్తుడై కృతార్థు డగును. దేవాలయ ద్వారముకడ 1గం. సేపు నిలుచుండి పరీక్షించిన హిందూదేశము యొక్క అన్నిమూలలనుండి యాత్రికు లుత్సాహముతో రామేశ్వరనాథు నెప్పుడు కండ్లారజూతుమాయని ఆదుర్దాతో ఆర్తితో వచ్చుట చూచెదము - బెంగాలీలు, పంజాబీలు, ఆంధ్రులు, ఓఢ్రులు, మహారాష్ట్రులు, గుజరాతీయులు, ఉత్తర హిందూస్థానసాధువులు, బైరాగులు, సన్యాసులు మొదలగు నానాజనులను గాంచి యాత్రికుడు కడు సంతసించును. మొదట 100గ. దూరమున నున్న సముద్రములో స్నానముచేసి స్వామిని సేవింపవలెను. శతాబ్దములనుండి యీ క్షేత్రము హిందువులకు లక్ష్యమై యున్నది. దీనినే 'Unchanging City' 'మార్పులేని నగరము' అని అందురు; అనగా రాజ్యములు మారినను, నగరములు శిథిలమైనను ఈక్షేత్ర మట్లే నిలిచియున్నది. సింహద్వారము 100 అ. యెత్తున నున్నది.

వసతులు :- అన్ని సంప్రదాయములవారికి సత్రములు గలవు. స్టేషనుకడ బండ్లుండును. కూలీలు గలరు. కొనుటకు ప్రసాదము దొరకును. భోజనశాలలు గలవు. బజారులో అన్ని వస్తువులు లభ్యమగును. పోష్టాఫీసు గలదు. పండాలు స్టేషనుకడకు వచ్చి యాత్రికులను దమయిండ్లలో బసచేయ పీడింతురుగాని సత్రములలో దిగుట మంచిది. క్షేత్రమున ప్రవేశించిననా డుపవసించి, మరునాడు లక్ష్మణతీర్థములో స్నానము చేసి, హిరణ్యశ్రాద్ధము పెట్టవలెను. కనీసపు రేటు రూ.1-4-0.

చూడవలసినవి:- రామేశ్వర దేవాలయము ముఖ్యము. ఇది శివక్షేత్రము. శ్రీరాముడు బ్రాహ్మణుడగు రావణాసురుని జంపి, లంకాపురినుండి వచ్చినప్పుడు బ్రహ్మహత్యానివారణార్థ మీలింగమును ప్రతిష్ఠ చేసినట్లు చెప్పుదురు. అందువనే స్వామిని శ్రీరామలింగేశ్వరు డందురు. ఈదేవాలయము మూడు ప్రాకారములు గలిగియున్నది తూర్పుగోపురము 126అ. యెత్తున 50 సంవత్సరములకు పూర్వము గట్టబడినది. పశ్చిమగోపురము 76అ. యెత్తున మొదటిగోపురముకంటె పురాతనముగ గనబడుచున్నది. రెంటిమీదను ఈజిప్టుదేశశిల్పమును బోలినశిల్పమున కనిపించు విగ్రహములు చెక్కబడియున్నవి. ఉత్తర, దక్షిణగోపురము లసంపూర్తిగ నున్నవి. 1173లో సింహళదేశప్రభువగు పరాక్రమబాహు వీదేవాలయమును గొంత వృద్ధిపఱచినట్లు చెప్పుదురు. ఈప్రాకారములు గోపురములు ముఖ్యముగ 1434 నుండి 1770 వరకు అనగా దాదాపు 350 సంవత్సరములలో రామనాథపుర ప్రభువుల చేత పూర్తిగావింపబడినవి. దేవాలయమంటపముల కుపయోగించబడినరాళ్లు 40 అ. పొడవు గలవి. సింహళము (సిలోను) నుండి అతివ్యయప్రయాసలకు లోనై తేబడినట్లు చరిత్రవలన తెలియుచున్నది.

మొదటి ప్రాకారమునందు గర్భాలయము గలదు. ఇందు శ్రీరామునిచే ప్రతిష్ఠింపబడినలింగమునకు మున్నూటఅఱువదియైదుదినములు గంగాజలములతో మహావైభవముగ నభిషేకము, హారతి జరుగుచుండును. దీనిప్రక్కనే కాశీవిశ్వేశ్వరుడను శివలింగము గలయాలయ మున్నది. దేవాలయము

వెనుక సేతుపతు లశ్వారూఢులై యున్నట్లు కంచువిగ్రహము లుంచబడినవి స్వామికి ఉదయము, 5గం. లకే పంచామృత స్నానము గావించెదరు. ఆలయమంతయు సున్నము. ఇటుకతో కట్టబడినదిగాని క్రమముగ నాటుకోటిచెట్టియార్లు (మొదటి ప్రాకారము) రాతితో కట్టిరి.

ఆంజనేయుడు కాశీనుండి లింగమును తెచ్చుట ఆలస్యమైనందునను. సుముహూర్తము దాటిపోవుచున్నందునను సీతమ్మ యిసుకతో లింగమును జేయగా శ్రీరాముడు ప్రతిష్ఠించెనట. తరువాత ఆంజనేయస్వామి తెచ్చినకాశీవిశ్వనాథ లింగమును ప్రక్కగ ప్రతిష్ఠించిరి. ఆలయముపైవిమానమును. రామలింగేశ్వరస్వామివిమానమును అనేకవిగ్రహములతో నూతనముగ 1946 లో తయారుచేసిరి 1947 లో కుంభాభిషేకము మహావైభవముగ జరిగెను. ఈప్రాకారములో కోటి తీర్థము సర్వతీర్థము గలవు. మిగిలినతీర్థము లితరప్రాకారములలో గలవు సర్వతీర్థజల మమృతమే.

2వ ప్రాకారము:- ఇది 500 అ. X 300 అ. గలిగి నూతనముగ నాటుకోటుచెట్టియార్లచే కట్టబడుచున్నది దీనిని నిర్మించుటకు 40 అ. పొడవుగల రాతిదూలములను బహుధన వ్యయప్రయాసలతో చేర్చిరి. కట్టడము లన్నియు రాతితో నిర్మించుచున్నారు. అమ్మవారిదేవాలయగోపురము, గొప్ప నందీశ్వరుని సున్నముతో నిర్మించి రంగులువేసిరి. ఎక్కువ తీర్థము లిందు గలవు

3వ ప్రాకారము:- ఇది 1000 అ. పొడవు. 600 అ. వెడల్పు గలిగి నాలుగువైపుల సున్నముతో ఆర్చిలుతీర్చి

మహాల్ వలె నిర్మించబడినవి. ఇవి 5 అ. ఎత్తుమీద 17 అ. వెడల్పున 4000 అ. పొడవున నున్నది ఈప్రాకారములోని మంటపము కడువిచిత్రముగ నుండును. ఇంతపొంపైన పొడ వైన ప్రాకారము మరెచ్చటను లేదు. ఈ ప్రాకారములోనికి ధారాళముగ గాలి. వెలుతురు వచ్చుటకు జేయబడిన నేర్పరి తనము ప్రశంసింపదగినది. రామలింగవిగ్రహములు శ్రీకోదండ రామస్వామి, నటరాజమందిరము, సేతుమాధవస్వామి ఆల యము, కోనేరు, ఇతరతీర్థములు. దుకాణములు మొదలగు నవి యీప్రాకారములో గలవు. దీనికి తూర్పువైపున సముద్ర మును, పడమటివైపున పట్టణమును, గోపురములును గలవు.

అమ్మవారి దేవాలయము రామలింగేశ్వరాలయమునకు దక్షిణమున గలదు. అమ్మవారు పర్వతవర్ధని. అమ్మవారు దేదీప్యమానముగా ప్రకాశించుచుండును. ప్రతిశుక్రవార మీదేవిని నవరత్నములతో నలంకరించి దర్శనీయమగు బం గారుపాలకియందుంచి ప్రాకారములో నూరేగింతురు. అమ్మ వారి యనుగ్రహమున దుష్టగ్రహబాధ నివారణ మగునని ప్రతీతి. దేవాలయమున కొకలక్షరూపాయలు సాలీనావచ్చు నని తెలియుచున్నది. బంగారపుటుయ్యాలతో పవళింపుగది గలదు. ఇందు నిత్యము రాత్రి 10 గంటలకు పవళింపుసేవ జరుగును. వేడుకలు చూడనగును.

ఈ దేవాలయమునుగూర్చి ఫర్గుసన్ ఇట్లు వ్రాసెను.

Mr Fergusson, the Orientalist, said, "If it were proposed to select one temple which should exhibit



రామేశ్వరము - 3వ ప్రాకారము

all the beauties of the Dravidian style in their greatest perfection and at the same-time exemplify all its characteristic defects of design the choice would almost inevitably fall on that of Rameswaram. It is a massive structure well designed with gopurams on each face but the glory of the temple is in its Corridors of over 4000 feet in length."

పాశ్చ్యవైజ్ఞానికు డైన ఫర్గూసన్ ఇటు లనిరి. "సకల ద్రావిడశిల్పసౌందర్యములను, అందలి రేఖాచిత్రలోపములను సర్వసమగ్రముగ మహోత్తమముగ ప్రకటించుదాక్షిణాత్యాలయములలో ప్రసిద్ధమగణ్యమైనది రామేశ్వరాలయము. రామేశ్వరాలయనిర్మాణము బ్రహ్మాండమైనది. అన్నివైపుల గోపురములచే విలసిల్లుచున్నది. విశిష్య దేవాలయప్రతిభ 4000 అడుగుల పొడవుగల దానిప్రాకారములయందున్నది."



రజతరథము - రామేశ్వరము

ఉత్సవములు:- ఈయాదినమని లేక నిత్యోత్సవముగా నుండును. కాని 'తిరుకళ్యాణ' మనుకార్తికమాసములో జరుగునుత్సవమునకు దాదాపు 20 వేల యాత్రికులు దేశము నలుమూలలనుండి వచ్చెదరు. శివరాత్రికిగూడ పదిదినములు మహావైభవము జరుగును. మహాశివరాత్రినాడు స్వామిని పలు రంగులవిద్యుద్దీపములతో అలంకరించబడిన రజత (వెండి) రథముపై వేంచేయించి కావించురథోత్సవమును చూచి ప్రతి యాత్రికుడును వైమరచి తాను కైలాసమునం దున్నట్లే తన్మయు డగును. శివరాత్రికిముందు 3 దినములు దూరశ్రవణ యంత్రముల యేర్పాటుతో గొప్పవిద్వాంసులచే గాన సభలు, హరికథాకాలక్షేపములు జరుపబడును.

## సేతుయాత్ర

సేతుయాత్రచేయుక్రమము గలదు. శ్రీరామచంద్రుడయోధ్యకు వెళ్ళి పట్టాభిషిక్తుడైనపిదప తనపరివారముతో విమానారూఢుడై వచ్చి యీ సేతుయాత్రాక్రమముననే యాత్రచేసినట్లు శ్రీ ఆనందరామాయణమున యుద్ధకాండమందు 9 అధ్యాయమున 28వ శ్లోకములో నిట్లున్నది.

శ్రీరాముడు మొదట ఉప్పూరు (రామేశ్వరమునకు 20మై.)లో లోగడ తానే ప్రతిష్ఠించిన విఘ్నేశ్వరుని దర్శించి నవపాషాణమునొద్ద స్నానమాచరించి, దేవీపట్టణమునకు వెళ్లి అచ్చట వెటలతీర్థము (వేదళై)లో స్నానమాడి, పాంబన్‌కడ సముద్రమును దాటి, ఏకాంతరామేశ్వరముచెంత విమానమును నిలిపి, తనపరివారముతో పాదచారులై అందరును



గంధమాదనపర్వతము - రామేశ్వరము

రామేశ్వరములోని లక్ష్మణకుండములోను, తదుపరి తన పేరుతో నున్న రామతీర్థమందుగూడ స్నానమాడెను. తరు వాత అగ్నితీర్థము (రామేశ్వరములోను,) ధనుష్కోటి, జటాయుతీర్థములలోను స్నానమాడెను. తరువాత గంధ మాదనపర్వతమును, దర్శించి. అచ్చటినుండి హనుమంతునిచే తేబడి ప్రతిష్ఠించబడిన విశ్వనాథుని దర్శించి, తరువాత రామే శ్వరునికి (తనచే ప్రతిష్ఠించబడినది) తాను తెచ్చినగంగచేత

అభిషేకము గావించెను. తనబాణముతో గ్రుచ్చి కోటితీర్థ మనుదివ్యమగు బుగ్గ నేర్పరచి తరువాత సర్వపాప పరిహారార్థము సేతుమాధవస్వామిని దర్శించి భూరిదానములు గావించి అచ్చట ఒకనెల మకాముచేసిరి. ఈ యాత్రచేయుట చేత తనతో విమానములో వచ్చినపరివార మంతయు మహానందమును పొందిరి. తరువాత పూర్తిపాపపరిహారార్థము కోటి తీర్థములో మరల స్నానమాచరించె'' నని ఆనందరామాయణ ములో నున్నది. అందుచే యాత్రికు లీక్రమమునే అనుస రించుచుందురు.

తీర్థములు:- దేవాలయములో 22 తీర్థములు గలవు. ఇతరత్ర 21 తీర్థములు గలవు. ఈతీర్థములలో స్నానముచేయు వారు తమ వెంట బక్కెట్టు, తాడు తీసికొని వెళ్ళవలెను. ఈస్నానములను చేయించునట్లు ముందుగనే పురోహితునితో మాట్లాడుకొనవలెను. ప్రతితీర్థమునకు నొకపూర్వగాథ గలదు. ఈతీర్థములలో స్నానముచేయుటచేత శరీరమునకును, ఆత్మకును పరిశుద్ధి గలిగి పాపములు క్షీణించి కోర్కెలు ఫలించు నని ప్రతీతి. అదియునుగాక యీతీర్థములలో ఓషధులకలయిక గూడ నుండునని ప్రతీతి.

తీర్థములపేర్లు - వానిస్థానము:- 1. మహాలక్ష్మి. 2. సావిత్రి, 3. గాయత్రి, 4. సరస్వతి, (పుష్పవనములో) 5. మాధవ, [శివ ప్రాకారము] 6. గంధమాదన 7. గవాక్ష, 8. గవయ, 9. నల, [శివ ప్రాకారములో పడమరగా] 10, నీల 11, శంక, 12. శంరక, [రెండవప్రాకారములో తూర్పున]

13. బ్రహ్మహత్యావిమోచన 14. సూర్య 15. చంద్ర 16. గంగ, 17. యమున 18 గయ (ఇవి అన్నియు 2వ ప్రాకారములో ఉత్తరముగా) 19 శివ. (నందిమంటపముకడ) 20. సత్యామృత, (నవశక్తిమంటపము) 21. సర్వతీర్థము (రామేశ్వర దేవాలయావరణములో) 22. కోటితీర్థము, (విశాలాక్షి, విభీషణలింగములమధ్య) ఇవిగాక మరి 21 తీర్థములు దేవాలయము వెలుపల గలవు.

1 చక్రతీర్థము లేక ధర్మపుష్కరిణి (నవపాషాణములో) 2. చక్రతీర్థము, (దర్భశయనములో) 3. పాపవినాశతీర్థము (సముద్రతీరమున, మండపరైల్వే స్టేషనుకడ) 4. కపితీర్థము (పాంబన్‌లో) 5. మంగళతీర్థము, 6. ఋణవిమోచనతీర్థము ( తెంగచిమఠముకడ ) 7. అమృతవాణీతీర్థము, (ఏకాంతరామేశ్వరములో) 8. సుగ్రీవ, 9. జాంబవత్, 10. అంగద, 11. పాండవ, 12 భీమ, 13. అర్జున, 14. నకుల, 15. సహదేవ, 16. ద్రౌపది, 17. బ్రహ్మ, 18. పరశురామ, 19. హనుమకుంట 20. అగస్త్య, 21. నాగతీర్థము, (ఇవి అన్నియు గంధమాదనపర్వతమునకు వెళ్లి తిరిగివచ్చుదారిలో గలవు.)

దేవస్థానమునకు గొప్పవిలువగల మణులతోను, ముత్యములతోను వెండిబంగారములతోను చేయబడి వివిధకాలములలో వివిధరాజులచే బహూకరించబడిన 32 ఆభరణములు గలవు.

గంధమాదనపర్వతమునకు వెళ్ళునప్పుడు కొబ్బరికాయ, కర్పూరము, అగ్గిపెట్టె తప్పక తీసికొనివెళ్ళవలెను. బయట నున్న తీర్థములు లక్ష్మణతీర్థముతో ప్రారంభమై గంధమాదనపర్వతముతో గూడ 8 మైళ్లు దూరముగాన అన్ని తీర్థములను చుట్టిరావచ్చును బండికి రు 2 మొదలు రు 5 వరకు తీసికొం

దురు. ఈస్నానము లన్నియు చేయించుట, తీర్థవిధులు పెట్టించుట మొదలగువిషయములను ముందుగనే పండాలతో మాట్లాడుకొనవలెను,

గంగాభిషేకము :- స్వామికి గంగోత్రి, ప్రయాగ, హరిద్వారములనుండి తెచ్చినగంగయే వినియోగపడును. ఈగంగయు గాజు, ఇనుము, రేకుపాత్రలలో తెచ్చిన స్వామి కభిషేకముచేయరు. అట్లు తెచ్చినవారు బజారునుండిగాని, దేవస్థానపాత్రిల స్టోరుగదినుండిగాని లోహపాత్రను కొని అధికారులయెదుట గంగ నందుంచి అభిషేకమున కీయవలెను. ఒక్కొక్కపాత్రాభిషేకమునకు రు 2 రుసుము. ఇట్టిఅభిషేకము లుదయమునుండి రాత్రివరకు స్వీకరింపబడుచుండును. శివరాత్రిదినములలో రాత్రిపగలు తెంపులేకుండ అభిషేకములు చేయుదురు.

గంగను పైప్రదేశములనుండి తేలేనివారికి దేవాలయములో ఒకరూపాయకు గిద్దెడు పరిమాణము గంగాజలము నొసగుదురు. యాత్రికులకు సప్లయిచేయుటకు దేవస్థానములో రూ. 10,000 ల విలువగల గంగాజలము నిలువచేసి యుంచెదరని చెప్పుదురు. అదిగాక మామూలు గంగాభిషేకమునకు రు 2 అనగా మొత్తము 3 రూ. లతో షుమా రొక గిద్దెడుగంగ రామలింగేశ్వరుని కభిషేకముచేసినవా రగుదురు.

వాహనములు:- స్వామి కతిసుందర శిల్ప విరచిత రజత వాహనము లనేకము గలవు. ఆభరణము లన్నియు విలువగలవి గాన రూ. 5 టిక్కెట్టు కొని చూడవచ్చును.

| వాహనము పేరు | వెండియా బంగారమా | ఎప్పుడు ఏర్పడినది | విలువ |
|---|---|---|---|
| | | | రూ. అ. పై. |
| 1. వృషభవాహనము | బంగారము | 1932 | 10,854-0- 0 |
| 2. హంసవాహనము | ,, | 1932 | 10,330-0- 0 |
| 3. భూతివాహనము | ,, | 22-6-26 | 8,728-3- 8 |
| 4. అశ్వవాహనము | ,, | | 8,755-6- 3 |
| 5. పాలకీ | ,, | 30-6-26 | 1,59,081 3- 7 |
| 6. వెండిరథము | వెండి | 22-6-22 | 80,516-3-10 |
| 7. కల్పవృక్షము | ,, | | |
| 8. కామధేనువు | బంగారము | | |
| 9. చిలుకవాహనము | వెండి | | |
| 10. కైలాసవాహనము | వెండి, బంగారం | | |
| 11. సింహవాహనము | బంగారము | | |
| 12. గజవాహనము | బంగారు, వెండి | | |
| 13. ,, | పూర్తి వెండి | | |

ఇవిగాక యింక ననేకవాహనములు గలవు. శివరాత్రికి అన్నియు దినమున కొకటిచొప్పున తీయుదురు.

అర్చనలువగైరా

గంగాభిషేకము 2-0-0
క్షీరాభిషేకము (పాలఖరీదుతో) 1-8-0
సహస్రనామార్చన 1-0-0, నైవేద్యము 2-0-0 3-0-0
త్రిశతిఅర్చన (308) అర్చన 0-8-0 నైవేద్యము 1-0-0 1-8-0
అష్టోత్తరశతనామార్చనము 0-8-0
పంచామృతోత్సవము 150-0-0
రజతరథోత్సవము 500-0-0

| | |
|---|---|
| సముద్రముకడ శ్రాద్ధమునకు | 1-4-0 |
| లక్ష్మణతీర్థముకడ ప్రాయశ్చిత్తమునకు | 1-4-0 |

యాత్రికులు రామేశ్వరము విడుచుటకు ముందు గంగా తీర్థమునొద్ద స్నానముచేసి సర్వతీర్థమునొద్ద పాత్రతో తీర్థము తీసికొని (రుసుము 0-0-6) తీర్థపుచెంబును బజారులో సీలు చేయించుకొని, ప్రయాణముసాగించవలెను. వెళ్ళునపుడు పురోహితుడు (పండా) దీవించి ప్రసాదమిచ్చును. పై తీర్థము తీసికొన్న వెంటనే రామేశ్వరము వదలకపోయిన ఆతీర్థమునకు విలువయుండదట.

రామేశ్వరపరిసరములలో దర్శింపదగిన క్షేత్రములు :-

గంధమాదనపర్వతము :- దేవాలయమునకు మైలు దూరములో నున్నది. (లోగడ దీనిగూర్చి వ్రాయబడినది.) హనుమంతు డిచ్చటినుండియే లంక కేగుటకు మార్గము చూచుకొనెను. శ్రీరాముడుగూడ నిచ్చటినుండియే తనవానర సైన్యమును లంకకు నడిపించెను. రెండంతస్తుల దేవాలయము గలదు. రాముడు లింగప్రతిష్ఠనుగూర్చి యిచ్చట కూర్చుండియే ఆలోచించెనట. ఈ దేవాలయముపై కెక్కిన రామేశ్వరద్వీప మంతయు కాననగును. దేవాలయము తెరచియుండగా వెళ్ళవలెను.

2 ఏకాంతరామేశ్వరము:- రామేశ్వరమునుండి 8 మై. లేక తంగచ్చిమఠంరైల్వేస్టేషనునుండి తూర్పుగా ఒకమైలు దూరము. శ్రీరాము డొక చేతినెత్తి సీతతో మాట్లాడుచున్న ట్లున్నది. సేతువుకట్టుచుండినపుడు రాముడు తనపరివారముతో

నిచ్చట నుండెనట. తరంగములహోరుచేత పరివారముతో మాట్లాడుట కాటంకముగ లుగుచున్న దని యేకాంతముగ నుండుట కిచ్చట మ కా ము చే సె న ట. అందువలననే దీని కేకాంత రామేశ్వరమని పేరు కలిగెనట.

3. నంబినాయకి అమ్మన్:- రామేశ్వరమునకు దక్షిణ ముగా 2మై. లో గలదు. ఇచ్చట ఆపేరుగలదేవత ఒకగ్రామ మును రక్షించెననియు అందువలననే ఆగ్రామ మాదేవత పేరుతో పిలువబడుచున్నదనియు చెప్పెదరు. చిన్న అందమైన దేవాలయము గలదు. ఆదేవాలయదేవి దేహసంబంధమైన జబ్బులు నయమగున ట్లనేక విచిత్రములు చేసినట్లుగ గలదు. అందువలన నిచ్చట యాత్రికులు ప్రార్థించి, దేవీప్రసాదమును పొందుదురు.

4. సీతగుండము :- ఇది తంగచ్చిమఠమునకు సమీ పము. రామేశ్వరమునకు 5మై. దూరము సీత తన పూర్వావ తారమైన వేదవతిగ ఇచ్చట స్నానమాడెనని తెలుపుదురు.

5. విల్లూరినీతీర్థము:- తంగచ్చిమఠమునకు తూర్పుగా స్టేషనుకు సమీపమున 'సముద్రమున స్వచ్ఛమైన మంచినీటి ఊట గలదు సీత దాహముచే బాధపడుచున్నప్పుడు రాముడు తన బాణముకొన నిసుకలో గ్రుచ్చగా నీమంచినీటిఊట యేర్పడెనని చెప్పుదురు.

6 భైరవతీర్థము (పాంబన్ లో):- ఇది చల్లనిప్రదే శము. ఇచ్చట స్కూ్రజర్ రోలింగురైల్వే (Scherzer Rolling Railway lift Bridge) వంతెన ముఖ్యముగ చూడనగును.

7. కోదండరామన్‌కోవెల్ :- ఇది రామేశ్వరమునుండి 5 మై. ధనుష్కోటికి పోవుదారిలో స్టేషనుకు రైల్వేలైనుకు అర మైలులో కనబడుచుండును. యాత్రికులు తీరమున నడచి యీక్షేత్రమును జేరుదురు. ఇది యిసుకతిప్పపై గలదు. రాతి విగ్రహములేగాక కంచులో సీతారామలక్ష్మణులు ధనుర్ధారులై యుండిరి. ఇచ్చటనే విభీషణునివిగ్రహముగూడ గలదు. ఇచ్చటనే విభీషణుడు రామునియొండ జేరుటకు లంకనుండి వచ్చెననియు, రాము డభయ మిచ్చెననియు చెప్పుదురు.

## ధనుష్కోటి

ఇది రామేశ్వరము స్టేషనునుండి 23 మైళ్లు, 0-12-0 చార్జీ యగును. ఇచ్చట జనాభా 5 వేలు; కాని ధనుష్కోటి రైలు స్టేషనునుండి సముద్రమునకు 2 మై. దూర ముండును ఉదయమబండికి వెళ్లి 11 గం. తిరిగి రావచ్చును ఎట్టివారైన నిసుకలో నడువక తప్పదు. ఇతర యానము లేవియు లేవు. రామేశ్వరమునుండి నావలో (పడవలో) వచ్చుట చాలసౌకర్యము. అది రేవునకు తీసికొని వెళ్లును. నడక పని లేదు రాను పోను మాట్లాడుకొనవలెను.

ధనుష్కోటి ద్వీపమును సముద్రము మూడుసంవత్సరములలో ముంచివేయగలదని నిపుణులు ఫిబ్రవరి 1955 లో ప్రకటించిరి. 1958 లోగా స్టీమర్లు ఆగుటకు స్థలాంతరముగూడ నిర్ణయించవలసివచ్చు ననుచున్నారు. గడచిన నాలుగునందల యేండ్లలో సముద్రజలము ద్వీపముమీదికి 5 మైళ్ళమేరకు

చొచ్చుకొనివచ్చినది. ఈప్రమాదమునుండి పుణ్యక్షేత్రమును రక్షించవలసినదక్షుడు సర్వసమర్థుడు భగవానుడే. యాత్రికుల వలన లక్షాయేబదివేలును, సరకురవాణాద్వారా 40 లక్షలును సాలీనా ఆదాయము ధనుష్కోటినుండి వచ్చును.

యుద్ధానంతరము వానరులు పూర్వము కట్టినవంతెన (సేతువును) నిచ్చట పగులగొట్టిరి. దానిచే రెండుసముద్రములు రత్నాకరము, మహోదధి కలిసినవి. శ్రీరాముడు బాణము కొనతో వంతెనను పగులగొట్టుటచే దీనికి ధనుష్కోటి అని పేరు వచ్చినది. అందుచే ధనుస్సును పూజించెదరు. ఇచ్చట 108 గాని 36గాని సముద్రస్నానములు యథావిధిగ చేయుదురు. ఇందువలన చాంద్రాయణవ్రతఫలితము గలుగునని భారద్వాజ మహర్షి నిర్ణయము గావించిరట. ఇసుకలో పండాచే (పురోహితుని) బాణప్రతిమను వేయించి దానిని పూజించి 36గాని 108గాని స్నానములు సంకల్పములు. సైకతరామలింగేశ్వర పూజ చేయించుకొనవలెను. పురోహితునిచే రామేశ్వరములో స్నానసంకల్పములు చేయించుటతోపాటు ధనుష్కోటి స్నానముగూడ కలపి మాట్లాడుకొనుట మంచిది.

సేతువు (రెండుసముద్రములు కలియుచోటి యిసుక) తీసికొనివచ్చి రామేశ్వరములో 3 భాగములుగచేసి పూజించి 2భాగములు దానముచేసి ఒకభాగము రేణువుగూడ భూమిపై బడకుండ భద్రపరచవలెను. దీనిని ప్రయాగలో త్రివేణీసంగమములో పూజించి సమర్పించవలెను. ధనుష్కోటిలో చేసిన గోరంతదానము కొండంతఫలము నొసంగునని చెప్పుదురు.

"కోటినదులు ధనుష్కోటిలో నుండగ ఏటికి తిరిగెదవేమనసా"
అని కీర్తించలేదా త్యాగరాజు !

ధనుష్కోటిపయర్

ఇచ్చటికి స్టీమర్లు వచ్చి ఆగును. సింహళద్వీపమును కలుపు స్టీమరు వచ్చుచుండుట చూడనగును. 22 మై. సముద్రముమీద ప్రయాణముచేసిన తలైమన్నార్ పయర్ చేరుదుము. దక్షిణరైల్వేలై నొకవైపునను స్టీమరు మరియొక వైపునను వచ్చి ఆగును. మనుష్యులు. సామానులు సులువుగ మార్పు చేసికొనవచ్చును. పటములో చూడనగును.

## మ ధు ర

రామేశ్వరమునుండి మానేమధుర జంక్షనుమీదుగా 101 మై. ప్రయాణముచేయవలెను. రు.౩-5-0చార్జీ యగును. ఇది సముద్రమట్టమునకు 440 అ. యెత్తున నున్నది ఇది దాదాపు రెండులక్షలజనాభా గలిగి మద్రాసురాజధానియందు 2వ మహాపట్టణముగ పరిగణింపబడినది. ఈ పట్టణమును 'The City of Festivals' 'ఉత్సవములపట్టణ' మని యందురు. రామేశ్వరమునుండి వచ్చువారు మధురజంక్షన్ స్టేషనులో దిగిన చూడవలసిన వన్నియు చూడనగును. స్టేషను కెదురుగ సత్రము గలదు. దీనికి 2 ఫర్లాంగులలో బస్ స్టాండు గలదు. మీనాక్షి దేవాలయము 3 ఫర్లాంగులదూరములో గలదు. ఈ పట్టణము వైఘానదికి దక్షిణనిక్కున నున్నది. ఈ నదీగర్భమున పురాతన గ్రీకు, రోమునాణెములు దొర



మధుర మీనాక్షి

కుటచే చిరకాలమునుండి పరదేశవ్యాపారములలో ముఖ్యముగ గ్రీకు, రోము దేశములతో సంబంధము గలిగియుండెడిదని చెప్పుదురు. దీనిని పాండ్యరాజులు ముఖ్యపట్టణముగ నేలుకొనిరి. ఈ పట్టణము చరిత్రాత్మకముగను, శిల్పనైపుణ్యమునందును, విద్యాపరిజ్ఞానమునందును అనాదినుండి పేరుగాంచెను ఈపట్టణనిర్మాణము చాల అందమైనది. దేవాలయము చుట్టు వీధులు బాటలు తీర్చి బహురమ్యముగ అమర్చబడినవి. ఈపట్టణనిర్మాణమునుగూర్చి గెడ్డెస్ మహాశయు డిట్లు నుడివెను.

"Here" writes Professor Geddes, "is not simply a City made monumentally great temples, rich and varied, and innumarable minor ones. What rejoices me is to find the realization of an exceptionally well grouped and comprehensive town plan and this upon a scale of specious dignity with individual and artistic freedom to which I cannot name any equally surviving parallel whether in India or elsewhere"

ఈ విషయమై ప్రొఫెసర్ గెడ్డెస్ మహాశయు డిట్లు వ్రాయుచున్నాడు. "అనేకమహాభాగ్యవంతము లైనయాయా దేవాలయములు మొదలైనవానివలనమాత్రమే జ్ఞాపకార్హమైననగరము గాదు. నాకది ఆనందప్రద మెందుచేతనన అన్ని వసతులతోకూడి, ప్రత్యేక శిల్పస్వాతంత్ర్యముతో పట్టణనిర్మాణ మసమానముగ నున్నది. భారతదేశములోగాని, వేరెందేగాని దానితో సమానమైన పట్టణనిర్మాణము నేను పేర్కొనలేను."



మీనాక్షీ దేవాలయగోపురము - మధుర

క్రీ. పూ. 27 సం. ననే మధురను పాలించురాజు తన దూతను అగస్టస్ (Augustus) రాజునొద్దకు పంపినట్లు గలదు. మధురవలె అనేకశతాబ్దము లవిచ్ఛిన్నముగ పరిపాలించిన రాజ్యములు ప్రపంచమున మరెచ్చటను లేవనిచెప్పవచ్చును.

వసతులు:- జిల్లాకు ముఖ్యపట్టణ మగుటచే అన్ని వసతులు గలవు. సిటీబస్సులు, జట్కాలు, రిక్షాలు మొదలగు ననేకవాహనములు గలవు. పట్టణమంతయు చూపెడిగైడ్లు (చూపువారు) స్టేషనుకడ లభించెదరు. వారు రూ. 3/- లు తీసికొందురు. ప్రతిగురు, ఆదివారములలో సంత జరుగును.

తయారగువస్తువులు :- మధుర జరీ లేసు తయారు చేయుటకును, నేతపరిశ్రమయందును, అద్దకములయందును, కొయ్యపనికిని, యిత్తడిసామానులకును, బంగారు, వెండిపని లోను గొప్ప ప్రసిద్ధి గాంచినది.

ఉత్సవములు :- సం. పొడుగున ప్రతినెలలోను ఉత్సవములు జరుగుచుండును. అం దేప్రిలులో జరుగు మీనాక్షీసుందరేశ్వరుల కల్యాణమును. చిత్రోత్సవములు మాత్రము ముఖ్యము. ఈ ఉత్సవములకు దాదాపు లక్ష యేబదివేలయాత్రికులు వచ్చెదరు. జనవరి లేక ఫిబ్రవరి నెలలో తెప్పయుత్సవము మహావైభవముతో జరుగును.

మీనాక్షిఅమ్మవారి దేవాలయములో అర్చనరేట్లు :

| | | | |
|---|---|---|---|
| సహస్రనామము | అ. 0-12-0 | తిరువాభరణపట్టు | అ. 0-4-0 |
| అష్టోత్తరము | 0- 3-0 | అభయాభిషేకము | 0-1-0 |
| హారతి | 0- 1-0 | నైవేద్యము | 0-1-0 |
| సామాన్యార్చన కొబ్బరికాయ | 0- 3-0 | కల్యాణతాంబూలము | రూ. 1-0-0 |
| నారికేళఫలాభిషేకము | రూ. 4- 0-0 | మాంగల్యధారణము | 2-0 0 |

మీనాక్షీసుందరేశ్వరుల దేవాలయము :- ఇది 282 గజములపొడవును, 248 గజముల వెడల్పును గలిగి, 9 గోపురములతో నిర్మింపబడినవి. అందొకటి 152 అడుగులయెత్తున నిర్మింపబడినది. ఈ గోపురపుపనితనముతో సమానమైనది మరియెచ్చటను లేదు. ఈ దేవాలయములో చూపినశిల్పనైపుణ్యము హిందూదేశమున మరియెచ్చటను లేదు.

మొదట చితవాసల్ వీధినుండి దేవాలయములోనికి ప్రవేశించవలెను. ఇది మీనాక్షి అమ్మవారి దేవాలయమునకు మార్గము దీని కుత్తరముగా సుందరేశ్వరుని దేవాలయము గలదు. (అంతయు పై ఆవరణలోనే) ప్రారంభములోనే అష్టలక్ష్మమంటపము కలదు. ఇందు లక్ష్మి యెనిమిదివిధములైనధనముల కధీశ్వరియైనట్లు గొప్పవిగ్రహములుగ చెక్కి స్తంభములపై నుంచబడి పైకప్పురాళ్ళను మోయుచున్నట్లమర్చిరి. వీనికిపైన మీనాక్షి అమ్మవారిపూర్వచరిత్ర అనగా ఆమెజన్మము, శివునితో యుద్ధము, వివాహము, తనకుమారుడగుసుబ్రహ్మణ్యస్వామిజననము, సుందరేశ్వరునివిగ్రహములు నల్లరాతిలో చెక్కబడియున్నవి. ఉత్తరగోపురమునొద్ద నిరుప్రక్కల 2 చొ॥ 4 సప్తస్వరములుమోగుసంగీతస్తంభములు లోకేరాతిలో చెక్కబడి గలవు. మోగించి చూడవలెను. ఈమంటపముచివరద్వారముగుండ వెళ్లిన నెడమవైపు విఘ్నేశ్వరునివిగ్రహమును కుడివైపున ఆరుశిరస్సులు గలసుబ్రహ్మణ్యస్వామి విగ్రహమును చూడగలము.

పై ద్వారము దాటగనే మీనాక్షీసుందరేశ్వరులు వేష వేషగుజ్జములపై వేటకాండ్రవలె చక్కగ చెక్కబడియున్నారు.



మధురగోపురము, పుష్కరిణి

ఈద్వారముగుండ వెళ్లిన నాయకరాజులమంత్రియైన మీనాక్షీనాయకునిచే కట్టబడిన యొకమంటపము వచ్చును. ప్రస్తుత మిందు దేవస్థానపు పసుగులను కట్టివేయుచుందురు. ఈ మంటపము నుండి బయటికి వెళ్ళు ద్వార మిత్తడి ద్వారము. ప్రతి దిన మీద్వారముచుట్టు ప్రమిదలను వెలిగింతురు. ఇట్లు శివగంగ జమీందారుగా రేర్పరచినట్లు చెప్పెదరు. ఈద్వారముగుండ వెళ్ళిన నొకచీకటిమంటపము వచ్చును. ఇందు శివునియొక్క పలువిధములైన విగ్రహములు చెక్కబడియున్నవి. ఈమంట పమును దాటివెళ్ళిన "పొత్తమార్య" అనుకోనేరును చేరు

నును ఈకోనేటిగట్టున కట్టబడినమంటపముగోడపై శివుడు చేసిన 60 లీలలు చెక్కబడి అమర్చబడియున్నవి. తూర్పువైపునకు వెళ్ళి నిలుచుండిచూచిన మీనాక్షీ, సుందరేశ్వరుల గర్భాలయములపై నున్నవిమానములు బంగారురేకులతో కప్పబడి ధగద్ధగాయమానముగ ప్రకాశించుచు గనుపించును. ఈవైపుచివరకు వెళ్ళిన మీనాక్షీ దేవాలయములోనికి వెళ్లు దక్షిణద్వారము వచ్చును. దేవాలయములోనిగర్భాలయము ముందర నుండుహాలత్యద్భుతశిల్పములో నిండియున్నది. ఇది పాండ్యరాజులచే నిర్మించబడినది. పైహాలులో కుడిచేతివైపున నున్నగోడపై దేవాలయచరిత్ర నరవములోను సంస్కృతములోను శాసనరూపమున నున్నవి పైహాలులో నుత్తరపువైపున నూరుస్తంభములమంటపము గలదు. చిదంబరమున కనుపించని నిరాకారస్వామి (చిదంబరరహస్యము) ఇచ్చట నాకారముగ స భా ప తి (శివ)గ ప్రతిష్ఠించబడియున్నది. ఈమంటపము నానుకొని సూర్యుడు మధ్య నున్నట్లును చుట్టును అష్టదిక్పాలకు లున్నట్లును చెక్కబడియున్నది. మీనాక్షి అమ్మవారు దేదీప్యమానమై ప్రకాశించుచు, భక్తులహృదయముల నాకర్షించుచు గంభీరముగ నుండును. మీనాక్షి అష్టాదశ దేవీపీఠస్థానములలో కివది ఇటనుండి కుడివైపునకు వెళ్ళిన సుందరేశ్వరస్వామ్యాలయము ప్రవేశించెదము. గర్భాలయము ముందర బంగారపుధ్వజస్తంభము గలదు. ఈదేవాలయావరణములో ఆర్యనాయక మొదలియార్ చే 1550లో నిర్మించబడిన వేయిస్తంభములమంటపము గ ల దు . అందు ప్రస్తుతము

దుకాణము లుంచబడుచున్నవి. మొదలియారా్ గుజ్జముపై నెక్కి యున్నట్లు రాతిలో చెక్కబడి యెడమప్రైపున ప్రతిష్ఠించ బడియున్నది. ఇది అంతయు చూచినతర్వాత తూర్పుద్వారము గుండ వెళ్ళిన రోడ్డుమీదికి వచ్చెదము.

పుదుమంటపము లేక తిరుమలసత్రము:- ఇది రోడ్డుకు రెండవప్రైపున గలదు. 120 స్తంభములు గలిగి నాలుగువరు సలలో 333 అ పొడవు, 105 అ. వెడల్పు గలిగి యొకదాని కంటె రెండవది మిన్నగ కదు చిత్రముగ తిరుమల రాజుచే నిర్మింపబడినది శివుడు తిరుమలరాజునకు ప్రత్యక్ష మగుటకు (దర్శనమిచ్చుటకు)ను సంవత్సరములో పదిదినము లుండుటకు తనహోదాకు తగినట్లు సుందరమైనభవనమును నిర్మిం చిన తప్పక (శివుడు) దర్శన మిచ్చెదనని సెలవీయగా తిరు మలరా జిట్టిసుందరభవనమును నిర్మించెనని చెప్పుదురు. దీని నే వసంతమంటపమనియు, లేక తిరుమలసత్రమనియు నందురు. దీనిని నిర్మించుటకు 22సం॥ పట్టెనట ఇందు మధురను పాలిం చిననాయకరాజుల ప్రతిమలు (విగ్రహములు) గలవు ఇది 1623 మొదలు 1645 వరకు నిర్మించినట్లును, దీని నిర్మాణము నకు ఒకకోటి నాలుగులక్షలు ఖర్చాయినట్లును జెప్పెదరు. ప్రస్తుతము దీనియందు దుకాణములు పెట్టుటచే దీనిపైఖరి మారినది.

మధురలో లైబ్రరీ. మ్యూజియము నాకేతాన్పున గలవు. ఉ. గం. 9-0 నుండి 11-0 వరకు సా. గం. 4-0 నుండి 7-0 వరకు తెరచియుంచబడును.

తిరుమలనాయకునిభవనము : ఇది స్టేషనునుండి దాదాపు 1½ మై. దూరములో నుండును. దీనిని తిరుమలనాయకుడును తంజావూరు రాజకన్యయైన తనభార్యను మెప్పించునిమిత్తము నిర్మించెనని చెప్పుదురు. ఇందు దర్బారుమహాలు, స్నానపు



మధుర పెరుమాళ్లు

గములు. పండుకొనుమహాలు మొదలైన పెక్కుహాలులు, డోములు, స్తంభములు కర్రఇనుపదూలము లేమాత్రము లేకుండ నిర్మింపబడి, హిందూదేశపుశిల్ప నైపుణ్యమును చాటుచున్నది. ప్రతియాత్రికుడును దీనిని తప్పకచూచి తీరవలెను. ఇందు ప్రస్తుతము ముఖ్యమగు జిల్లాసంబంధమైన ఆఫీసు లేర్పరచిరి.



తిరుమలనాయక్ భవనము

పట్టణమునుండి దాదాపు 1½ మైలు ఉత్తరముగా 'తుంకుం' అనుభవనము తిరుమలనాయకునిచే నిర్మింపబడినది. అందు జంతువులకును, మల్లులకును పోరాటము పెట్టించెడి వారట. ప్రస్తుత మీ భవనములో జిల్లాఅధికారి (కలెక్టరు) నివాస మేర్పరచుకొనియున్నారు.

మరియమ్మకొళం లేక తెప్పకొళం :- ఇది స్టేషను నుండి 3 మైళ్ళదూరములో నున్నది. దీనినికూడ తిరుమల నాయకుడే నిర్మించె నని చెప్పెదరు. ఇది యొక పెద్దచెరువు. దాదాపు మైలు చుట్టుకొలత కలిగి యుండును. దీని మధ్య లంకవలె నుండు పెద్దదిబ్బపై ఎత్తైన గోపురములతోను ప్రాకారములతోను దేవాలయము నిర్మింపబడినవి. ప్రతిసంవత్సర మీ తటాకమునందు తెప్పయుత్సవము జరుగును. ఈ ప్రాకారము నొడ్డున దాదాపు లక్షపైగా దీపములు వెలిగింతురు. ఈ యుత్సవమును గాంచుటకు విశేషముగ యాత్రికులు వచ్చెదరు.



శివనాట్యము – మధుర

మట్టివృక్షము :- ఇది పాలియంపాళెజమీందారివారి బంగళాలో గలదు. ఇది చాలగొప్పవృక్షము. దీనిప్రకాండపు

చుట్టుకొలత దాదాపు 70 అ. ఉండును. ఈ చెట్టునీడ ఎటు నుండి కొలచినను 180 అ. కైవారమున నుండును.

చరిత్ర :- రెండవశతాబ్దమువరకు పాండ్యరాజులే పరిపాలించిరి. 3వ శతాబ్దము మొదలు పదియవశతాబ్దమువరకు పల్లవులు పాండ్యులను వశపరచుకొని వారిని సామంతులవలె నియమించిరి. 10వ శతాబ్దము మొదలు 12వ శతాబ్దమువరకు చోళులు, పాండ్యులు పరిపాలించిరి 14వ శతాబ్దప్రారంభములో మహమ్మదీయు లాక్రమించిరిగాని విజయనగరచక్రవర్తులు మహమ్మదీయులను పారద్రోలి వారు స్వాధీనము చేసికొనిరి. తరువాత నాయకచక్రవర్తులు పరిపాలనకు వచ్చిరి ఈనాయకచక్రవర్తులకాలములోనే 1000 స్తంభముల మంటపము, పుదుమంటపము, రాజగోపురము, మరియమ్మ తెప్పకొళము మొదలైన వన్నియు నిర్మించబడినవి. క్రమముగ నాయకరాజులనుండి ఆర్కాటునవాబుహస్తగత మైనది. ఆతరువాత మహమ్మదాలీ తనశత్రు వైనమైసూరుభూపతితో యుద్ధముచేయుటకు ఈస్టిండియాకంపెనీవారు సహాయముచేసి నందులకు మధుర. సేలములను, కంపెనీవారికి బహుమానముగ నిచ్చిరి. కనుక అప్పటినుండి కంపెనీపరిపాలనములో నుండి 1858 సం॥ ఇండియాగవర్నమెంటు ఆక్టుప్రకారము కంపెనీనుండి బ్రిటీషు సామ్రాజ్యమునకు చెంది నేడు మన భారతప్రభుత్వముక్రిందికి వచ్చెను.

## తిరుమాళ్ళిరుంశోలై లేక అళగర్ సన్నిధి

ఇది 69వ దివ్యదేశము. ఇది మధురనుండి ఈశాన్యముగ 12 మైళ్ళదూరమున నున్నది. బస్సులు, సత్రములు

మొదలగు వసతులు గలవు. అడవిమృగములభయము గలదు. అళగరస్వామి, (సుందరరాజపెరుమాళ్లు) సుందరవల్లినాంచార్, సోమచంద ఇందు చందవిమానములు. నూపురనదీతీరము, తూర్పు తిరుముఖమంటపము, పూదత్తాళ్వార్, పేయాళ్వార్, నమ్మాళ్వార్, తిరుమంగయాళ్వార్, ఆండాళ్ మంగళాశాసనము ఈ ఆలయగర్భాలయముపైనున్న సోమచందవిమానమునకు (శ్రీ వేంకటాద్రి)స్వామివారిచే బంగారు గిలాము వేసిన రేకులతో కవచము పొదగబడినది.

ఈ దివ్యదేశమునందు స్వామికి పెద్దదోసెలు నివేదించెదరు. ఇంతపెద్దదోసెలు మరియేదివ్యదేశములోను నివేదించరు. దోసె 1కి ఒకరూపాయిపావలా చొ॥ అమ్ముదురు ఇచ్చట కోతులు విశేషము, "కరుప్పణర్" దేవాలయమునొద్ద ప్రమాణములు చేయుచుందురు. దోషులాసత్యములకు ప్రమాణములు చేసిన అనేకవిపత్తులకు లోనగుదురు. ఇది దావాలు, కేసులు మొదలైనవానికి ప్రసిద్ధి. ఒక్కొక్క కేసున కైదురూపాయలు రుసుము చెల్లించవలెను. చిత్రాపౌర్ణమికి అళగర్ నుండి మధురలోని వైఘునదికి వచ్చి అచ్చట 5 దినములు మీనాక్షీకల్యాణోత్సవము జరుగును.

తిరుకూడల్ లేక దక్షిణమధుర

ఇది 70వ దివ్యదేశము. ఇది మధురస్టేషనుకు మైలు దూరములోనున్నది. అనగా మధురపట్టణములోనేయున్నది. అన్నివసతులు గలవు. రామానుజకూటము గలదు. కూడ అళగర్, వకుళవల్లినాచ్చియార్, అష్టాంగవిమానము, హేమపుష్కరిణి, చక్రతీర్థము, కూర్చున్నసేవ, పెరియాళ్వార్లకు ప్రత్యక్షము.

## తిరుమోగూర్

ఇది 71వ దివ్యదేశము. ఇది మధురకు 7 మై. దూరములో నున్నది. బస్సులు గలవు. భోజనశాలలు లేవుకాని క్షేత్రమున ప్రసాదము లభ్యమగును. అమృతమును పంచిపెట్టు నిమిత్తము శ్రీమహావిష్ణువు మోహినీవేషమును ధరించి నందున స్వామి కీపేరు వచ్చెను.

కాళమేఘప్పెరుమాళ్, తిరుమోగూర్ తాయార్, కేతకి విమానము. క్షీరాబ్ధిపుష్కరిణి. నమ్మాళ్వారు మంగళాశాసనము.

## తిరుప్పరన్‌కుండ్రము

ఇది మధురనుండి విరూధనగర్ లైనులో 5 మై. దూరములో నున్నది. అనగా మధుర పరిక్రస్టేషను. అ. 0-3-0లు



తిరుప్పరన్‌కుండ్రము—మధుర

చార్జీ. ఇది కొండపైన నున్నది. ఇది సుబ్రహ్మణ్యక్షేత్రము. ప్రతిమాసము గొప్పయుత్సవము జరుగును. అన్నివసతులు గలవు. రైలులోనుండి వెళ్లునపుడు కనిపించును. దక్షిణదేశమున ప్రసిద్ధమైన ఆరుసుబ్రహ్మణ్యక్షేత్రములలో నిది యొకటి. ఇది 'నక్కీరార్' అనుగొప్పభక్తుడును, కవియునైన తమిళుని జన్మస్థానము.

## తిరుత్తంగాల్

ఇది 72వ దివ్యదేశము. మధురనుండి విరూధనగర్ జంక్షన్ మీదుగా శివకాశి యనుస్టేషనులో దిగి ఉత్తరముగా 2 మై. ప్రయాణముచేసిన తిరుత్తంగాల్ చేరుదుము. మధుర నుండి 1-6-0 చార్జీ యగును. ఈ క్షేత్ర మొకచిన్నకొండపై గలదు. బండ్లు సత్రములు రామానుజకూటము కలవు. భోజనశాలలు లేవు

అప్పన్, అన్ననాయకి, దేవచంద్రవిమానము పాపవినాశతీర్థము, తిరుమంగయాళ్వారుమంగళాశాసనము. శ్రీకృష్ణుడు బాణాసురుని జయించి అనిరుద్ధునకును, ఉషకును పరిణయము జరిపినప్రదేశ మిదియే యందురు.

ఇచ్చటికి 2మై. దూరములో నున్న 'శివకాశి' అనుపట్టణము దీపావళిమందుసామానులు తయారుచేయుటలో ప్రసిద్ధి.

## శ్రీవిల్లిపుత్తూరు

ఇది 73వ దివ్యదేశము. ఇది విరూధనగర్ జంక్షన్ తెంకాశికార్డులైనులో విరూధనగర్ నుండి 5వ స్టేషను. ఇది

శివకాశీ స్టేషనునుండి 10 మై రైలుచార్జీ. 0-6-0. ఇది దాదాపు 40 వేల జనాభా గలతాలూకాముఖ్యపట్టణము వైష్ణవభక్త లగు పెరియాళ్వార్లును, ఆండాళమ్మవారును జన్మించిన జన్మ భూమి యిదియే స్టేషనునుండి గ్రామము (అనగా దేవాలయము, ఊరు) 2 మై. దూర ముండును. రైలులో ప్రయాణము చేయువారికి చాలదూరమువర కెత్తైనగాలిగోపురము కనిపించుచుండును. ఈ దివ్యదేశము విల్లి యనుచెంచుప్రభువుచే నిర్మించబడినదిగాన శ్రీవిల్లిపుత్తూ రనుపేరు గలిగినది. మధుర నుండి బస్సులో వచ్చుట మంచిది. బస్సు ఆలయమువద్ద నాగును. బస్సులో వచ్చుటే సౌకర్యము ఆలయమునకు దక్షిణముగా 'తిరుమణ్ణికొలను' అనుగొప్పసుందర మైనకోనేరు గలదు. దీనికి కొండలనుండి నీరు వచ్చును. ఆలయమందు శ్రీరంగనాథుడు, ఆండాళమ్మ, గరుడాళ్వారు నిలుచుండి యుందురు. ఇందు సేవల కుయ్యాలమంటపము గలదు. ఉత్సవములు మోహనరూపులు. దీనికెదురుప్రక్కన రంగనాథాలయము గలదు. స్వామి శేషశాయియై పరుండియుందురు. శిలావిగ్రహము గాదు. సున్నముతో జేయబడినది. ఆళ్వారులకు ప్రత్యేకాలయములు గలవు.

వసతులు :- స్టేషనుకడ జట్కాలు, ఎద్దుబండ్లు, సత్రములు గలవు. భోజనశాలలు వేరుదుకాణములు గలవు. క్షేత్రమందు ప్రసాదము టిక్కెట్లమీాద లభ్యమగును.

ఆడిమాసము (ఏప్రిల్) లో జరుగురథోత్సవము గొప్పగా జరుగును. ఈ యుత్సవమునకు దాదాపు 10 వేల మంది యాత్రికులు వచ్చెదరు. ఆషాఢ, భాద్రపద, మార్గ

శిరములలోగూడ గొప్పయుత్సవములు జరుగును. శ్రీవిల్లిపుత్తూరునకు ఆరుమైళ్ళలో సుందరబాహు పెరుమాళ్లుకోవెల దర్శనీయము.

## తిరువన్నామలై

ఇది శ్రీవిల్లిపుత్తూరునకు పడమరగా దాదాపు 3 మై. దూరములో నున్నది. ఇది చిత్తూరుజిల్లాలో నున్న పెద్దతిరుపతి లోనిశాఖ యని చెప్పెదరు. కొండపైన వేంకటాచలపతి సన్నిధి గలదు.

## రాజుపాళెము

ఇది శ్రీవిల్లిపుత్తూరునుండి 7 మై. 0-4-0 రైలుచార్జీ. ఇందు దాదాపు 30 వేల జనాభా గలదు. ఇంతవరకు మనము చేసినయాత్రలన్నింటిలో రాజుపాళెములోనే హెచ్చుగ తెలుగు మాట్లాడువారు గలరు. అన్నికుటుంబములు తెలుగువారే. తెలుగుపాఠశాల తెలుగుగ్రంథాలయములు గలవు. ఇది నేతపరిశ్రమలో ప్రసిద్ధికెక్కినది. మనవైపునకు రాజుపాళెము చొక్కాగుడ్డ, కోటుగుడ్డ (ఖద్దరు) తయారై విశేషముగ మన ఆంధ్రదేశమునకును, అన్నివైపులకును నెగుమతి జరుగుచుండును.

## శంకరనాయర్‌కోయిల్

ఇది రాజుపాళెమునుండి 20 మై. దూరము. 0-11-0 చార్జీ. ఇది శివక్షేత్రము. సత్రములు గలవు. భోజనసదుపాయములు గలవు. అమ్మవారిపేరు గోమతి అమ్మవారు. ఇచ్చట శంకరుడు సగము శివుడుగను, సగము విష్ణువుగ

నుండుటచేత ప్రతిదినము స్వామిముఖమున సగము అడ్డబొట్టు, సగము నిలువుబొట్టును పెట్టుచుందురు. ఆషాఢమాసములో గొప్పయుత్సవము జరుగును. ఆసమయమున దాదాపు 20 వేల యాత్రికులు వచ్చి సేవింతురు.

## తెంకాశి

పై క్షేత్రమునుండి 23 మై. ప్రయాణముచేసిన తెంకాశిజంక్షను చేరుదుము. 0-12-0 రైలుచార్జీ. 27 వేల జనసంఖ్య గలదు. దీనిని దక్షిణకాశి యందురు. ఇది చిత్రానది ఉత్తరతటమున నున్నది.

వసతులు:- సత్రములు, బంగ్లా స్టేషనుకడ అన్నిరైలు వేళలయందు సిద్ధముగ నుండును. స్టేషనునొద్ద మంచిభోజన శాలలు గలవు.

చూడదగినవి :- స్టేషనునుండి 3 ఫర్లాంగులలో కాశీ విశ్వనాథాలయము (శివాలయము) గలదు. ఈయది 15వ శతాబ్దమున నిర్మింపబడినట్లు తెలియుచున్నది. కాని 18వ శతాబ్దిచివరభాగములో దీనిగోపురము దాదాపు సగము భాగమునకుపైగా కాల్చివేయబడినట్లచ్చటివారు చెప్పుదురు. ఈదృశ్యము నేటికిని గాంచనగును. దీనిమంటపములోని స్తంభములపైగలశిల్పనైపుణ్యము మధుర దేవాలయములోని విగ్రహముల జెక్కినయాశిల్పిచేతనే చెక్కబడినట్లు కనుపించును. అమ్మవారిఆలయముగూడ గలదు.

## కుర్తాలము

ఇచ్చట జలపాతము గలదు. తెంకాశీస్టేషనునుండి 3½ మై. దూరము. చక్కనిరోడ్డుగలదు రోడ్డు చల్లనినీడ నిచ్చు వృక్షములచే నలంకరించబడి యాత్రికుల కాహ్లాదకరముగ నుండును. ఈజలపాతము మేనెలనుండి అక్టోబరు నెలవరకు గలకాలములో దర్శించిన బాగుగానీటిధారలదృశ్యము గాంచ నగును. ఇతరకాలములో సన్నిధారలే గాన్పించును. ఎండ కాలమున నదిలో నీరే యుండదు. జలపాతము గానరాదు.

వసతులు:- స్టేషనుకడ బండ్లు దొరకును మామూలు దినములలో బండికి 0-6-0; సీజనుసమయములో బండికి0-8-0 నుండి రూ. 1-0-0 వరకు తీసికొందురు అనేకసత్రములు గలవు. కొద్దిఅద్దెకు గదులుగూడ లభించును. లోకలుఫండు వారిసత్రము జలపాతమునకు సమీపమున గలదు. సాధారణదినములలో చార్జీ యుండదుగాని సీజనుసమయములలో దినమునకు రు. 0-4-0 తీసికొందురు. మరిరెండుసత్రములు గలవు. ఇవిగాక పెద్దపెద్ద బంగళాలు ప్రత్యేకముగ నిర్మించ బడినవి. వీనిని అద్దెలకొసంగుచుందురు. భోజనశాలలు గలవు.

జలపాతము:- చిత్రానది దాదాపు 50 అ. ఎత్తునుండి క్రిందికి దుముకుచుండును. అది క్రిందకి పడుచోట స్నానము చేయుటకు—అనగా ధారలతుంపరలు పైనబడి ఆహ్లాదకరముగ స్నానము ముగియున ట్లేర్పాటుచేసిరి. నూనె రాచుకొని ఈధారలక్రింద కూర్చుండిన సబ్బుతోగాని, శీకాయతోగాని పనిలేకయే ఆనీటియం దుండులవణముల చేత నూనెజిడ్డు

పోవును. ఈ జలపాతస్నానము, గాలి వలన ఆరోగ్యము నొంద జూన్‌నుండి అక్టోబరు వరకు గొప్పధనికులుసైతము వచ్చుచుందురు. ఈప్రాంత మారోగ్యకరముగను, పవిత్రము గను నుండును. ఇచ్చటిప్రకృతిసౌందర్యము కడురమణీయము.

ప్రాతజలపాతమునకు సమీపమున నొకశివాలయము గలదు. ఇందు స్వామికి కుర్తాళేశ్వరుడనియు, అమ్మవారికి నిరేణునాదవాణి యనియు పేర్లు. ఈ దేవాలయములో ప్రతి రాత్రి వేణుగానము చేయుదురు.

శ్రీమౌనస్వామివారి ఆశ్రమము :- ఇది జలపాతము నకు 3 ఫర్లాంగులదూరములో నున్నది. శ్రీమౌనస్వామివారు సుప్రసిద్ధాంధ్రులు. వీరు యావజ్జీవము దాదాపు 30 సం॥ లు మౌనవ్రతము నవలంబించి, 1944 సం॥ న సిద్ధినొందిరి. వీ రాంధ్రులై యుండియు, అరవదేశములో గొప్పపేరు ప్రతిష్ఠలు సంపాదించి 15 యకరముల ఆవరణములో నీయాశ్రమ నిర్మాణము గావించిరి. వారు దాదాపు 4½ లక్షలవిలువగల ఆస్తి నాశ్రమమునకు సంపాదించిరట. ఈఆశ్రమము పడమటి కనుమలకు తూర్పుప్రక్కన కొండలనానుకొని కొబ్బరి, అరటి, మామిడితోటలతోను, అనేక పశుపక్షులతోడను కళకళ లాడుచున్నది. ఇందు శ్రీకోదండరామస్వామివారి దేవాలయము, దత్తాత్రేయ, సుబ్రహ్మణ్య, వినాయక దేవాలయములు గలవు.

## పాపనాశనము

ఇది కుర్తాళమునుండి తిరిగి టెంకాశిస్టేషనుకు వచ్చి అచ్చటినుండి మన్‌యాచి-షెన్‌కోటలైనులో టెంకాశినుండి

23 మై. లో నున్న అంబాసముద్ర మనుస్టేషనులో దిగవలెను. టెంకాశినుండి 0-12-0 చార్జీ. అంబాసముద్రమునుండి ఆగ్నేయ మూలగా 5½ మై. కొండలలో రోడ్డుప్రయాణము చేసిన పాప నాశనము చేరగలము. అంబాసముద్రముస్టేషనునుండి యూ రరమైలుదూరములో నున్నది. ఊరిలో అగస్త్యమహర్షి దేవా లయము చూడదగినది.

వసతులు :- అంబాసముద్రముస్టేషనునొద్దకు బస్సు వచ్చును. వెళ్లినప్పుడు ఖాళీదొరకుట కష్టము. 0-4-0 ఇచ్చిన పాపనాశనస్థానమునకు తీసికొని వెళ్లును. బండ్లు, భోజనశాలలు గలవు. రెండు మూడుగదులతో సత్రములు గలవు. గదకి 0-4-0 అద్దె గలదు. చుట్టునరణ్యములు, కొండ రేవువరకు బండ్లు పోవును మొత్తముమీద వెళ్లినప్పుడు బండి, వచ్చి నప్పుడు బస్సు మంచిది.

చూడదగినవి :- తామ్రపర్ణీనదీతీరమున నొక శివాలయము గలదు. ఇచ్చట కోతులు మెండు. ఇచ్చట స్వామివారిని పాపవినాశేశ్వరుడనియు, అమ్మవారిని లోకేశ్వరి యనియు నందురు. ఆలయముముందుండు తామ్రపర్ణీనదిలోనికి దిగుటకు చక్కని మెట్లున్నవి. ఇచ్చటనీరు చాలనిర్మలముగా నుండును. దీనియందు చేపలు విశేషము. పెద్దపెద్దచేపలుగూడ గలవు. తామ్రపర్ణీ దేవాలయమందుండు నీభాగమును 'పవిత్రమైన చేపలకొలం' అని అందురు. నీటిలో చేపలును, ఒడ్డున, చెట్లమీద, దేవాలయప్రాకారములమీద కోతులును విశేషము. ప్రకృతిసౌందర్యము రమణీయముగ నుండును.

దుకాణములలో నమ్ముమరమరాలు, పప్పులు కొని చేపల కాహారముగ నీటిపై వేసిన చేపలు పైకి తేలుచు వానిని తినును. ఈదృశ్య మాహ్లాదజనకము. కాని మనము పరాకుగ నున్న కోతులు మీదబడి మనచేతిలోనిపదార్థములను. (పప్పు, మరమరాలను) ఎగురగొట్టి తాము తినజూచును గాన అట్టి సమయములలో గుప్పెడుపప్పు దూరముగ విసరిన కోతు లన్నియు ఒక్కొక్కగింజ యేరుకొని తినులోపల మనము చేపల కాహారము వేసి వినోదమును గనవచ్చును.

దాదాపు మైలుదూరములో విద్యుచ్ఛక్తిచే నడుపబడు గుడ్డలమిల్లు గలదు. దేవాలయములో కొబ్బరికాయకు అణా చీటి గలదు.

కల్యాణతీర్థజలపాతము — పాపనాశనము



కల్యాణతీర్థము :- పాపనాశనమునుండి పర్వత, మహా రణ్యములగుండా చక్కని మోటారురోడ్డు వేయబడియున్నది. ఇంతవరకు చేసినదక్షిణప్రయాణములలో నిట్టి మనోహర ప్రకృతిసౌందర్యమధ్యమున ప్రయాణము చేసియుండము. పాప నాశన దేవాలయముప్రక్కగా బస్సు పోవును రోడ్డుమార్గ ముగ వెళ్ళిన కల్యాణ తీర్థము 3 మైె. ఉండునుగాని అడ్డ దారిన వెళ్ళిన 1½ మైె. మాత్రమే. నడచి అడ్డదారిని వెళ్ళుటే శ్రేష్ఠము కార్తిక మాఘమాసములలో యాత్రికులు విశేష ముగ వత్తురు తిప్పపైకి వెళ్లుసరికి రమణీయమైన ప్రకృతి సౌందర్యమునడుమ నురుగులు గ్రక్కుచు క్రిందికి దుముకు తామ్రపర్ణి నదీజలపాత ము నొకవిశాలమైన లోయయందు గాం చుటతోడనే ప్రతి యాత్రికుని హృదయ మానంద నిమగ్న మగు ను. మనకు గనబడు నాలుగైదు ధారలకు 'పురాతనపాపనాశన' మని పేరు ఈనీటి ధారలప్రక్కగ కొండ గట్టెక్కి దాదాపరమై లు పెద్దపెద్దరాళ్లుదాటి

కల్యాణతీర్థము



పైకి వెళ్ళిన కల్యాణతీర్థ మేకధారగా రమారమి 100 అడుగుల ఎత్తునుండి క్రిందికి పడుట గాంచగలము. పాపనాశనజలపాతమునకు కుడిప్రక్కగా 10 గజములదూరమున ఒకగుహ గలదు. అందు విఘ్నేశ్వరుని ప్రతిష్ఠించిరి. దీనిప్రక్కనే అగస్త్యతీర్థము గలదు ఇచ్చట సీతారామలక్ష్మణ, పార్వతీ, శివ, అగస్త్యమహర్షి ప్రభృతుల విగ్రహము లొకపెద్దరాతియందు చెక్కబడియున్నవి. ఇచ్చటినుండి పాపనాశనమునకు తిరిగివెళ్లి బస్సుమీద పైకివెళ్ళవలెను. దీనికి పడమటగా హైడ్రోఎలక్ట్రిక్ విద్యుచ్ఛక్తి భవనము నిర్మింపబడియున్నది.

కొట్టంతల :- (Lower Dam) పాపనాశనమునుండి 3 మై. బస్సుకు 0-4-0 చార్జీ. పర్వతములమధ్య అరణ్యములో సమతలముగా నుండుప్రదేశము; అనగా పై చెప్పిన విద్యుచ్ఛక్త్యాలయమునకు దాదాపు మైలుదూర ముండును. మిక్కారుగ నడచివెళ్ళినను వెళ్లవచ్చును. ఇచ్చట పాపనాశన డాముకు సంబంధించిన ఆఫీసర్లు, కూలీలు నివసించుచుందురు.

అడికిరాయి లేక కారయారనె (Upper Dam):- ఇది యీ కొండలలోనే యింక 8½ మై. బస్సులో ప్రయాణము చేయవచ్చును. బస్సుకు 0-6-0. ఇచ్చట కాఫీక్లబ్బులు కలవు. ఇచ్చట తామ్రపర్ణీనది రెండుకొండలమధ్యగ ప్రవహిం

చును. నిరంతరము విద్యుచ్ఛక్త్యాలయము పనిచేయుటకు నీటి సప్లయికొరకు నీరెండు కొండలనడుమ నొక పెద్దగోడ 198అ. ఎత్తున కట్టి దానికి తలుపుల నేర్పాటుచేసి కావలసినంతనీటిని వదలుకొను నేర్పాటు చేసిరి. దీనినే పాపనాశనం – డాము అందురు.

బాణతీర్థము :– ఇదియు తామ్రపర్ణినదీజలపాతము. చాల పెద్దధారతో క్రిందికి దుముకుచుండును. పై డాము ప్రదేశమునుండి కుడిప్రక్కగా 4 మై. నడచివెళ్ళిన (అతికష్టమైనప్రయాణము) బాణతీర్థము చేరుదుము. ఇచ్చటికి తెలిసిన వారిని తీసికొని వెళ్లవలెను. వారికి 0–8–0 యిచ్చిన వచ్చెదరు. ఇచ్చట పెద్దపెద్దధార లెత్తునుండి క్రిందికి దుముకుచుం



బాణతీర్థజలపాతము

డును. తామ్రపర్ణీజన్మస్థానము కొండలో నింకనుపైన నున్నది. ఇచ్చట ఊరుగాని, మనుష్యసంచారముగాని లేదు. ప్రకృతి సౌందర్యము కడురమణీయము. ఈ ప్రశాంతైకాంతప్రదేశమున కొంతతడవు కూర్చుండి భగవంతుని ధ్యానించుకొని ఆయన సృష్టిచిత్రమున కానందించి తిరిగి 21 మై. బస్సులో వచ్చి అంబాసముద్రము చేరవలెను.

## కల్లిడై కురిచ్చి

ఇది అంబాసముద్రమునకు ప్రక్కస్టేషను. 3 మైళ్ళ దూరము. 0-2-0 చార్జి. ఇది సింగంపట్టిజమీందారిలోనిది. ఈప్రాంతమం దుండునరణ్యము గొప్పది. ఈకీకారణ్యప్రదేశములలో ఏనుగులు, ఎలుగుబంట్లు మొదలగు క్రూరమృగములు సంచరించుచుండును. అరణ్యములో మూడు పెద్దబంగళాలు గలవు. కావలసినచో ముందుగ వ్రాసి అనుమతిపొందవలెను.

## సేర్మాదేవి

ఇది కల్లిడైకురిచ్చిస్టేషనునుండి 7 మై. దూరములో నున్నది. 0-4-0 చార్జి. సేర్మాదేవిస్టేషనునుండి 18 మైళ్లు మోటారుబస్సుకు 0-8-0 చార్జి. తిరుకురుంగుడి యను 80వ దివ్యదేశమును చేరగలము. ఇచ్చటగూడ అడవిమృగముల సంచారము గలదు. ఒంటరిగా వెళ్లరాదు. వామనునిదేవా

లయ ముండుటచేత (పొట్టివా డగుటచేత) కురుంగుడియని నామ మేర్పడెను.

వసతులు:- ఇచ్చట బండ్లు గలవు. సత్రములు గలవు. మఠమునందు యాత్రికులకు భోజనము దొరకును.

ఉత్సవములు :- ఫాల్గునమాసమందు 10 దినములు బ్రహ్మోత్సవములును, జ్యేష్ఠమాసమందు శ్రీ భాష్యకారుల యుత్సవమును జరుగును.

నంబిసన్నిధి :- ఇది పై క్షేత్రము నుండి 6 మై. ఒంటరిగా వెళ్లుట కష్ట సాధ్యము. ఇది కొండపైన గలదు. వారములో నొక్క దిన మిచ్చటికి జనులు కలసి తండోపతండములుగ వెళ్లుచుందురు. ఇచ్చట నేనుగులు, పులులు, ఎలుగు బంట్లు విశేషముగ నుండును తిరుమంగైయాళ్వా



ఈ ప్రాంతపు అడవులలోని పెద్దపులులు

రు లు పరమపదవి నలంకరించినస్థల మిదియే. పంచనంబుల క్షేత్రములు ; అనగా 1. నిండ్రనంబి, 2. కిడందనంబి,



అరణ్యములలోని అడవి ఏనుగులగుంపు

3. ఇరుందనంబి, 4. రుప్పైయేవనంబి, 5. తిరుపార్కడలనంబి, గలస్థానము. కురుంగుడివల్లినాంచారు, కేతకవిమానము, తిరుప్పార్ కడల్ నది, నమ్మాళ్వారు, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారులమంగళాశాసనము.

## తెన్నివెల్లి (తిరునల్వేలి)

ఇది సెర్మదేవిస్టేషనునుండి 12 మైళ్ళదూరము. 0-7-0 రైలుచార్జీ. ఇది తెన్నివెల్లిజిల్లాకు ముఖ్యపట్టణము. దాదాపు 70 వేలు జనసంఖ్య గలదు. తామ్రపర్ణీనదికి పశ్చిమభాగమున నీపట్టణము గలదు. జిల్లాకు సంబంధించినఆఫీసు లన్నియు

తామ్రపర్ణీనదికి తూర్పుతీరమున నున్నపాలంకోట యను పట్టణములో గలవు. పాలంకోటకూడ తిరునల్వేలియంత పెద్ద పట్టణమే. ఈ రెండును నదిమీద నొకవంతెనచే కలుపబడు చున్నవి. తిరునల్వేలినుండి బ్రిడ్జి (వంతెన) మీదికి వెళ్లు నప్పుడు కుడిచేతిప్రక్క ఈష్టుయిండియాకంపెనివారిచే నిర్మింప బడిన ఒక స్తంభము గలదు.

వసతులు :- స్టేషను (జంక్షన్) కు 1½ ఫర్లాంగులలో లోకల్ ఫండువారిసత్రము గలదు. దినమునకు క్రిందిభాగమున 0-4-0లును, పైభాగమున 0-8-0ను అద్దె గలదు. అన్నివస తులు గలవు. ఇచ్చటినుండి పట్టణమునకు దాదాపు మైలుం డును. టౌనుస్టేషనులో దిగిన పట్టణము చాలదగ్గర. బస్సుస్టాండు జెంక్షన్ స్టేషనుకు సమీపము. జంక్షన్ స్టేషనునుండి సిటిబస్సు లన్నివైపులకు పోవుచుండును.

చూడవలసినవి :- పట్టణమధ్యమున నెల్లైయప్పార్ స్వామిఆలయము గలదు. ఇది జంక్షనుస్టేషనునుండి 2 మైళ్లుం డును. టౌన్‌బస్సుకు 0-1-6. ఆలయముచుట్టును పట్టణము నిర్మింపబడినది. ఈ ఆలయము మధురమీనాక్షి దేవాలయ మును పోలియున్నది ; గాని అంతపెద్దది గాదు. వేయిస్తంభ ములమంటపము, గర్భాలయమునకు ముందుండుమంటప స్తంభములు సంగీతస్తంభములు మొదలగునవి మోహించి చూడనగును. ఈ దేవాలయశిల్పము దర్శనీయము. మధురనాయకవంశస్థాపకు లైన విశ్వనాథ అనునాత డీదేవాలయమును పునర్నిర్మాణము గావించెనని చెప్పుదురు.

తయారగువస్తువులు:- ఇచ్చటికి సమీపములో నుండు 'మెలపలయం' అనుగ్రామములో నూలుతివాచీలు నేయుదురు. టెన్నివెల్లిలో పాత్రలు విశేషముగ జేయుదురు. చెరకు ముఖ్యమైనపంట.

☞ టెన్నివెల్లినుండి తిరుచుందూర్ వెళ్లులైనులో నున్న క్షేత్రములను, దివ్యదేశములను సేవించుకొని తిరిగి టెన్నివెల్లికే వచ్చి అచ్చటినుండి ప్రయాణమై బస్సుమీదగాని, రైలుమీదగాని కన్యాకుమారివైపు వెళ్ళవలెను.

## శ్రీవైకుంఠము

ఇది 74వ దివ్యదేశము. ఇది టెన్నివెల్లి తిరుచుందూరు లైనులో టెన్నివెల్లినుండి 18 మై. 0-10-0 లు రైలుచార్జి. స్టేషనునుండి దేవాలయమునకు దాదా పొకమైలు. ఇది తామ్రపర్ణీనదియొడ్డున నున్నది. నది కావలివైపున శ్రీవైకుంఠము గలదు. ఈ పట్టణమును కలుపుచు నదిమీదుగా 1859 లో ఆనకట్టవంతెన నిర్మింపబడినది. ఈ వంతెనపొడవు దాదాపు 3 ఫర్లాంగులు.

వసతులు:- స్టేషనునుండి 2 ఫర్లాంగులదూరమున నది యొడ్డున లోకల్ఫండువారిసత్రము గలదు. పట్టణమున భోజనశాలలు గలవు. అన్నిసౌకర్యములు గలవు. ఇచ్చటి నుండి అన్నివైపులకు బస్సులు పోవుచుండును. స్టేషనునొద్ద జట్కాలు గలవు. ఇచ్చటినుండి నవతిరుపతులు చూడనగును. బస్సులు పోవుచుండును

చూడవలసినవి :- పట్టణములో వైకుంఠనాథదేవాలయము గలదు. ఇందు స్వామి రజతశేషశాయియై యుం

డును. ఈ ఆలయమును మనప్పాడిరాజా 4000 సం॥ లకు పూర్వము నిర్మించెనని చెప్పుదురు. అమ్మవారిపేరు వైకుంఠవల్లి తాయారు. దేవాలయము చాలపెద్దది; గాని శిల్పము లేదు. ఇందు చైత్రమాసములో 10 దినములు బ్రహ్మోత్సవములు జరుగును. ముఖ్యముగ 5వ దినమున 5 గరుడసేవలు చూడదగినవి.

చంద్రవిమానము, తామ్రపర్ణినది, పృథుతీర్థము, పూర్వముఖము, ఇచ్చట నొకశివాలయముగూడ గలదు.

## అళ్వారుతిరునగరి

ఇది 75వ దివ్యదేశము, శ్రీవైకుంఠమునుండి 3 మైళ్లు. రైలుమీద 0-2-0 చార్జీ. తామ్రపర్ణినదియొడ్డున నడచి వెళ్ళవచ్చును. ఇది నమ్మాళ్వారు 12సం॥ చింతచెట్టుతొఱ్ఱలో సమాధియందున్న క్షేత్రము. 5వేల జనాభా గల గ్రామము.

వసతులు:- సత్రములు, భోజనశాలలు. బండ్లు గలవు. క్షేత్రమందు ప్రసాదము లభ్యమగును. నవతిరుపతులను సేవించుట కిచ్చటినుండి బండ్లేర్పాటుచేసికొనిపోవలెను. కాకుమాని ఆదికేశవులశెట్టిధర్మశాల దక్షిణ తిరువీధిలో నున్నది. దేవస్థానమువారియొద్ద గైడుపుస్తకములు దొరకును. వెల : అ. 0-8-0 లు.

చూడవలసినవి:- ఆదినాథస్వామి, నమ్మాళ్వారు దేవాలయములు గలవు. సుందరమూర్తులు, నిలుచున్న సేవ యిచ్చెదరు. దేవాలయమునకు వెనుకభాగమున నొకచింతచెట్టు గలదు. ఇది అతిపురాతనమైనది. నమ్మాళ్వారు చిన్నతనమున

నీచెట్టుతొఱ్ఱలో ప్రవేశించి 12 సం॥ ధ్యాననిష్ఠులైయుండి తమిళవేదమును ధారాళముగ పద్యరూపమున శ్రీమహావిష్ణుని స్తుతించుచు చెప్పిరి. ఈ చింతచెట్టు నేటికిని నిలిచియున్నది. దాని క్రిందిభాగమును 4గజముల యెత్తువరకు మూసివేసి వేదికగ నిర్మించిరి. ఈ వేదిక చుట్టును 108 దివ్యదేశముల పెరుమాళ్లను చిత్రించిరి. ఈ గొప్ప వృక్షము 7 కొమ్మలు గలిగి చాలపురాతనతను జూపును. వింత యేమన రాత్రిలందు తజ్జాతి వృక్షములవలె దీనియాకులు ముడుచుకొనవు. ఈ చెట్టుకాయలు పండవు. యాత్రికులు పవిత్రముగ దాని బెరడు, ఆకులు ప్రసాదముగ గొనిపోవుదురు.



చింతచెట్టు — ఆళ్వారుతిరునగరి

దీనికొమ్మలను నరకిన చీము, రక్తము వచ్చునని చెప్పెదరు. ఒకానొకప్పు డొకసాధు వల్లే కొమ్మను నరకగ

చీము, రక్తము వచ్చెనట. నిత్యము స్వామి నీచెట్టుక్రింద వేదికపైనుంచి అర్చించెదరు.

2వ ప్రాకారములో శ్రీదేవి, ఆండాళ్లు అమ్మవారు, శ్రీనమ్మాళ్వారు, దశావతారములు, చింతచెట్టు, రాపత్తు, పగలుపత్తు మంటపములు గలవు. ఈ ప్రాకారమంతయు దాదాపు మంటపమే.

3వ ప్రాకారములో మ్యూజియం గలదు. దీనిముందు మంటపమున సంగీతస్తంభములు గలవు. మిగిలినభాగములు శిథిలావస్థలో నున్నవి.

ఉత్సవములు :- వైకాశిమాసములో (మేనెలలో) ఉత్తరానక్షత్రదినముతో 12 దినములు బ్రహ్మోత్సవములు జరుగును. 5వ దినమున నవతిరుపతులనుండి గరుడవాహనము లతో నేకకాలమున బ్రహ్మాండమైన ఉత్సవము జరుగును. ఈ మహోత్సవము కన్నులపండువుగ నుండును. దాదాపు 5వేలనుండి 8వేలవరకు యాత్రికులు వత్తురు. అష్టోత్తరశత పూజకు 0-4-0, సహస్రనామపూజకు 0-8-0.

అప్పన్‌సన్నిధి

ఇది నమ్మాళ్వారు జన్మించినస్థానము. ఆళ్వారుతిరునగరికి తూర్పుగ దాదాపు 1½ మైళ్ళదూరములో తామ్రపర్ణీనది కావలిగట్టున గలదు. యాత్రికులు దీనినిగూడ సేవించుకొని రావచ్చును.

## రెట్టై తిరుపతి

ఇది 76వ దివ్యదేశము. ఆళ్వారుతిరునగరినుండి ఉత్తరముగా 2మై దూరములో గలదు. బండ్లు గలవు. భోజనశాలలు లేవు. వంట చేసికొననలెను. ప్రసాదము చిక్కును.

దేవపిరాన్, అరవిందలోచనుడు. కరుంతడగుడి నాంచియార్, కుముదవిమానము, తామ్రపర్ణినది, వరుణతీర్థము, నమ్మాళ్వారుమంగళాశాసనము.

## తిరుక్కుళనెందై

ఇది 77వ దివ్యదేశము. ఇది పైస్థలమునకు 3 మైళ్ళు. పైదాని మాదిరివసతులే. మాయక్కూత్తప్పెరుమాళ్, కుళందైవల్లినాంచియార్, ఆనందనిలయవిమానము, పెరుంగళతీర్థము, నమ్మాళ్వారుమంగళాశాసనము.

## తిరుప్పేరై

ఇది 78వ దివ్యదేశము. పైదానికిది మైలుదూరము. వసతులు లేవు. ఫాల్గునమాసములో బ్రహ్మోత్సవము జరుగును. మకరనెడుంగుళైకాత్తపెరుమాళ్లు, కుళైక్కాదువల్లి నాంచియార్, భద్రవిమానము, శుక్రపుష్కరిణి, నమ్మాళ్వారుమంగళాశాసనము.

## తిరుక్కోళూర్

ఇది 79వ దివ్యదేశము. ఆళ్వారుతిరునగరినుండి 2మై. వంటచేసికొనవలెను. ప్రసాదము లభ్యమగును. ఇది మధుర

కవి ఆళ్వారులజన్మస్థానము. బ్రాహ్మణేతరులు దూరము నుండియే సేవించవలెను. వైత్తమానిధిస్వామి, కోళూరువల్లి నాంచియార్, శ్రీకరవిమానము, కుబేరతీర్థము, తామ్రపర్ణి నది, భుజంగశయనము నమ్మాళ్వారుకు ప్రత్యక్షము.

## వరగుణమంగై

ఇది 81వ దివ్యదేశము. ఇది శ్రీవైకుంఠమున కొక మైలు దూరము బండ్లు గలవు. వంట చేసికొనవలెను. తిరువారాధన కాలమందుమాత్రము తలుపులు తెరచియుంచెదరు. స్వామి విజయాసనుడు, వరగుణవల్లినాంచియార్, విజయకోటివిమానము, దేవపుష్కరిణి, అగ్నితీర్థము, నమ్మాళ్వారుమంగళాశాసనము.

## తిరుప్పుళింగుడి

ఇది 82వ దివ్యదేశము పై దివ్యదేశమునుండి మైలు దూరము. బ్రాహ్మణేతరులు బయట నిల్చి చిన్నద్వారమునుండియే దర్శింపవలెను. ఇది యిచ్చటి ఆచారము కాయించ్చిన వేందపెరుమాళ్, మలర్ మగళ్ నాచ్చియార్, వేదసారవిమానము, వరుణతీర్థము, నమ్మాళ్వారుమంగళాశాసనము.

## తిరుచ్చందూర్

ఇది యిాంబ్రాంచిరైల్వేలైనులో తుదిస్టేషను. సముద్రము నానుకొనియున్నది. పెద్దపట్టణము. ఆళ్వారుతిరునగరి నుండి 17 మైళ్ళదూరము. 0-9-0 రైలుచార్జి.

వసతులు:- అనేకసత్రములు బండు. భోజనశాలలు గలవు. అన్నివస్తువులు లభ్యమగును. హైస్కూలు గలదు.

చూడవలసినవి:- సముద్రము నానుకొనియున్న శ్రీ సుబ్రహ్మణ్యస్వామ్యాలయము వేయి సంవత్సరములకు



శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ఆలయము - తిరుచ్చెందూర్

పూర్వమే నిర్మింపబడినట్లు తెలియుచున్నది. లోపలిప్రాకారములు శిల్పకళావైభవమున చిదంబరములోని ప్రాకారమును పోలియున్నవి. ఈ ఆలయపు తూర్పుప్రాకారమునకు మహాసముద్రతరంగపరంపరలు తాకుచుండును. శ్రీ సుబ్రహ్మణ్య

స్వామి యువకుడై శివార్చనా నిమగ్నుడై యొకచేత జప మాలను, రెండవచేత పుష్పములను గలిగి యాత్రికులకు భక్తి



తిరుచ్చెందూరుదేవాలయ దృశ్యము

విధేయతాదుల నాదేశించుచుండును. రెండవప్రక్క షణ్ముఖ విగ్రహము గలదు. సాయంతనార్చనా సమయమున యాత్రికులు వచ్చి తీర్థప్రసాదములు పుచ్చుకొందురు. ఇచ్చట భస్మము, గంధము ఆకులలో పెట్టియిచ్చెదరు. దేశాచారమునుబట్టి యీ స్వామికి పీచులేని గుండ్రనికొబ్బరికాయలనే కొట్టెదరు. దేవాలయగోపురములు, దేవాలయము, సముద్రమునొడ్డున విశాలమంటపములు, బరండాలు గలవు. సాయంసమయమున నిచట బహురమణీయముగ నుండును. ఆలయములోనికి వచ్చువారికి ఇసుకలో కాళ్లు కాలకుండ రేవులనుండి ఆలయములకు పెడ్లు వేసిరి.

నాలికణర్ :— ఈ క్షేత్రమున రామేశ్వరములో వలె 24 తీర్థములు గలవు. అందు దేవాలయమున కెదుట

దాదాపు 100 గజములలో 'నాలికణర్' అనెడిది సముద్రమునకు 40 గజములదూరములో నున్నది. ఈబావి 6 అంగుళములకైవారముమాత్రమే కలిగియున్నది. దీనిలోతు అంతు లేకున్నది. తక్కిన 23 తీర్థములలోని నీ రుప్పగ నుండునుగాని యీతీర్థమునీరుమాత్రము తియ్యగ నుండును. దీనియొద్దకు వెళ్లుటకు దిగుడుబావిలోనికివలె దిగి వెళ్ళవలెను. స్నానము చేయుట కచ్చటనే 1 లేక 2 తాటియాకు దొప్పలు గలవు. వానితో ముంచుకొని స్నానముచేయవలెను. స్నానము చేసిన నీరు ప్రక్కనున్న దిగుడుబావిలోనికి పోవును. ఆనీటిని పంపుతో (యంత్రసహాయమున)పైకి తోడివేయుదురు. నిత్యము స్వామి కభిషేకతీర్థ మీబావినుండియే తీసికొని వెళ్లుదురు. వైశాఖమాసమున విశాఖానక్షత్రదివసోత్సవమునకు 20 వేలకు పైగా యాత్రికులు వత్తురు. ఇందరిచేత్రి మేమన నింతమంది యాత్రికు లాచిన్నబావిలో స్నానముచేసినను నీరు తరుగక యదేమట్టమున కుండును. సముద్రస్నాన మిచ్చట మహాహ్లాదకరముగ నుండును. రామేశ్వరములోవలె నిట సముద్రస్నాన మెప్పుడైన చేయవచ్చును.

ఇచ్చట మాఘ, వైశాఖ, మార్గశిర (అవనిఅవతు) మొదలగుమాసములలో గొప్పయుత్సవములు జరుగును. వీనిని సేవించుటకు యాత్రికులు విశేషముగ వచ్చుచుందురు. గ్రామములో నొకశివాలయము గలదు. ఇచ్చటికి సమీపములో 16 స్తంభములు గలమంటప మొకటి గలదు. ప్రతిస్తంభము పైన శాసనములు చెక్కబడియున్నవి.

తిరుచుందూరునుండి ప్యారీకంపెనీవారి సొంతరైల్వేలైను న్యారోగేజీ టినయన్‌విలైస్థలమునకు వేయబడినది. అటనుండి కొలంబో, తూటికారన్ మొదలగు ప్రదేశములకు రేవువ్యాపారము చేయుదురు.

 తిరుచుందూరునుండి తిరిగి మరల తిరునల్వేలిస్టేషనుకు రావలెను. ఇటనుండి అనంతశయనము చేరువరకు బస్సుప్రయాణము.

## తోతాద్రి

బస్సులమార్గమున తిరునల్వేలినుండి నాగర్‌కోయిల్ వెళ్లుమార్గమున బస్సుమీద 19 మైళ్ళు ప్రయాణముచేసినచో తోతాద్రి చేరుదురు. 0-10-0 చార్జీ. దీనినే వానమామలై లేక నాంగునేరి, శ్రీదరమంగాయ్ అనియు పిలిచెదరు. ఇది 83వ దివ్యదేశము. అష్టస్వయంవ్యక్తక్షేత్రములలో తోతాద్రి ఒకటి.

వసతులు:- భోజనశాలలు, సత్రములు రామానుజ కూటములు గలవు. జియ్యరుగారిమఠమునందు యాత్రికులకు ప్రసాదము లభించును. బండ్లు గలవు. అన్ని వస్తువులు దొరకును.

చూడవలసినవి:-తోతాద్రినాథదేవాలయము. ఈ క్షేత్ర స్వామిని భూమినుండి తీయునప్పుడు స్వామికి గాయముతగులుటచేత నాటినుండి నేటివరకు నిత్యము కొన్ని డబ్బాలనూనెతో అభిషేకము చేయుదురు. ఈనూనె సోమసూత్రముద్వారా యొకగుంటలోనికి పోవును. దానిని తీసి మొదటిప్రాకారములో ఈశాన్యముగ 50గ.దూరమున నున్న గిలుకలుగల రెండుబావు

లలో పోయుదురు. యాత్రికు లీనూనెను సీసాలలో పట్టుకొని పోయి కీళ్ళనొప్పులకు వాడెదరు. సీసా 1కి 0-1-0 వెల.

దేవాలయమున కెదుట రామానుజసంప్రదాయము నకు ప్రధానులైన జియ్యర్ గారిమఠము గలదు. దేవాలయ మున కుత్తరమున నొకపెద్దచెఱువు గలదు. దానినడుమ నొక కోనేరు గలదు. దానికి జియ్యర్ తీర్థమని పేరు

స్వామివారికి 2 లక్షలరూపాయల విలువగల బంగారు రథ మొకటి గలదు. దానిని జూచుటకు కొద్దిరుసుము గలదు. స్వామివారిపుష్పవనము చాల అందముగలిగి చూడదగియున్నది. దేవస్థానమున కొకయేనుగు, నొకయొంటెయు గలవు.

కళ్ళియూరు లేక బడేనారాయణ

ఇది సుబ్రహ్మణ్యస్వామిక్షేత్రము. తోతాద్రికి 8మై. ప్రతిశుక్రవారము స్వామిని వేడుకొనిన వరములు ఫలించునట.

కేరళదేశపరిచయము

"I had visited temples before in north India, but I had not done so in a devout spirit and they had failed to stir me. But the majestic Kerala temples spoke to me. Every carving, every little image, every little oil lamp had a meaning for me."

Mahatma Gandhi

ఉత్తరభారతములోని దేవాలయముల నింతకుపూర్వము సందర్శించితిని. నాలో సంచలన మేమియు కలుగలేదు. పుణ్యక్షేత్రదర్శనఫలము కలిగినటుల తోచలేదు. కాని కేరళ రాష్ట్రమందలి బ్రహ్మాండమైన గోపురాలంకరణ దేవాలయ

ములు నన్ను పరామర్శించినటు లనుపించినది. ప్రతిశిల్పము, ప్రతిప్రతిమ, ప్రతిజ్యోతి భావగాంభీర్యముతో ప్రకాశించినవి. నాలో జ్ఞానజ్యోతి మెఱసినది. (గాంధిమహాత్ముడు)

మనము యాత్రచేయబోవునది తిరువాన్కూరు, కొచ్చిన్, మలబార్ ప్రాంతములు. ఇదియే కేరళప్రదేశము. ఇది 14,980 చదరపుమైళ్లు విస్తీర్ణముతో 13లక్షల 60 వేల జనాభా గలిగియున్నది. ఈ భూభాగము బహుసారవంతమై పనస, ఖర్జూర, పోకచెట్లతోడను, జాతీ యాలకీ లవంగాది లతాసంతానములతోడను బహురమణీయముగ నుండును. పునుగు జవ్వాది కస్తూరి మొదలగు సుగంధద్రవ్యముల కిది యునికిపట్టు తామ్రపర్ణీనదీపరిపుష్టములై బహుసస్యములు, కొబ్బరిచెట్లు, ఫలవృక్షాదులు ఫలించుటచే దేశము భాగ్యవంతముగ నుండెను. అనుకూలవాతాతపాదులచే స్త్రీ పురుషులు స్వర్ణచ్ఛాయ గల్గియుండుటయేగాక బుద్ధివికాసవిశేషముతో రాణింతురు. సంగీత సాహిత్య నాట్య శిల్పాది విజ్ఞానములయం దాదర్శకులగువారికేగాక, ఆధ్యాత్మికవిజ్ఞానమునం దాదర్శకులగు మహామతిమంతులు నిందే యుదయించిరి. అద్వైతదర్శనప్రణేత జగద్గురు శ్రీశంకరభగవత్పాదుల కిదియే జన్మభూమి. కథాకళి నాట్యశాస్త్రకర్త శ్రీవీర కేరళవర్మ కిదియే పుట్టిల్లు. సంగీతగేయరచయిత మహారాజస్వాతితిరునాళ్మహోదయు డేతద్దేశీయుడే. ఈ గానసరస్వతి తనగేయములను సంస్కృతాంధ్ర తమిళ మళయాళ మహారాష్ట్ర హిందీభాషలలోగూడ విరచించెనట. ఇక భారతదేవతామూర్తులయెడ

గాఢభక్తిపరిపక్తులు రేకెత్త తనయపూర్వకుంచికచే ననేక చిత్రముల ననుగ్రహించిన శ్రీరవివర్మ తిరువాన్కూరు రాజ కుటుంబములోనివాడే. శిల్పకళోన్నతికి నానాదేవాలయ మంట పాదులే నిదర్శనము. దంతపువస్తువు లిందు బహుమనోహర ముగ జెక్కబడును. డచ్చి. ఫ్రెంచి, పోర్చుగీసులు, పర్షి యనులు, రోమనులు, గ్రీకులు మున్నగు విదేశీయు లీదేశ సౌభాగ్యము నెంతయో కొనియాడి, యిచటి యపూర్వవస్తు సంభారమూలమున వ్యాపారసంబంధము నొందిరి.

భాగ్యమునకు దోడిచటిపుణ్యాత్ములలో మహోదారు లనేకులు గలరు. అప్పటి కేరళచోళచేరప్రభువులు తమ రాజ్యమునంతయు భగవదర్పణ మొనర్చి, తాము తత్కైంకర్యధర్మకర్తలుగ మాత్రము వర్తించిరి. ఎన్ని వేలజనులకైన నిరతాన్నప్రదానము గావించుచుండిరి. మొన్న మొన్నటి వరకు అనంతశయనము. జనార్దనము, కన్యాకుమారి మున్నగు దేవస్థానములలో నడచిన కార్యక్రమమే యిందుకు తార్కాణము. ఇట్లు స్వర్గఖండ మనదగి, పావనపండితపాదపవిత్రిత మైన యీ పుణ్యభూమిని దర్శించి, తద్రజోలేశమునైన శిర మున ధరించి, తామ్రపర్ణినిర్మలోదకస్నానపానము లొనర్చి, మనమును ధన్యుల మగుదుముగాక !

"I have left a bit of my heart here, because of the beauty of the land, and its beautiful people. I shall come again" NEHRU

స్థలరామణీయము, జనరామణీయము, నాహ్లాదయము నాకర్షించినవి. నేను మరొకమారు రాగలను.

* జవహర్లాల్ నెహ్రూ

## పొన్నగుడి లేక ఛోటేనారాయణ

వానమామలై నుండి 12 మైళ్లు. బస్సుకు 0–7–0. దేవాలయము చీకటిలో నుండును. స్వామిపేరు రామలింగస్వామి, అమ్మవారు శివకామేశ్వరి. ఇది హనుమత్ప్రతిష్ఠయని చెప్పెదరు ఛోటేనారాయణదేవాలయము చిన్నది ఇది పై దేవాలయమునకు దక్షిణముగా నుండును. ఈ దేవాలయము గౌతమముని ప్రతిష్ఠ యని చెప్పుదురు.

## నాగర్‌కోయిల్

ఇది పెద్దపట్టణము. సిమెంటురోడ్లు, క్లాక్‌టవరు కలిగి అందముగ నుండును. ఇక్కడనుండి మళయాళదేశములోనికి ప్రవేశింతుము. పూర్వ మిచ్చటికి 8 మైళ్ళదూరములో నొక గ్రామమునొద్ద బ్రిటిష్ తిరువాన్కూరుసరిహద్దులో మనపెట్టెలను సామానులను విప్పి తిరువాన్కూరు కస్టమ్సుఆఫీసులో తనిఖీచూచెడివారు. పొన్నగుడినుండి 16 మైళ్లు బస్సులో పోవలెను. 0–8–0 చార్జి. మళయాళమునందు స్త్రీలు పురుషులవలె ఒకతుండుగుడ్డ లుంగీ కట్టుకొని చేతులు లేని బనీనులపైన ఒకతుండుగుడ్డ కప్పుకొందురు. వెంట్రుకలు దూముడి వేసికొందురు. పురుషులు లుంగీ, చొక్కా, పైన తుండుగుడ్డ ధరింతురు. ఇది యీ దేశపూర్వాచారము. నాగరికులు మాత్రము పరిశుభ్రముగ మామూలుగ వస్త్రములు ధరింతురు.

వసతులు :- అన్ని వస్తువులు దొరకును. పెద్దబజారు గలదు. బజారునుండి 6 ఫర్లాంగులదూరములో రాజావారి ధర్మశాల గలదు. ఇటనుండి తిరువనంతపురమునకు, కన్యాకుమారికి, తిరునల్వేలికి గంటగంటకు బస్సులు పోవుచుండును. బ్రాహ్మణభోజనశాల లుండవు. భోజనవసతికి చాలనిబ్బంది. మాంసాహారము చేయునాయర్లవో, లేక ముసల్మానులవో భోజనశాలలుమాత్రి ముండును. ప్రతిభోజనపదార్థమునందును కొబ్బరినూనె విశేషముగ వాడుదురు. సొంతవంట చేసికొనుట శ్రేష్ఠము. తిరువనంతపురము వెళ్లుమార్గ మంతయు సిమెంటురోడ్డు. ఇది ఎత్తైనపర్వతములమీదుగా, మహారణ్యములగుండ పోవుచు ప్రకృతిసౌందర్యముతో నాహ్లాదము కలిగించును

మలబారు దేశమున దేవాలయములకట్టుబడి పూర్తి మార్పుగా నుండును. రాతిపని చాలతక్కువ. దేవాలయములో ఎర్రరంగు వేసిన రేకులతో (మాంగళూరు పెంకులు) గేబెలుగాను. గర్భగుడి గుండ్రముగా నుండి బంగారపునీరు కలశములుమాత్రము పైన నుండును. గోపురము లుండవు. ద్వారములమీద కలశములు గలగేబె లుండును. మొదటి ప్రాకారమునకు వెలుపల అంతయు కొయ్యకటకటాల కిత్తడి దీపపు ప్రమిదలు పంద్రెండువరుసలలో నాల్గువైపుల నుండును. ప్రదక్షిణముచేయువేళలో వాని నన్నిటిని వెలిగింతురు. ఈదృశ్య మానందకరముగ నుండును. ఆలయములను గుర్తించుట కష్టము. గంధము ఇసుకతో కూడినతడి విభూతిని తీర్థమిచ్చెదరు. ప్రసాదముగా దీనిని భుజించెదరు.

ముఖ్యముగ చూడదగినవి :— నాగేశ్వరన్‌కోయిల్. సత్రమునుండి 2 ఫర్లాంగులదూరమున కనబడుచుండును. నాగరాజస్వామి భూమిమట్టమున నుండును. ఇది స్వయంభు వని చెప్పుదురు. గర్భాలయములో స్వామిప్రక్కన 'నీటి యూట' గలదు. అర్చకుడు తీర్థముగా నాయూట జలమునే యిచ్చుచుండును. అన్నిటికంటె విచిత్రవిషయ మేమన యాత్రికుల కాయూటనుండి వచ్చునిసుకనే ప్రసాదముగ నిచ్చెదరు. మొదటి ఆరుమాసములు తెల్లయిసుకయు, రెం డవ ఆరుమాసములు నల్లయిసుకయు వచ్చుచుండునట.

దేవాలయమునకు నెదుట నొకచిన్నకొలను గలదు. అందు యాత్రికులు స్నానమాడెదరు. దీనికుడివైపున ఒకపెద్ద అశ్వత్థనారాయణవృక్షమును, యాత్రికులు ప్రదక్షిణముచేయు పెద్దరాతివేదికయు గలవు. ఇచ్చట దానిమ్మపండ్లు చాలచౌకగ దొరకును.

## తిరువణపరిశారం

ఇది 84వ దివ్యదేశము. ఇది నాగర్‌కోయిల్‌కు దాదాపు 2 మైళ్ళుండును. బండ్లు గలవు. చక్కనిరోడ్డు గలదు. బస్సులు పోవుచుండును. నాగర్‌కోయిలుకు, కన్యాకుమారికి మధ్య గలదు. సత్రములు గలవు. ఇది నమ్మాళ్వారుతల్లిగారైన నాథనాయకమ్మవారి జన్మస్థానము. తిరుక్కుఱళప్పర్, కమల వల్లినాంచారు ఇంద్రకళ్యాణివిమానము, లక్ష్మీతీర్థము, తూర్పు తిరుముఖమండలము, కూర్చున్న సేవ.

## తిరువట్టారు

ఇది 8వ దివ్యదేశము. ఇది నాగర్ కోయిల్ కు దాదాపు 20 మైళ్ళు. బండ్లు, బస్సులు గలవు. సత్రములు గలవు. ఈ క్షేత్రము రెండునదులమధ్య నుండుటచే దీని కాపేరు వచ్చినది. ఇది ఒకచిన్నబస్తీగాన సౌకర్యములు గలిగి యున్నది. బ్రాహ్మణేతరులు స్వామిని సేవించుటకును గర్భాలయము తాకుటకును నధికారము లేదు. ఆది కేశవపెరుమాళ్, మకరవల్లినాంచియార్, అష్టాంగవిమానము, కడల్ వాయి తీర్థము. నమ్మాళ్ వారు మంగళాశాసనము. పరశురామక్షేత్ర మందురు, ఆలయప్రాకారములు విశాలమైనవి. రాతి స్తంభములు బారులు తీరియుండును. వానిపైశిల్పము ద్రవిడకాలమునాటిది.

## శుచీంద్రము

"నమోస్తు వాగీశ హరీశ్వరాయ । నాగేన్ద్రచాపాయ నదీధరాయ
నామ్నా శుచీన్ద్రేశ ఇతిస్తుతాయ । జ్ఞానాటవీశాయ నమశ్శివాయ"

ఇది నాగర్ కోయిల్ కు కన్యాకుమారికి మధ్య నున్నది. పళయార్ నదియొడ్డున గలదు. ఇది పెద్దయూరు. అన్ని వసతులు గలవు. సత్రములు గలవు. పూర్వము తిరువాంకూరు ఎస్టేటులో చేరినది. అనంతశయనము తరువాత నిదియే గొప్ప క్షేత్రము. దేవేంద్రుడు తపస్సుచేసి పాపవిముక్తుడైనందున దీని కీపేరు కలిగినది.

వసతులు :— అన్నివసతులు గలవు. వంట చేసికొనవలెను.

చూడవలసినవి:- స్థానేశ్వరాలయము. దీనిని స్థానమలయప్పెరుమాళ్ అనియు అందురు. ఇది చాల గొప్పది.



శుచీంద్రము

మొదటిప్రాకారముపై నేడంతస్తులగోపురము గలదు. ద్వారముకడ పోలీసుసిబ్బంది యుండును. యాత్రికులు చొక్కాలు విప్పి దేవాలయములోనికి వెళ్ళవలెను. ఈ క్షేత్రము చుట్టుపట్ల పూర్వము జ్ఞానారణ్యమనెడి గొప్ప అరణ్యముండెడిది. అందత్రిమహర్షి, అనసూయ తపస్సుచేసికొనుచు నుండెడివారని చెప్పెదరు. దేవాలయము నానుకొని త్రివేణి యనుపెద్దకోనేరు

గలదు. ఇంద్రుడు తపస్సుచేసినది, అనసూయ త్రిమూర్తులను పసిబాలురగావించి సేవించినది యిచ్చటనేయని చెప్పెదరు. ఇచ్చట బ్రహ్మ విష్ణు, మహేశ్వరుల నర్చించెదరు. ముగ్గురు మూర్తు లేకరూపము దాల్చి ఏకేశ్వరాకారమున నిక్కడ వెలసియున్నారు. ఆయాకారమును 'ధర్మసంవర్ధని' అందురు. నిత్యము రాత్రిలం దింద్రుడు స్వయముగా వచ్చి పూజించు ననియు, అట్లు పూజించినందుకు గుర్తుగ వస్తువులు స్థానములు మారియుండుననియు అర్చకులు చెప్పెదరు. నేటికి నిది దృష్టాంతము దేవాలయములో నేమిజరిగినది యేమి విన్నది యితరులకు చెప్పకూడదట. దేవాలయగోపురము పై అంతస్తు లోపలి భాగమున గలగదులలో దేవాలయ పూర్వచరిత్ర విశేషమును దెలుపుగాథలు చిత్రరూపమున వ్రాయబడియున్నవి. దేవాలయములో స్వామికి చేయునభిషేకము బయటికి రాక భూమిలో అంతర్ధానమై కన్యాకుమారియొద్ద స్థానతీర్థములో సముద్రమున కలియునని చెప్పెదరు. అచ్చట ఒడ్డున అలలు తీసిన వెంటనే యిసుకను తీసి యూరిననీటిని త్రాగిన తియ్యగ నుండును. ఈ తియ్యనియూట శుచీంద్రములోని అభిషేకజలమని చెప్పెదరు.

కన్యాకుమారికడనున్న అమ్మవారు స్థానేశ్వరుని వరించెను. వారికి వివాహముహూర్తము నిశ్చయింపబడెను; గాని స్థానేశ్వరు డాముహూర్తమునకు వెళ్లకుండుటచే పెండ్లి ఆగిపోయెను. అందుచే నప్పటినుండి నేటివరకు కన్యాకుమారి కన్యగాను, స్థానేశ్వరుడు బ్రహ్మచారిగాను వేరు వేరుగా నిలచిపోయిరి.

కళ్యాణమంటపముల స్తంభములు సంగీత స్తంభములు. వానిని వాయించి చూడవలెను. ఆదిశంకరులు ఇచ్చట చిత్రి సభలో శివతాండవమును దర్శించెననియు, శివుడు స్వయముగా వారికి బ్రిణవ ముపదేశించెననియు చెప్పెదరు.

## మరుత్త్వల్ మలై

శుచీంద్రమునుండి 5 మై. మైలాడీ అనుగ్రామమునకు వెళ్లుజంక్షన్ రోడ్డులో దిగి అచ్చటినుండి 9 మై. నడచివెళ్ళిన దీనిని చేరుదుము. (ఈతొమ్మిదిమైళ్లలో 7 మై. కొండమీాదను 2 మైళ్లు మైదానములోను పోవలెను.)

వసతులు:- సామాను, పాత్రలు తీసికొని వెళ్ళి వంట చేసికొనవలెను. అచ్చట నేవియు దొరకవు.

చూడదగినవి :- మలై (పర్వతము) హనుమంతుడు లక్ష్మణమూర్ఛాసమయమున సంజీవిపర్వతమును తెచ్చి పని పూర్తియైనపిదప లంకనుండి దానిని విసరగా అందుండి యిచట జారిపడిన కొంతభాగమే యీాపర్వతము. దీనిపై పెక్కుగొప్ప మూలికలు దొరకును.

## కన్యాకుమారి (అగ్రము)

శుచీంద్రమునుండి కన్యాకుమార్యగ్రము 9 మైళ్లు. బస్సుకు 0-4-0. ఇది భారతదేశ పరమదక్షిణాగ్రము. శుచీంద్రమునుండి 3 మైళ్ళ పొడవువరకు పడమటికనుమ లుండి అటనుండి పర్వతములు ముగిసి భూమిమాత్రము గుట్టలు, గుట్టలుగ మెట్టపల్లములుగ నుండి తరువాత కన్యాకుమారి

వరకు మైదానముగ నుండును. కాశీయాత్రచేసినవారు తప్పక కన్యాకుమారిఅమ్మవారిని దర్శించవలె ననుశాస్త్రనియమము గూడ గలదు. కాన సంవత్సరముపొడుగునను యాత్రికులు నానా దేశములనుండి వచ్చుచుందురు. ఇచ్చట మూఁకునిద్రలు చేయునాచారము గలదు.





కన్యాకుమారి అగ్రము

వసతులు:- బస్సు ఆగుచోటు కెదురుగ గవర్నమెంటు వారిసత్రము గలదు. అన్నివసతులు గలవు. సత్రపుగదులలో

నుండి సముద్రము, దేవాలయము, దూరమున పోవు ఓడలు చూడనగును. ఈ సత్రమునకు చార్జీ లేదు. ఇవిగాక మరి రెండు సత్రములు గలవు అచ్చట దినమునకు 0-4-0 చార్జీ. భోజనశాలలో ముందుగ తెలిపిన దానికేర్పాటు చేయుదురు. అన్ని వస్తువులు దొరకును

చూడదగినవి:- శ్రీకన్యాకుమారీదేవాలయము ముఖ్యమైనది. ఇది సముద్రపుటొడ్డున నుండును. భారతదేశపుణ్యక్షేత్రములలో చిట్టచివరనుండుక్షేత్రమిదియే. బంగాళాఖాతము, అరేబియాసముద్రము హిందూమహాసముద్రము కన్యాకుమారి అమ్మవారిపాదముల పూజించుచున్నవా యనునట్లు కడుగంభీరముగ తరంగించుచుండును. అమ్మవారు తూర్పుముఖముగ 16సంవత్సరములబాలికవలె నిల్చుండి దుష్టులకు భయంకరముగను, భక్తులకు తల్లివలెను ప్రసన్నసుకుమారతతో గాన్పించుచుండును. ఉత్సవసమయములో అమ్మవారిశరీరమంతయు గొప్ప గొప్పమణులచే అలంకరింతురు. ఆమణులు రత్నములు మొదలగువిలువగల ఆభరణముల నెల్ల తిరువాన్కూర్ మహారాజా వారిరాజభవనమున భద్రపరచియుంచెదరు. ముఖ్యముగ అమ్మవారికి 'నాగమణి' అనునొకగొప్పమణి గలదు. దానికాంతి మహాప్రభాభాసమానమై లైటుహౌస్‌లోనిదీపమువలె ప్రకాశించును. నావికులు భ్రాంతులు గాకుండుటకై ఉత్సవ సమయములలోను, ముఖ్యపర్వదినములలోనుదప్ప మిగిలిన సమయములందు ప్రాగ్దక్షిణపశ్చిమద్వారములు మూసియే యుండును. దేవాలయములోని కుత్తరద్వారముగుండ ప్రవేశించెదరు.

అమ్మవారినలంకరించి ప్రతిదినము రాత్రి 8గంటలకు గావించు పూజా, హారతులు చూచితీరవలెను.

స్నానఘట్టము :- దేవాలయమునకు దక్షిణభాగమున క్రమముగ దిగి దాదాపు నూరుగజములు వెళ్ళిన స్నానఘట్టములు వచ్చును. ఈస్నానఘట్టములకు 10గజములదూరములో హిందూదేశపుచివరరాయి (Last stone of India) గలదు. మాతా. పితృఘట్టములలో బ్రాహ్మణులచే సంకల్పములు చెప్పించుకొని స్నానముచేయుదురు. ఇవిగాక చుట్టుపట్ల దాదాపు 11 తీర్థములు గలవు. యాత్రికు లందు స్నానము చేయుదురు.. 1.చక్ర 2.పాపనాశన, 3.గాయత్రి, 4 సావిత్రి, 5. సరస్వతి. 6 కుమారి, 7. గణేశ, 8. భాను, 9. వేమ, 10. మాతృ, 11. పితృ నామములుగల 11 తీర్థములు గలవు.

పడమరగా అరేబియాసముద్రతీరమువైపు వెళ్ళిన 2 ఫర్లాంగులలో సముద్రమునానుకొని P. W. D. వారిచే నిర్మించబడిన స్వాభావిక మైనస్నానఘట్టము. (Natural Bathing pool) గలదు. ఇందు స్నానముచేయుట కనేకులు పాశ్చాత్యులు, భారతీయులు ప్రత్యేకముగ కార్లపై వచ్చి స్నాన మాచరించి పోవుచుందురు. ఇచ్చట సూర్యోదయాస్తమయముల ప్రకృతి వైభవదృశ్యము నేత్రానందకరమగుట ముఖ్యాదర్శనీయము. ఈఘట్టములోనికి ప్రవేశించుటకు 0-2-0 రుసుము చెల్లించవలెను.

గాంధిమంధిరము:- కన్యాకుమారి అగ్రమువద్ద మూడు లక్షల రూపాయల ఖర్చుతో తిరువాన్కూర్ కొచ్చిన్ ప్రభు



సూర్యోదయము – కన్యాకుమారి

త్వములవారు గాంధిస్మారకమందిరము నిర్మించిరి. గాంధిజీ అస్థికలలో కొన్ని 1948 ఫిబ్రవరి 12వ తేదీన కన్యాకుమారి వద్ద సముద్రములో కలపబడినవి. ప్రతి సంవత్సరము అక్టోబరు రెండవ తేదీన అనగా గాంధిజయంతినాడు సూర్యకిరణాలు మందిరములోని వేదికపై ప్రసరించునటుల నేర్పాటు జరిగి యుండుట ఈమందిరములో ఒక విశేషము.

ఇచ్చట ప్రకృతిసౌందర్యము కడురమణీయము. మూడు గొప్పసముద్రముల కలయికచే కొండలవంటి అలలు లేచి

రాళ్ళకు తగిలి దాదాపు నూఱడుగులయెత్తు లేచి సూర్యరశ్మికి వెండి తళుకువలె మెరసి, తెల్లనినురుగుతో నీటిపై బడి తేలు చుండుదృశ్యము రాత్రి చంద్రకాంతియందును, పగలు సూర్య కాంతియందును మిరుమిట్లుగొలుప, శీకరశీతలవాయువులు సోక యాత్రికుడు పరమానందమున మునిగిపోవును జీవితాంతమువరకును మరపునకు రాక యాత్రికు డాసుందరదృశ్యముల స్మరణకు తెచ్చుకొన్నప్పుడెల్ల గగుర్పాటు నొంది, తన్మయత నొందకమానడు.

వివేకానందునిగుట్ట (Vivekananda Rock) – శ్రీమత్ వివేకానందస్వామి తాను తనపరివ్రాజక జీవితములో కన్యాకుమారికి వచ్చినప్పుడు హోరుమనుచు, భీతినిగొల్పుసముద్రమున భీతిజెందక ధైర్యముతో దుమికి యీదుకొనుచు నీగుట్టపైకి వెళ్ళి 3దినములు తపస్సుచేసి అమితోత్సాహము కలిగి, తాను పాశ్చాత్యదేశములకు వెళ్ళసంకల్పించినది యీగుట్ట

వివేకానందునిగుట్ట (కన్యాకుమారి)





సూర్యాస్తమయము - కన్యాకుమారి

మీదనే. గనుక దీనికి వివేకానందునిగుట్ట యనిపేరు గలిగెను. ఆగుట్టపైకి యాత్రికులు చిన్న తెప్పకొయ్యలమీద వెళ్ళవచ్చును. రానుపోను రూ.1/- తీసికొందురు. ఇది కడుఅపాయకరము. ఆడవారు వెళ్ళలేరు. మగవారిలోగూడ నీత వచ్చి ధైర్యసాహసములు గలవారే పోవలయును

ఈ గుట్టకు వెళ్ళి ప్రదక్షిణముచేసి తిరిగివచ్చుట కొకమైలుకు పైగా నుండును. వివేకానందునిచరిత్ర స్మృతికిరాగానే నాలో (రచయిత) నొకనూతనోత్సాహము గలిగియెట్లయినను ఆ పవిత్రగిరికి ప్రదక్షిణమొనరింప సంకల్పము

గలిగినది. ఒక తెప్పకొయ్యను గాని దానిసాయముతో వెళ్ళితిని. దీనిసూత్రి మేమున నెట్టి స్థితిలోగూడ ఆ కొయ్యను వీడరాదు. ఈ మహాసముద్రము నీదుటయన సామాన్యపుపని గాదు. అందు నాకో యీత అసలే రాదు. ఎట్లో భగవానుని అనుగ్రహమున నీకొయ్యసహాయమున ఆగుట్ట సమీపించి గుట్టపై ధ్యానముగావించి తరువాత ఆగుట్టకు ప్రదక్షిణము చేసి తిరిగి వచ్చితిని. ఈ మహాసముద్రముపై నెట్లు వెళ్ళితినో ఆ ధైర్యసాహసము లెట్లు కలిగెనో భగవచ్చిత్రముగ నాకు తోచెను. శ్రీవివేకానందులు అచ్చటికి వచ్చిన సందర్భములు వగైరా విషయములు అచ్చటనున్న 'వివేకానందగ్రంథాలయము'లో నున్నగ్రంథములలో వివేకానందుని జీవితము చదివిన తెలియనగును. గుట్టపైకి వెళ్లువారు నావికులతో ముందుగ రేట్లు మాట్లాడుకొనవలెను. డబ్బు తిరిగివచ్చిన తరువాత సత్రములో నిచ్చెదమని చెప్పవలయును. సాధారణముగ తిప్పమీదకు వెళ్లినతరువాత నెక్కువచార్జీ వసూలు చేయ ప్రయత్నించెదరు. అటుల నియ్యనిచో అచ్చటనే వదలి వెళ్లెదమని బెదరించెదరు. కాని అట్టిసమయమున మారుమాట్లాడక వారడిగినరేటిచ్చెదమనిచెప్పి వారు చేసినమోసమునకు తిరిగి వచ్చిన తరువాత అసలే యియ్యమని పేచీపెట్టి చివరకు మొదట ఒప్పుకొన్నరేటే యియ్యవలెను. డబ్బుమాత్రము మీ వెంట నుండరాదు.

ఈ అగ్రమునుండి చూచిన ప్రతిసంవత్సరమును చైత్రి మాసమున పూర్ణిమనాడు సూర్యాస్తమయమును, చంద్రో

దయము నొకే క్షణమున జరుగుట చూపరుల కాశ్చర్యా నందోత్సాహములను కలిగించును. ఇట్టిచిత్రి మీాఁగ్రిము నొద్దతప్ప ప్రిపంచమం దెచ్చటను గానుపించదు.

అనంతశయనము లేక ట్రివేండ్రము లేక తిరువనంతపురము

ఇది తిరువాంకూర్ రాజ్యమునకు ముఖ్యపట్టణముగ నుండెడిదిగాని నేడు కేరళరాష్ట్రమునకు రాజధానినగర మైనది. ఈరాజ్యము దాదాపు 7,626 చదరపుమైళ్ళ వైశాల్యము గలిగి, సాలుకు 2,32,92,000రూపాయల ఆదాయము గలిగియున్నది. మదగజశార్దూలాదివన్యమృగసంచారముగల అరణ్యములతోడను. ఏలకీ, జాతీలవంగాది లతలతోడను, జీడిమామిడి. పోక, కొబ్బరి. పనస, వరిపంటలతోడను, తెంపులేని కొబ్బరి తోపులతోడను, ఒకవైపు ఘీంకారముచేయు అరేబిమాసముద్రిమునకును, రెండవవైపు కోటగోడవలెనున్న పడమటికనుములకును మధ్య కలకలలాడు నిట్టిరాజ్యమున కిది మహారాజ నివాసపత్తన మగుటచే యాత్రికునిహృదయము నాకర్షించుచుండును.

ఇది దాదాపు లక్షజనసంఖ్య గలపట్టణము. 86వ దివ్య దేశము. దక్షిణారైల్వేలై నిచ్చటితో నంత్యమగును. దీనికే చేర దేశమని ప్రాచీనులవ్యవహారము. ఈ తిరువాంకూరు రాజ్యమును జనవరి 1750 క్రీ.పూ. మహారాజమార్తాండవర్మ తమ కులదైవమైన శ్రీపద్మనాభస్వామికే సర్వాధికారములతో, సర్వస్వము సమర్పించి భరతుడు రామరాజ్య మేలినట్లే శ్రీపద్మనాభస్వామివారిసేవకుడుగ పరిపాలనచేయుటచే నాటి

నుండి నేటివరకు నట్లే జరుగుచున్నది. ఈరాజ్యమునకు ముఖ్య చిహ్నము శంఖము. నాణెములపైనను, బ్యాడ్జీలపైనను దానినే రాజచిహ్నముగ ధరించెడివారు. ఇది గొప్పయాత్రాస్థలము. శ్రీరామానుజ, మధ్వాచార్య, శ్రీచైతన్యమహాప్రభువులు దర్శించినట్లు గలదు. ఈపట్టణము నవీనపద్ధతులతోడను, సుందర వనములతోడను రమ్యముగ నిర్మింపబడినది. ఇది కన్యా కుమారినుండి 58 మైళ్ళు. చార్జీ 2-4-0. చక్కనిసిమెంటు రోడ్డు. మహారణ్యములతో కప్పియుండు పర్వతశిఖరములు, ఒకసారి లోయ కొకవైపున, మరుక్షణమున మనము తిరిగి వచ్చినరోడ్డు కనుపించునట్లు లోయ రెండవవైపు మెట్టన తిరు గుచు పడమటికనుమలను దాటుచు, కొబ్బరి, పోక, రబ్బరు చెట్లమధ్య బస్సులు మహావేగముగ పోవుచుండ ప్రయాణికుని మనస్సు బ్రహ్మానందపరవశమగును. దృశ్య మద్భుతముగ నుం డును. సామాన్యపుబస్సులో ట్రాముల్లోవలె మిక్కిలియొత్తి డిగా నెక్కుచుందురు. నాగర్‌కోయిల్‌కు ట్రివేండ్రమునకు చార్జీ 1-0-0. ఎక్స్‌ప్రెస్సుబస్సు టిక్కెట్టు రూ. 1-14-0. సీటురిజర్వుచేసియుండును. ఎక్కడ నిలువకుండ ట్రివేండ్రము వెళ్ళును.

వసతులు:- అన్ని వసతులు, వస్తువులు లభించును. ఇది ఇండో, సిలోన్, బొంబాయి విమానమార్గములో నున్నది. ప్రతివారము విమానము లిచ్చట ఆగిపోవుచుండును. ఈ దేశ మున నేతికి బదులు కొబ్బరినూనెను వాడెదరు. యాత్రికులు ముందుగ నేతిని కొని జాగ్రత్తపడి యీ దేశమున యాత్ర

చేయుట మంచిది. వీరినాణెములు ప్రత్యేకముగ నుండెడివి. ఇచ్చట పట్టణబస్సుసర్వీసు గలదు. సెంట్రల్ రైల్వేస్టేషను దగ్గరనున్న 'గాండ్ హోటలు' లో గదులు సులభముగా దొరకును. (1గదికి రూ. 1-0-0) గుడికడ సత్రములు లేవు.



పద్మనాభస్వామిదేవాలయము (తిరువనంతపురము)

ముఖ్యముగ చూడవలసినవి:—

శ్రీ పద్మనాభస్వామి దేవాలయము: ఇది పెద్ద అనాది దేవాలయము. సింహద్వారముకడ సిపాయిలు కావలి యుందురు. లోనికి వెళ్లు యాత్రికుల చొక్కాలు విప్పించి నడుమునకు గుడ్డ కట్టించి లోపలికి పంపుదురు. ఇతర సామానులున్న వారు తీసికొని భద్రపరచి మరలివచ్చునప్పు డిత్తురు. ఇప్పుడు దేవాలయ ముందుప్రదేశము పూర్వము 'అనంతన్ కాడు' అను అరణ్యముగ నుండెడిదట.

ఈదేవాలయములో మలబారు నంబుద్రీ బ్రాహ్మణులచే సనాతన ధర్మప్రకారము మహాశుచిగను, వైభవముగను

పూజాది కర్మలు నడిపించెదరు. స్వామివారిదర్శనమున కుద యము గం. 6 మొదలు 7-30 వరకును మరల సాయంతన మున గం. 6 మొదలు 8 గంటలవరకును తెరచియుంచెదరు. ఇతరసమయములలో దర్శనము కాదు. స్వామి విష్ణుమూర్తి. ఆది శేషునిపై శయనించియుండును. స్వామివారిని మూడు ద్వారములగుండా దర్శింపవలెను. మొదటిద్వారములో స్వామి వారిముఖము కనిపించును, రెండవద్వారములో ఉత్సవరులు, నాభినుండి యుద్భవించిన బ్రహ్మదేవుడు, కమలము కనిపిం చును; మూడవద్వారములో స్వామివారిపాదదర్శన మగును. బ్రాహ్మణులకుమాత్రము తీర్థము, తులసీదళము నిచ్చెదరు. బ్రాహ్మణేతరు లందరకు పూజచేయు బ్రాహ్మణుడుగాక వేరొకబ్రాహ్మణుడు స్వామివారి పాదములవైపు అరుగుక్రింద నిల్చుండిన బ్రాహ్మణేతరులకు తీర్థము తులసీదళము నిచ్చెదరు. స్వామివారియెదుట నుండుమంటపము (వేదిక) పై నెవరికిని సాష్టాంగనమస్కారమునకుగాని కూర్చుండుటకుగాని అధికారము లేదు. దూరమునుండియే సాష్టాంగనమస్కారము చేయవలసి యుండును. ఈ దేవాలయములో నిత్యము 3 పూటలు వేల కొలది బ్రాహ్మణులకు సమారాధన జరుగుచుండును. రాజు గారి భవనమునుండి దేవాలయములోనికి రహస్యమార్గములు గలవు.

స్వామివారిగోపురమున కెదురుగ నున్నపద్మతీర్థము నందును సముద్రతీర (బీచి) సమీపములో గల శంఖతీర్థము నందును, (సముద్రమే) తప్పక స్నానముచేయవలెను. శ్రీకంఠే

శ్వరములోని శివుని, శ్రీవరాహములోని విష్ణువును దప్పక దర్శింపవలెను. తిరువనంతపురమునకు 18 మైళ్లలో తిరువల్లంఅనుచోట పరశురామ దేవాలయము, బ్రహ్మదేవాలయమును గలవు.

ఉత్సవములు:- మీనము (మార్చి) నెలయందును, తుల (అక్టోబరు) నెలయందును నేటేట గొప్పయుత్సవము జరుగును. అన్నియుత్సవములలోను మహారాజావారు స్వయముగ పాల్గొందురు. ఆరుసంవత్సరముల కొకసారి 'మురజపమ్' అనునుత్సవము 56దినములు జరుగును. అందు చివరదినమున లక్షదీపోత్సవము జరుగును. ఈయుత్సవములకు కొన్నిలక్షలు ఖర్చులగునట్లు తిరువాన్కూరుస్టేట్ గజెట్టులో గాంచనగును.

చూడదగినవి:—

మ్యూజియము:- ఇందనేక విచిత్రమైన జంతువులు, పక్షులు, సర్పములు గలవు నీటిమార్గములను చూపుస్లానులను మ్యూజియములో చూడనగును. పురావస్తుప్రదర్శనశాల, వృత్తివిద్యాను నేర్పుహైస్కూలు, కళాశాలలు హైకోర్టు, మహారాజావారి భవనములు, బీచి, విమానము లాగుస్థలము, శ్రీరామకృష్ణమఠము, చిత్రాలయము, రంగవిలాస్ప్యాలెసు, ఆర్టుగేలరీ మొదలగునవి చూడదగినవి పై ప్రదేశము లన్నియు ఒకదాని కొకటి మైలుదూర ముండును. ఇచ్చట ముఖ్యముగ దంతపుపని మహానిపుణతతో చేయుశిల్పులు పెక్కురు గలరు.

తిరువాన్కూరురాజ్యములో 8,800 అడుగుల యెత్తైన యేనుగుకొండ, 6,200 అడుగులయెత్తైన అగస్త్యపర్వతము, ఏలకికాయలు విశేషముగ పండుఏలకికొండలు గలవు. ఇవి

యన్నియు ప్రకృతిసౌందర్యమున మునిగితేలుచు తీరమున పడమటికనుమలలో గలవు.

## వర్కల లేక జనార్దనము

ఇది అనంతశయనమునుండి 26 మై. ఇచటనుండి మరల రైలుమార్గము ప్రారంభమగును. వర్కల రైలుస్టేషనుకు 0-14-0 చార్జియగును. ఇది ఆనాదిక్షేత్రములలో నొకటి. ఈక్షేత్రము అరేబియాసముద్రతీరమున సుందరవనములతోను, పెక్కునీటియూటలతోను, పర్వతములతోను, మనోహరముగ నుండును. ఐదువేలజనాభాగలపట్టణము. స్కాందపురాణమున నీస్థలమహిమ వర్ణింపబడినది.

వసతులు:- స్టేషనుకు 1½ మై. లో దేవాలయము. ఊరు కలదు. దేవాలయమువెనుక రాజాగారిధర్మశాల గలదు. అన్నివస్తువులు దొరకును. ఇచ్చటనే పేముతో పెట్టెలు, బుట్టలు, పళ్ళెములు మొదలైనవి తయారుచేయుశిల్పులుగలరు. వానిని దేవాలయమునొద్దకు తెచ్చి యాత్రికుల కమ్ముదురు. భోజనశాలలు, సత్రములు గలవు భోజనమునకు ముందుగ తెలుపవలెను. దేవాలయములో ప్రసాదము దొరకును. కార్లు జట్కాలు, ఎద్దుబండ్లు, బాడుగకు దొరకును.

చూడవలసినవి:- జనార్దనస్వామి దేవాలయము ముఖ్యమైనది. పూర్వమీదేవాలయము సముద్రతీరమున నుండి, యొకప్పుడు సముద్రముచే కొట్టుకొనిపోగా మధురరాజునకు స్వప్నమున గాన్పించి స్వామి తనజాడ నెరింగింప ఆవిగ్రహము ను వెదకి తెచ్చి యిప్పుడున్న యెత్తైన తిప్పమీద మరల బ్రతి

ష్ఠించెనట. ఆవిగ్రహము కుడిచెయ్యి విరిగియుండుటచే దానిని బంగారపు రేకులచే నంటించి మరల ప్రతిష్ఠించిరి. స్వామి ఆచమనముచేయుచున్నట్లుగా దర్శనమగును యాత్రికులు చక్రతీర్థములో స్నానముచేయుదురు. శ్రీకృష్ణభగవానుడు బాలకుని యంతయెత్తున నుండి యాత్రికుల నాకర్షించుచుండును పూర్వమిచట కణ్వమహర్షి తపస్సుచేసినచోటనియు. బ్రహ్మ యజ్ఞము చేసినస్థలమనియు, సముద్రమున తర్పణము వదలినస్థలమనియు జెప్పెదరు. ఆలయము చిన్నదిగా ఉత్తరహిందూస్థానపద్ధతిలో నుండును

దేవాలయమున కరఫర్లాంగులో అరేబియాసముద్రము గలదు. ఒకప్రక్క కొండలు, వాని నానుకొని సముద్రము, కొండలలో ననేకప్రదేశములలో ఊటజలము వచ్చుచుండుట చూచితీరవలెను. యాత్రికులు ముందయ్యూటజలముక్రింద స్నానముచేసి తరువాత సముద్రములో స్నానముచేయుదురు. ఈయూటజలము మంచి యారోగ్యము నిచ్చు ననియు, సముద్రతీర మగుటచేత చల్లగ నుండుననియు, స్వామిసేవ, దర్శనములు లభ్యమగు ననియు ననేకు లచట కాలము గడపుదురు.

ఉత్సవములు:— ప్రత్యమావాస్యతర్పణ మిచట ముఖ్యము. చైత్రె, ఆడి, పంగుని నెలలలో గొప్ప ఉత్సవములు జరుగును. అష్టోత్తరమునకు 0–6–0, సహస్రనామమునకు రు.1. శివగిరిమఠమునకు వెళ్ళుదారిలో రైలుసొరంగమువలె కొండను దొలిచి కాలువత్రవ్వి, అందుండి పడవలు నడుపబడుచున్నవి. ఈ సొరంగము దాదాపు 783గ. పొడవున నుండును. 17లక్షల రూప్యము లీపనికై వినియోగించిరి. ఒకవైపునుండి సొరంగ

ములో చూచిన రెండవవైపు వెలుతురు కనిపించుచుండును. ఈసారంగముగుండ పడవలు సముద్రములోనికి పోవుచుండును. కాలువ కిరువప్రక్కల ప్రకృతిసౌందర్యము కమనీయముగ నుండును. శివగిరిమఠమునకు సమీపములో నుండుసారంగము ద్వారముకడ నీటిబుగ్గలు నాలుగైదు గలవు. ఆ బుగ్గలకు గొట్టములు పెట్టిరి. ఆగొట్టములద్వారా నిరంతరము ధార పడుచుండును. ఆధారలక్రిందకూర్చుండి స్నానాదులచేయు నేర్పాటు గలదు. బహురమణీయమైన దృశ్యము. ఇచ్చోటి జీడిమామిడి చెట్లమధ్యగుండ రోడ్డున వెళ్ళిన నరఫర్లాంగు దూరములో శివగిరిమఠము చేరవచ్చును.

## శివగిరిమఠము

దేవాలయమునుండి దాదాపు 3 మైళ్ళు స్టేషనునుండి 1½ మైలు దూరము. దాదాపు 80సంవత్సరములక్రింద శ్రీగురు నారాయణ యనుగొప్పప్రవక్త జన్మించి గొప్పప్రచారముచేసి మలబారుదేశమంతటను తనసిద్ధాంతమును, తనసందేశమును వెల్లడించిరి. అనేకులు వారికి శిష్యులై తరించిరి. 20-9-1928 తేదీన వారు సిద్ధిపొందిరి. వారిసిద్ధాంతమున ఒకటే మతము, ఒకటే దైవము, ఒకటే వర్ణమును నున్నది. ఈ మఠమునకు వెళ్ళుదారి అంతయు జీడిమామిడిచెట్లతో నిండియుండును. ఈపంట యిచ్చట విశేషము. ఈమఠ మొక కొండతిప్పమీద గలదు. అందు చక్కని శారదాలయము 1912లో నిర్మించిరి. దానివెనుక శ్రీనారాయణగురువువారిసమాధి గలదు ఇచ్చట సన్యాసులు నివసింతురు. ఈమఠము దాదాపు 1904 ప్రాంతములో స్థాపించిరని చెప్పెదరు. అనేకకుటీరములు గలవు.

ఈమఠమును మహాత్మాగాంధీ, రవీంద్రనాథఠాగూరు మొదలగు మహనీయులు దర్శించిరి. 1903లో 'నారాయణ ధర్మపరిపాలనయోగ' మనుపేర నొకసంఘ మేర్పడెను. అందీనాడు 3, 50,000 సభ్యులు గలరు. దీనిక్రింద 1,200 బ్రాంచీలు గలవు. ఆబ్రాంచీలక్రింద అనేకవిద్యాలయములు, క్లాసన్‌లో నారాయణగురుకళాశాలయు స్త్రీలకు మరియొక ప్రత్యేకకళాశాలయు నేర్పడి నడుచుచున్నవి.

ఏటేట డిశంబరు నెలలో వారిసమాధియొద్దకు లక్షలాది భక్తులు పసుపుపచ్చనివస్త్రులు ధరించి వెళ్ళెదరు. అచ్చట ఆధ్యాత్మికసభలు మొదలగునవి మహావైభవముగజరుగును. వీరి శిష్యులలో నొకరగు పి.నటరాజన్‌గారు పాశ్చాత్య దేశములలో (ఐరోపా, అమెరికా) వారిబోధనలను ప్రచార మొనర్చిరట.

Mr. Romain Rolland, the celebrated French writer, in his famous work 'The Life of Ramakrishna' in page 160,refering to Guru Sri Narayana and his work in South India remarks: "His teachings, permulated with the philosophy of Sankara, shows evidence of a striking difference of temperment compared with the mysticism of Bengal, of which the effusion of love (Bhakti) inspire in him a certain mistrust. He was, one might say, a 'Jnanin' of action, a grand religious intellectual, who had a keen sense of the people and of social necessities. He has contributed greatly to elevation of the oppressed class in South India, and his work has been associated at certain times with that of Gandhi"

రోమైనురోలెండుగారు (Mr. Romain Rolland) రచించిన 'రామకృష్ణజీవిత' మను గ్రంథమునందలి 160వ పుట యందు శ్రీనారాయణగురుదేవుని గూర్చియు, దక్షిణమున విస్తారవ్యాప్తియం దున్నట్టి వారి రచనలను గూర్చియు ఇటుల విమర్శింపబడెను.

"జగద్గురు శ్రీ శంకరాచార్యులవారి వేదాంతముతో సంపర్కముపొందిన శ్రీనారాయణగురుదేవునిబోధనలు వంగ రాష్ట్రమునందలి భక్తియోగముతో భేదించుచున్నవి. ప్రేమ భావప్రేరిత మయినభక్తితత్వము వంగీయుల భక్తి సంప్రదాయమనిన శ్రీగురుదేవునందు తూష్ణీంభావమును రేకెత్తించినది. ఈ సమ్యగ్జ్ఞాని వేదాంతవిచారణయందు మహా మేధావంతు డగుటచే ప్రజాసామాన్యముయొక్క లౌకిక సాంఘి కావసరముల సహితము గుర్తించగలిగెను. దక్షిణమున అణగారిపోవుచున్న దీనజనోద్ధరణకై శ్రీ నారాయణగురుదేవులు మహత్తరకృషి సల్పిరి. ఈ మహనీయుని రచనలు మహాత్మా గాంధి విరచితగ్రంథములతో సన్నిహితత్వము పొందుచున్నవి.

## శెంగణూర్

ఇది 87వ దివ్యదేశము. కొట్టారకర స్టేషనునుండి 30 మైళ్లు. బండ్లు గలవు. సత్రములు గలవు. ఇమైయవరప్పన్, శెంగమలవల్లినాచ్చియార్, జగజ్జ్యోతివిమానము, తిరుశిత్తారు, శంఖతీర్థము. శ్రీనమ్మాళ్వారు మంగళాశాసనము.

### తిరువారన్ విళై

ఇది 88వ దివ్యదేశము. పైదానికిది 3మై. ఇది అర్జునుని ప్రతిష్ఠయందురు. అన్నివసతులు గలవు ఇది పంపానదీ తీరమున నున్నది. తిరుక్కురళప్పన్, పద్మాసననాచ్చియారు, వామనవిమానము, వేదవ్యాససరస్సు, నమ్మాళ్వారుమంగళాశాసనము.

### పులియూర్

ఇది 89వ దివ్యదేశము. పైదాని కిది 3మై. ఇది చాల చిన్నగ్రామము. వసతియు లేదు. అన్నియు మనమే యేర్పరచుకొనవలెను. మాయప్పిరాన్, పొర్కొరినాచ్చియార్, పురుషోత్తమ విమానము, పూంజునై తీర్థము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

### తిరువమున్నూర్

ఇది 90వ దివ్యదేశము. ఇది పైగ్రామమునకు 5 మై. ఇది నకులునిప్రతిష్ఠ యందురు. ఏవసతియు లేదు. ధ్వజస్తంభము, ద్వారపాలకులు లేవు పాంబణైయప్పన్, కమలవల్లి తాయార్, వేదాలయవిమానము, పాపనాశతీర్థము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

### తిరువల్లాయి

ఇది 91వ దివ్యదేశము. పైదాని కిది 3½ మై. పెద్దనగరము. అన్నివసతులు గలవు. ఇది వైష్ణవ క్షేత్రమైనను విభూతి వాడెదరు. కోలపిరాన్, శెల్వతిరుక్కొళుందు, తాయార్,

చతురంగకోలవిమానము, ఘంటాకరత్న తీర్థము, నమ్మాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము. పురుషులు లోపలికి వెళ్ళి సేవించవచ్చును ; గాని స్త్రీలు బయటనుండియే దర్శింపవలెను.

## తిరుక్కడిత్తానం

ఇది 92వ దివ్యదేశము. ఇది పై దివ్యదేశమునకు 5 మై. దూరము. కుగ్రామమగుటచే సౌకర్యములు లేవు. అద్భుత నారాయణుడు, కల్పకవల్లి తాయారు, పుణ్యకోటివిమానము, భూమితీర్థము నమ్మాళ్వారుమంగళాశాసనము.

## అరాణ్ముల

ఇది తిరుపల్లాయి 91వ దివ్యదేశమునుండి 2 మైళ్ళలో పాంబతీరమున గలపార్థసారథి దేవాలయము. ఇది ధర్మరాజు ప్రతిష్ఠయట. ఇందు 'అరాన్ములఅప్పన్'అనుస్వామి సంతాన హీనులకు గుఱియైనస్వామి. ఈ స్వామిని గొలిచి దక్షిణదేశమున సంతానము పొందినవారనేకులు గలరు. అందువలననే భారతదేశమున నీక్షేత్ర మీవిషయమున ప్రత్యేకఘనత వహించినది. జనవరిమాసములో యాత్రికులు పిల్లలు గుంపులు గుంపులుగా వచ్చెదరు. ఈ యుత్సవమునకు ముందే అచ్చటి పిల్ల లెండుటాకులను (మట్టలను) పోగుచేసియుంచి స్వామి యెదుట గుట్టవేసి, కొన్నిప్రార్థనలతోను, కొంతశాస్త్రకర్మ కాండతోను దానికి నిప్పుముట్టించి నృత్యగానములతో చుట్టు తిరుగుదురు. ఈ దృశ్య మానందదాయకము.

సాధారణదినములలో సంతానహీనులు కులవివక్ష లేక పిల్లలను తలంచుసన్నానముచేతను, ప్రసాదసోపేతభోజనముచేతను తృప్తిపరచెదరు. దేవాలయమున కెదుర నున్ననదియందుండు మత్స్యములను పవిత్రముగ జూచెదరు యాత్రికులీమత్స్యములను మరమరాలు, కొబ్బరిముక్కలు వేసి పోషించెదరు పాలులేనితల్లు లిట్టిదయారససత్కార్యములు చేయుటచేత వారికి స్తన్యము గలుగుననియు ప్రసిద్ధి.

క్విలన్‌నుండి ఎర్నాకులమునకు రైలుమార్గము 90 మై. మీటరుగేజి లైను వేయబడుచున్నది. ఇందు ఎర్నాకులం కొట్టాయంవరకు 37 మై. మార్గము తయారై 17-10-56 రైల్వేమంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రిగారిచే ప్రారంభింపబడినది. ఇంతవరకు 235 లక్షలు ఖర్చుఅయినది. మొత్తము 90 మైళ్ళకు 6 కోట్లు ఖర్చగునట. 1957లో పూర్తికాగలదట.

## వైకము

దీనినిగూడ దక్షిణకాశి యందురు. ఇది గొప్ప శివక్షేత్రము. వర్కలనుండి క్విలన్‌కు రైలుమీద 14 మై. దూరముండును. 0-7-0 చార్జీ. క్విలన్‌నుండి సుందరప్రకృతిని గాంచుచు స్టీముబోట్లపైన మలబారు ఉప్పుకయ్యలలో దాదాపు 12గంటలు ప్రయాణముచేసిన నీక్షేత్రము చేరుదుము. మధ్య అలప్పీ అనుగొప్ప వ్యాపారకేంద్రము గలదు. అందు దిగి మకాముచేయవలెను. ఇది కొబ్బరిపీచుపట్టాలు, కొబ్బరిత్రాడు మొదలగువానికి ప్రసిద్ధమైనస్థానము. ఇది తాలూకా గ్రామము. గ్రామమంతయు శృంగారమైన, దట్టమైనవనములతో రమణీయముగ నుండును.

వసతులు :- స్టీములాంచిమీద పోవువిధము:

| | 1వ తరగతి | 2వ త. | 3వ త. |
|---|---|---|---|
| క్విలన్ నుండి అలప్పి 8గం. ప్రయాణము | 1-0-0, | 0-8-0, | 0-4-0 |
| అలప్పినుండి ఎర్నాకులం 6గం. ,, | 1-0-0, | 0-8-0, | 0-4-0 |

ఈ చార్జీలు మారుచుండును.

చూడవలసినవి :- ఖరాసురుడు తనకు శివు డొసగిన మూడులింగములను గొనిపోవుచుండ నవి జారిపడబోవ రెండు చేతులతోడను నోటితోడను బట్టుకొని మూడుస్థలముల నొకే సమయమున ప్రతిష్ఠించెనట. కుడిచేతితో ప్రతిష్ఠించిన ప్రదేశమే వైక మనెడి క్షేత్రము. ఎడమచేతితో ప్రతిష్ఠించిన స్థలము ఏత్మనూరు ; నోటితో ప్రతిష్ఠించినస్థలము కడు_త్తెరి. ఈ మూడును సమీపములోనే యుండును. నవంబరు (కార్తిక

అలప్పీ ప్రాంతమున సూర్యాస్తమయ దృశ్యము



మాసము)లో గొప్పయుత్సవము జరుగును. 50 వేల యాత్రికులు వత్తురు.

### కొచ్చిన్

నైకమునుండి బస్సుమీదగాని, స్టీములాంచిమీదగాని ప్రయాణముచేసి కొచ్చిన్ చేరవచ్చును. దాదాపు 20 వేల జనసంఖ్య గలదు. ఇది యొకద్వీపము సముద్రతీరమునుండి దాదాపు రెండుమైళ్ళదూరమున నుండును. కొచ్చిన్ద్వీపము చేరుట కెన్నియోస్టీములాంచీలు గలవు. ఈద్వీప మంతయు కొచ్చిన్ మహారాజావారి యాధిపత్యమున నున్నది. ఇది చరిత్రాత్మక మైనపట్టణము. 1498లో వాస్కోడిగామ (Vasco-dagama) నివసించినగృహముగూడ నున్నదని చెప్పెదరు. ఇటీవల నీరేవును వృద్ధిచేసి చెన్నపట్టణమునవలె గొప్పహార్బరు (ఓడరేవు)కట్టి అనేకనవీనవసతులుచేసి పెద్దపెద్దస్టీమర్లాగునట్లు చేసియున్నారు. ఆప్రాంతములలో దొరకురబ్బరు, మిరియాలు, కొబ్బరినూనె, దినుసులు. కలప ఇతరదేశముల కెగుమతిచేయు ముఖ్యమగు రేవుపట్టణ మిదియే. ఇది పశ్చిమసముద్రతీరమున బొంబాయి వంటిపెద్ద రేవుస్థలము. హార్బరువిల్లింగ్డన్(Willing-don) ద్వీపములో నున్నది.

### ఎర్నాకులం

ఇది కొచ్చిన్నుండి 2మైళ్ళు. క్రొత్తగా వంతెన కట్టిరి. బస్సు గలదు. స్టీములాంచీలు గలవు. ఇది దాదాపు 24 వేల జనాభా గలపట్టణము. ఇది కొచ్చిన్సంస్థానమునకు ముఖ్య

పట్టణము. కొచ్చిన్ స్టేట్ రైల్వే యిచ్చటనే అంత్యమగును. కొచ్చిన్ మహారాజావా రిచ్చటి కేడుమైళ్ళదూరమున నున్న త్రిపనిత్తురై అనుకొండపై రాజభవనములో నివసింతురు. కచ్చేరి, రాజభవనములు (యిర్విన్ పార్కు) వగైరాలు గలవు.

వసతులు:- రైలుస్టేషను గలదు. ఇచ్చటనుండి కొత్తాయమునకును, అలప్పికిని మోటారుసర్వీసుగలదు. అన్ని వస్తువులు దొరకును. రెండు స్టీములాంచీలు ఒకటి మహారాజవారిభవనమునుండి గవర్నమెంటుఆఫీసులకును, రెండవది రైలుస్టేషనుకును కొచ్చిన్ రైల్వే బొట్ ఏజన్సీకిని రాకపోకలు జరపును. ట్రావెలర్స్ బంగళా గలదు.

## తిరుకాట్కారై

ఇది 93వ దివ్యదేశము. ఎర్నాకులమునుండి 6 మైళ్ళ దూరములో నున్న యిడెప్పల్లి రైలుస్టేషనులో దిగవలెను. 0-4-0 చార్జీ. ఈస్టేషనునుండి 2 మైళ్ళు. చక్కనిరోడ్డు గలదు. ఇచ్చట నన్నివసతులు గలవు. సత్రములు గలవు. కాట్కారైయప్పన్, పెరుంశెల్వనాయకి. పుష్కలవిమానము, కపిల తీర్థము. కపిలమునికి ప్రత్యక్షమైన స్థానము నమ్మాళ్వారు మంగళాశాసనము.

(అల్వాయి Alwaye) ఇది ఇడపల్లిస్టేషనునుండి 7 మైళ్ళ దూరము. 0-4-0చార్జీ. ఇది పెరియార్ నదీతీరమున నున్నది. ఇది కొచ్చిన్ స్టేటువారి వేసవివిడుకాంపట్టణము (Summer station.) శివరాత్రి కిచ్చట నున్నశివక్షేత్రమునగొప్పయుత్సవము జరుగును. ఈయుత్సవములందు నదిలో స్నానముచేయు

టకు కొచ్చి—తిరువాన్కూర్ సంస్థానములనుండి వేలకు వేలయాత్రికులు వచ్చెదరు. ఈనదీజలములో ఓషధు లుండునని ప్రతీతి.

వసతులు:- స్టేషనునుండి 1/2 మైలులో బ్రాహ్మణ సత్రము గలదు. రైలుస్టేషనులో 1, 2 క్లాసులవారి వెయిటింగు గదులు గలవు.

చూడదగినవి:- శ్రీచిత్రావీవింగు ఫ్యాక్టరి, క్రిష్టియన్ కాలేజీ, సంస్కృతకళాశాల, మహిలలాయం, గవర్నమెంటు వ్యవసాయశాఖ మొదలగునవి చూడదగినవి.

(2) నారాయణగురువు ఆశ్రమము:- శివగిరిమఠమునకు సంబంధించినఆశ్రమము. వర్కలకడ చూచిన శివగిరిమఠమునకు నిది శాఖ ఈఆశ్రమము బహునిర్మలమై చూడదగియున్నది.

## కాలడి

ఇది జగద్గురు శ్రీశంకరాచార్యులవారిజన్మస్థానము. అంగమాల అనుస్టేషనులో దిగవలెను. అల్వాయినుండి 6 మై. రైలు

శ్రీశంకరాచార్యులవారి జన్మస్థానము (కాలడీ).



చార్జీ0-4-0. స్టేషనునుండి దాదాపు 5 మై. దూరమున శ్రీశంకరులవారిజన్మస్థాన మైనకాలడీ చేరవచ్చును. బస్సులు గలవు. ఇది పెరియూరునది ఒడ్డున నున్నది. నదిలో స్నానము చేయుటకు చక్కనిఘట్టములు గలవు. ప్రకృతి సౌందర్యము బహు రమణీయము. 5 వేలజనాభా గలగ్రామము. చెవ్వారా లేక కారుకుట్టిస్టేషనులలో దిగిన 7 మై. దూర ముండును. బస్సులు గలవు.

వసతులు :- శృంగేరీమఠమువారు యాత్రికుల సౌకర్యార్థము గృహములు నిర్మించిరి. కారుకుట్టి రైలుస్టేషనులో దిగిన ప్రక్కగనే రోడ్డు పోవుచుండును. ఇచ్చటినుండి బస్సులో కాలడీకి వెళ్లుట చాలసులభము ; లేదా తిరుచూరునుండియైన వెళ్ళవచ్చును. కాని కాలడీస్టేషనులో దిగుట అంతమంచి మార్గము కాదు. భోజనమున కిబ్బంది. కాన వెళ్లునప్పుడీవిధముగా కారుకుట్టిమీదుగా వెళ్ళి, వచ్చునప్పుడు నేరుగా కాలడీనుండి తిరుచూరుకు ప్రయాణము చేసిన అచ్చటినుండి రైలుమీద వెళ్ళవచ్చును.

చూడవలసినవి : శ్రీశంకరాచార్యులవారి దేవాలయము నిర్మించినప్రదేశము పూర్వము కొచ్చిన్ సంస్థానముక్రింద నుండెడిది. కాని 1906 లో తిరువాన్కూరుసంస్థానమువారాప్రదేశమునంతను కొని శ్రీశంకరుల దేవాలయము నిర్మించుటకుగాను శ్రీ శృంగేరిమఠమున కిచ్చిరి. ఈస్థలమున నే మనము దర్శించు శ్రీ శంకరభగవత్పాదాలయము, శ్రీరామ

కృష్ణమఠము గలదు. 1910 సంవత్సరములో నిర్మించిన దేవాలయములు చూడదగినవి. ఈ దేవాలయములలో నితర దేవాలయములలోవలె తాంత్రికమంత్రములతోగాక వేదమంత్రములచే పూజ గావింపబడుచుండును. ఈ యాలయనిర్మాణములలో మహోపకార మొనర్చిన తిరువాన్కూరుసంస్థానాధీశులు చిర స్మరణీయులు. ఈ ప్రదేశముననే శ్రీ శారదా దేవీ దేవాలయము, దీని కెదురుగ శంకరులు తనహస్తములతో అగ్నిని కల్పించి తల్లిగారి దహనసంచయనాది క్రియలు నిర్వహించిరని శృంగేరీమఠమువారు నిర్ధారణచేసి తులసికోటను కట్టించి శాసనములను గావించిరి. ఇదియు చూడనగును దానిప్రక్కన శ్రీ శంకర దేవాలయము గలదు. దానిసమీపమున మరియొక ఆవరణములో సంస్కృతపాఠశాల, వేదపాఠశాల, వారివసతి గృహములు గలవు. పోక, పనస మున్నగు తోటలతో మహారణ్యముగ నుండి, మధ్యమధ్య చక్కని బాటలతో కలకల లాడుచుండును.

ఈ దేవాలయముల ప్రక్కనే శ్రీశంకరులవారు స్వయముగ ప్రతిష్ఠించిన శ్రీకృష్ణ దేవాలయము గలదు. శ్రీశంకరులవారు నివసించినగృహము మొదటి దేవాలయముల ఆవరణములోనే యుండియుండునని నిర్ధారణచేసి శంకరాలయమును నిర్మించిరి.

శ్రీరామకృష్ణాద్వైతాశ్రమము పై ఆలయములకు పోవు త్రోవలో గలదు. వీరుగూడ ఒక సంస్కృతహైస్కూలును నడపుచున్నారు.

ఉత్సవములు:- వైశాఖశుద్ధపంచమినాడు జరుగు శ్రీశంకరజయంతికి యాత్రికులు వేలకువేలు భారతదేశమునలు

మూలలనుండి వచ్చి వైదికమతోద్ధారకు లైన శ్రీశంకరుల దర్శించి సేవించి పోవుచుందురు.

అర్చన:- అష్టోత్తరము 0-8-0, త్రిశతి 1-0-0, సహస్రనామము 2-8-0, నైవేద్యము 1-0-0.

కాలడీ ప్రస్తుత మొకఆరోగ్యకరమైనపట్టణముగ నెంచ బడుచున్నది. కారణ మీనదీజలము లోషధులతో కలిసి యుండుననియు, అందు స్నానమాడిన అనేకరోగములు కుదురుననియు చెప్పెదరు.

## తిరుమూళిక్కళం

ఇది 94వ దివ్యదేశము. అంగమాలిరైలుస్టేషనుకు దాదాపు 5 మైళ్లు. సత్రములు, బండ్లు గలవు. ఈ దేవాలయము



మలబారు ఉప్పుకయ్యలు

నకు పశ్చిమముగా అల్వాయి అనుపెద్దనది ప్రవహించు చున్నది. 93వ దివ్యదేశమునకు సమీపము.

తిరుమూళిక్కళిత్తార్, మధురవేణినాచ్చియారు, సౌందర్యవిమానము, పెరుంకులతీర్థము, నమ్మాళ్వారు, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

## చాలకుడి

ఇది అంగమాలినుండి 3వ స్టేషను. కొచ్చిను అడవుల నుండి వచ్చుకలప అంతయు నీస్టేషనునుండి యెగుమతి అగును. అన్నమలై శెట్టిగారి గవర్నమెంటువారి కలప డిపో లిచ్చట గలవు. దట్టమైనఅడవిని స్టేషనును కలుపుచు ఒకట్రాముబండి కూడ వేయఁబడినది. ఇచ్చటినుండి 5మైళ్లదూరములో కొచ్చిన్ మహారాజావారు వేసవిమకాంచేయు కన్జీరపల్లి అను గ్రామముకూడ గలదు. ఇచ్చట కలపదూలములను మోసి కొనిపోవుట కేనుగులను గుంపులు గుంపులుగా నుపయోగించు చుండుట ఆశ్చర్యకరను. ఇటనుండి 20 మైళ్లు వెళ్ళిన గొప్ప క్రూరమృగముల వేటాడుమహారణ్యము గలదు. వేటాడుటకు లైసెన్సు ముందుగా పొందవలెను. ప్రక్కస్టేషను, ఇరింజలకుడి. ఇది మార్చినెలలో కోడిపందెములు వేయుటలో ప్రసిద్ధమైనది.

## ఒల్లూరు

ఇది పైస్టేషనునుండి నాల్గవస్టేషను. ఇటనుండి అనాస కాయఁలు, మెంగులూరుపెంకు ఎక్కువగా ఎగుమతి జరుగు చుండును.

(4) అనేక ఫ్యాక్టరీలు, రంపపుమిల్లులు, మెంగుళూరు పెంకులు, గుడ్డలు తయారగును.

ఉత్సవములు :- పై దేవాలయములో ఏప్రిల్ లేక మేనెలలో గొప్పయుత్సవము జరుగును. అందు, వంద ఏనుగులూరేగింపులో పాల్గొనును. చూచితీరవలయును. ఈ యుత్సవములకు దాదాపు 10,000 యాత్రికులు రైలుపై ప్రయాణము చేయునట్లు అంచనా వేయబడినది.

ఇచ్చటినుండి 20 మైళ్ళ దూరములో గురువయ్యూర్ క్షేత్రమునకు చక్కనిరోడ్డు కలదు. మోటార్లు పోవుచుండును. ఇచట గొప్ప శ్రీకృష్ణదేవాలయము గలదు. సదా అనేక యాత్రికులు వెళ్ళుచుందురు.

☞ మన మిచ్చటినుండి ఉదకమండలమువరకు చేయుప్రయాణము వినోదార్థమేగాని దైవసంబంధమున గాదు; గాని యింతదూరము వచ్చి ప్రకృతిసౌందర్యమునుకూడ చూచుట ధర్మము. గాన రుచించినవారు చూడవచ్చును.

షొరనూరు

ఇది తిరుచూరునుండి 21 మై. 0-11-0చార్జీ. ఇది జంక్షన్ స్టేషన్ రైల్వేగెడు చూడుడు. భరతపురానది కావల కొచ్చిన్ సంస్థానము. నది కవ్వలియొడ్డున కొచ్చిన్ మహారాజావారి ఆదరణతో జరుపబడు ఆర్యసమాజ ఆసుపత్రి గలదు. 'వల్లత్తోల్' అనుమహాకవిచే ప్రారంభించబడిన ఒకనాట్యశాల గలదు. అందు కేరళదేశనృత్యములు ప్రత్యేకముగా నేర్పెదరు.

కోయంబత్తూరు

మన మిప్పుడు కొంచెము వెనుకకు వెళ్లి ఉదకమండలము, కూనూరు చూచి తిరిగి మంగుళూరువైపునకు వెళ్లెదము.

షోరనూర్ జంక్షనునుండి పోదనూరు జంక్షన్‌లో మారి నీలగిరి రైల్వేమీదుగా ప్రయాణముచేయవలయును. షోరనూర్‌నుండి కోయంబత్తూరుకు 62మై. రు.2-1-0 ఛార్జీ. రైలిచ్చట కొండల మీదుగాను, అరణ్యములలోను పోవును. ప్రకృతిసౌందర్యము మహారమ్యముగా నుండును. దాదాపు 4గం.ల ప్రయాణము. ఇది లక్షజనాభా గలజిల్లాముఖ్యపట్టణము. సముద్రమట్టము నకు 1,350 అడుగుల ఎత్తున నుండును. పోదనూర్‌జంక్షను నుండి 3మై. దూరములో నుండును.

వసతులు:- ఇది పెద్దబస్తీ అగుటచేత అన్ని వస్తువులు దొరకును. స్టేషనుసమీపమున ధర్మశాల గలదు.గుఱ్ఱపుబండ్లు దొరకును.

ముఖ్యముగ చూడదగినవి:- బట్టలు,దూది,నూనెఫ్యాక్టరీలు గలవు. ఇచ్చట వ్యవసాయకళాశాల గలదు. తప్పకచూడవలెను.

## పెరూర్

దీనినే 'మేలాచిదంబర' మని అందురు. ఇది కోయంబత్తూరునుండి 3మైళ్ళలో నున్నది. నటరాజేశ్వరస్వామివారి గొప్పదేవాలయము గలదు. ఇది నాయకరాజుల కాలమున నిర్మించబడి ద్రవిడశిల్పసౌందర్యముతో విరాజిల్లుచున్నది.సమీపమున నున్న విల్లయన్‌గిరి లేక కైలాసపర్వతము,దానిపైనున్న యాలయములు చూడనగును. బండ్లు గలవు.

## మెట్టుపాలియం

ఇది కోయంబత్తూరునుండి 22 మై. 0-12-0 ఛార్జీ. ఇది నీలగిరికొండలఅడుగుభాగమున నున్నది. ఇచ్చట బ్రాడ్‌గేజిలై

వంత్యమై నీలగిరిచిన్నలైను ప్రారంభ మగును. ఈ రైలుపట్టా లలో విశేషము గలదు. (Abt Rack is used) కొండల నెక్కవలెనుగాన వెనుకకు ముందునకు జారకుండ రెండుపట్టా లకు మధ్య పండ్లుగల మరియొకపట్టా గలదు. దానిమీద పండ్లు గలచక్రములు పోవుచుండును. దీనివలన రైలుపెట్టెలు, ఇంజను ముందుకుగాని, వెనుకకుగాని జారక పట్టుపట్టియుండి ఇంజను శక్తికొలది లాగిననే పోవుచుండును. ఇట్టిది దక్షిణదేశములో మరెచ్చటను లేదు.

వసతులు:- బ్రాహ్మణభోజనశాలలు గలవు. బంగాళా దుంపలు విశేషముగ పైరగును. మైదానములకు ఎగుమతి జరుగుచుండును.

## నీలగిరి (కొండలు)

మెట్టుపాలెమునుండి 20నిమిషములు ప్రయాణము చేసిన నీలగిరికొండల అడుగుభాగమునకు చేరుదుము. ఈ కొండలనే ఇంగ్లీషులో Blue Mountains అనియు, దేవభాషలో నీరిగిరి యనియు నందురు. తూర్పుపడమటికనుమలు కలియుగొప్ప పీఠభూమి. ఈకొండలు భూమధ్యరేఖకు 11 డిగ్రీలదూరమున మాత్రమే ఉండును. మెట్టుపాలెమునుండి ఉదకమండలమువరకు పోవుకొండలమార్గము (Ghat section) 28½ మైళ్లుమాత్రమే. ఈకొద్దిదూరము పోవునంతలో ఆమార్గమున రైలు 7,300 అడుగులఎత్తునకు పోవును. ఈకొద్దిదూరమును రైలుప్రయా ణము (వెళ్లుటకుగాని, వచ్చుటకుగాని) దాదాపు 3గం. పట్టును. రైలులో ప్రయాణముచేయునప్పుడు ప్రయాణికుడు కడుజాగ్ర

త్త్రగా కిటికీలనుండి చూచుచుండవలెను. ఒక్కొక్కప్పుడెత్తుశిఖర ములపైకి వెళ్ళినప్పుడు వందలకొలదిమైళ్లు కనుచూపుమేరవరకు రకరకము లైనవృక్షజాతులతో పచ్చగను ఆమధ్య సూర్యకిరణములచే మెరయుజలపాతములకాంతులను వానిధ్వనులును, మనము మైదానములలో చూడనివృక్షజాలములను, [ప్రకృతి] సౌందర్యమును కన్నులార జూడవలయునేగాని వర్ణింపతరము గాదు.

## కూనూరు

ఈస్టేషను మెట్టుపాలియంనుండి 17 మైళ్ళలో నున్నది. ఇది దాదాపు 15 వేలజనాభా గలపట్టణము. సముద్రమట్టమునకు 5600అ. యెత్తున గలదు. ప్రయాణములో రైలు టీ, రబ్బరుతోటలగుండా దట్టమైన అరణ్యములమధ్య పెక్కు సెలయేళ్ళమధ్యను జలపాతములప్రక్కగను పోవును. ఈ పట్టణము కొండలనడుమ నిర్మించబడినది. ఇచ్చటినుండి 20 మైళ్ళవరకు కొండలమీద అడవులగుండ చక్కనిరోడ్డు గలదు. షికారుగా వెళ్ళి ప్రకృతిసౌందర్యము పరిశీలించవచ్చును.

వసతులు:— ఇచ్చటినుండి 14 మై. దూరములోనున్న కోటగిరి అనుపట్టణమునకు మోటారుసర్వీసు గలదు.

చూడదగినవి:— శ్యామపార్క, డోల్ఫిన్స్‌నోస్, కటేరి జలపాతము, లేడీకానింగ్ సీట్.

## విలింగ్టన్

ఇది కూనూరునకు ప్రక్కస్టేషను. మైలు దూరము. ఇది మిలిటరీస్టేషన్.

## కోటగిరి

ఇది కూనూరునుండి యీశాన్యముగా 13 మై. కూనూరు నుండి బస్సు గలదు. సముద్రమట్టమునకు 6,500 అ. ఎత్తున నున్నది. ఇదికూడ ఒకచిన్న వేసవి విశ్రాంతిపట్టణము. కాని ఏకాంతముగ, ప్రశాంతముగ విశ్రాంతి తీసికొనువారి కిది యుపయోగపడును.

## ఉదకమండలము

దీనినే "The Queen of the Hill stations in India" అనిఅందరు. హిందూదేశమున నున్నకొండలమీదిపట్టణము లలో రాణివంటిది. ఇది సముద్రమట్టమునకు 7,500అ. యెత్తున నుంట మద్రాసు గవర్నరుగారి వేసవిమకాము యున్నది. సూర్యోదయమునుండి సూర్యాస్తమయమునకు సంవత్సరసరా సరియుష్ణోగ్రత 57.33 డిగ్రీలుమాత్రమే కొండలపై నున్నను చక్కని విశాలమైనబజారులతో శోభించును. ప్రతిగృహము ఉద్యానవనమును బోలి రమ్యముగ నుండును. ఇచ్చటినుండి మైసూరుకు బస్సు గలదు. ప్రయాణము కడునాహ్లాదకరముగ నుండును.

చూడదగినవి:— (1) దొడబెట్టశిఖరము 8,700 అ. ఎత్తు గలిగి ఒకదినము విహారముచేయదగినదిగ నుండును. ఇచ్చటినుండి 18 మై. దూరమున (2) 'పైకరా' (Pykara) జలపాతమునుండి విద్యుచ్ఛక్తిని తయారుచేసి కొన్నిజిల్లాలకు సప్లయిచేయుచున్నారు. ఇదియు చూడదగినది. [3] బొటానికల్ ఉద్యానవనములు (Botanical gardens) పలువిధములైన

మొక్కలతోను పుష్పజాతులతోను, ఆకుపసందులతోను ప్రయాణికు నాకర్షించునట్టిది. సాయంకాలములందు విహార ముగ వెళ్ళదగినది. [4] దానిసమీపమున గవర్నరుగారిభవ నము చూడదగినది. [5] 'తోడా' అనునీలగిరికొండలలో నివ సించువారిగుడిసె. వారు దానిని నిర్మించువిధానము. వారిజీవి తము చూచితీరవలెను అనేకసంస్థానాధిపతులు, రాజులు, ధని కులు వేసవిలో మకాముచేయుటకుగా నేర్పరచికొనిన భవన ములు చూడదగినవి.

## పళని

ఉదకమండలమునుండి మరల పోదనూర్ జంక్షనుకు వచ్చి అచ్చటినుండి పోలాచిమీదుగా 64 మైళ్ళదూరము రైలుమీద ప్రయాణముచేసిన పళనిక్షేత్రము చేరుదుము. రు2-2-0 రైలు చార్జీ అగును. ఇది శివునిపుత్రుడైనసుబ్రహ్మణ్యస్వామిక్షేత్రము. హిందూదేశ మన్నివైపులనుండి సం॥ పొడుగున నీక్షేత్ర మును దర్శించుటకు యాత్రికులు వచ్చుచుందురు. కొండపైని దేవాలయము గలదు. ఈపట్టణమున 35 వేలజనాభా గలదు. స్వామిపేరు దండాయుధపాణిస్వామి.

ఈ నగరము సముద్రమట్టమునకు 1068 అడుగుల యెత్తున గలదు. సుబ్రహ్మణ్యస్వామి ఆలయము 450అడుగుల యెత్తున నున్న కొండపై గలదు. మహ్మదీయులు సహితము స్వామిని సేవింప వత్తురు. సుబ్రహ్మణ్యస్వామి ఆలయములు దక్షిణభారతమున విశేషముగ గలవు. కాని ఉత్తరభారతమున సుబ్రహ్మణ్యస్వామిని చాలకొద్దిమంది అర్చించెదరు.

వసతులు:— కొండ యెక్కుటకు ముందుగా ప్రయత్నించిన వృద్ధులను, రోగులను కుర్చీలమీద మోసికొనిపోవుదురు. దీనికి సాధారణపుచార్జీ రు2/- పట్టణములోను. కొండక్రిందను సత్రములు గలవు. వానిలో కోలుసామంఅయ్యర్ వైశ్యమఠము ముఖ్యమైనవి. ఈసత్రములలో అద్దె లేదు. భోజనవసతి లేదు. బండ్లు స్టేషనుకడ దొరకును. అనేకభోజనశాలలు గలవు. ప్రతి వర్ణము వారికి సత్రములు గలవు. దేవస్థానసత్రము స్టేషను కొక ఫర్లాంగుదూరములో గలదు.

ఉత్సవములు : తెప్పఉత్సవము, జనవరి-ఫిబ్రవరి నెలలో జరుగును. 30,000 మంది వత్తురు. పంగున్యుత్సవము మార్చి-ఏప్రిల్ నెలలో వచ్చును. 50 వేలమంది యాత్రికులు వత్తురు.

| | | | |
|---|---|---|---|
| వైకాశ్యుత్సవము- మే-జూన్ నెలలో | 5 వేలు | ,, | ,, |
| కార్తికషష్ఠి-అక్టోబరు లేక నవంబరు | 10 వేలు | ,, | ,, |
| తిరుకార్తికాయ్-నవంబరు లేక డిశంబరు | 20 వేలు | ,, | ,, |

అర్చన :

| | | | |
|---|---|---|---|
| అర్చనకు | రూ. 0-4-0 | గాజాలంకారము | రూ. 3-0-0 |
| పంచామృతాభిషేకము (రూ. 20 ల వరకు) | 2-4-0 | వేదాలంకారము | 3-0-0 |
| | | కర్పూరహారతి | 0-2-0 |
| రు.20/- పైన రు.100లకు లోపు | 3-4-0 | పంచామృతాభిషేకము | 2-4-0 |
| రు. 100 పైన | 6-4-0 | జవ్వాహారితో స్వామిదర్శనము | 7-8-0 |

చూడదగినవి:— 3 మైళ్ళదూరములో పెరువుడియార్ క్షేత్రము పట్టణమధ్యమున పెరియనాయకి అమ్మన్ దేవాలయము.

చూడదగినవి:— శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవాలయము పలనికొండమీద దాదాపు 500అ. ఎత్తున నున్నది. ప్రస్తుతము చూచు దేవాలయము చేరరాజుచే నిర్మించబడుటచే గుజ్జి ముపై నెక్కియున్న ట్లాయనప్రతిమ దేవాలయోత్తర భిత్తిపై నున్నది. కొండమీద నుండుటచే చక్కని ప్రకృతిసౌందర్యము యాత్రికుని మనస్సును రంజింపజేయును.

మొక్కుబడు లున్నవారు కొండక్రింద ఆనుకొనియున్న షన్ముగనదిలో స్నానముచేసి ఒకకావడిని భుజముపై ధరించి మౌనముగ నుండి తనవెంట భజనపరులు సుబ్రహ్మణ్యస్తోత్రములు చేయుచురాగా పైనున్న దేవాలయమునకువెళ్లి స్వామిని దర్శించి కావడి దింపి స్వామిని తేనె, పంచదార, అరటిపండ్లు గుజ్జులతో మహావైభవముగ అభిషేకము చేయుదురు. ఈయభిషేక ప్రసాదము చాలకాలమువరకు నిలువయుండునని మహాప్రసాదముగ స్వస్థానములకు గొనిపోయి స్వీకరింతురు. ఇటనేక చిత్రసన్నివేశములుకూడ జరుగుచుండునట. ఆ కావడిలో ఒక్కొక్కప్పుడు మృతినొందిన ప్రాణులనుగూడ మోసికొనిపోగా వానికి ప్రాణము గలుగునట్లు చెప్పుదురు. ఒక్కొక్కప్పుడు స్వామికి పవిత్రమైన భస్మముతోగూడ అభిషేకము చేయుదురు.

తయారగునవి:— [పంటలు]:— ప్రత్తి, ఉల్లి, వేరుసెనగ, టానింగుచేసినచర్మములు, టానింగుచేయు యంత్రశాలలు దాదాపు 10 గలవు. కంచుపాత్రలు విశేషముగ తయారగును. సిగరెట్టు కంపెనీ చూడనగును. [ఇది స్పెన్సర్ కంపెనీవారిది.]

ఉత్సవములు:— పంగునిమాసము (March- April) నెలలో జరుగునుత్సవమునకు దాదాపు 20,000 యాత్రికులు రైలుమీద వచ్చునట్లు అంచనా వేయబడినది.



కొడైకెనాల్

పళనినుండి దిండిగల్ జంక్షన్‌లో దిగి యచ్చటినుండి దిండిగల్ మధురమధ్యలో నున్న కొడైకెనాల్ రోడ్డు స్టేషనులో దిగి బస్సుమీద కొడైకెనాల్ వెళ్ళవచ్చును.

## కొల్లన్‌గాడ్

ఇది పొలాచీజంక్షన్ మీదుగా పొలాచీఒల్వకోట్ జంక్షనులమధ్య నున్నది. ఇది గాయత్రినదీతీరమున నున్నది. ఇది కొల్లన్‌గాడ్ మహారాజావారిసంస్థానము. రాజభవనము చూడదగినది. ఈపట్టణదేవాలయములో జరుగు ఆర్ద్రోత్సవమునకు యాత్రికులు వేనవేలు వత్తురు.

పై క్షేత్రమునకు 5 మైళ్లదూరములో కరాచరాకురిచి అను వైష్ణవక్షేత్రమును దాదాపు 6 మై. దూరములో సీతకుండు [సీతర్ కుండు] కలవు. (ఇందు సీతాదేవివారు స్నానముచేసె నని వాడుక.) ఇది ఒక చిన్న జలపాతము.

## పాల్ ఘాట్

ఇది గొప్ప పట్టణము. కోట, కందక మిప్పటికి మంచి స్థితిలో కట్టుదిట్టముగా నున్నవి.

పొదనూరునుండి కొండలు, అడవి ప్రారంభ మగును. పశువులను వెదురుదడులతో కట్టిన దొడ్లలోనికి రాత్రులందు తోలుదురు. ఈయవి మనవైపు బందెలదొడ్లమాదిరిగ నుండును. వాలయార్ అడవిలో మొదటిస్టేషను. ఇచ్చటనుండి 'గురువయూర్'కు బస్సులు గలవు. 25 మై. దూరము.

## ఒల్వాకోట్

ఇది మదరాసుమంగుళూరు మైన్ లైనులో నున్నది. పొదనూరునుండి 30 మై. 1-0-0చార్జీ. మనము ప్రయాణము చేసివచ్చిన చిన్నలైనింతటితో నంత్యమగును. స్టేషనుసమీపములో అమైఅమ్మన్ దేవాలయము గలదు. అందు శిల్పము చూడనగును. ప్రక్కనున్న కొంకపల్లెలో జైనదేవాలయము గలదు.

ఎగుమతులు:- స్టేషనునొద్ద పెక్కులాట్ల కలప, దూలములు వెదురుబొంగులు కన్నువిూరి ఎగుమతికి సిద్ధముగా నుండును. బండ్లు, కార్లు దొరకును.

## పట్టాంబి

ఇది ఒల్వాకోట్ జంక్షనునుండి షోరనూరు జంక్షను మీదుగా 35 మైళ్ళదూరమున నున్నది. 1-3-0 చార్జియగును. గవర్నమెంటువారి ఫారము, సంస్కృతకళాశాలయు సమీపమున గలవు.

వ స తు లు :- మంచిరోడ్డు గలదు. బస్సు గలదు.

## గురువయూరు

ఈస్టేషనునుండి 18 మై. దూరములో 'గురువయూ'రను శ్రీకృష్ణక్షేత్రము గలదు. ఇచ్చటికి నిత్యము హిందూదేశము నన్నివైపులనుండి యాత్రికులు వచ్చుచుందురు. పట్టాంబినుండి పాల్ ఘాట్ నుండి బస్సుసర్వీసు గలదు. నేడీక్షేత్రమును ప్రభుత్వము పునరుద్ధరించిరి.

## విత్తువకోడు

ఇది 95వ దివ్యదేశము. కులశేఖరాళ్వారు మంగళాశాసనము. ఇది పట్టాంబిస్టేషనునుండి దక్షిణముగా $1\frac{1}{2}$ మై. దూరములో నున్నది. బండ్లు గలవు సత్రములు గలవు. ఉయ్యవందపెరుమాళ్లు, విత్తువక్కోట్టువల్లి, తత్వకాంచనవిమానము, చక్రతీర్థము, భుజంగశయనము.

## తిరునావాయ్

ఇది 96వ దివ్యదేశము. ఈదివ్యదేశముతో మళయాళదేశపుదివ్యతిరుపతులు పూర్తియగును. ఎడక్కోళంరైలు స్టేషనుకు $1\frac{1}{2}$ మైళ్లు. తిరుమంగయాళ్వారు మంగళాశాసనము. ఇది సముద్రతీరమున గలదు. అమావాస్యలలో గొప్పయుత్సవము జరుగును.

నారాయణులు, మలర్మంగనాచ్చియారు, వేదవిమానము, శెంగమలసరస్సు, నావాయముకుందులు, శిరుదేవి నాచ్చియార్ అను పేర్లుగూడ గలవు.

ఈ దేవాలయములోని మూలవరతాయార్లను మహాశిల్పి తయారుచేసెనుగాని కండ్లు తెరవలేదు. దృష్టి పెట్టలేదు. ఒకనాడాతయారుచేసినవిగ్రహము నొకస్థలమునుంచి మరునాడుదయమున ఆశిల్పి చిత్తులి తెమ్మని తనభార్యతో చెప్పెనట. అప్పుడామెకుబను లీవిగ్రహము 'ఏన్' అని బదులిచ్చెనట. దానిబట్టి దృష్టిపెట్టకపోయినను విగ్రహమునకు ప్రాణము వచ్చినదని అట్లే ప్రతిష్ఠగావించిరని యిచ్చటివారు చెప్పుదురు.

గమనిక : రైల్వేలైను కడలుండీనుండి ఫెరోక్ (Ferok) స్టేషనువరకు సముద్రమునొడ్డున పోవును. మహారమ్యముగ నుండును. యాత్రికు లీదృశ్యమును చూడవలెను. మంగుళూరు పెంకులు చేయుఫ్యాక్టరీలు చాల గలవు.

## కల్లాయి

ఇది కాలికట్‌కు ముందుస్టేషను. రైలులో పోవుచు చూడవచ్చును. రంపపుమిల్లులు గలవు. ఇటనుండి కలప పెక్కుస్థలముల కెగుమతి యగుచుండును.

## కాలికట్

ఇది మెయిన్‌లైనుమీద ముఖ్యమగుస్టేషను. మలబారు జిల్లా కిది ముఖ్యపట్టణము. జనాభా దాదాపు 99 వేలు.

ప్రప్రథమమున పోర్చిగీసునావికుడైన వాస్కోడగామా 1498 మే 20 తేదీన హిందూదేశములో నీప్రదేశముననే అడుగు పెట్టెనట.

గాలి బాగుండిన చిన్నచిన్న స్టీమర్లు తీరమునకు వచ్చుచుండును.

వసతులు:- రహదారిబంగళా గలదు. స్టేషనుసమీపమున సత్రము గలదు. పట్టణములో నన్నివర్ణములవారికి భోజనశాలలు గలవు.

చూడదగినవి:- స్టేషనునుండి 2 మైళ్లదూరమున జమోరిన్ రాజభవనము గలదు. నేతఫ్యాక్టరీ, వరక్కాలలోని దేవాలయము మొదలగునవి చూడదగును.

తయారగువస్తువులు: బట్టలనేత, పెంకులు తయారగును. మిరియాలు, అల్లము, కలప, తేయాకు, కాఫీ, రబ్బరు, కొబ్బరి కాయలు విరివిగా నెగుమతియగును.

## టెల్లిచ్చేరి

ఇది 28 వేల జనాభా గలపట్టణము. కాలికట్టు కెన్నూరు మధ్య గలదు. కాలికట్టునుండి 43 మై. 1-7-0 చార్జీ. జనాభా సుమారు 28 వేలు. ఇటనుండి అనగా కాలికట్ నుండి మనము పశ్చిమసముద్రతీరమున కొబ్బరితోపులగుండ మలబారు ప్రకృతిసౌందర్యమును లక్షించుచు పోవుచుందుము గాన ప్రయాణికులు కడుజాగరూకతతో పగటిప్రయాణము చేయుట మంచిది.

వసతులు :- మైలుదూరములో రహదారిబంగాళా గలదు. సమీపములో సత్రము గలదు. అన్ని జాతులవా రుండవచ్చును

చూడదగినవి:- 1683లో నిచ్చట ఈష్టిండియాకంపెనీవా రొకఫ్యాక్టరీని కట్టిరి. ముఖ్యముగ హిందూయాత్రికులు కావేరీ నదీజన్మస్థానమును దర్శింపగోరువా రిచ్చట దిగిపోవలయును. అది కూర్గుకొండలలో గలదు. విరాజ్‌పేటమీదుగా మెర్కరా చేరిన కావేరీజన్మస్థానము చేరగలము. టెల్లిచ్చేరినుండి మెర్కరా 80మై. చక్కనిరోడ్డు ; బస్సుసర్వీసు గలదు.

టెల్లిచ్చేరిలో జగన్నాథదేవాలయము గలదు.

☞ వివరములు (కావేరీ) కూర్గురాజ్యముక్రింద చూడనగును.

## కెన్‌హన్‌గాడ్

ఇది టెల్లిచ్చేరినుండి 52మై.1-12-0చార్జి. శ్రీస్వామి రామదాస్‌గారి ఆశ్రమమునకు వెళ్లగోరువా రిచ్చట దిగవలెను శ్రీస్వామివారు గొప్పవ్యక్తులు, దర్శనీయులు. భగవన్నామమే శరణ్యముగ గొని అనేక సహస్రులను తరింపజేయుచున్నారు. ఇటనుండి రైలు సముద్రతీరమున పోవుచు ప్రకృతిసౌందర్యముచే ఆనందమును కలిగించును.

వసతులు :- కెన్‌హన్‌గాడ్‌స్టేషనునే హోసుదుర్గ్ (Hosdurg)అందురు. రైల్వేస్టేషనుబోర్డుపైనట్లుండును. స్టేషనుకడ కూలీలు దొరకుదురు. ఆశ్రమమునకు షుమారు రు.1-0-0 కూలీ. ముందుగ కబురుచేసిన ఆశ్రమముబండియే స్టేషనుకు వచ్చును. దానికి కొంతరేటు నిర్ణయించియుండును.

చూడవలసినవి:- (1) స్టేషను కుత్తరమున టిప్పుసుల్తానుచే నిర్మింపబడినకోట శిథిలావస్థలో హోస్ మర్గు అన్యప్రదేశమున గలదు. చారిత్రాభిలాషాపరులు దిగి దర్శింపనగును.

ఆనందాశ్రమము :- ఆశ్రమము దాదాపు 45 ఎకరములలో కొబ్బరి, పోకవనములలో మధ్యమధ్య తెల్లని భవనములతో నేత్రానందకరముగ నుండును. మంజపతిపర్వత దిగువభాగమున 1931 లో శ్రీ స్వామి రామదాస్ గారిచే నీయాశ్రమము నిర్మించబడినది. చక్కనిభజన [హాలు.] శాల గలదు. ఇందు శ్రీ స్వామివారెక్కువకాలము యాత్రికులతో గడపుచుందురు.. ప్రతిదినము ప్రాతస్సాయంకాలముల నియ

ఆనందాశ్రమము



మముగ ఒకగంటకాలము భక్తులచే తన్మయతతో సంకీర్తన కాలక్షేపము జరుపబడుచుండును. ఇది ప్రతివారు ననుభవించియే తీరవలెను.

ఉత్సవములు:- ప్రధానముగ మూడుత్సవములు జరుగును. శ్రీ హనుమజ్జయంతిదినమున శ్రీ స్వామివారి జన్మదినోత్సవమును, మహాలయామావాస్యదినమును, శ్రీమాతాజీ కృష్ణాబాయి జన్మదినోత్సవమును, ప్రతిసం॥ డిశంబరు 27 తేదీన



శ్రీ స్వామి రామదాసు



శ్రీ మాతా కృష్ణాబాయి

సన్న్యాస దినమహోత్సవమును - అనగా శ్రీ స్వామివారు వారి ప్రాపంచకజీవితమును త్యాగముచేసి ఆధ్యాత్మికజీవితమున ప్రవేశించినదినము - మొదలగు ఉత్సవములు జరుగు

చుండును. హిందూదేశము నన్ని వైపులనుండియు ఐరోపా, బర్మా, సింహళ దేశములనుండియు యాత్రికులు వచ్చుచుండురు.

పబ్లికేషన్ డిపార్టుమెంటు:- ఇందు శ్రీ స్వామివారిచే ప్రచురించబడు వివిధభాషలలోని గ్రంథములును, ఇంగ్లీషులో 'The Vision' అను ఆధ్యాత్మికమాసపత్రికయు ప్రచురించబడు చుండును

వివిధభాషలలో దాదాపు 1200 గ్రంథములు గల యొకగ్రంథాలయమును, పాదచారులై తీర్థాటనము చేయుచు వచ్చు సాధువులకు సదావర్తి యిచ్చి బసచేయుటకు వసతి చూపునేర్పాటుగల యొకచక్కని ధర్మశాలయు, యాత్రికులకు సకలసౌకర్యములతో ప్రేమతో అమితశుచితో భుజించుటకు, పాకములు చేయుటకు పెద్దభోజనపాకశాలలును దాని కావల దాదాపు 56 పశువులతో [గోవులు, గేదెలు] చక్కని నవీన పద్ధతులతో నిర్మించబడినయొక గోశాలయు, రాత్రిసమయ ములలో ఆశ్రమమంతయు విద్యుద్దీపములచే దేదీప్యమాన ముగ ప్రకాశింప జేయుటకుగాను నొకయింజను, డైన మోలతో నొకభవనమును, మాన్సూన్‌లో ఫలించు వరి పొలములు, కూరలు, పండ్లు, పుష్పములు ఫలించి కలకల లాడు ఆశ్రమభూములతోను. బీదవిద్యార్థులకు విద్యా భ్యాసము, వృత్తివిద్య, ఆధ్యాత్మికవిద్యలు గరపునట్టి శ్రీకృష్ణ విద్యాలయము, శిల్పాలయము ( Industrial Institute ) ఉచితవైద్యశాల, ఆనందాశ్రమం పోష్టాఫీసులతోను, శ్రీస్వామి మాతాజీవార్ల ప్రేమ, చిరునగవులతో కలకలలాడుచు జాతి,

మతవివక్ష లేక అచ్చటికి వచ్చు ప్రతిమానవుని శారీరక, మానసిక, నైతిక, ఆధ్యాత్మికావసరములను తీర్చుచు ప్రకాశించుచున్నది ఇటీవల (శ్రీ) స్వామివారును, మాతాజీవారును ప్రపంచయాత్ర గావించి వచ్చిరి.

☞ ఆశ్రమము చూచుకొని తిరిగి 3½ మై. నడచి కన్‌హాన్‌గాడ్ స్టేషనుకు వచ్చి మనప్రయాణము ముందుకు సాగించవలెను.

## కేసరాగాడ్

ఇది కేన్‌హాన్‌గాడ్‌నుండి 14 మై. 0-8-0 చార్జి. మల్లికార్జున దేవాలయము చూడదగినది. స్టేషనునుండి 6 మై. దూరమున 'బిన్నార్‌గి' అనుచోట ఒక జలపాతము గలదు. అందు స్నానముచేసిన కీళ్ళనొప్పులు పోవునని ప్రతీతి. దాదాపు స్టేషనునుండి 3 మై. లో గవర్నమెంటువారి కొబ్బరిపరిశోధనశాల గలదు. (Cocoanut research form) ఇది కేసరగాడ్ తాలూకాకు ముఖ్యపట్టణము.

## మంగుళూరు

పెద్దరైల్వేలైను ఇంతటితో ఆగిపోవును. ఈ పట్టణము దక్షిణకెనరాలో నేత్రావతీనదీతీరమున నున్నది. దాదాపు లక్షజనాభా గలిగి, దక్షిణకెనరాకు ముఖ్యపట్టణముగ నున్నది. స్టేషనుకు సమీపముననున్న 'మంగళదేవి' దేవాలయమును బట్టియే యీ నగరమునకు మంగుళూరు అని పేరువచ్చెను.

వసతులు :- స్టేషనుసమీపమున రహదారిబంగళా, సత్రము గలవు. అన్నివసతులు గలవు. సిటీబస్సులు గలవు. మంగుళూర్‌నుండి మైసూరుకు 170 మై. బస్సులు గలవు.

రూ. 5-8-0 చార్జీ. ఉదయము 6 గంటలకు బయలుదేరిన సాయంతనము 4 గంటలకు మైసూరు చేరవచ్చును. మార్గము పడమటికనుమలు దాటునపుడు ప్రకృతి కమరమణీయముగ నుండును. మార్గ మంతయు కాఫీతోటలు, కలపవృక్షములు, మిరయము, లవంగము, ఏలకీలతలతో నిండియుండును.

చూడదగినవి:- ఇది చరిత్రయందు పేరుపొందిన పట్టణము. మనప్రాంతమునకు వచ్చుమంగుళూరు పెంకు మొదట నిచ్చటనే చేయబడి క్రమముగ పశ్చిమతీరప్రధానపరిశ్రమగా వ్యాపించినది. చెర్చిలు, కచ్చేరీలు, కాలేజీలు, చూడదగినవి ఈ పెద్దపెద్దభవనము లన్నియు కాశీలోని భవనములు గంగలోనికి తొంగిచూచుచున్న ట్లిచ్చట సముద్రములోనికి చొప్పించి తొంగిచూచుచున్నట్లు కట్టిరి.

మంగుళూరుసమీపములో చూడదగినవి:-

1. మంగుళూరునుండి (Land Route) నేలమార్గముగా ఉడిపికి వెళ్లుమార్గమున 13 మైళ్ళలో ముదిబిద్రి అనుక్షేత్రమున జైనశిథిలములు చూడనగును. అందు వేయిస్తంభముల మంటపము గలదు. దానిలో 42½ అడుగులయెత్తున గౌతముని విగ్రహము చెక్కబడినది. పురాతనజైనరాజులకోట, సంస్కృత కళాశాల చూడనగును.

2. ముదిబిద్రినుండి అదేమార్గమున (ఉడిపికి వెళ్ళు రోడ్డుమీద) 20 మై. దూరమున 'కార్కళ' అను నొకపట్టణము గలదు. మనబస్సు పోవుమార్గమునుండియే 60 అ. యెత్తున

ఒక తిప్పపై తొలుపబడిన గొప్పగొతమేశ్వరునివిగ్రహము చూడనగును. ఈప్రదేశము బస్సు నిలచుస్థలమునకు దాదాపు 2 ఫర్లాంగులదూరములో గలదు. అనంతశయనములోవలె అనంతపద్మనాభస్వామి దేవాలయమును చూడనగును.

3. స్టేషనునుండి 3 మైళ్ళలో కదిరి అనుక్షేత్రములో దేవాలయము, తెప్పకొళము గలవు. సిటీబస్సు గలదు. కదిరి మంజనాథేశ్వరుడు కొబ్బరితోటలు, ఒకచిన్నకొండ, జలపాతము, పాండవగుహలు గలవు. జలపాతమునుండి నడుము లోతు కోనేటిలోనికి నీరు పెట్టిరి.

## ఉడిపి (రజతపురము)

మంగుళూరునుండి ఉడిపికి వెళ్లుటకు 2 మార్గములు గలవు. ఒకటి తీరమార్గము (Coast line) ఇది 33 మైళ్ళు. రూ 1-2-0 బస్సుచార్జీ. రోడ్డు సముద్రతీరము నానుకొని పోవుచుండును; గాన తరచుగ సముద్రము కనుపించును.

1. కూళూరు 2. పావంజ 3. మూల్కి 4. ఉద్యావర అనునదులను పడవలలో దాటవలెను. బస్సు ఈవలిఒడ్డున ఆగును: ఒకఫర్లాంగు విశాలమైన నదులును పడవలలో దాటి ఆవలి రేవు చేరగనే వేరొకబస్సు సిద్ధముగ నుండును. రేవు కేవు 0-1-0 యివ్వవలెను. ఇట్లే మిగిలిన మూడునదుల మీదగూడ దాటవలెను. మొత్తము 4 గంటల ప్రయాణము.

2వ మార్గము:- నేలమీదుగా పోవునది. (Land Route ఇది కార్కళమీదుగా పోవును. ఈమార్గమున ఉడిపి 52 మై. ఉండును. బస్సుకు రూ 1-12-6 చార్జీ. ఈమార్గములో నదు లడ్డమురావు. బస్సు నేరుగా పోవును మంగుళూరుకు కర కాల 33మై. రూ1-0-6, కార్కళ ఉడిపి 19 మై రూ0-12-0. ఈమార్గముపడమటికనుమలనుండి పోవును.ప్రకృతిసౌందర్యము కడురమణీయము. కార్కళ బస్సుస్టాండునుండి గొప్పబుద్ధ విగ్రహమును చూడనగును. బొంబాయి కొచ్చిన్ స్టీమర్లు 'మల్పె'(MALPE) రేవులో ఆగును. 'మల్పే' ఉడిపికి 3మైళ్లు.

వసతులు:- మంగుళూరునుండి 37మై. చక్కనిరోడ్డు మార్గము. మోటారుబస్సులు గలవు. 8 మఠములలోయాత్రి కులు దిగవచ్చును భోజనశాలలు గలవు. సిటీబస్సులు గలవు. ఇచ్చటిబస్సులయేర్పాట్లు రైల్వేవారియేర్పాట్లవలె చాలకట్టు దిట్టముగ నుండును.

శ్రీకృష్ణదేవాలయము:- శ్రీకృష్ణవిగ్రహము మధ్వా చార్యులవారిచే 800సం॥ క్రితము ప్రతిష్ఠింపబడినది. శ్రీమధ్వా చార్యులవా రొకానొకనావికునినుండి గోపీచందనమును స్వీక రింపగా అందు ఈ శ్రీబాలకృష్ణమూర్తి విగ్రహము ఆశ్చర్యముకలుగునట్లు వెలసెను. శ్రీమధ్వాచార్యులవా రప్పటి కప్పుడే బాలకృష్ణుని వర్ణించుచు 'ద్వాదశస్తోత్రము'ను పఠిం చిరి. ఇది నేటికిని ప్రసిద్ధి. ఆవిగ్రహమునే ఉడిపి దేవాలయ మున ప్రతిష్ఠించిరి. శ్రీ బాలకృష్ణుడు మహాసుందరరూపుడు.

స్వామిదర్శనము నేరుగ గాదు. స్వామి కెదురుగా గోడలోని కిటికీవలె వెండితో దుప్పుతో నేర్పాటుగల గవాక్షముగుండ దర్శనమగును. ఈకిటికీని కనకదాసు కిటికి అందురు. పరమభక్తుడైనకనకదాసు స్వామిని ప్రార్థించగా ఆయన తనభక్తుని కరుణించ తూర్పుముఖముగ నున్నస్వామి పశ్చిమాభిముఖుడై నేడు మనము చూచునట్లు కిటికీగుండ కనుపించుచుండును. కనకదాసెచ్చటనుండి స్వామిని ప్రార్థించెనో అచ్చట నొకమంటపమును నిర్మించిరి. దానిని కనకదాసుమంటప మందురు. ఈచరిత్రలన్నియు అచ్చటివారి నడిగి విపులముగ తెలిసికొనవగును

ఈఆలయమున స్వామి నర్చించుటకు శ్రీమధ్వాచార్యులవారు 8 మఠముల నేర్పాటుగావించి అందుండుస్వాములే (యతీశ్వరులే) రెండు సంవత్సరముల కొకపర్యాయమొక్కొక్కరివంతుచొప్పున అర్చనచేయునట్లు నియమించిరి. అప్పుడే 'పర్యాయ' మనుగొప్పయుత్సవము జరుగును. ఇచ్చట జరుగునర్చన భారతదేశమున మరెచ్చటను జరుగదనియే చెప్పవచ్చును. ఎదుటమంటపములో శ్రీ ఆంజనేయస్వామివారి అర్చనగూడ చాలముఖ్యముగా చేయుదురు ఈపర్యాయోత్సవమునకు లక్ష యాత్రికులు వత్తురు.

శ్రీమధ్వాచార్యులవారు త్తరయాత్ర సల్పివచ్చినది మొదలు శ్రీఅనంతేశ్వరస్వామి దేవాలయములో ప్రజలకు మతబోధ గావించెడివారు. శ్రీ చ. అ. ల ఆస్థానము నిప్పటికిని

పవిత్రముగ నుంచి ఖాళీగా విడిచిపెట్టి యుంచినారు.

సోదెమఠమునకు చెందిన వాదిరాజస్వామియార్ గొప్ప వారు. వారు (క్రీ.శ.1600న) తనచేతిలో జపమాల జారిపడగనే తనను సమాధిచేయవలయునని శిష్యులతో చెప్పెను. అట్లేజప మాల జారిపడెను. ఆకాశమున వారికొరకువిమానమువచ్చెను. అందులో వా రాకాశమార్గమున వెళ్ళుచు శిష్యులకొరకు వారు ధరించినకాషాయవస్త్రమును, సువర్ణపాదుకలను క్రిందికి జారవిడిచిరి. వానిని నేటికిని సోదెమఠమున అర్చించుచుందురు. వారిసమాధిమీద నుండుమృత్తికను భక్తులు, శిష్యులు ధరించి సర్వరోగవిముక్తు లగుచుందురు

శ్రీకృష్ణమఠము:— ఇందు శ్రీమధ్వాచార్యులవారిచే వెలిగించబడినదీప మారిపోకుండ నేటివరకు రక్షించుచున్నారు. పట్టణమున జరుగుశుభకార్యములలో హోమాదులకొఱ కీదీపమునుండియే వెలుగును తీసికొని వెళ్లుదురు. శ్రీమధ్వా చార్యులవారిచే వాడబడిన దారుమయాసనము, ఘంటామణి, దీపపుసెమ్మెలు, రజతాక్షయపాత్రి — మొదలగునవి నేటికిని వాడుకలో గలవు. వానిని చూడనగును. ఇచ్చట శ్రీకృష్ణ పరమాత్మసన్నిధిని జరుగు నానాసేవలలో కర్పూరహారతికి రూ 2 లు మొదలు త్తమకల్పబ్రహ్మోత్సవమునకు రూ 1108 వఱకు రేట్లు నిర్ణీతములై యున్నవి. ఆఫీసుబోర్డులో వివరములు చూడనగును. ఉడిపిలో మహాత్మాగాంధి మెమోరియల్ కళా

శాల, కస్తూరిబా మెమోరియల్ కళాశాల, సంస్కృత కళా శాల, పెక్కుహైస్కూళ్లు గలవు.

ఉడిపికి సమీపములో నున్న ముఖ్యమైనయాత్రాస్థలములు:

(1) సముద్రతీరము—ఉడిపికి నాలుగుమైళ్ళలో గలదు. రెండుగోపీచందనపుముద్దలలో 1. బాలకృష్ణుడు 2. బలరాముడు నుదయింప, బాలకృష్ణుని ఉడిపియందును, బలరాముని వడభాండేశ్వరములోను ప్రతిష్ఠించిరి. సముద్రస్నానముచేయుటకు నియమితకాలములో వేలకువేలు యాత్రికులు వచ్చెదరు

(2) పాజకక్షేత్రము:— శ్రీ మధ్వాచార్యులవారిజన్మస్థానము. ఇది ఉడిపికి దాదాపు 7మై. దూరమున నున్నది. బండ్లు, కార్లు వెళ్లుచుండును.

(3) విమనగిరి : పైక్షేత్రమునకు 2మై. ఇచ్చట దుర్గాదేవాలయ మొకకొండతిప్పమీద నున్నది. దీనిచుట్టు నాలుగు తీర్థములు గలవు. అందు శ్రీమధ్వాచార్యులవారు నిత్యము స్నానముచేసెడివారని ప్రతీతి

(4) దండతీర్థము:— ఇది తీరమార్గమున 7 మై. దూరమున గలదు. ఈకొలనునుండి శ్రీమధ్వాచార్యులవారు వారి గురువుగారి పొలములకు నీరుపెట్టిరని చెప్పుకొందురు. పర్యాయమున కధికారము వహించు ప్రతిస్వామి మొదట నిందు స్నానముచేయవలెను.

(5) ఇంద్రాణి:— ఇది ఉడిపికి తూర్పుగా 3మై.దూరమున నున్నది. ఒకకొండమీద దుర్గాదేవాలయము. అందు 5 స్వయముద్భవించిన సాలగ్రామములును, కొండదిగువభాగ

మున నీటిబుగ్గయు. దాని కెదురుగ నొకమారుతి దేవాలయ మును గలవు. ఈక్షేత్రము వనభోజనమునకును, ఏకాంతసాధ నకును అనుకూలముగ నుండును.

(6) కోటీశ్వర్ :- ఇది ఉడిపికి 21 మైళ్ళదూరమున గలదు. ఇందు కోటిలింగములు గలవు. రథోత్సవము కడు వేడు కతో జరుగును.

(7) మూకాంబికాక్షేత్రము:- ఉడిపి కీశాన్యమూలగా 56మై. దూరమున నున్నది. ఇది దుర్గా దేవాలయము. స్వయ ముద్భవముగల శివలింగము. ముఖ్యముగ మలబారు దేశీయుల కీ క్షేత్రము చాలప్రధానము. శివలింగము వెనుక మహత్తర తేజశ్శక్తి గలదుర్గా దేవిని శ్రీ శంకరాచార్యులవారు ప్రతిష్ఠిం చిరి. కుస్తాద్రి లిచ్చటికి సమీపము. ఈ పర్వతములపై సిద్ధ పురుషులు తపస్సు చేసికొనుచుందురను ప్రతీతిచే కొలది మందియాత్రికులు బహుకష్టముమీద కొండ లెగప్రాకె దరు. కుందుపూరుమీదుగా వెళ్ళవలెను. బస్సు గలదు. నవరాత్రులయం దిచ్చట చాలవైభవముగ నుండును.

(8) గురుగుంజిమలై:- దాదాపు 63 మై. దూరమున పడమటికనుమలయందు గలదు. ఇది విమల, తుంగ అనురెండు నదులు కలియుచోటు. గొప్పతీర్థముగ భావించెదరు. దీనికి 9మై.దూరమున గంగమూల అనుతుంగభద్రానదీజన్మస్థానము గలదు.

☞ ఉడిపి దర్శించి మంగుళూరు వచ్చి అటనుండి కూర్గురాజ్యములోని క్షేత్రము, పడమటికనుమలసౌందర్యము గాంచుచు మోటారు మీదుగ మైసూరు చేరవలెను.

## కూర్గు – కొడగు (Coorg)

కూర్గు అనగనే తేనె జ్ఞాపకము వచ్చును. కూర్గు తేనె ప్రశస్తమై మన దేశమున అమ్మబడును. కూర్గు పడమటికను మలలో మైసూరు, మలబారులకు మధ్య నున్న చిన్న రాజ్యము. మంగుళూరునుండి మైసూరు వెళ్ళు బస్సుమార్గమున గలదు. పూర్వ మిది మార్గవసతులు లేక మారుమూలలలో నుండెను, గాని నేడు చక్కని పెక్కురోడ్లు నలువైపుల విస్తరిల్లి ప్రయాణికుల నాకర్షించగలుగుచున్నది. నవంబరునుండి జూన్ వరకు దర్శనార్హముగ నుండును కూర్గురాజ్యము 1593 చ. మై. విస్తీర్ణము గలిగి, 2,30,000 జనాభా గలిగియున్నది. కొడగు అనగా కొండలప్రదేశమని వారిభాషలో దాని భావము.

కాఫీ, నారింజ, ఏలకుల వనములతోను, ప్రకృతి సౌందర్యరామణీయముతోను యాత్రికుల నాహ్వానించును. కూర్గురాజ్యమునకు మెర్కారా (Mercara) రాజధానినగరము. సముద్రమట్టమునకు 3809 అ. ఎత్తున గలదు. ఇది యొక వేసవివిడుదనగరము. (Hill Station) ఇచ్చట కాఫీ, నారింజ పరిశోధనాలయములు (Research Centre) గలవు.

చూడదగినవి:– రాజాసనము (Raja's Seat) మనోహరదృశ్యము నిటనుండి గాంచనగును. 1854 లో పాశ్చాత్యులు మెర్కారాలో కాఫీపంట ప్రారంభించిరి. నేడు భారత దేశములో పండు 21 వేలటన్నుల కాఫీలో ఒక్కకూర్గులో 9 వేల టన్నులు పండుచున్నది. ఇది యెన్నటికిని మరపునకు

రాదు. రాజకోట, నేటి సెక్రిటరేటు దర్శనీయములు.

ఓంకారేశ్వరాలయము. ఇది మెర్కారాలో గలదు. ఇది హిందు, మహమ్మదీయ శిల్పసమ్మేళనముతో నిర్మింపబడినది. దూరమునుండి యిది మహమ్మదీయాలయమువలె గానుపించును గాని సమీపించిన నిజముగా హిందూ ఆలయమే.

తలకావేరి: కావేరీనది దక్షిణదేశమునకు జీవనాధారము. కూర్గురాజ్యమున బ్రహ్మగిరి (పర్వతము)నుండి మెర్కారాకు 25 మైళ్ళలో తలకావేరియను పవిత్రపుణ్యక్షేత్రము గలదు. ఇది కావేరీనదీజన్మస్థానము. ఈ ప్రాంతప్రకృతి సౌందర్యము మనోహరము. చక్కనిరోడ్డు, బస్సులు గలవు. తులాసంక్రమణమున వచ్చుకావేరీపుష్కరమునకు సంవ



కావేరీనదీజన్మస్థానము - తలకావేరి

వత్సరము పొడవునను యాత్రికులు విశేషముగ వచ్చు చుందురు. మెర్కారానుండి భాగమండలా 25 మైళ్లు. బస్సులు గలవు. అటనుండి తలకావేరి 3 మైళ్లు. ఈ ప్రయాణ మతి రమణీయమైన పర్వతారణ్య, జలపాతాది ప్రకృతిసౌందర్య మధ్యమున పోవుచుండ యాత్రికునికి కలుగు ఆనందమునకు మేర లేదు. ఈమార్గము ఏలకి, లవంగ, కాఫీ, పోకతోటల తోను, పలువిధములైన పుష్పగుచ్ఛములతోను అగాధమైన లోయలతోను మనోహరముగ నుండును.

ఈ పవిత్రమైన కావేరీనది పడమటికనుమలలో బ్రహ్మ గిరి యనునొక యెత్తైన శిఖరమున జన్మించి తూర్పుగ ప్రవ హించి బంగాళాఖాతమున కలియుచున్నది. దీనిజన్మస్థలమున నొకశక్తి ఆలయముగూడ గలదు. ఈఆలయమున అఖండ దీపము (రాత్రిం బవళ్లు, 365 దినములు) వెలుగుచుండును. దీనిసమీపమున 30 అ. చతురముగల యొక తటాకము నేర్పరచి దానిలోనికి నీరు నింపుదురు. ఆ తటాకము నిండిన తదుపరి నీరు పొర్లి ప్రవహించుప్రవాహమే కావేరీనదిగ రూపొందుచున్నది. ఇదియే కావేరీజన్మస్థలము. ఇచ్చట తులామాసమున జరుగుఉత్సవమున నూతనవధూవరుల నత్తగా రింటికి పంపులాగున యాత్రికులు పసుపు, కుంకుమ, పండ్లు నీటిలో వదలి నమస్కరించెదరు. కావేరి తనభర్త యగు సముద్రరాజును జేర అమితోత్సాహముతో వాయు, శర, మనోవేగమున ప్రకృతిరమణీయతతో తులదూగుగిరులు, లోయలు, వనములు దాటుచు, మైదానములనెల్ల సస్య

శ్యామలము లొనర్చుచు, వృక్షముల ఫలింపజేయుచు పరు గిడుచుండును.

విశ్వనాథాలయము : ఇది యిచ్చటి తులాస్నానఘట్ట మునకు సమీపము. ఈఆలయ ముత్తరాదిఆలయముల ననుస రించియుండును. స్వామిపేరు విశ్వనాథుడు, అమ్మవారు విశా లాక్షి. వినాయకులు డుంఠివిఘ్నేశ్వరుడు, స్వర్ణకాలభైర వులు, దండపాణి మొదలగు పరివారముగూడ గలదు. అనగా కాశీక్షేత్ర మిచ్చట నెలసె నందురు. దీనికి దక్షిణకాశి యనియు నామము గలదు.

కూర్గురాజ్యమునుండి సాలీనా లభించుపంటలు.

| | | | | |
|---|---|---|---|---|
| ధాన్యము సాలీనా | 45 వేలటన్నులు | టీ | 2,70,362 పౌన్లు |
| ఏలక్కాయలు | 370 ,, | నారింజలు | 5 కోట్ల పౌన్లు |
| మిరియాలు | 300 ,, | గంధపుచెక్క | 120 టన్నులు |
| కాఫీ | 9 వేల ,, | కలప | 5లక్షల 70వేల ఘ. అ. |

ధర్మస్థల

ఇది ఉడిపికి 80మై. బస్సుకు రూ.3-8-0 చార్జి. మహా రణ్యములలో పర్వతములలోగుండ మార్గము పోవును. ఇచ్చట సేవ్యులు మంజనాథస్వామి; మహారుద్రుడు. ఎందరు వచ్చినను లేదనకుండ భోజనముపెట్టెదరు. కాసి యెవరును, నెట్టివస్తు వును నచ్చటినుండి తేగూడదని చెప్పుదురు.

కోర్టులలో తెగని పెక్కు దావాలీక్షేత్రస్వామియెదుటనే పరిష్కారమగును. రూ. 5 లు ఫీజు కట్టి స్వామియెదుట నిద్దరు పార్టీలును నిలువబడి యథార్థమును చెప్పుకొని తమతమ తగా దాలను తీర్చుకొందురు. అసత్య మాడినవారు నెత్తురు గ్రక్కి మరణించెదరని ప్రతీతి.

## శ్రీ కుక్కె సుబ్రహ్మణ్యక్షేత్రము

ఇది దక్షిణ కెనరాజిల్లాలో పుత్తూరుతాలూకాలో చేరి యున్నది. ఈ క్షేత్రమునకు 1. మంగుళూరు, 2. మైసూరురాజ్యములోని హాసన్ అనురెండును దగ్గర రైల్వేస్టేషనులు. మంగుళూరునుండి సుబ్రహ్మణ్యక్షేత్రము 67 మై. దూరము. హాసన్ నుండి సకలేశపురము, యుప్పినగడేద్వారా 100 మై. దూరము. ఏబస్సుమార్గమైనను వేసవికాలములో నవంబరునుండి మేవరకు మాత్రమే పోవును; మిగిలిన నెలలో పోవుట కష్టము. మహారణ్యములు, నదులు అడ్డగించును. హాసన్‌లో ఉదయము బయలుదేరిన సాయంతనము సుబ్రహ్మణ్యము చేరగలరు.

పూర్వము 'కుక్కెపట్టణ' ముండెడిదనియు. ఒకలక్ష యిండ్లకు పైగానున్నవనియు చెప్పెదరు. కాని కాలక్రమముగ ఆ పట్టణము శిథిలమైపోయినది. నేటిజనాభా 700 మాత్రము.

సుబ్రహ్మణ్యక్షేత్ర దూరదృశ్యము



స్కాందములో సనత్కుమారసంహితలో సహ్యాద్రి భాగముక్రింద 'తీర్థక్షేత్రమహిమ నిరూపణ' ఘట్టములో నీక్షేత్రమాహాత్మ్యము వర్ణింపబడియున్నది. ఇది 'కుముర్ధారా' నదీతీరమున నున్నది

సేవలు : అర్చనలు:— రు1-8-0 మొదలు రు 4551-4-0 వరకు గలవు. ఆక్షేత్రిపుగైడునందు విశదముగ చూడనగును. ఇచ్చట సంతానార్థము నాగప్రతిష్ఠలు జరుపుదురు. ఇచ్చటి పంచామృతములు 6 మాసములవరకు నిలువయుండునని ప్రతీతి. అనేకధర్మశాలలు గలవు.

ముఖ్యముగచూడదగినవి:— 1. సుబ్రహ్మణ్యస్వామి దేవాలయము. 2. కుక్కేలింగము కుక్కే అనగా కన్నడములో బుట్ట ఈక్షేత్రమేర్పడకముందొకబుట్టలో లింగము లుండెనట. అందుచే కుక్కెలింగమని పిలువబడుచున్నది. 3. ఉమామహేశ్వర దేవాలయము 12వ శతాబ్దములో శ్రీమధ్వాచార్యులవారీక్షేత్రమును దర్శించినప్పుడుగూడ నీస్వామి యున్నట్లున్నది. 4. వేదవ్యాససంపుట, నరసింహ 5. బలాలరాజావారి విగ్రహము—11వ శతాబ్దమున హోసలబలాలా అను చక్రవర్తిచే నీదేవాలయము వృద్ధిచేయబడుటచేత నీవిగ్రహమును స్థాపించిరి. 6. సుబ్రహ్మణ్యమఠము—ఇది శ్రీమధ్వాచార్యుల వారిసోదరు శ్రీవిష్ణుతీర్థాచార్యులవారిచేత స్థాపించబడినది. 7. శృంగేరిమఠము:- (శృంగేరిమఠమువారి శాఖ; గాని యిప్పుడది సుబ్రహ్మణ్య దేవస్థానమువారిపరిపాలనములో నున్నది. 8. హోసులింగం 9. దర్పణతీర్థము- 10. ఆది సుబ్రహ్మణ్యము

11. ఉత్తరాదిమఠము 12. రుద్రిపాడె - (దేవాలయమునుండి 2 ఫర్లాంగులలో)

13. కాశీకట్టె ( ,, ,, )

14. బిలద్వార్ (పూర్వ మీ ప్రదేశములో నాగేంద్రు డుండెడివాడు) ఇది దక్షిణద్వారముగుండ నీ గుహలోనికి వెళ్ళి ఒకఫర్లాంగుపొడుగున రెండవ వైపునకు యాత్రికులు వచ్చెదరు. వర్షాకాలములో వెళ్ళలేరు.

15. కుమారధారనది:- 16 మత్స్యతీర్థము:- ఇది దేవాలయమునుండి 1½ మై. 17. అగ్రహాసోమనాథతీర్థము:- ఇది మైలుదూర ముండును. 18. కుమారపర్వతము:- 12 మై. దూరము. 4000 అడుగులయెత్తు. దారి లేదు తెలిసినవారిని తీసికొని వెళ్ళవలెను. ఈపర్వతముపై 'కుమారలింగములు' సాలగ్రామములవంటివి దొరకును. యాత్రికు లేరుకొని తెచ్చుకొందురు.

ఉత్సవములు:- సుబ్రహ్మణ్యక్షేత్రమున కార్తికబహుళ ద్వాదశినుండి మార్గశిరశుక్లపూర్ణిమవర కుత్సవములు జరుగుచుండును. మార్గశిరశుక్ల షష్ఠినాడు బ్రహ్మోత్సవము జరుగును.

## గోకర్ణము

ఈప్రదేశమున సముద్రము స్వాభావికముగా ఆవుచెవిని పోలియుండుటవలన దీని కీశ్వరుడే గోకర్ణము (ఆవుచెవి) అని నామకరణముచేసినట్లు గాథలు చెప్పెదరు. ఇది పశ్చిమసముద్రమున నుత్తరకనరాజిల్లాలో గలదు. ఇది ఉడిపికి 125 మై. దూరములో నున్నది. ఇచ్చటిలింగము శివుడు రావణుని

కిచ్చినలింగములోని భాగమని వాడుక. గోకర్ణక్షేత్రమును గూర్చి రామాయణమునందును, మహాభారతమునందును వర్ణింపబడియున్నది. మహాబలేశ్వరలింగము ద్వాదశ తేజో లింగములలో నొకటి.

వసతులు:- అహల్యాబాయిచే నిర్మించబడినధర్మశాల గలదు. దీనియందు యాత్రికులకు భోజనవసతిమాత్రము గలదు. ఉండుటకు గదులు లేవు. ఇచ్చటమాత్రము పండాల నాశ్రయించవలెను. పండాలు మంచివసతి చేయఁగలరు. వారికి పెద్దయిండ్లు గలవు. దేవునిఆలయములో 2వ ప్రాకారములో పంచలో సాధువులు దిగుచుందురు. ఉడిపినుండి గోకర్ణమునకు బస్సు లంచెలమీద (మార్పులతో) పోవును. బస్సుల కనెక్షన్ సరిలేనందున రెండుదినముల ప్రయాణమగును. ముందుగ డబ్బు కట్టి సీట్లు రిజర్వుచేసికొనుట మంచిది. ఈమార్గము మహారణ్య గతము. కొండలమీద నెక్కుట, దిగుట, మెండు. ఒకవైపు అరేబియాసముద్రము, రెండవవైపు పడమటికనుమలు దట్టమైన అరణ్యములతో నుండును. మధ్యమధ్య నదములు గలవు. అందు నాల్గింటిమీద (బస్సు దిగి) పడవలలో వెళ్ళి ఆవలనున్న బస్సులనెక్కి ప్రయాణముచేయవలెను. రెండునదములమీద బస్సులనుగూడ పడవలపై ఆవలకు దాటించెదరు. (నదములనగా పడమరగా ప్రవహించి సముద్రమున కలియునవి) నదములను దాటించినందుకు బస్సుచార్జీగాక కొన్నిచోట్ల 0-0-9, కొన్నిచోట్ల 0-1-3 తీసికొందురు. ఈనదములలో సముద్రజలము కలియుటచేత నీరుప్పగ నుండును. ఇచ్చట

వర్షములు చాలహెచ్చుగ కురియుచుండును. అందుచే నప్పటి కప్పుడే నదములు నిండుగ ప్రవహించుచుండును. మరల ఒకటి రెండుగంటలలో తగ్గుచుండును. ఈప్రాంతములో తాటిచెట్లు, పందులు కనుపించవు.

ఉడిపినుండి హనవార్ కొకబస్సు రూ 2-11-0 చార్జీ. ఒకటికెట్టిచ్చెదరు. హనవార్ నుండి కుమటా మీాదుగా గోకర్ణమునకు మరొక్కటికెట్టు. రూ 1-6-0 చార్జీ మొత్తము ఇంచుమించు 100 మైళ్ళ దూరము.

గోకర్ణక్షేత్రములో చూడదగినవి:-

1. కోటితీర్థము, 2. గోగర్భము-కొండమీాద 3ఫర్లాంగు లలో గలదు. 3. రామతీర్థము సముద్రతీరమున కొండమీాద 2 ఫర్లాంగులలో నొకకొండదరియందు గలదు. రావణసంహారానంతరము నరహత్యామహాపాతకమును పోగొట్టుకొనుటద్దేశ్యముతో శ్రీరాముడాత్మలింగమును పూజించుచు నీప్రదేశములో కొంతకాలము నివసించియుండుటచే దీనికీపేరు వచ్చినదని కొందరు చెప్పుదురు. 4. సీతాలక్ష్మణ తీర్థములు-ఇవియు సమీాపముననేగలవు 5. తామరగౌరిఅమ్మవారు-దేవాలయము నానుకొని తూర్పున గలదు. అమ్మవారిచేత నొకత్రాసుండును. దానిసిబ్బి యొకటి మొగ్గుగ క్రిందకు వ్రాలియుండును. కాశికంటె గోకర్ణమే యెక్కువ పవిత్రమైనదని దానిభావమట. 6. పురాతనమహాబలేశ్వరలింగము, 7. సాక్షీశ్వరలింగము. (6 & 7) రెండవప్రాకారములో గలవు. రామతీర్థమున కొక ఫర్లాంగులో కొండమీాద భీమతీర్థము గలదు. విఠల్ మందిరము,

భద్రకాళిమందిరములు ఊరిచివర గలవు. శ్రీవెంకటేశ్వర మందిరము, విఘ్నేశ్వరునిగుడి చూడనగును.

స్నానము:– కోటితీర్థమునొద్ద ప్రాయశ్చిత్తకర్మ, క్షురకర్మ చేయించుకొందురు. పశ్చిమసముద్రస్నానము (రత్నాకరిలో) చేయించి పిండప్రదానము చేయింతురు.

## హుబ్లి

గోకర్ణమునుండి దాదాపు 110 మైళ్లు. పడమటికనుమలలో దట్టమగుఅడవులలో కడురమ్యమైన ప్రయాణము. గోకర్ణమునుండి హుబ్లీకి బస్సుచార్జీ. రూ 4-0-0. 7 గంటల ప్రయాణము. హుబ్లీయందు సిద్ధారూఢస్వామిమఠము దర్శనీయము. హుబ్లీస్టేషనునుండి 2½ మై. దూరములో గోకర్ణము పోవురోడ్డు గలదు.

☞ హుబ్లీనుండి గుంటకల్ చేరి అచ్చటినుండి పండరిపురము మీదుగా ఉత్తరయాత్ర చేయనగును. లేదా గోకర్ణము నుండి మైసూరు సంస్థానము బస్సుమీద చేరి అచ్చటిక్షేత్రముల దర్శింపవచ్చును.

## గెర్‌సొప్పా జలపాతము

(JOG FALLS.) గోకర్ణమునుండి తిరిగి కుంటా మీదుగా గెర్‌సొప్పాజలపాతము షుమారు 80 మైళ్లుండును. బస్సులు గలవు. కాని నదు లడ్డముండుటచేత ప్రయాణమొక్కొక్కప్పు డాలస్య మగుచుండును. ఇచ్చటి ప్రకృతిసౌందర్యము వర్ణనాతీతము. ఈజలపాతము దాదాపు 830అ. ఎత్తునుండి క్రిందకు దుముకుచుండును. ఇంతపెద్దజలపాతములు

ప్రపంచమున మృగ్యములుగ నున్నవి. దీనినిగూర్చి పాశ్చాత్యులు విశేషముగ పొగడిరి

Lewis Rice; writes: "No words can suffice to adequately describe the charms of a scene replete with every element of the sublime, combining in one super panorama so many varying aspects both of terror and beauty, all instinct with the life, the force and play of moving waters."

లూయీరైసు ఇటుల వ్రాయుచున్నాడు:—

"ఈప్రకృతిదృశ్యము భగవంతునియందు భయభక్తులు గలుగజేయు మూలతత్త్వములతో పరిపూర్ణత్వము నొంది యున్నది. భయావహము, ఆనందదాయక మైన నానావిధ రూపము లత్యంతాధిక మైన యీ విశ్వదృశ్యమున పెనవేసి కొనినవి. ఈ జలపాతప్రవాహమునందలి చైతన్యయుతవిశ్వలీల మానసిక ప్రవృత్తినిగూడ నరికట్టజాలును. మంత్రముగ్ధమయిన యీప్రకృతిదృశ్యమును సంపూర్తిగ నభివర్ణించుటకు నోటిమాటలు చాలవు."

గెర్‌సొప్పా జలపాతము JOG FALLS



"While excelled in height by the Cerosoli and Evanson Cascades in the Alps, and

the falls of the Arve in Sovoy, the Gersoppa cataract surpasses them in volume of water precipitated and while much inferior to Niagara in volume it far excells those celebrated falls of the New world in height."

జర్సొప్పాజలపాతము ఆల్ప్సు (Alps) పర్వతమునందలి సెరొసొలి, (Cerosoli) ఎవాన్సన్, (Evanson) సావాయి పర్వతములందలి ఆర్వ్ (Arve) సేలయేళ్ళకన్న ఎత్తున నతిశయింపకున్నను జర్సొప్పా నిలువచేయు జలమే ఘనపరిమాణమున అధికముగ నున్నది. కాని నయాగరా (Niagara) ప్రవాహపాతము నిలువచేయునీటికన్న తక్కువైనను సెరొసొలి ఎవాన్సన్ నయాగర జలపాతములను జర్సొప్పా పాత మధికముగ నతిశయించుచున్నది.

ఈ జలపాతమునొద్ద మహాత్మాగాంధీ హైడ్రోఎలక్ట్రిక్ వర్క్సు గలవు.

వసతులు:- సాగర్ నుండి తలగొప్పమీదుగా బస్సు గలదు. 1-2-0 బస్సుచార్జీ. జలపాతమునొద్ద రహదారిబంగళా గలదు. గదికి దినమునకు రూ1-12-0 ఒంటరిగానున్న; కుటుంబముతో నున్నగదికి రూ2-8-0. ముందుగ తెలిపిన భోజనము బస యేర్పాట్లు లభించును. హైడ్రోఎలక్ట్రిక్ వర్క్సు చూడవలెనన్న జనరల్ సూపరింటెండెంటుగారి యనుమతి కావలెను. ఉత్తరప్రత్యుత్తరములకు.

EXECUTIVE ENGNEER, No 3. Division, Jog Falls, P. O.

24 మై. దూరములో నున్న 'హిరేభాస్కర్ రిజర్వాయరు'నుగూడ చూడనగును బస్సు గలదు.

భోజనము 1వ తరగతి (పెరుగుతో) 1-4-0, 2వ తరగతి భోజనము 1-0-0, 3వ తరగతి భోజనము (మజ్జిగతో) 0-12-0.

భద్రావతి

జలపాతమునుండి షిమొగ వచ్చి అచ్చటినుండి రైలుమీద 12 మై. ప్రయాణముచేసిన భద్రావతి చేరనగును. 0-7-0 రైలుచార్జీ.

ఇది 'భద్రానదికి' కుడివైపున నున్నది. మైసూరుగవర్నమెంటువారియినుము, ఉక్కు కర్మాగారము గలదు. ఇది యిండియాలోనికెల్ల పెద్దది మైసూరు పేపరుమిల్లిచ్చటనే గలదు.

శృంగేరి (శృంగగిరి)

అద్వైతమతస్థాపనాచార్యు లగుశ్రీ శంకరాచార్యులవారు స్థాపించినప్రధానమఠము.

ఇది షిమొగనుండి 58 మై. బస్సుమీద వెళ్ళవలెను. బస్సుచార్జీ రూ. 2-12-0. శృంగగిరి అనునదే క్రమశః శృంగేరి అయ్యెనందురు. అనేక దేవాలయములు గలవు. గాని 'శారదాదేవి' దేవాలయము ముఖ్యము. శ్రీశంకరాచార్యులవారు కాశ్మీరునుండి తెచ్చిన సువర్ణశారదాదేవి నీదేవాలయమున ప్రతిష్ఠించిరి. నేటికి నావిగ్రహమునకే అర్చన జరుగుచున్నది. ఈమైసూరురాజ్యములో నిది గొప్పమఠము. భాగ్య

వంతముగూడ. 1346 నుండి మొగలు చక్రవర్తులు, విజయ నగరరాజులు, గంగవంశరాజులు, మైసూరురాజులు, టిప్పు సుల్తాను మొదలైనవా రెన్నియో జాగీరులు సమర్పించినట్లు గలదు నేటికిని వాని ననుభవించుచున్నారు. ఈఋష్యశృంగ పర్వతముపైన వసిష్ఠ, విశ్వామిత్ర, విభాండక, కశ్యపాది మహర్షు లాశ్రమస్థులై తపస్సు చేసినట్లు పురాణగాధ లనేకములు గలవు. ఈప్రాంతమునందలి ప్రకృతిరామణీయకతయే యింద రు ఋషీశ్వరుల నిచ్చటి కాకర్షించినది. ఇది యనాదినుండి గొప్పతపోమహిమ గలదిగ మనశాస్త్రములలో పేర్కొనబడినది.

శృంగేరిరథోత్సవము



ఇది ఆదిశంకరుల వారిచే స్థాపింపబడిన నాల్గు ఆమ్నాయపీఠములలో నొకటి. ఆచార్యుల వారిచే స్వయముగ ప్రతిష్ఠింపబడిన శారదా లయము గలదు. నగర మధ్యమున తిప్పపైన శ్రీ విభాండకమహర్షిచే అర్చింపబడిన శ్రీ మల్లికార్జునస్వామివారి ఆలయము గలదు. శారదాదేవి ఆలయముప్రక్కన

విద్యారణ్యులచే స్థాపింపబడిన శ్రీవిద్యాశంకరాలయము గలదు. ఇది పురావస్తుశాఖవారి(Archelogical Importance) గణ్యతనొందినది.

దర్శనీయములు : 1. శ్రీదుర్గాలయము, 2 కాలభైరవాలయము, 3. కాళీదేవి ఆలయము, 4. శ్రీ వీరాంజనేయాలయము (ఇది శృంగేరీపట్టణము వెలుపల గలదు. దీనిని ఆది శంకరులు ప్రతిష్ఠించిరి.)

ఇచ్చటకు 6 మై. దూరములో ఋష్యశృంగపురము (కిగ్గ) న శృంగేశ్వరస్వామిఆలయము గలదు. రామాయణమున పేరెన్నికగన్న శ్రీఋష్యశృంగమహర్షి చే నీఆలయమున స్వామి వర్చించినట్లు గాథలు గలవు.

బస్సుమార్గములు :

| | | | |
|---|---|---|---|
| కోడూరు లేక బిరూరునుండి | శృంగేరికి 76 | మైళ్ళు | రూ. 4-0-0 లు. |
| ఉడిపినుండి | ,, 60 | ,, | |
| మంగుళూరునుండి | ,, 83 | ,, | |

గోకర్ణమునుండిగూడ బస్సులు గలవు.

నేటి మఠాధిపతులు శ్రీమద భినవవిద్యాతీర్థ మహాస్వామిగల్ వారు.

ఇచ్చట మేడమీద నాలుగువేల వ్రాతప్రతులు అచ్చుగ్రంథములు గలగ్రంథాలయము చక్కనియేర్పాట్లతో నుంచబడినది.

కళాశాల :- శ్రీ శంకరాచార్యస్థాపితమగు కళాశాల గలదు. ఇందు పది సం॥లు చదువవలెను. బాలుర కథ్యాత్మ

విద్య గరపి గొప్పవారినిగ జేయుదురు. ఇందు 80మంది విద్యార్థులు 10మంది అధ్యాపకులు గలరు. ఒక్కొక్క రొక్కొక్క శాస్త్రమునందు ప్రత్యేకించి పరిశోధనచేసినవారుగ నుందురు. సంవత్సరమున కొకసారి నది కావలియొడ్డున నున్నచిన్నకుటీరములో నిరంతరస్నాన, ధ్యాన, పఠనాదికార్యక్రమములలో మునిగియున్న గురుదేవుసన్నిధి కీపరీక్ష కాబోవువిద్యార్థి నదిలో నీదుకొనుచుబోయి వారిని జేరవలెను. వారు పరీక్షించి యాశీర్వదించి, యాదరింతురట.

## తరికెరె

ఇది భద్రావతిస్టేషనునుండి 12 మై. తరికెరె రైల్వే స్టేషను. ఇది శృంగేరికి, బాబాబుడన్‌గిరికి దగ్గరి రైల్వేస్టేషను. ఇది ముఖ్యవ్యాపారస్థలము. అన్నివసతులు గలవు.

ఇచ్చటి కారుమైళ్లదూరములో అమృతపురమున అమృతేశ్వరాలయము గలదు. ఈదేవాలయము శిల్పముతో గుప్పింపబడియున్నది. ఆశిల్పు లీదేవాలయామృతలింగేశ్వరులపై ప్రతిశివరాత్రికి సూర్యకిరణములు పడునట్లు నిర్మించిరి.

## బేలూరు (BELUR)

ఇది మైసూరు స్టేటులో నున్నది. షిమొగనుండి హాస్సాన్‌కురైలుమీద వచ్చి అచ్చటినుండి బేలూరుకు 24 మై. బస్సుమీద వెళ్ళవలెను. లేదా శృంగేరినుండి నేరుగ బస్సుమీద ముడిగెరె వచ్చి అచ్చటినుండి బేలూరు చేరవచ్చును. బేలూరు సముద్రమట్టమునకు 3,282 అడుగులఎత్తున నున్నది. ఇది యాగాచినదియొడ్డున గలదు.

వసతులు:— రహదారిబంగళా గలదు. వంటకు గదులు గలవు. ఇచ్చట ఆర్కిలాజికల్ డిపార్టుమెంటువారిచే తర్ఫీదు పొందినఒక గైడు (బేలూరుశిల్పము దేవాలయములు చూపుటకు) గలడు. అతనికి తోచినది యియ్యవచ్చును. అతని నుపయోగించుకొనిన ప్రయోజనముగలదు. ఈశిల్పములు చూడబోవునప్పుడు వెంట బ్యాటరీలైటు తీసికొని వెళ్ళిన చీకటిగ నున్న ప్రదేశములలో శిల్పమును పరిశీలింపవచ్చును.

An English traveller Mrs Bowring, has left a description of the fine town of Belur and its natural setting. She says, " I shall never forget the view on entering Belur. It was most lovely. Green rice crops sloping down to the edge of the tank, a fine sheet of blue water surrounded by large trees, above which appeared the grey walls of the fortress and the white dome and towers of the famous temple; beyond the Bababudan mountains looking purple and blue ... It was altogether as beautiful a sight as anything I have ever seen "

శ్రీ చెన్నకేశవాలయము - బేలూరు



భారతదేశము విచ్చేసినయొక ఆంగ్లేయయువతి బౌరింగు సతి (Mrs. Bowring) బేలూరు నగరమును సందర్శించినంతనే ఆనగరసౌందర్యమునకును, ప్రకృతిరామణీయకతకు నచ్చెరువు నొంది, యీక్రిందివిధమున తనమనోజనితాభిప్రాయమును వెల్లడించెను. "బేలూరునగరము పొలిమేరలు చేరినంతనే కన్నుల పండువుగ గోచరించిన ఆకమనీయదృశ్యము నీజన్మలో మఱువలేను. ఆప్రకృతిశోభ అత్యంతమనోహరము. తటాకముగట్టు వరకు నేటవాలుగ వ్యాపించిన ఆకుపచ్చని వరిచేలు, మహావృక్షములచే ఆవరింపబడినతటాకము, నీలవర్ణమయమై, వినిర్మలమగుతటాకమునందలిశుద్ధజలము, వృక్షోపరిభాగములందు గొలదిదూరమున గానవచ్చు శిథిలావస్థయం దున్నను గడు గంభీర మైనకోటప్రాకరములు, ప్రఖ్యాతిచెందిన పవిత్రదేవాలయ గోపురాగ్రభాగములు, మేఘశ్యామల, ధూమ్రవర్ణముల నలరారు బాబుబుడన్ పర్వతపంక్తులుయాత్రికులకుబ్రహ్మానందము నొసంగును. ఇంత మనోరంజకముగ ప్రకృతి సుందరరూపము దాల్చుటను నే నెపుడును జూడలేదు.

ఈపత్తనము పురాతనమై చరిత్రప్రసిద్ధమై యున్నది. మహాబలశాలి, విష్ణుభక్తుడు నగు విష్ణువర్ధనుడు చక్రవర్తిగ నుండినపుడు నానాకళల పోషించుచు ముఖ్యముగ శిల్పమును సర్వోన్నతి నందించెను. ఆమహారాజు కట్టించిన యనేకవిష్ణ్వాలయములలో బేలూరులోని విజయనారాయణాలయము బహుసుందరము, సువిశాలము. కేశవస్వామిని బ్రతిష్ఠించి శాస

నములు వేయించెను. జకనాచార్యశిల్పి పేరు చిరస్మరణీయము గావించెను.

ఈదేవాలయశిల్పము చాలసున్నితమై భావయుక్తమై బహుకళారసికుల నాకర్షించుటేగాక రామాయణ, మహాభారత భాగవతాది గాథలనుండి అనేకచిత్రవిచిత్రచరిత్రలు ప్రత్యక్షమగునట్లు చెక్కబడియుండుటచే భక్తజనులగూడ నాకర్షించుచున్నది. ఇందు శిల్పకళాచాతుర్యమును వెదజల్లువిగ్రహములు వందలకొలది గలవు.

నవరంగహాలు:-దీని స్తంభములు బహుసున్నితమైనశిల్పముచే నిండియున్నవి. ఇందు ముఖ్యములు నృసింహ, మోహినీ స్తంభములు నృసింహ స్తంభము తిరుగుచుండెడిదట. కాని కాలక్రమమున నెవరో దానిని జెడగొట్టిరట. దీనిపైకప్పు 13అ. చతురము, 20 అ. ఎత్తుననుండి లతలతో చెక్కబడినది.

బేలూరు గోడలపైశిల్పము



ఆండాళ దేవాలయము దక్షిణప్రాకారముమీద వేణుగోపాలవిగ్రహ మతిసుందరమైనది గలదు. శ్రీకృష్ణదేవరాయల కాలములో నిత్తడిధ్వజస్తంభము ప్రతిష్ఠింపబడినది.

ఇంతచక్కని దేవాలయము శిథిలావస్థలో నుండుట గాంచి క్రీ. శే. 4వ కృష్ణరాజవడయూర్ (మైసూరుమహారాజ) వారు లక్షలకొలదిద్రవ్యమును వెచ్చించి దేవాలయపునరుద్ధరణము గావించిరి. వారివిగ్రహమునుగూడ లోహములో తయారు చేయించి విష్ణువర్ధనునివిగ్రహముప్రక్కన స్థాపించిరి.

బాబాబుడ్డెన్‌సమాధి:— ఇది బేలూరుకు 30 మై. దూరములో నున్నది. చిక్‌మాంగులూరునకు 10 మై. దూరములో నున్నది. బస్సులు గలవు. ఈయన గొప్పఫకీరు. కాఫీ త్రాగెడి ఈయన మక్కానుండి మనదేశమునకు వచ్చునప్పు డీప్రదేశమున తనవెంట తెచ్చిననాలుగుకాఫీగింజలను స్వోపయోగము

బేలూరుదేవాలయసింహద్వారదృశ్యము



నకు నాటుకొనెను. నేడది యచటి కొండలపై వ్యాపించుట చే (5 వేలనుండి 6 వేల అ.ల యెత్తుండును) వానికి బాబాబుడ్డెన్ గిరులని పేరు గలదు. హిందువులు, మహ్మదీయులు నీబాబాగారి సమాధిని కొలుచుచుందురు

## హాళేబీడు

ఇది బేలూరునుండి 10 మైళ్ళదూరములో నున్న దర్శనీయమగు ప్రాచీన మహాపత్తనము. బస్సులు గలవు.

ఈ దేవాలయమునుగూర్చి మైసూరుగవర్నమెంటు ఆర్కిలాజికల్ రీసెర్చిడైరక్టరగు లేటుమిష్టర్ లేవిస్ రైస్ ఇట్లువ్రాసెను.

The late Mr. Lewis Rice, Director of Archaeological Researcher, Mysore Government, has said while comparing the parthenon at Athens, and the Halebid temple. ".........The parthenon is the best example we know of pure, refined, intellectual power applied in the production of architecture design. Every part and every effort is calculated with mathematical exactness and executed with provision that never was equalled. The Halebid temple is the opposite of all this. All the pillars of the parthenon are identical, while no two facts of the Indian temple are the same; every convolution and every scroll is different.........and every part exhibits a joyous exuberance of fancy scorning every mechanical restraint. All that is wild in human faith and warm in human feeling is found portrayed on these walls."

ఏథెన్సునగరమందలి పార్థినాను (Parthenon) సుందర భవనమును, హళేబీడు దేవాలయమును పోల్చుచు మైసూరు ప్రభుత్వ పురావస్తుపరిశోధకసంస్థాధికారి యగు లెవిస్ రైస్ గారు (Mr. Lewis Rice) ఇట్లుద్ఘాటించిరి. "మిశ్రమముకాని సున్నితమయిన మానవుని మానసికశక్తిని ప్రయోగించి నిర్మించిన అత్యుత్తమశిల్పచిత్రకళాసుందరమందిర మొక్క-పార్థినానని యే మన మింతవర కనుకొనుచున్నాము. పార్థినానునందలి ప్రతిభాగము, ప్రతిరచనము ఖచితమగు గణితముప్రకారము చెక్కబడినందున అత్యంతనిష్కృష్టమై, సున్నితమై దానితో సరితూగగల కట్టడము ప్రపంచమున మరియొకటి లే దనిపించుకొనినది. కాని హళేబీడు దేవాలయము పార్థినానును మించి రాణించుచున్నది. పార్థినానునకు హళేబీడునకు రెట్టింపువార యున్నది. పార్థినానునందలి స్తంభము లన్నియు ఒకేతీరున ఆకారభేదము లేకుండ నున్నవి. కాని భారతీయ దేవాలయమున ప్రతిఅంగుళము మేలను శిల్పచిత్రము విచిత్రముగ నున్నది. ప్రతి మెలిక, ప్రతివంపు అలంకారశోభను గూర్చుచు నొకదాని నొకటి పోలియుండక అత్యంతసుందరముగ నున్నవి. శిల్పచిత్రములందలి విశేషాధిక్యము విజృంభించుచు స్వయం సమృద్ధముగ నుండి ఆనందమును రేకెత్తించుచున్నందున యంత్రనిర్మాణములకు తలవంపులుగ నున్నది.

మానవత్వము, మానవశక్తి, మానవుని నైతికవిశ్వాసము దేవాలయపుగోడలపైన మూర్తీభవించినవి."

ఇంకొకరు :—

"Had but this temple been completed, it is one of the buildings on which the advocate of Hindu architecture would desire to take a stand."

దురదృష్టవశమున నీ దేవాలయము వైకల్య మొందినది. దేవాలయము చెక్కుచెదరక యథాతథముగ నున్నయెడల హిందూశిల్పకళయొక్క అత్యున్నతస్థాయిని నిరూపించుచు ఈ దేవాలయము కళారాధకులకువిశ్వకళామందిర మైయుండెడిది.

మరొకరు :-

"This temple is a gem of Indian architecture. If this temple has been illustrated in anything like completeness, there was probably nothing in India which would have conveyed a better idea of what its architects were capable of accomplishing."

భారతీయశిల్పసంపదకు ఈ దేవాలయము వజ్రసమము. ఈ దేవాలయపు పరిపూర్ణస్థాయికి భంగము వాటిల్లకుండ నుండినయెడల భారతీయశిల్పశాస్త్రజ్ఞుల ప్రతిభావిశేషమును జగద్విఖ్యాత మొనర్చుటకు ఈకళారాధనమందిరము ఎంతయో ఒప్పియుండెడిది.

## శ్రవణబెళగోళ

హాళెబీడునుండి హాస్సాన్ మీదుగా 70 మై. దూరమున గలదు. బస్సులు గలవు. అనగా హాళెబీడునుండి బేలూరు. 10 మై. బేలూరునుండి హాస్సాన్‌కు 24 మై. హాస్సాన్ నుండి శ్రవణబెళగోళకు 36 మై. మొత్తము 70 మైళ్లు. మైసూరు నుండి 50 మై. ఇది మైసూరురాజ్యములో హాస్సాన్ జిల్లాలో గలదు. ఇచ్చట నిత్తడిపాత్రలు చేయుదురు.

ఇది జైనులకు ప్రధానమైన పుణ్యక్షేత్రము. ఈగ్రామమున కిరువైపుల నెత్తైనపర్వతములు గలవు. వానిమధ్య నొక సరోవరము గలదు. ఒకపర్వతమును వింధ్యపర్వతము లేక ఇంద్రబెట్ట అందురు. ఇది సముద్రమట్టమునకు 3,250 అ. యెత్తున నున్నది. దీనిపైననే 983 A. D. న, 58 అ. యెత్తున గోమతేశ్వరవిగ్రహము చెక్కబడియున్నది. కొండపైకి మెట్లు చెక్కబడియున్నవి. జైనసంబంధమైన అనేక దేవాలయములు గలవు. రెండవపర్వతముమీదకూడ అనేకజైన దేవాలయములు గలవు. ఈ దేవాలయములను విష్ణువర్ధనుడు వైష్ణవమత మవలంబించకపూర్వము నిర్మించినట్లు చెప్పుదురు.

చరిత్ర:- భారత దేశమున 3వ శతాబ్దము (3 B. C.)న అఖండసామ్రాజ్య మేలినచంద్రగుప్తాచార్యుడు తనఅవసాన కాలమున తనరాజ్యమును త్యాగముచేసి యిచ్చట నొక గుహలో నివసించెను. ఈ గుహను యాత్రికులు నేటికిని దర్శింతురు. క్రీ. శ. 983 లో చాముండార్యుడు 58అ. యెత్తుగల గోమతేశ్వరవిగ్రహము నొకేశిలయందు చెక్కించెను. ఇంతపెద్ద విగ్రహము ప్రపంచములో నెచ్చటను లేదు. ఇది జైనమతాచార్యుని విగ్రహము. ఈ విగ్రహమును చెక్కినశిల్పి అరిత్తనంబి. గోమతేశ్వరవిగ్రహమూర్తి ధ్యానావస్థయందున్న యతివలె నిశ్చేష్టుడై యున్నట్లు చెక్కబడినది. పాదములు పద్మమునందున్నట్లు చెక్కబడినవి.

"Nothing grandeur" says Fuergusson, "or more imposing exists anywhere out of Egypt and even

there, no known statue surpasses it in height or excels it in perfection of art it exhibits."

"ఇంతకన్న వైభవోపేత మింకొకటి లేదు" అని ఫెర్గూసన్ (Mr. Fuergusson) తన స్వాభిప్రాయమును వెల్లడించిరి. "ఇటువంటి శిల్పకళాఖండ మీజిప్టునందుదప్ప ఇంకెచటను లేదు. శిల్పకళోత్కృష్టతను వెల్లడించు భావపూరిత గంభీర భారతీయశిలాప్రతిమ నతిశయించు విగ్రహముకొఱకు వెదకి జూచిన ఈజిప్టునందుగూడ కానుపించని విషయము వాస్తవము."

## IN TUNE WITH INFINITE

### (A. K. SETT. F. R. G. S., F. R. S. A)

Every part of the body is in its right proportion, the perfect anatomy of the naked body is magnificient. Broad of chest, narrow of waist, with curved thighs, the Gomateswara stands on his robust legs. His long arms with tapering fingers, every nail carefully carved out, hang on either side of him. The Saint in deep meditation is lost to life and to the world. His open eyes are closed to the seething struggle for existance which goes on around him. He is in perfect tune with the Infinite; he is in Nirvana. So lost is he in deep thought that snakes have curled round his shapely arms and have built their homes thereon and a fig tree has grown on his legs. The Gomateswara's face, crowned by a mass of thick curls surpasses the beauty of his body. The entire glory of this massive piece of loveliness lies in the lips of the

saint which are faintly parted in the inscrutable smile of Mona Lisa.

## సర్వాంతర్యామితో సర్వమేళనము

(ఎ. కే. సేత్, F. R. G. S., F. R. S. A.)

శరీరమునందలిప్రతిభాగము యుక్తమైన అంగానుగుణ్యమును బొందియున్నది. దిగంబరాకారమునందలి అంగప్రత్యంగ సౌష్ఠవము పరిస్ఫుటాశ్చర్యకరము. సువిశాలమైనవక్షఃస్థలముతో. సున్నితమైననడుముతో, గుండ్రనియూరువులతో శోభించుగోమతేశ్వరస్వామి దృఢము లగుపాదములపై నిలిచియుండును. అత్యంతలావణ్యమున జెక్కబడిననఖముల నలరారు నాజానుబాహువులు గోమతేశ్వరస్వామి కిరువైపుల వ్రేలాడుచుండును. గాఢ సమాధ్యవస్థయం దున్నస్వామి ప్రపంచాతీతు డగ కాచును. మనుగడకై నిత్యము జరిగెడి సంఘర్షణనుండి సోదరజనుల నుద్ధరించుటకు గాబోలు పద్మదళముల బోలు నేత్రద్వయమును మూసికొని ధ్యాన

గోమతేశ్వరస్వామి - శ్రీవణబెళగోళ



నిమగ్నుడయ్యెను. సర్వాంతర్యామియందు సర్వమును మేళ వించి గోమతేశ్వరుడు తాదాత్మ్యమును బొందెను. గోమతేశ్వర స్వామి నిర్వాణస్థితి నందుకొనెను. పరమేశ్వరునందు లీనమైన గోమతేశ్వరునిశరీరముపై సర్పము లెగబ్రాకుచు వల్మీకముల నిర్మించుకొనినవి. పరమపవిత్ర మగు పలాశపాదపముగూడ పాదములందు మొలకెత్తి దినదినాభివృద్ధి జెందుచున్నది. జటాజూటముల నలరారుగోమతేశ్వరుని ముఖకమల మత్యంత సుందరముగ నున్నది. నిగూఢమైన ఆధ్యాత్మికాంతరార్థమును బోధించెడిగంభీరభావపూరిత మగు చిఱునగవుసొంపు ప్రకటిం చెడి కదలియు గలదనియధరముల జెన్నారు ముఖకమల మద్భుతాశ్చర్యముల గొల్పుచున్నది.

## కృష్ణరాజసాగర్ లేక బృందావనము.

ఇది హాస్సాన్‌నుండి 65 మై. మైసూరు-అరిశికెరె లైనులో కృష్ణరాజసాగర్ రైల్వేస్టేషను గలదు. రు2-1-0చార్జీ. స్టేషను నుండి మైలుదూరములో డాము గలదు. మైసూరునుండి బస్సు మీాద 12 మై. ఉండును.

కృష్ణరాజసాగరడాము :- ఇది 130 అడుగుల ఎత్తున దాదాపు 1¾ మై. పొడవున కట్టబడినది. 44,000 మిలియన్ల ఘనపుటడుగులనీరు 50 చదరపు మైళ్ళలో నిల్వచేయుదురు. ఈ డాము 1911లో ప్రారంభింపబడి 1931లో పూర్తియైనది. దీని నిర్మాణమునకు 2½కోట్లు ఖర్చుఅయినది. 10 వేలమంది కూలీలు పనిచేసిరి. ఈ డామునిర్మాణమువలన శివసముద్రము నొద్ద

విద్యుచ్ఛక్తి తయారగును. ఇచ్చటినుండి గొట్టములద్వారా 60 మై. దూరము నీరు తీసికొనివెళ్లిరి. కాలువలద్వారా వ్యవసాయాభివృద్ధి జరిగినది దీనికాలువలలో నొకటి యగు విశ్వేశ్వరయ్యర్ కాలువ 26-27వ మైలులో 9 200 అడుగులు కొండ గుట్ట తొలువబడినది. దీనికి రు45 62,000 ఖర్చయినది. సొరంగముగుండ పోవుకాలువలలో ఇండియాలో నిదియే పెద్దది.

బృందావనము:- డామునకు దిగువభాగమున నీటిధారలలో రంగురంగుల విద్యుద్దీపములతో సొగసుగ నేర్పాటుచేసిరి. ఇది చూచువారికి ఆనందము, ఆశ్చర్యము కలిగించును. మనము దక్షిణయాత్రిలో నిట్టి దెచ్చటను చూచియుండము. యాత్రికుల కీమనోహరదృశ్య మెన్నటికిని మఱపునకు రాదు. దీనిని ప్రేక్షకులు An artificial fairy land మానవనిర్మిత రమ్యాతిరమ్యభూమి అనియు, Heaven on earth భూలోకవైకుంఠ మనియు, If there is any paradise on earth,

బృందావన గార్డెన్సు — కృష్ణరాజసాగర్



it is this భూమిపై స్వర్గ మన నిదే యనియు పలువురు నుడివిరి. పటములలో చూడనగును. నీటి ధారలు, వానినుండి విద్యుద్దీపములు రంగురంగులుగ ప్రవేశించుట మనోరంజకముగ నుండును. ఈ విద్యుద్దీపములు ప్రతిశని ఆదివారములందును, దసరా, క్రిస్మసు, రాజుగారి జన్మదినములందును మాత్రమే ప్రకాశింపజేయుదురు ప్రత్యేకముగ విద్యుద్దీపములు వెలిగించవలెనన్న రూ.50-0-0లు చెల్లించిన వెలిగించబడును.

వసతులు:- డాముకు దిగువభాగమున నీనీటియూటల దృశ్యము కనుపించులాగున కృష్ణరాజసాగర్ హోటలును నిర్మించిరి ఈ విశ్రాంతిభవనము చాలనందముగ నుండును. ఇది నవీనపద్ధతులతో సర్వసౌకర్యములతో నేర్పాటుచేసిరి.



బృందావనగార్డెన్సు – వసతిగృహము

స్నానసరస్సు : ఇదియు మనోహరముగ నుండును. దీని యందు చిన్నస్టీములాంచి నేర్పాటుచేసిరి. కొద్దిటిక్కెట్టు గలదు.

## మైసూరు

ఇది యీపేరుగల సంస్థానమునకు ముఖ్యపట్టణము. ఇది సముద్రమట్టమునకు 2,500 అడుగుల ఎత్తున నున్నది. మహిషాసురుడను (దున్నతలగలరాక్షసుడు) రాక్షసునిపురము కాలక్రమమున మైసూరనునామమును వహించినది. ఈరాక్షసుని సంహరించుటకై శ్రీదుర్గాదేవి లేక మహిషాసురమర్దని లేక చాముండేశ్వరి అవతారమున అవతరించి, ఆ రాక్షసుని సంహరించెనట. ఈ చాముండేశ్వరిఆలయము నేటిమైసూరు ప్రభువుల కులదైవముగ వెలసి మహావైభవోపేతముగ ప్రకాశించుచున్నది. ఈ కొండ సముద్రమట్టమునకు 3,489 అ. ఎత్తున గలదు. అమ్మవారి యాలయము కొండమీద గలదు మోటారు వెళ్లు మార్గము గలదు. నడచి వెళ్ళవచ్చును. మంగళ, శుక్రవారములందుమాత్రమ మ్మవారిని మహావైభవముగ అలంకరింతురు. దేవీనవరాత్రములందు మాత్రము (దసరా) మైసూరులో జరుగు వైభవము

చాముండేశ్వర్యాలయము – మైసూరు



హిందూదేశమున మరెచ్చటను జరుగదని చెప్పవచ్చును. కొండపైకి వెళ్ళుమెట్లు 17వ శతాబ్దమున దొడ్డదేవరాజావారిచే నిర్మింపబడినవిగా చెప్పెదరు.

దర్బారుకు వెళ్లువారు నల్లకోటు, లేసుతో అల్లిన కండువా, తలపాగ ధరించవలె. ఈ దుస్తు లచ్చట దర్జీవారికడ అద్దెకు దొరకును. దర్బారు చూచుట కనుమతిపత్రాలను పొందవలెను.

ఇచ్చటి నందీశ్వరుడు 16 అ. ఎత్తున ఒకేశిలలో అన్ని యవయవములు, గంటలు మొదలగునవి అద్భుతశిల్పచాతుర్యమును చూపుచు తంజావూరు, చిదంబరములలోనినందీశ్వరుల మించెనా యనునట్లుండి దాదాపు 3 వంతులమెట్లెక్కినప్పటికి కంటికి గాన్పించి చూపరులమనస్సు నాకర్షించును. ఇది300సం॥ క్రింద తయారుకాబడినదట. మైసూరుపట్టణమున విద్యుచ్ఛక్తి మిగులచౌక. అందుచేతనే మైసూరుపట్టణ మంతయు దేదీప్యమానముగ ప్రకాశించును. మరియు చక్కనితారు, సిమ్మెంటు రోడ్లచేతను, సుందరానేకచిత్రభవనములచేతను, ప్రకృతిశోభ కేంద్రీకరించినట్లు తోచునుద్యానవనములచేతను హిందూదేశమున మైసూరును మించినపట్టణము మరియొకటి కలదా యని ప్రతియాత్రికునిహృదయము నాకర్షింపకమానదు.

చూడదగినవి : (1)చాముండేశ్వర్యాలయము : 1827లో ఒడెయార్ మహారాజావారీదేవాలయమును పునర్నిర్మాణము చేసియు, సింహవాహనాదులు చేయించియు, సంస్కృతభాషయందు 30 శ్లోకములు చెక్కినబంగారుమాల అనగా నక్షత్రమాల సమర్పించిరి. ఈమహారాజావారియొక్కయు, రాణీగారి

యొక్క-యు, విగ్రహములు దేవాలయసమీపమున నెలకొల్పబడియున్నవి.

డామునుండి మైసూరు రైలుమీద 9 మైళ్లు. 0-5-0 చార్జీ. ఇది మైసూరుసంస్థానమునకు ముఖ్యపట్టణము. ఇప్పుడు రాజప్రముఖ పరిపాలనక్రింద నున్నది. ఇది 1,51,000 జనసంఖ్య గల్గినపట్టణము. ఇచ్చట కన్నడభాష హెచ్చుగ మాట్లాడుదురు. తెలుగుకూడ చాలమందికి తెలియును. ఈరాజ్యము 72,730 చ. మై. సం॥ ఆదాయము రు11 కోట్లు.

వసతులు:- అన్నివసతులు గలవు. టాక్సీలు గలవు. మైలుకు 0-12-0 చార్జి. గంటకు (ఆగుతు) 1-14-0 ఇద్దరు కూర్చుండుటాంగాలుగూడ గలవు. ఇచ్చటినుండి కెన్ననూరు, కాలికట్, ఉదకమండలము, మంగుళూరుకు బస్సులు గలవు.

పట్టణములో చూడదగినవి:- ప్యాలెస్ (రాజభవనము.) ఇది 245అ. పొడవు 156అ. వెడల్పు 145అ.ఎత్తున అందముగ నిర్మింపబడినది. ఇందు హిందూశిల్పము దంతము, కొయ్య,

మైసూరుమహారాజభవనము



చిత్రలేఖనము లద్భుతముగ చూపబడినవి. తలుపులమీది బంగారము, వెండి, దంతపుపనితన మతిశరదృష్టము (ఈతలుపు లింగ్లండు ఎగ్జిబిషనుకు, పంపబడినవి) ప్రయివేటుహాలు లిత్తడి స్తంభములతో, మనుజునియెత్తున దేవతల యొక్కయు, రాజులయొక్కయు చిత్రములు గల్గియున్నది. రాజాగారిబహుమతుల గదిలో ననేక చిత్రవిచిత్రవస్తువులు వెండి,బంగారము, దంతములలో చేయబడినవి గలవు. రాజా వారికి బహూకరింపబడిన వస్తువులన్నియు అందముగ సం దమర్చబడియున్నవి. హైదరాలీ టిప్పుసుల్తాన్ ప్రభృతులు వాడినకత్తులు, బాకులు, తుపాకులు ఫిరంగుల నొకగదియందేర్పరచిరి. రాజులు వేటాడిన పెద్ద పులులు వగైరాలు చర్మములుగల్గి సజీవముగా నున్నట్లుండును. వెండిబంగారు సింహాసనములు పెక్కురకములైన యద్దములు (ఒకదానిలో చూచిన మనముపొడుగాటివారముగను, రెండవ దానిలో పొట్టివారముగను కనుపింతుము) దర్బారుహాలు పైడోము బంగారపు రేకులతో నిర్మింపబడియున్నది. అచ్చము బంగారముతో చేయబడిన 'హౌడా' (ఏనుగుపై నలంకరించునది) గలదు. ఈభవనమంతయు విద్యుద్దీపములతో అమర్చబడి యున్నది. ఇందు ప్రవేశించుటకుముందు ప్యాసు పొందవలెను.

లలితామహల్ :- దీనిని జూచుటకు గవర్నమెంటుహౌస్ నుండి అనుమతిపొందవలెను. ఇది గొప్ప అందమైనభవనము. గొప్పగొప్ప రాజవంశీయులు, మాననీయులు వచ్చినప్పుడు మకాముచేయుటకు నుపయోగించెదరు. ఈక్రిందివన్నియు ఉ॥ 8 నుండి 11-30, సా॥ 2-30 నుండి 5-0వరకు ఉచితముగ చూడ



లలితామహల్

నగును. ఆర్టుగ్యాలరీ (ఇది జగన్ మోహన్ ప్యాలెస్‌లో గలదు.) ఇందు చిత్రకళకు సంబంధించినచిత్రములు, సంగీతవాద్యములు, మొదలైనవాని కళారాధనశాలగలను. రాజభవనము తయారగు కాలములో మహారాజులిందులో నివసించిరి.

---

జగన్మోహన్ ప్యాలెస్



రాజేంద్రజూలాజికల్ గార్డెన్సు:— ఇందు ఫొటోలు తీసికొనుటకు సామాన్యకెమెరాకు రూపాయి, సినిమాకెమెరాకు రూ4/-లు చార్జీచేయుదురు. ఇందు స్వేచ్ఛగా విహరించు జీవజ్జంతువుల నెన్నింటినో ఒకచోట చేర్చిరి. యాత్రికులు తప్పక యీ జీవజంతువులనుదర్శింప దగును.

ప్యాలెస్‌గారేజి:- ఇం దనేకజాతుల గుఱ్ఱములు, వానినుపయోగించుజీనులు, పవిత్రమైనస్టేటు గుఱ్ఱము (దీని నెవరు నెప్పుడు నెక్కలేదు) మొదలైనవి విచిత్రముగ నుండును.

శ్రీచామరాజేంద్ర టెక్‌నికల్ ఇన్‌స్టిట్యూట్:-ప్రపంచములో నెల్ల పెద్దదగు శాండల్‌వుడ్ ఆయిల్‌ఫ్యాక్టరీ, హిందూదేశములో నెల్ల పెద్దదగు గవర్నమెంటుసిల్కునేతఫ్యాక్టరీ మొదలగునవి చూడనగును.

శ్రీరామకృష్ణమఠము:-ఒంటికుప్పెలలో గలదు. స్టేషను నుండి దాదాపు మైలుదూరము. బస్సు గలదు.

మైసూరు 2దినములలో చూచువిధము:-

ఈరెండుదినములు శని, ఆదిగాని; శుక్ర, శనిగాని, యైయుండవలెను.

మొదటిదినము:- మైసూరు ఉ. 6 గం. లకు చేరవలెను.

చూడవలసినస్థలములు.

శాండల్‌వుడ్ ఆయిల్ ఫాక్టరీ,
సిల్కుఫాక్టరీ,
ఆర్టుగేలరీ, } ఉ. 9గం. 12గం. వరకు.

ప్యాలెసు అశ్వశాలలు
,, శకటశాల,
జూ (జీవజంతువులశాల) } సా॥ 3గం. నుండి సా॥ 6గం. వరకు

చాముండేశ్వరికొండపైకి సా॥ 6గంటల నుండి రా॥ 8గంటల వరకు

రెండవ దినము:- శ్రీరంగపట్టణము వెళ్ళి తిరిగిరావలెను.

టాక్సీలోనయిన ఉ. 9 నుండి 12 వరకు.
రైలుమీద 7-5 నుండి 11-30 ,,
టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్
ఎగ్జిబిషను } సా॥ 3గం. నుండి 5గం వరకు.
కృష్ణరాజసాగర్ (డామ్) టాక్సీఅయిన సా6-0నుండి 9-0.
రైలుమీద సా॥ 5-55 నుండి 9-55వ.

విద్యుద్దీపము లెల్ల శని, ఆదివారములలో వెలిగింతురు.

నంజనుగూడు

ఇది మైసూరునుండి 12 మై. దూరమున కాబినినదీ తీరమున గలదు. ఇది తాలూకాముఖ్యపట్టణము. ఇది శివ క్షేత్రము. మైసూరులోనిశివక్షేత్రములలో నిది యొకటి. నంజుండేశ్వరు డనుస్వామి దేవాలయము గలదు రైలుమార్గము 16 మై. ఆస్వామి పేరుమీదనే యీపట్టణమునకు నంజనుగూడను పేరు కలిగిగెను. ఈ దేవాలయమంటపములలో మైసూరుమహా రాజుల, రాణీలవిగ్రహములు స్థాపించబడియున్నవి. ఇందు దాదాపు 63 శివభక్తులయొక్కయు, దక్షిణదేశమహనీయుల యొక్కయు విగ్రహములు గలవు. దేవాలయమున పార్వతి అమ్మవారు, సుబ్రహ్మణ్యస్వామి లేక దండాయుధపాణి మూర్తులు గలవు. మార్చి ఏప్రిల్ నెలలలో నేటేట 3దినములు

గొప్పరథోత్సవము జరుగును. ఆయుత్సవమునకు వేలమంది యాత్రికులు వచ్చెదరు. సమీపమున పరశురామ దేవాలయము మాధ్వుల శ్రీరాఘవేంద్రస్వామిమఠము, (ఇది 15వశతాబ్దము నుండి నేటివరకు) గలదు. పెద్దపట్టణమగుటచే అన్నివసతులు గలవు.

## తలకాడు

ఇది కావేరీతీరమున మైసూరునుండి 28మై. దూరమున గలదు. ఇది ఒకప్పుడు రాజధానిగా నున్నదిగాని యీనాడొక మైలుపొడవున దాదాపు 20 లేక 30 పురాతనశిథిలముల ఇసుక దిబ్బలచే కప్పబడియున్నది. ఈయిసుకదిబ్బలక్రింద ముప్పది దేవాలయములకన్న నెక్కువ గలవు. ఇది మొదట గంగవంశపు రాజులతరువాత చోళరాజులముఖ్యపట్టణముగ నుండెను. తరువాత హొసలరాజులచేతను వారితరువాత విజయనగరరాజుల చేతను తరువాత 1634 లో మైసూరురాజులచేత నాక్రమించబడెను. వైద్యేశ్వర, పాతాళేశ్వర మరాళేశ్వరప్రభృతి దేవాలయములు గలవు. వీనిలోనికి ప్రవేశించుటకు వీలగునట్లు మాత్రమిసుక తీయబడినది.

14 సం॥ల కొకపర్యాయము 'పంచలింగదర్శన' మనెడి యుత్సవము జరుగును. ఆయుత్సవమునకు భారతదేశమునన్ని మూలలనుండి దాదాపు లక్షయాత్రికులు వచ్చెదరు.

కీర్తినారాయణాలయ మిసుకతో పూడిపోయినది. గోపురము మాత్రము కనుపించును. అచ్చటిశాసనమునుబట్టి హొసల విష్ణువర్ధనుడు క్రీ. శ. 1117లో తలకాడు ఆదియమన్ అను

వైసాగ్రియుని జయించినట్లును, తజ్జయసూచకముగ నీకీర్తినారాయణ దేవాలయమును నిర్మించినట్లును గలదు.

నైద్యేశ్వర దేవాలయముపై తల, కాడు అను నిద్దరు సోదరుల విగ్రహములు గలవు. వారిద్దరిపేర్లనుండి దీని కీపేరు వచ్చెను.

ఈప్రదేశ మిసుకతో పూడిపోవుటకుకూడ నొకగాథ గలదు.

## సోమనాథపురము

ఇది మైసూరునుండి 33 మైళ్ళ దూరములో నున్నది. రోడ్డుమార్గము.బస్సుగలదు ఇది చెన్న కేశవస్వామ్యాలయము నకు ప్రసిద్ధి. ఈ దేవాలయము 1268లో హోసల రాజులలో 3వ నృసింహుని పెద్ద ఉద్యోగి యైన సోము డనువానిచే నిర్మింపబడెను. అందుచేత సోమనాథపురమయ్యెనట. ఇచ్చటి శిల్పము

సోమనాథపుర దేవాలయము



మైసూరుశిల్పమునకు గీటురాయి యనిచెప్పవచ్చును. ఈదేవాలయమున త్రిమూర్తుల ఆలయమువలెనుండి మధ్య శ్రీచెన్నకేశవస్వామి, ఒకవైపు వేణుగోపాలుడు, రెండవప్రక్క జనార్ధనుడు గలరు. విగ్రహములు దేవాలయమునందు పనితనము గుడ్డమీద లేసుతో అల్లినట్లు తీగలు, లతలు, భారత, భాగవత, రామాయణాదిచరిత్రలు గోడలపై చాలసున్నితమైనశిల్పమున జూపిరి. బయట గోడలపైన శిల్పనైపుణ్యమును నెదజల్లు 194 పెద్దవిగ్రహములు గలవు. ఇవి అన్ని 13వ శతాబ్దమున నిర్మించినట్లు శాసనమువలన తెలియుచున్నది.

Mr. Lewise Rice Says "This elaborately carved structure is attributed to Jakanachari, the famous sculptor and architect of the Hosala Kings, under whom Hindu art in Mysore reached its culmination. Though not on the scale of the unfinished temple at Halebid, the general effect is more pleasing, from the completion of the superstructure, consisting of three pyramidal towers or Vimana surmounting the triple shrine."

లూయిస్ రైస్‌గారు (Mr. Lewis Rice) ఇటు లనుచున్నారు. "మిగుల శ్రమపడి చెక్కినయీ నిర్మాణము హోసల రాజులకాలమునాటి సుప్రసిద్ధ శిల్పాచార్యులయిన జక్కనాచార్యుని చేతిపనివిశేష మనెదరు. హోసలరాజులకాలముననే మైసూరు సంస్థానమున హైందవశిల్పకళ ఆకసము నందుకొనినది. హాలేబీడునందలి దేవాలయ మసంపూర్ణస్థితియందున్నను, బహుభుజగోపురాకారముగల మూడు శిఖరముల విరాజిల్లు దేవాలయముమీది కట్టడపుస్థూలాకార మేయెంతయో తృప్తిని గలిగించుచున్నది."

## శ్రీరంగపట్టణము

ఇది సోమనాథపురమునుండి 20 మై. దూరమున నున్నది. బస్సులు గలవు. మైసూరునుండి 10 మై. గలదు. రైలు, బస్సులు గలవు కావేరీనది రెండుగా చీలి శ్రీరంగపట్టణముదాటిన తరువాత 3 మైళ్ళలో రెండును కలిసి ఒకేనదిగ ప్రవహించును. ఈ నది రెండుగ చీలుటచే నేర్పడినద్వీపమే శ్రీరంగపట్టణము. అనగా నీపట్టణముచుట్టును కావేరి ప్రవహించుచున్నది. అనాది కాలములో నీ ద్వీపమున గౌతమర్షి తపస్సుచేసినట్లు చెప్పుదురు. క్రీ. శ. 894 లో తిరుమలరాయుడు రంగనాథునికి ఆలయము నిర్మించి రంగపురము లేక రంగపట్టణము అని పేరు పెట్టెను. అసలు శ్రీరంగపట్టణము క్రీ. శ. 1120 లో విష్ణువర్ధనుని సోదరుడు ఉదయాదిత్యుడు కట్టించెను 1495 లో శ్రీరంగపట్టణము విజయనగర రాజుల చేజిక్కినైసాయిలపాలన క్రింద నుండెను. 1610 లో తిరుమలార్యునినుండి

టిప్పుసుల్తాన్ సమ్మర్ ప్యాలెస్—శ్రీరంగపట్టణము



మైసూరురాజు ఓడియార్ కు వశమయ్యెను ఇదియే హైదరాలీ, టిప్పుసుల్తానులపాలనలో నుండగ 1799 లో బ్రిటీషువారిహస్త గత మయ్యెను. ఇది శ్రీరంగపట్టణ క్లుప్తచరిత్రము.

చూడదగినవి:- టిప్పుసుల్తాన్ సమ్మర్ ప్యాలెస్:- ఇందు చిత్రకళ అందముగ చిత్రించబడినది తూర్పువైపున గుమ్మాజ్ అనదగు టిప్పు తండ్రి, తల్లి సమాధులు గలవు. దానిపై నొకపెద్దకట్టడ మున్నది. దానికి రెండువైపుల చాల నెత్తైన టాజ మహాల్ కువలెనె గోపురము లున్నవి.

రంగనాథ దేవాలయము : అనేకశతాబ్దములకుపూర్వము కట్టబడినది. ఇది ద్రవిడశిల్పమును బోలియున్నది. మహ్మదీయుల కాలములో గూడ దీనిని జక్కగ పోషించిరి. హైదరాలీ, టిప్పు మహ్మదీయులైనను రంగనాథుని వారు దైవముగ భావించి జాగీర్లుగూడ నిచ్చినట్లు చెప్పుదురు. జనవరి నెలలోను, రథ సప్తమికిని గొప్పయుత్సవము జరుగును. వేనకు వేలు యాత్రికులు వచ్చెదరు.

శ్రీవిశిష్టాద్వైతమతాచార్యులగు శ్రీ రామానుజాచార్యులవారీశ్రీరంగపట్టణమునకు వచ్చి కొంతకాల ముండుటచే దీనికి వైభవము కలిగి భక్తు లనేకులు వచ్చుట కలిగెను.

కోటలో నున్న మసీదుగోపురము పైకెక్కిన మైళ్ళ కొలది దూరమును మైసూరుపట్టణము, శ్రీరంగపట్టణపు కోట గోడలు, కావేరి కనుపించును. ఇందు 5 శాసనములు పర్షియా భాషలో నున్నవి. వానినిబట్టి యీమసీదు 1787 కట్టినట్లు తెలియుచున్నది. రంగనాథాలయమునకు 150 గజముల దూర

ములో టిప్పూరాజభవనము శిథిలమై యున్నది. (Water gate) టిప్పూ యుద్ధమునం దెచ్చట చనిపోయెనో అతనిశవ మెచ్చట కనిపించెనో అచ్చట నొకశాసనము గలదు. దేవాలయమునకు సమీపములో టిప్పూ ఇంగ్లీషుఆఫీసర్లను బంధించిన చీకటి కొట్టు (Dungeon) గలదు. దేవాలయమునకు ముందువైపు 100 గజములలో నొక యిటుకతో గట్టబడిన (ఊగులాడు వంతెన)ఆర్చి ఉండెడిది. (De Haviland Arch)దానిపై నెక్కి ఊగిన 2 లేక 3 అంగుళములు కదలిక కలిగెడిదని చెప్పెదరు. అది 1936లో పడిపోయెను. 1 మై. దూరములో స్కాటిష్ బంగళాలో చిత్రములు మ్యూజియంక్రింద నుంచిరి.

రైల్వేస్టేషనుకు వెనుక కోటగోడలకు బ్రిటీషు ఆఫీసర్లు ఫిరంగులతో ముట్టడించి కోటలోనికి ప్రవేశించినది చూడనగును.

## మేలుకోట లేక తిరునారాయణపురము

శ్రీరంగపట్టణము స్టేషనుకు ప్రక్కస్టేషనగు ఫ్రెంచి రాక్సుస్టేషనులో దిగి అచ్చటినుండి బస్సుమీద 18మై. పోయిన మేలుకోట చేరుదుము. మేలుకోట అనగా కొండమీద నెత్తున నున్నకోట యనిఅర్థము. యదుగిరి యనుకొండమీద కట్టబడిన కోట. క్రింద కావేరి, మోతీతలావు(ముత్యములసరస్సు)గలవు. ఇది గొప్పక్షేత్రము. వైష్ణవుల పురాణస్థలములలో నిది ఒకటి.

వసతులు :- బండ్లు, బస్సులు, భోజనశాలలు అన్ని వస్తువులు దొరకును. ఇచ్చట గుడ్డలనేత విశేషముగ జరుగును.

చరిత్ర :- ఇచ్చట ముఖ్యముగ నృసింహనారాయణ స్వామ్యాలయములు గలవు నృసింహస్వామ్యాలయము యదుగిరిమీద గలదు.

వైష్ణవమతోద్ధారకులగు శ్రీరామానుజాచార్యులవారు మతవ్యతిరేకులచే తప్పించుకొని మేలుకోట చేరి 14 సం॥ లు నివసించిరి. ఇచ్చట హోసలరాజును వైష్ణవమతమునకు మార్చెను. ఆయనయే విష్ణువర్ధనుడు. ఆరాజు వైష్ణవమత మవలంబించుటకు ముఖ్యకారణము రామానుజుల గొప్ప తనము. ఆయనసిద్ధాంతము, ప్రపత్తిమార్గము, ఆయనవిశాల దృష్టి మొదలగునవియే. ఇచ్చట ముఖ్యమైనది శ్రీకృష్ణదేవా లయము దీనినే 'చల్లపిళ్ళె'రాయదేవాలయ మనియు నందురు.

ఉత్సవవిగ్రహము :- శ్రీరామానుజులకు స్వప్నమున గన్పించి, సపరివారముగ తాను మైసూరు సుల్తానునొద్ద నున్నట్లు చెప్ప రామానుజుడు వెళ్ళి అభ్యర్థింప సుల్తా నావిగ్ర హముల జూపెనుగాని సుల్తానుకూతురు సుందరమోహన కృష్ణవిగ్రహమును అలంకరించి యొకసింహాసనమున నుం చెను. రామానుజు డావిగ్రహమునుగూడ నిమ్మని కోరెను. గాని సుల్తా నిచ్చగించలేదు. రామానుజుడు ధ్యానమున గూర్చుండి తనయోగశక్తిచే అందరు వినుచు చూచుచుండగనే 'కృష్ణా రమ్ము'అని పిలువ నావిగ్రహము నృత్యముచేయుచు, నడచివచ్చి శ్రీరామానుజులయొడిలో నిలచెను. సుల్తాను, సభికులు ఆశ్చర్యచకితు లైరి. సుల్తాను ప్రేమపూర్వకముగ

ఆ విగ్రహమును రామానుజున కిచ్చెను ఆవిగ్రహమును మేల్కోటకు దెచ్చిరి. అచ్చట ఉత్సవవిగ్రహముగ నేటికిని సేవింపబడుచున్నది.

సుల్తానుకూతు రావిగ్రహ వియోగమును భరించలేక కృష్ణభక్తిపరతతో ఆమె మేల్కోట కేగి అచ్చటనే స్వామిని సేవించుచు స్వామియందు లీనమాయెను. ఆమెపేర నొక ఆలయము నిర్మింపబడెను. అది నేటికిని గలదు.

ఈ ఆలయమును రామానుజుడు సంవత్సరములో 3 దినములు హరిజనుల దర్శనార్థమై స్వేచ్ఛగా విడిచిరి. బ్రహ్మోత్సవములో చివర 3 దినములు హరిజను లానంద ముతో, భక్తిపరతత్వముతో నృత్యగీతాదులతో స్వామిని నేటికిని సేవించుచుందురు.

పూర్వమహారాజులు సమర్పించిన బంగారు, వెండి వస్తువులు నేటికిని స్వామిసేవలో నుపయోగించబడుచున్నవి. వైరముడిసేవోత్సవము [మార్చి-ఏప్రిల్] పంగునిమాసమున పుష్యమీనక్షత్రదినమున చాలవైభవముగ జరుగును దీనికి దాదాపు 10,000 యాత్రికులకు పైగా వత్తురు.

దేవాలయ మనేకామూల్యాభరణములను కలిగియున్నది. అందు 'వైరముడి'అనుమణులతో చేయబడినది మిక్కిలి విలువ గలది. దానిని మైసూరుమహారాజావారిభవనమున నుంచె దరు. దాని నుత్సవసమయమున తెచ్చి స్వామి కలంకరించి యారాత్రి మాత్రమే అచ్చట నుంచెదరు.

శ్రీరామానుజాచార్యులవారికి స్వప్నములో స్వామి ప్రత్యక్షమై ఆప్రాంతములోఅడవియందు వైష్ణవులచేనుపయోగింపబడు 'నాము' గని కలదనియు, అచ్చటనే యొకస్వామి విగ్రహము గలదనియు తెలుప అట్లె, రాజసాహాయ్యమున ఆరెంటిని కనుగొని స్వామి కాలయము నిర్మించిరి. ఆ 'నాము నుద్ద' గని నేటికి నన్నివైపులకు నాము రవాణాచేయుటకు ప్రధానమైనది. ద్వారకలో గోపీతలావులో గోపీచందనమువలె దక్షిణదేశమున నీపవిత్రమైన 'నాము'ను వైష్ణవు లందరు నొసట ధరించి ఆసంప్రదాయచిహ్నమును గుర్తింపజేయుదురు. ఇచ్చట కల్యాణపుష్కరిణి, నారాయణ, పరాశర, పద్మ వగైరా 13 పుష్కరిణులు దర్శనీయములు.

## మండియా

మేలుకోటనుండి క్రెంచిరాక్సుస్టేషనుకు చేరి ప్రయాణము ముందుకు సాగించిన మండియా (Mandya) స్టేషను వచ్చును. ఇది జిల్లాకు ముఖ్యపట్టణము. ఇచ్చట ఇండియాలోని పెద్ద పంచదారఫ్యాక్టరీలలో రెండవదిగా గుర్తింపబడినది యిట గలదు. రైలుమార్గమున కిరుప్రక్కల చెరుకుతోటలు కనుపించును. విద్యుద్దీపములతో నందముగ నుండును. సం॥ కు 30 వేల టన్నుల పంచదార తయారగును.

ఇచ్చటికి సమీపమున హులికెరే (HULIKERE) అనుచోట 9,200 అడుగులపొడవున కొండగుట్టను తొలచి అందుండి విశ్వేశ్వరయ్యార్ కాలువను ప్రవహింపజేసిరి. దీనికి 45,62,000 ఖర్చు చేసిరి. ఇంజనీరింగు నేర్పు దీనియందు కానవగును.

## శివసముద్రము

మండియానుండి మద్రాసు రైల్వేస్టేషనులో దిగవలెను అచ్చటినుండి 27 మై. దూరములో శివసముద్రము చేరవచ్చును. బస్సు గలదు మద్రాసు మైసూరు - బెంగుళూరు లైనుమీద గలదు. ఈవిద్యుచ్ఛక్తి కేంద్రమునుండి 34,500 కిలోవాట్లశక్తి తయారగును.

Mr. S. G Forbes says:

"It did not take the Mysore government very long after these investigations and developments to appreciate the value of hydro-electric power and to start an investigation of her resources. The survey of the hydro-power resources of the Mysore state actually began in 1898, about ten years after the invention of the incandescent lamp and the development of an economical motor"

పోర్బ్సుగారు (Mr. S. G. Forbes) ఇటు లనుచున్నారు:—

"జలవిద్యుచ్ఛక్తి అభివృద్ధికి నల్పు పరిశోధనలయనంతరము, జలవిద్యుచ్ఛక్తి సదుపయోగముల విలువను గుర్తించి విద్యుచ్ఛక్తిసాధనాధారములకై పరిశోధనల కుపక్రమించుటకు మైసూరుప్రభుత్వమున కెంతో కాలము పట్టలేదు. మైసూరు సంస్థానమున జలవిద్యుచ్ఛక్తి సాధనాధారములను అంచనా వేయుటకు విచారణ 1898 సంవత్సరమున ప్రారంభమయ్యెను. 1898వ సంవత్సరమునకు సరిగా పదివత్సరములక్రితమే జ్వాలించెడుదీపము పొదుపున కుపయుక్తమగు మోటారుయంత్రముల వంటి సాధనములు కనుగొనబడెను."

జలపాతము:– ఇచ్చట కావేరి రెండుగ చీలి దాదాపు 200అడుగుల యెత్తునుండి క్రిందకుపడును. ఉత్తరప్రవాహమును గంగచుక్కి అనియు, దక్షిణప్రవాహమును బారచుక్కి అనియు నందురు. ఈపాయలమధ్య నేర్పడుపట్టణమే శివసముద్రము. ఇది 16వ శతాబ్దమున గంగరాజుచే నిర్మింపబడినది. ఈప్రాంత మంతయు ప్రకృతిసౌందర్యముతో నలరారుచుండును. గంగచుక్కికి వెళ్లుమార్గమున పీర్‌సాహెబ్ అనుమహ్మదీయఫకీరు దర్గా గలదు. ఈజలపాతములనుండి హైడ్రోఎలక్ట్రికల్‌పవర్ స్టేషను నడుపుచున్నారు.

శివసముద్రమునకు కొన్ని మైళ్ళదూరములో 'సింహా' అనుచోట 1937 లో నొకవిద్యుచ్ఛక్తి కేంద్రము నేర్పాటు గావించి మైసూరురాజ్యములో దాదాపు 900 మై. వరకు షుమారు 220 పట్టణములకు విద్యుచ్ఛక్తిని ప్రసరింపజేయు చున్నారు.

## బెంగుళూరు

ఈ పట్టణమునకు మొదటికెంపెగౌడరాజు యొక్క ప్రధానామాత్యుడు యెలాంక 1537 లో మట్టికోటగోడను నిర్మించెను అప్పటికే పట్టణమంతవరకు పెరుగునని యూహించి పట్టణమునాల్గువైపుల రక్షకవుబురుజులను కట్టించెను. అదే ప్రకారము నేటిపట్టణ మాహద్దుల ననుసరించి పెరిగెను. కోటలో ఉత్తరమున వినాయకదేవాలయము, ఆంజనేయాలయము బస్‌వన్‌గుడిలో నందిదేవాలయము, గవిపురములో నితర దేవాలయములు నిర్మించెను. కోటగోడ లట్లే యుండగా హైదరాలి తనపరిపాలనలో రాతిగోడలను కట్టించెను.

బెంగుళూరు పెద్దరైల్వేకూడలి, విద్యుద్దీపములతోను, చక్కనితారు, సిమెంటురోడ్లతోను, సుందరనవీనభవనముల తోను, ఉద్యానవనములతోను, రమణీయమైనతోటలతోను కన్నులపండుగుగా నుండును. దీనిజనాభా 8 లక్షలు. ఇది సముద్రమట్టమునకు 3,000 అ. యెత్తున నున్నది. ఇం దన్ని దేశస్థులు నివసించుచుందురు. ఇది 25 చ. మైళ్ళవిస్తీర్ణమైన నగరము. ఇది మైసూరుగవర్న మెంటుకార్యస్థానము. బ్రిటీషు వారు శ్రీరంగపట్టణము ఖాళీచేసివచ్చినతరువాత నీకోటలో కొంతకాల ముండిరి. ఈకోటలో టిప్పుసుల్తాను శ్రీరంగపట్ట ణములోని దరియాదౌలతాభవనమునుబోలు రాజభవనమును కట్టించెను. ఇందు గొప్పశిల్పము చూపబడినది. దీనిని నేటి కిని జాగ్రత్తగ కాపాడుచున్నారు.



పురపాలకసంఘభవనము—బెంగుళూరు

గవిపురములోనిగుహలో. గంగాధరేశ్వరాలయము గలదు. దానిసమీపమున 12అ. పొడవున ఒకేరాతిలో చెక్కబడిన గొడుగులు, డమరము గలవు.

పట్టణములో చూడదగినవి :- 1 మహారాజాప్యాలెస్. ఇది కంటోన్మెంటుస్టేషనుకు పడమట గలదు. 2. పబ్లిక్ ఆఫీసులు. 3. కబ్బన్‌పార్కు (ఇందే పై పబ్లిక్ ఆఫీసులు గలవు.) 4. గవర్నమెంటు మ్యూజియము. 5. శేషాద్రిమెమోరియల్ హాలు. 6. లాల్‌బాగ్ :- ఇది హైదరాలికాలములో వేయబడి టిప్పుసుల్తానుచే వృద్ధిచేయబడినది. ఇందు, పెక్కురకములైన ఫల, పుష్పజాతులు మిక్కిలి అందముగ, నమర్చి, శ్రద్ధగ పెంచబడుచుండును. లోనికి కార్లుసహితము వెళ్ళవచ్చును. 7. రేస్‌కోర్సు (Race course) ఇది 2మై. చుట్టుకొలత గలిగి యిండియాలోనికెల్ల గొప్పదని ప్రసిద్ధిగాంచెను. 8 గ్రంథా

లాల్‌బాగ్ - బెంగుళూరు



లయము (Public Library) 9. The Indian Institute of Science:- పదార్థవిజ్ఞానశాస్త్రపరిశోధన కేంద్రము ఇది జె. యన్. తాతా (బొంబాయి) గారి 30 లక్షల విరాళముతో స్థాపింపబడినది. 10. సోపుఫ్యాక్టరీలు, నూలుమిల్లులు, 11. ఏడు మైళ్ళ దూరములో విమానములు చేయుఫ్యాక్టరీ (ఇండియాలో మరెచ్చటను లేదు) (Air craft factory) 12. సిటీమార్కెట్, 13. డొడ్డపోటఎవెన్యూ (ఇందు పెద్దపెద్దషాపులు గలవు) బలేపేట, చిక్ పేట, (ఇవి అన్నియు పెద్దబజారు, ముఖ్యవ్యాపార స్థానములు) 14. రసూల్ మార్కెట్. 15. టెలిఫోన్ ఫ్యాక్టరీ. 16. శ్రీరామకృష్ణమఠము. 17. శంకరమఠము. 18. అనంతస్వామిమఠము మొదలగునవి ముఖ్యముగ చూడనగును.

వసతులు:- సిటీస్టేషనుకు 200 గ. దూరములో కోట ప్పయ్యసత్రమును. కంటోన్ మెంటుస్టేషనుకు 100 గ. దూరములో నొకసత్రమును గలవు. ఇవిగాక సిటీస్టేషనునుండి మైలు

వాణీవిలాస్ ఆసుపత్రి – బెంగుళూరు



లోపున నాల్గుసత్రములును, రెండుసత్రములు కంటోన్‌మెంటు స్టేషనునుండి 3 మైళ్ళ దూరములోను గలవు. అన్నివసతులు గలవు. సిటీబస్సులు, భోజనశాలలు గలవు.

నందిగిరి (Nandi HILLS)

వేసవినివాసస్థానము. ఇది బెంగుళూరుస్టేషనునుండి ప్రత్యేకముగున్నారోగేజిలైను 41 మై. లో నందిహిల్సురైల్వే స్టేషను గలదు. రోడ్డుమార్గము 36 మై. స్టేషనునుండి కొండ అడుగుభాగమునకు 2 మై. దూరము. రిక్షాలు, బండ్లు గలవు. భోజనశాలలు గలవు. ఇది సముద్రమట్టమునకు 485 అడుగుల యెత్తున నున్నది. పైకి చక్కనిమోటారురోడ్డు గలదు. నడచి యెక్కువారికి 1775 మెట్లు గలిగినమార్గము గలదు. నడువ లేనివారిని కుర్చీలలో పైకి తీసికొని వెళ్ళుదురు. ఏప్రిల్-మే నెలలలో బెంగుళూరులో 80° నుండి 92° డిగ్రీలవేడి యున్నప్పుడు కొండపైన 63° నుండి 65° డిగ్రీలవరకుమాత్రమే వేడి ఉదయమునను 76° డిగ్రీలు మట్టమధ్యాహ్నమప్పుడు నుండును. అనగా దాదాపు నీలగిరిలోని కూనూరులోనుండు వేడిమాత్రమే కలిగియుండును. ఈపర్వతములను జూచుటకు ముఖ్యముగ ఏప్రిల్‌నుండి జూన్‌వరకు బాగుండును.

విద్యుద్దీపములు, నీటివసతితో 5 బంగళాలు గలవు. వాని వాడుకొనుటకు కొద్దిఅద్దె కట్టవలసియుండును. సం. పొడుగునను హోటళ్ళుండును. బంగళాల నుపయోగించుకొనుటకు ముందుగ హిల్‌స్టేషన్‌సూపరింటెండెంటు, లాల్‌బాగ్, బెంగుళూరువారినుండి అనుమతి పొందవలెను.

కొండపైన యోగనందీశ్వర దేవాలయమును, కొండ క్రింద భోగనందీశ్వర దేవాలయమును గలవు. ఈ రెండు దేవాలయములు చోళ, పల్లవ, హోసలప్రభువులకాలము నుండి యుండి గొప్పశిల్పముతో నిండియున్నవి. హైదరాలి, టిప్పులచే కట్టబడినకోట బురుజులువగైరా శిథిలములు గలవు.

అమృతసరోవరము, టిప్పునివాసభవనము, టిప్పుకుక్క పాదములగుర్తులు, టిప్పుజనానా మొదలగునవి ముఖ్యముగ చూడదగినవి. శివరాత్రికి గొప్పయుత్సవము జరుగును. యాత్రికులు వేలకొలది వత్తురు పశువులసంత జరుగును.

## కోలారు బంగారుగనులు

బెంగుళూరునుండి రోడ్డుమార్గముగ 60 మై. బెంగుళూరు మద్రాసురైలులో బంగారుపేట యొద్ద దిగిన అచ్చటినుండి 11మై. బ్రాంచిరైలు. ఇండియాలో వాడబడునది నూటికి95పాళ్లు మైసూరుబంగారమే. ఈగనులమేనేజిమెంటు 1885జూన్ టైలర్ అండు సన్సువారు తీసికొనిరి. మిగులలోతైనగని 9664 అ. లు. ఈగనులలో 24,000మందికూలీలు పనిచేయుచున్నారు. అందు 15,000మంది గనులలో పనిచేయుచున్నారు. వీరందరకు పైన నొకపట్టణ మేర్పడినది. ఇచ్చటికి 92 మై. దూరమున గలశివ సముద్రమునుండి విద్యుచ్ఛక్తిసహాయమున నీగనిపని జరుగు చున్నది.

గనులను జూచుటకు క్రిందిఅడ్రెస్సుగల అధికారుల నుండి అనుమతిపొందవలెను.

Superintendent of the Mines or to the Chief Inspector of Mines, OORGAUM, K. G. F.

కోలారుకు 2మై. దూరములో కొలారుబెట్ట లేక శతశృంగపర్వత మున్నది. దీనియెత్తు 4000 అడుగులు. దానికి తూర్పున 'అంతరగంగ' అనునొకఊట గలదు. ఈయూట యొకనందినోటినుండి వచ్చును. దీనిని పవిత్రముగ నెంచుదురు.

## ముళ్‌బాగల్

ఇది కోలారునుండి 18మై దీనిని తూర్పుద్వార మందురు. తిరుపతికి వెళ్ళురోడ్డులో నుండుటచేత తూర్పుద్వార మందురు తిరుపతికి వెళ్ళు యాత్రికులు మొదట క్షురకర్మ చేయించుకొని నృసింహతీర్థములో స్నానముచేయునాచారము గలదు.

ఇచ్చటనే 'హైదర్‌వలీ' అనుమహమ్మదీయఫకీరుదర్గా గలదు. ఉత్సవములకు వేలకువేలు యాత్రికులు వచ్చెదరు.

## కుడుమేలె

ముళ్‌బాగల్‌కు 4మై. దూరములో కుడుమేలె అను క్షేత్రము కొండ నానుకొనియున్నది. అచ్చట సోమేశ్వర, గణేశదేవాలయములు గలవు. ఇవన్నియు శిల్పిజనకాచార్యుడే చేసినట్లు చెప్పెదరు. దేవతలు త్రిపురాసురునిమీదికి యుద్ధము నకు వెళ్లుట కీపర్వతముపై సైన్యములతో గుమిగూడిరట. అందువలన నీక్షేత్రమునకు 'కుడుమలై' అనిపేరు కలిగెను.

## అవని

ముళ్‌బాగల్‌నుండి 8మై.దూరమున నీక్షేత్రము గలదు. దీని నవంతికతో బోల్చెదరు. శ్రీవాల్మీకిమహార్షియు, లంకనుండి

తిరిగివచ్చునప్పుడు శ్రీరాముడును కొంతకాల మిట నున్నట్లు చెప్పుదురు. సీతను వనములలో విడిచిపెట్టినప్పు డామె యిట నుండి లవకుశులను గని వారిని వాల్మీకి యాశ్రమమునకు జేర్చెను. వాల్మీకి ఋషిచే వారు పోషింపబడిరట. ఇచ్చట ననేక దేవాలయములు గలవు.

## మైసూరు రాజ్యములో ముఖ్యముగ చూడదగినవి.

### ఆగుంబె (AGUMBE)

ఇది షిమొగనుండి 53 మై. పర్వతములలో అరణ్యములలో పోవలెను. ఇది పడమటికనుమలలో నెత్తైనశిఖరము. ఇటనుండి పశ్చిమసముద్రమున సూర్యాస్తమయ సౌందర్యము చూడదగినది. సూర్యాస్తమయమైన 5 నిమిషములలో ఆకాశమునను, సముద్రమునను పలురంగులతో ననేకాకారముల కాంచుట యాత్రికుని కానందదాయకము. ఈప్రాంతమునే పరశురామక్షేత్ర మందురు.

### కైదల

తుముకూరునుండి అరగంటప్రయాణము. బస్సులు, బండ్లు గలవు. ఇది పూర్వము క్రిదపుర మను పురాతనమైసూరు సంస్థానమునకు ప్రధాననగరము. ప్రఖ్యాతివహించిన శిల్పకారుడు జనకాచార్యుడు లేక జకనాచార్యునిజన్మస్థానము. ఈతడు క్రిదపురమును నృపాచార్యు డనురాజు పరిపాలించుకాలమున నుండెను. జనకాచార్యుని శిల్పనైపుణ్యమును మెచ్చి అనేకరాజసంస్థానములవా రాహ్వానించి దేవాలయవిగ్రహాదుల నిర్మింపించి బహూకరించిరి. ఇతనికుమారు డీతనికంటెను శిల్పచతురుడని ప్రఖ్యాతి.

## చామరాజసాగర్

ఇది బెంగుళూరుకు 22మై. కుముదవతీ, అర్కవతీనదుల సంగమునొద్ద నొకడాము 70 లక్షలు వెచ్చించి నిర్మించిరి. ముఖ్యముగ నిది బెంగుళూరు నీటిసప్లయికొరకు నిర్మించబడినది.

## దేవనహళ్ళి

బెంగుళూరుకు 23మై. బళ్లారి–బెంగుళూరు రోడ్డుమీద కలదు. ఇది టిప్పుసుల్తాను జన్మస్థానమట.

## శివగంగ

ఇది బెంగుళూరు హరిహర లైనులో విడవంద 3మైళ్ళలో రైల్వేస్టేషను గలదు. అటనుండి 3మై. బస్సులో పోవలెను. బండ్లుకూడ గలవు. దేవాలయము కొండమీద నున్నది.

పాతాళగంగ యనునొకపుష్కరిణి గలదు. గుహయందు దేవాలయములు గలవు. కొండశిఖరమున రెండు స్తంభములు గలవు. అందొకదానినుండి నీటియూట వచ్చుచుండును దానిని యాత్రికులు పవిత్రముగ నెంచుదురు. మకరసంక్రాంతి కిచ్చట గొప్పయుత్సవము జరుగును. వేనవేలు యాత్రికులు వత్తురు. కొండపైకి మెట్లు గలవు. రెండు ధర్మశాలలు గలవు. మంటపములుగూడ నివాసయోగ్యముగ నుండును.

## విదురాశ్వత్థము

ఇది బెంగుళూరు – హిందూపురము రైలుమార్గమున దొడ్డకురుగాడి అనుస్టేషను. బెంగుళూరునుండి 52 మైళ్ళలో గలదు. చార్జీ రూ 1–12–0. హిందూపురమునుండి బస్సుమీద

0-8-0, రైలుమీాద 0-5-0. హిందూపురము 12 మైళ్ళుండును. ఇది మైసూరురాజ్యములోనిది. ఇచ్చట కోతులు విశేషము.

వసతులు:- మైసూరుగవర్నమెంటు చక్కనివసతులు కల్పించిరి. విద్యుద్దీపములు గలవు. నీటిపంపులు, విశాలమగు అనేకసత్రములు గలవు. ఇది పావనపినాకినీతీరమున నున్నది. సత్రములలో పాత్రసామగ్రి లభించును. పాత్రకు దినమునకు 0-1-0 చార్జి.

విదురునిచే నాటబడినఅశ్వత్థమని యీక్షేత్రమునకు ప్రసిద్ధి. ఇది ఒకవిశాలమైన అశ్వత్థవృక్షము. (రావిచెట్టు) ఈవృక్షముచుట్టు నొకఅరుగు గలదు. ఆయరుగునకు మెట్లు గలవు. ఆమెట్లపైన మ్రొక్కుబడులవారు ప్రతిష్ఠించిన పెక్కు వందలనాగేంద్రవిగ్రహములు గలవు. యాత్రికులీవృక్షమునకే ప్రదక్షిణము గావింతురు. మహాపవిత్రమై, కోరినవారికికోరినది ప్రసాదించువృక్షము. భూతప్రేతములు, రోగములు, సంతానహీనతలు తొలగుటకొఱకు కార్తులు సదా సేవించుచుందురు. అందువలననే నిరంతరము వందలమంది ఆ వృక్షమునకు ప్రదక్షిణములు చేయుచుందురు.

## హిందూపురము

ఇది మ్యునిసిపల్ పట్టణము. మంచి వ్యాపారకేంద్రము. గ్రామస్థులందరు భక్తిశ్రద్ధలుగలవారు. ఇది చింతపండువ్యాపారమునకు ప్రసిద్ధి.

☞ మైసూరు క్షేత్రములు సమాప్తి.

## లేపాక్షి

జటాయు పీస్థలమునందు పడియుండ శ్రీరామచంద్రుడు వచ్చి 'లై, పక్షి' అనిరట. అవి లేపాక్షి యైనదని ప్రతీతి. 5 వేల యేండ్లక్రింద అగస్త్యులవారు శివలింగస్థాపన చేసిరట. దానికెదుట శ్రీవిష్ణుమూర్తి కలదు దానిప్రక్కన రామేశలింగము (సైకతలింగము) హనుమేశలింగము కలవు. ప్రస్తుతము ప్రధాన దేవత శ్రీదుర్గ. కోటప్రక్కనున్న పెద్దనందీశ్వరుడు, ఆలయములో నున్న నాగేంద్రుడు దర్శనీయము. ఒక పెద్దరాతి స్తంభము క్రింద నాధారము లేకుండ నిలువబడినది. దానిక్రింద పలుచనిగుడ్డ వేసి రెండవ ప్రక్కకు తీయవచ్చును. దీనినిబట్టి నేలపై ఆధారపడలేదని తెలియుచున్నది. ఆశిల్పినేర్పు మెచ్చదగినది. కప్పుపై క్రిందిభాగమున చిత్రించిన పుష్పలతాదులు సర్వుల నాకర్షించును. నర్తనసభ అసంపూర్తిగా నున్నది. గాని దర్శనీయము.

---

కళ్యాణమంటపము-లేపాక్షి







బసవేశ్వరుడు - లేపాక్షి  నాగేంద్రుడు - లేపాక్షి

ఈ ఆలయము క్రీ॥ శ॥ 1550 ప్రాంతమున కట్టబడినది. ఇపుడు జీర్ణావస్థలో నున్నది.

హిందూపురమునుండి కదిరిమార్గమున నీక్షేత్రము 9 మైళ్ళలో నున్నది. రోజునకు దాదాపు 6 లేక 8 బస్సులున్నవి. రేటు 0-6-0. సత్రములు లేవు

లేపాక్షినుండి తిరిగి హిందూపురము చేరవలెను. అట నుండి గుంటకల్ 113 మై. దూరములోనున్నది. రూ3-11-0చార్జీ.

## పెనుకొండ

ఇది హిందూపురమునుండి గుంటకల్ లైనులో 12 మైళ్ళ దూరమున నున్నది. రైలుస్టేషను గలదు. రూ 0-7-0 చార్జీ. అన్ని వసతులుగలవు. తాలూకాముఖ్యపట్టణము అనంతపురము జిల్లాలోనిది. ఇది చరిత్రాత్మకపట్టణము. ఈపట్టణ మంతయు కొండలచే చుట్టబడియున్నది. శ్రీకృష్ణదేవరాయలు దీనిని తన వేసవివిడకాముగ నిర్మించెను. దీనికి కారణ మీప్రాంత వాయువు మదనపల్లివాయువువలె ఆరోగ్యకరమైనవాతావరణముగల్గియున్నది. శ్రీకృష్ణదేవరాయల వసంతభవనమని ప్రసిద్ధికెక్కిన 'గగనమహాల్' యిచ్చటనే గలదు. ఇచ్చటి మట్టి నీటిని మురికిని శుభ్రపరచుశక్తి గలిగియున్నదని చెప్పుదురు. 'గగనమహాల్' కొయ్య లేకుండ నిటుకతో కట్టబడినది. రాణుల మందిరము విచిత్రముగ నొకేరాతిలో కట్టబడినది. గగనమహాల్ ప్రక్క రామాలయము, శివాలయము గలవు. శిథిలజైన దేవాలయము, దానిగోడలపైన ధర్మచక్రములు గలవు. పెనుకొండలో నేటి కీజీర్ణాలయములు 14 గలవు మసీదులుగ మార్చిన ఆలయములు 3 గలవు.

## ఒంటిమిట్ట (ఏకశిలానగరము)

ఇది కడపజిల్లాలో మద్రాసు-రాయచూరు మార్గమున మద్రాసునుండి 148 మై. దూరములోను, గుంటకల్ జంక్షను నుండి 128 మై. దూరమునను గల రైల్వేస్టేషను. ఇది ఆంధ్ర భాగవతకర్త యగు శ్రీపోతన్నగారిజన్మస్థాన మందురు. ఇచ్చటి

శ్రీకోదండరామస్వామిఆలయమును శ్రీఆంధ్రవాల్మీకి శ్రీవావిలికొలను సుబ్బారావుగారు (వాసుదాసస్వామివారు) జీర్ణోద్ధారము గావించిరి. దర్శనీయము.

రామతీర్థము-దాహముకాగా రాముడు బాణమువైచి పాతాళమునుండి గంగను పుట్టించెను. లక్ష్మణతీర్థము, సీతాతీర్థము గలవు. మునులకు సంతోషము గల్పింప శ్రీరాముడిచ్చట శిలారూపమున నుండెనట.

## తాడ్పత్రి (తాడిపత్రి)

శ్రీ చింతలారాయస్వామి ఆలయము :- తాడ్పత్రి అనంతపురముజిల్లాలోనిది. ఒంటిమిట్ట నుండి 80 మైళ్లు. రైల్వే స్టేషను గలదు. పెద్దనగరము. అన్ని వసతులు, బస్సులు గలవు. ఈఆలయము తాడిపత్రిరహదారిబంగళానుండి 4ఫర్లాంగులదూరమున గలదు. ఇది విష్ణునిఆలయము. ఎత్తైనప్రాకారములమధ్య తూర్పుముఖముగ గొప్పగోపురముతో నిర్మింపబడియున్నది. ఈగోపురాధోభాగమున మంచిశిల్పము గలదు. ప్రధానాలయమున కుత్తరదిశలో అందమైనలక్ష్మీఆలయము గలదు ప్రధానాలయమున కెదుట విచిత్రమైన శిల్పసౌందర్యముతో చెక్కబడినరాతిరథము దర్శనీయము. అన్నిటికన్న ఆశ్చర్యమునుగొల్పునది ఎదుటనున్న స్తంభములతో నిర్మించిన మంటపము. లక్ష్మీఆలయము నెదుటికప్పు మంటపము లోపలి భాగమున, గోడలపైన రామాయణ, మహాభారత పురాణములనుండి అనేకచిత్రములను కడునేర్పుతో పొందుపరచిరి.

ఈ ఆల యము ను 1509 - 1530 మధ్య విజయ నగరసామ్రా జ్యాధిపతి శ్రీ కృష్ణదేవరా యలకాలము న ఆప్రాంత మునకు గవ ర్నరుగాను న్న రామలిం గ నాయకుని కుమారుడు తిమ్మనాయ కుడు నిర్మించి నట్లు చెప్పు దురు.



చింతలారాయస్వామి ఆలయము - తాడ్పత్రి

## కన్యాతీర్థము

మార్గము: ఇది కడపజిల్లాలో జమ్మలమడుగు తాలూకా తూర్పున పినాకినీ నదికి దక్షిణముగా పెద్దదండ్లూరుకు ఒకమైలు 4 ఫర్లాంగులలో గలదు.

ఈక్షేత్రము అనాదిసిద్ధమైనది. ఇది అగస్త్యమహర్షిచే ప్రతిష్ఠింపబడినదట. చాళుక్యప్రభువులచే పునరుద్ధరింపబడి

కొంతకాల మజ్ఞాతముగనుండి తిరిగి నేడు ఉన్నతస్థాయినందు కొననున్న క్షేత్రరాజము. దీనినే మాతృకాక్షేత్రము, అగస్త్యాశ్రమము అనియు బిలుతురు. ఈ క్షేత్రమాహాత్మ్యము సూత సంహితలో త్రయోదశాధ్యాయమున గొప్పగ వర్ణింపబడినది.

ఇట నేడుమామిడివృక్షములను యాత్రికులు పూజింతురు. ఇచ్చటవల్మీకములు (పుట్టలు) విశేషము. ఇదిపూర్వము ప్రశాంతముగ తపస్సున కుపయోగపడిన ప్రదేశ మనుటకు సందియము లేదు.

ఇచ్చట శ్రీత్రిపురసుందరీ (చాముండాదేవి), సుందరేశ్వర స్వామి ఆలయములు ముఖ్యమైనవి. నిత్యము స్వామి సేవ తీర్థస్నానములచే యాత్రికుల బాపరహితులను, బుణ్యావంతులను, ఆరోగ్యభాగ్యవంతులను జేయుచున్నది. ఈతీర్థములో స్నానమాడిన దీర్ఘభయంకర క్షయాదిరోగములుగూడ నివారింపబడుట నేటికిని ప్రత్యక్షనిదర్శనము.

## అహోబిలము లేక శింగవేల్ కుండ్రము

ఇది 97వ దివ్యదేశము. ఈదివ్యదేశముతో దక్షిణదివ్యదేశములు సమాప్తి. నృసింహస్వామి, లక్ష్మీనాంచియారు. కురుగైవిమానము. ఇంద్రతీర్థము, నరసింగతీర్థము, పాపనాశతీర్థము, భవనాశితీర్థము, నమ్మాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము. ఇది నృసింహస్వామిక్షేత్రము.

మార్గవసతులు:- గుంటకల్ నుండి నంద్యాల 90 మై. రైలుమార్గము. రూ 2-15-0 చార్జీ. నంద్యాలనుండి రుద్రవ

రము మీదుగా బండ్లమీద పోవలెను మహారణ్యప్రదేశము. ఒంటరిగా వెళ్లరాదు. ఉత్సవసమయములో అనేకులు వెళ్ల వచ్చును. రెండవమార్గము కడపనుండి వచ్చువారు కడపస్టేషనులో దిగవలెను. అటనుండి బస్సుమీద ఆళ్ళగడ్డ 65 మై. బస్సు చార్జి రూ 1-15-0. ఆళ్ళగడ్డనుండి అహోబిలము 15 మై. బస్సుకు 1-8-0 (ఉత్సవసమయములలోమాత్రమే) దేవాలయముతప్ప నితరసత్రములు లేవు. మంటపములలో నివాసమేర్పాటుచేసికొనవలెను. ఏవసతియు లేదు.

ఈక్షేత్రము కొండదిగువ, నడుమ, మీద మూడుభాగములుగ నున్నది. కొండపై అహోబిలము, నవనారసింహక్షేత్రమని ప్రసిద్ధి. ఈతొమ్మిదిమూర్తులలో రెండు, మూడు సేవించుట కష్టము. అయిన నట్లే కష్టముమీద సేవించువారును కొందరు గలరు. ఈదివ్యదేశమును సేవించుట కష్టమని శ్రీతిరుమంగై యాళ్వారులే మంగళాశాసనమున తెలిపియుండిరి. ఇచ్చట బ్రహ్మోత్సవ మొకనెలదినములు జరుగును. ఫాల్గునపూర్ణిమకు గొప్పయుత్సవము జరుగును.

ప్రహ్లాదుని బోధవ ఉక్కుస్తంభమునుండి శ్రీనృసింహస్వామి వెడలి హిరణ్యకశిపుని హతమార్చినస్థల మిదియే. ఆయుక్కుస్తంభము నేటికిని దేవాలయమున చూడనగును.

క్రిందిఅహోబిలము:- ఇది అరణ్యప్రదేశమైనను దేవాలయముమాత్రము పెద్దది. ఎందరుయాత్రికులు వచ్చినను దేవాలయమంటపాదులలో నివసించుటకు వసతిగ నుండును. ఇందు ఉడయవర్లసన్నిధి పెద్దదిగా నున్నదికాని శిథిలావస్థయం

దున్నది. దానిసమీపమున అహోబిలస్వామి (జియ్యర్) వారి మఠము శిథిలావస్థలో నున్నది. ఉత్సవసమయములలోదప్ప నితరసమయములలో మనుష్యసంచారమే యుండదు. అర్చకులొకరిద్దరుమాత్రి ముందురు. ఉత్సవముల కహోబిలమఠము నుండి స్వాములు వచ్చి యుత్సవకార్యక్రిమము నడిపింతురు.

పైఅహోబిలము:- ఇది దిగువనుండి 7 మై. పోవలెను. మార్గముమాత్రము కష్టముగ నుండును. చివర 30 లేక 40 మెట్లెక్కుట సులభమే. మార్గమంతయు రాళ్ళురప్పలతో, మిట్ట పల్లములుగనుండును. దాదాపు 6 మై. వర కెద్దుబండ్లు పోవును. చివర మైలు నడచియే పోవలయును. పైన నీటిసౌకర్య మున్నది. దేవాలయముచుట్టు 'భవనాశిని' యనునది నీటితో నిండియుండును. ఈనీరెఱ్ఱగ నుండుటకు కారణము లనేకములు చెప్పుదురు. హిరణ్యాకశిపునిరక్తము ప్రసరించుటచేతను, నృసింహమూర్తి తనహస్తముల నిందు కడుగుకొనుటచేతను నట్లుండె నందురు. పైనగూడ నుండుటకు మంటపములు గలవు. పై దేవాలయమంటపములశిల్పము విచిత్రముగ నుండును.

షష్ఠపరాంకుశస్వామి యనువా రిచ్చటనే యొకబిలము నందు ప్రవేశించి అంతర్ధానమైనారని రాయికప్పిన యొకస్థలమును చూపెదరు. అందుకనియే అహోబిలమని పేరువచ్చె నందురు.

నవనారసింహ మూర్తుల వివరము:—1. లక్ష్మీనృసింహము (దిగువ అహోబిలము), 2. పత్తిరాంత నృసింహము,

3. యోగనృసింహాము (ఇవి రథవీథిలో దాదాపు 1½ మై.దూర ములోనున్నవి ) 4. కారంగినృసింహాము (పైఅహోబిలమునకు పోవుదారిలో మధ్య నున్నది.), 5 ఉగ్రనృసింహాము (ఎగువ అహోబిలము),6. భార్గవనృసింహాము (గరుడాద్రియందున్నది.) 7. వర్మవిధినృసింహాము (వేదాద్రియందున్నది.). 8. వరాహ నృసింహాము, 9 ప్రహ్లాదనృసింహాము (ఇది గంధాద్రి యందున్నది )

## శ్రీశైలము

అహోబిలమునుండి నంద్యాల చేరవలెను. అచ్చటినుండి బస్సుమీద శ్రీశైలమునకు వెళ్లువారు వెళ్ళవచ్చును. శివరాత్రికి గొప్పయుత్సవము జరుగును. ఏమార్గమున వెళ్లినను శ్రీశైల మునకు నడక తప్పెడిది గాదు. కాని మార్కాపురమునుండి రోడ్డు 20లక్షలవ్యయముతో నిర్మితమైనది. స్టేషనునుండి దోర్నాల 24మై. అచ్చటనుండి శ్రీశైలమురోడ్డు 31మై.

## మహానంది

నంద్యాలనుండి 9 మైళ్ళలో గాజులపల్లిస్టేషనులో దిగ వలెను. స్టేషనునుండి 3½ మై. చక్కనిరోడ్డు గలదు. వసతులు లేవు. శివరాత్రిసమయమున వసతు లుండును. తిరిగి స్టేషనుకు చేరవలెను.

## నెమిలిగుండము జలపాతము

ఇది నల్లమడఅడవులలో గుండలబ్రహ్మేశ్వరపర్వత శిఖరప్రాంతమునుండి బయలుదేరి కొండలజొచ్చుకొని నురు గులు గ్రక్కుచు కంభంతాలూకాలో నెమిలిగుండ మను సుందరజలపాతముగ నేర్పడి యాత్రికుల నాకర్షించుచున్నది.

## త్రిపురాంతకము

గాజులపల్లి స్టేషనునుండి గిద్దలూరులో దిగి బ్రహ్మంగారి మఠమును, వినుకొండలో దిగి త్రిపురాంతకమును, నర్సరావుపేటలో దిగి కోటప్పకొండను దర్శించి గుంటూరు శ్రీరామనామక్షేత్రము చేరవలెను.

☞ శ్రీశైలము, మహానంది మొదలగు క్షేత్రముల వివరణము ఉత్తరదేశ యాత్రామార్గదర్శియందు వ్రాయబడినది.

సూచన:- దక్షిణదేశమున గల 97 దివ్యదేశములచరిత్రము సమాప్తమైనది. మిగిలిన 11 దివ్యదేశములు అనగా 1. ద్వారక, 2. ఉత్తరమథుర, 3. సాలగ్రామము, 4. దేవప్రయాగ, 5. జ్యోతిర్మఠము, 6. బదరికాశ్రమము, 7. గోకులము, 8. బృందావనము, 9. అయోధ్య, 10. గోవర్ధనము, 11. శ్రీవైకుంఠము మొదలగువాని వివరములు 'యాత్రామార్గదర్శి' రెండవసంపుటమున ప్రచురింపబడినవి.

ప్రథమ సంపుటము

సమాప్తము.



# యాత్రామార్గదర్శి

## అనుబంధములు

1. నానాభాషాపదములు - వాక్యములు
2. సామాను లుంచుకొనువిధానము
3. వస్తువుల జాబితా
4. వస్తుప్రదర్శనశాలలు
5. ద్వాదశజ్యోతిర్లింగక్షేత్రములు
6. అష్టాదశశక్తిపీఠక్షేత్రములు
7. సత్రములు వానివివరము
8. అకారాదివరుసలలో క్షేత్రముల జాబితా
9. దక్షిణయాత్రామార్గదర్శి - అభిప్రాయములు

### 1. నానాభాషాపదములు, వాక్యములు

ఈయది ఆయా క్షేత్రములందు యాత్రికు లచటిజనులతో సంభాషించుట కుపకరించువాక్యముల నాలోచించి తయారుచేయబడినవి. ఈవాక్యములతోను, మాటలతోను యాత్రికులు పరభాషలవలన ఇబ్బంది లేకుండ యాత్రలు సేవించి రావచ్చును. మాటలు, వాక్యములు ముఖ్యముగ దక్షిణ భారతమున ఉపకరించుభాషలలో మాత్రమే వ్రాయబడినవి. తక్కినభాషలలో ఉత్తరయాత్రా మార్గదర్శియందు వ్రాయబడినవి. గాన పాఠకులు గమనింప ప్రార్థన.

కొన్ని అక్షరములపైన — అర్ధగీటు పెట్టియుండును. అనగా ఆగీతగలఅక్షరము సగమే ఉచ్చరించవలెను. ముఖ్యముగ మళయాళిభాషలలో ఆశబ్దములు వచ్చును. అట్లై అరవములోగూడ వచ్చును.

| తెలుగు | ఇంగ్లీషు | అరవము | మళయాళము | కన్నడము |
|---|---|---|---|---|
| **దైవ సంబంధము** | | | | |
| 1. టెంకాయ | కోకోనట్టు | తేఙ్గాయ్ | తేంగా | టెంగినకాయి |
| 2. కర్పూరము | క్యాంఫర్ | శూడమ్ | కర్పూరం చూడం | కర్పూర |
| 3. అగరు వత్తులు | అగర్‌బత్తీస్ | ఊదువత్తి | సాంబ్రాణి బత్తి | ఊదుబత్తి |
| 4. దేవాలయము | టెంపుల్ | దేవాలయం | దేవస్థానం | గుడి |
| 5. పూలమాల | గార్లెండు | పుమాలై | మాల | పుష్పమాలె |
| 6. రథము | కార్ | తేర్ | తేర్ | రథ |
| **సంఖ్యావాచకములు** | | | | |
| 1. ఒకటి | వన్ | ఒన్ను | ఒన్నె | ఒందు |
| 2. రెండు | టు | రెండు | రెండె | ఎరడు |
| 3. మూడు | త్రీ | మూణు | మూను | మూరు |
| 4 నాలుగు | ఫోర్ | నాలు | నాలె | నాలక్కు |
| 5. ఐదు | ఫైవ్ | అంజు | అంజె | ఐదు |
| 6 ఆరు | సిక్స్ | ఆరు | ఆరె | ఆరు |
| 7. ఏడు | సెవన్ | ఏళు | ఏళ్లు | ఏళు |
| 8. ఎనిమిది | యైట్ | ఎట్టు | యేట్ | ఎంటు |
| 9. తొమ్మిది | నైన్ | ఒంబదు | ఒయిన్‌పాత్ | ఒంబత్తు |
| 10. పది | టెన్ | పత్తు | పత్ | హత్తు |
| **పంట సంబంధము** | | | | |
| 1. దుకాణము | షాప్ | కడై | కడయి | అంగడి |
| 2. విస్తరి | లీఫ్ | ఇలై | యలి | ఎలె |
| 3. వక్క | నట్ | పాక్కుకొట్టై పాక్కు | పాక్ | అడికె |

| తెలుగు | ఇంగ్లీషు | అరవము | మళయాళము | కన్నడము |
|---|---|---|---|---|
| 4. తమలపాకు | బీటెల్ లీవ్ | వెత్తలై | వెట్టిల | విళ్యదెలె |
| 5. ఆవాలు | మస్టర్డ్ సీడ్స్ | కడుగు | కడుకె | |
| 6. ఉప్పు | సాల్ట్ | ఉప్పు | ఉప్పు | ఉప్పు |
| 7. అన్నము | రైస్ | సాదం | చోర్ | అన్న |
| 8. వంట చెఱకు | ఫైర్ వుడ్ | వెరగు | వెరకె | కట్టిగె |
| 9. పప్పు | డాల్ | పరుప్పు | పరుప్ | బేళె |
| 10. పెరుగు | కర్డ్ | తైర్ | తైర్ | మొసరు |
| 11. పొయ్యి | అవెన్ | అడప్పు | అడుప్పు | ఒలె |
| 12. చీపుర | బ్రూమ్ | తుడప్పం | వారియల్ | పొరికె |
| 13. బియ్యము | రైస్ | అరిశి | అరి | అక్కి |
| 14 గోధుమ పిండి | వీట్ ఫ్లోవర్ | గోదుమై మావు | గోదుమ మావ్ | గోధుమె హిట్టు |
| 15 కందిపప్పు | మెయిన్ | తువరంపరుప్పు | తొరంపరుప్పు | తొగరిబేళె |
| 16. మిర్చి | చిల్లీస్ | మొళగాయ్ | మొళకు | మెణసిన కాయి |
| 17. మిరియాలు | పెప్పర్ | మిళగు | కొరుమొళకు | మెణసు |
| 18. చింతపండు | టామరినెడ్ | పుళి | పుళి | హుణసెహణ్ణు |
| 19. పాలు | మిల్క్ | పాల్ | పాలు | హాలు |
| 20. బెల్లము | జాగర్ | వెల్లం | చక్కర | బెల్ల |
| 21. కారము | చిల్లీపౌడర్ | మిళగాయ్ తూళ్ | ముళకుపొడి | కార |
| 22. అగ్గిపెట్టె | మాచ్ బాక్సు | నెరుప్పుపెట్టి | తీపెట్టి | బెంకిపెట్టిగె |

| తెలుగు | ఇంగ్లీషు | అరవము | మళయాళము | కన్నడము |
|---|---|---|---|---|
| 23. మంచినీరు | ఫ్రెష్ వాటర్ | నల్లతణ్ణి | నల్లవెళ్ళం | శీనీరు |
| 24. నెయ్యి | ఘీ | నెయ్ | నెయ్య | తుప్ప |
| 25. పంచదార | షుగర్ | శర్కరై | పంచసారా | సక్కరె |
| 26. మజ్జిగ | బట్టర్ మిల్కు | మోర్ | మోర్ | మజ్జిగె |
| 27. కూరలు | వెజిటబుల్ | కరికాయగళ్ | తాయికరి | తరకారి |
| 28. ఆకుకూర | లీఫ్ వెజిటబుల్ | కీరై | | |
| 29 బీరకాయ | | పీర్కంగాయ్ | పీచంగాయ్ | జీరిగె |
| 30. వేడి | హీట్, హాట్ | శూడు | చూడు | శెఖె |

ఇతర వస్తువుల పేర్లు

| | | | | |
|---|---|---|---|---|
| 1. గది | రూమ్ | అరై | అర | కొఠడి |
| 2. అడవి | ఫారస్టు | కాడు | కాడె | అరణ్య |
| 3. ఉత్తరము | లెటరు | కడిదం | వడక్ | కాగద |
| 4. ఔషధము | మెడిసన్ | మరుందు | మరున్నె | ఔషధ |
| 5. కొండ | హిల్ | మలై | మల | బెట్ట |
| 6. దీపము | లాంప్ | విళక్కు | వెళిక్కె | దీప |
| 7. తాళము | లాక్ | పూట్టు | పూట్ | బీగ |
| 8. బండి | కార్టు | వండి | వండి | గాడి |
| 9. పండ్లపొడి | టూత్ పౌడర్ | పల్ పొడి | పల్ పొడి | |
| 10 సీరా | ఇంక్ | మై | మసి | మసి |
| 11. వేపపుల్ల | మార్గోసాస్టిక్ | వేపకుచ్చి | వేపంకుచ్చి | బేవినకడ్డి |
| 12. బాడుగ | హైర్ | వాడగై | బాడుగ | బాడిగె |
| 13. కూలి | కూలీ | కూలి | కూలి | కూలి |
| 14. బక్కెటు | బకెట్ | కడఘూర్ చాట్టి | వాళి | బానె |

| తెలుగు | ఇంగ్లీషు | అరవము | మళయాళము | కన్నడము |
|---|---|---|---|---|
| 15. త్రాడు | రోప్ | కయర్ | కైయర్ | హగ్గ |
| 16. బావి | వెల్ | కిణరు | కిణరె | భావి |
| 17. మరుగుదొడ్డి | లెట్రిన్ | కక్కూసు | కక్కూసు | కక్కూసు |
| 18. మార్కెట్టు | మార్కెటు | మార్కెటు | సంత | మర్కెట |
| 19. లవంగము | క్లోవెజ్ | క్రాంబు | క్రాంబు | లవంగ |
| 20. ఏలకులు | కార్డమన్ | ఏలక్కాయ్ | ఏలక్కాయ | ఏలక్కి |
| 21. జాజికాయ | నట్ | జాదిక్కాయ్ | జాజికాయ్ | జాజికాయ |
| 22. గ్రామం | విలేజ్ | గ్రామం | ఊరు | గ్రామ |
| 23. సముద్రం | సీ | కడల్ | సముద్రమె | సముద్ర |
| 24. నది | రివర్ | ఆరు | ఆరు | నది |
| 25. కాలువ | కెనాల్ | కాల్వాయ్ | తోడె | కాలువె |
| 26. చెరువు, కొళను | టాంక్ | కుళం | కొళం | కెరె |
| 27. ఆవు | కౌ | పశు | పశు | హసు |
| 28. దోమ | మసకిటో | కొశు | కొదు | సొళ్ళె |
| 29. మొసలి | కొకడైల్ | ముదలై | మొదల | మొసళె |
| 30 వేపచెట్టు | మార్గోసాట్రీ | వెప్పమరం | వేప్పమరం | బేలినమర |
| 31 నిమ్మపండు | లెమ్ | ఎలుమిచ్చం పళ్లమ్ | నారంగాయి | నింబేహణ్ణు |
| 32. పసుపు | ఉర్‌మెరిక్ | మంజళ్ | మంజల్ | అరుసిన |
| 33 ధనియాలు | కోరియాండల్ | దనియా కొత్తమల్లి | మల్లి | కొత్తుంబరిజీజ |
| 34. ఇంగువ | అసఫేబడా | పెరుంగాయం | కాయం | హింగు |
| 35. సున్నము | చునామ్ | శుణ్ణాముచ్చి | చుణ్ణాంబ్ | సుణ్ణ |
| 36. అల్లము | గ్రీన్ జింజర్ | ఇంజి | ఇంజి | హసిశుంఠి |

| తెలుగు | ఇంగ్లీషు | అరవము | మళయాళము | కన్నడము |
| --- | --- | --- | --- | --- |
| 37. పొట్లకాయ | స్నేక్ గోర్డ్ | పుడలంగాయ్ | పాడవలంగాయ్ | పడవలకాయి |
| 38. దోసకాయ | కుకుంబర్ | వెళ్లరిక్కాయ్ | పొతేకాయి | వాడ్డోకో |
| 39. వంకాయ | బ్రింజల్ | కత్తరిక్కాయ్ | వళుదళం (కాయ్ | బదనెకాయి |
| 40. పులుసు | భాత్ | సాంబార్, కుళంబు | కాళించో, చూటు | హుళి |
| 41. చారు | పెప్పర్ వాటర్ | రసం | రసం | సారు |
| 42. నిప్పుపుల్ల | మాచ్ | నెరుప్పుక్కు (చ్చి | తీకుచ్చె | బెంకికడ్డి |
| 43. బొగ్గులు | (చార్) కోల్ | కరి | కరి | బొగ్గు |
| 44. రోలు | మార్టర్ | ఉరల్ | ఉరలు | ఒరళు |
| 45. రోకలి | పెసిల్ | ఉలక్కై | ఒలక్కై | ఒనకె |
| 46. సూది | నీడిల్ | ఊశి | ఊశి | సూజి |
| 47. దారము | త్రెడ్ | నూలు | నూలె | దార |
| 48. తలనొప్పి | హెడేక్ | తలైవలి | తలవేదన | తలనోవు |
| 49 పాలవాడు | మిల్క్ మన్ | పాల్క్కారన్ | పాల్ కారన్ | హాలీనవను |
| 50. మంగలి | బార్బర్ | అమ్బట్టన్ | అంబటన్ | హజామ |
| 51. చాకలి | వాషర్ మన్ | వణ్ణాన్ | వణ్ణాన్ | అగసరవను |
| 52. పనికత్తె | సర్వెంటువుమన్ | వేలైక్కారి | వేలక్కారి | చాకరియవళు |
| 53. వైద్యుడు | డాక్టర్ | వైద్యన్ | వైద్యన్ | వైద్యను |
| 54 వెల | ప్రియస్ | విలై | వెల | బెల |
| 55. చరిత్ర | హిస్టరీ | చరిత్తిరం | చరిత్రమ్ | చరిత్రె |
| 56. యాత్రికుడు | పిల్గ్రిం | యాత్తిరైపోహన్ | యాత్రకారన్ | యాత్రిస్థను |
| 57. నేడు | టుడే | ఇన్రు | ఇన్నె | ఈహొత్తు |

| తెలుగు | ఇంగ్లీషు | అరవము | మళయాళము | కన్నడము |
|---|---|---|---|---|
| 58 రేపు | టుమారో | నాళై | నాళె | నాళె |
| 59. నిన్న | యెస్టర్డే | నేట్రు | ఇన్నలె | నిన్నె |
| 60. గంట | అవర్ | మణి | మణి | ఘంటె |
| 61 కాని | క్వార్టర్ అనా | కాలణా | ఒరుముక్కాలు | కాలణె |
| 62. అర్ధణా | హాఫ్ అనా | అరైణా | రెండు ముక్కాలు | అర్ధాణె |
| 63. అర్ధరూపాయ | హాఫ్ రుపీ | అరైరూపాయ్ | అరరూపాయి | అర్ధరూపాయి |
| 64. చిల్లర | చైయన్జి | శిల్లరై | చిల్లరె | చిల్లరె |
| 65. ఎచ్చట | హ్వేర్ | ఎంగే | ఎవ్విడె | ఎల్లి |
| 66. ఎంత | హౌమచ్ | ఎవ్వళవు | ఎత్రియ్ | ఎష్టు |
| 67. దర్శనము చేయు | విజిట్ | కండుకొళ్ | దరికాన్ | దర్శనహొండు |
| 68. చైత్రము | మార్చి | చిత్తిరై | మేడం | చైత్ర |
| 69. వైశాఖము | ఏప్రిల్ | వైగాశి | ఇడవం | వైశాఖ |
| 70. జ్యేష్ఠము | మే | ఆని | మిథునం | జ్యేష్ఠ |
| 71 ఆషాఢము | జూన్ | ఆడి | కర్క్కడహం | ఆషాఢ |
| 72. శ్రావణం | జులై | ఆవణి | చిగ్నం | శ్రావణ |
| 73. భాద్రపదము | ఆగస్టు | పురట్టాశి | కన్నె | భాద్రపద |
| 74. ఆశ్వయుజము | సెప్టెంబరు | అల్పిశి | తులం | ఆశ్వజ్ |
| 75 కార్తీకము | అక్టోబరు | కార్తిగై | వృశ్చికం | కార్తీక |
| 76 మార్గశిరము | నవంబరు | మార్గళి | ధను | మార్గశిర |
| 77. పుష్యము | డిశంబరు | తై | మకరం | పుష్య |
| 78 మాఘము | జనవరి | మాశి | కుంభం | మాఘ |
| 79 ఫాల్గుణం | ఫిబ్రవరి | పజ్గులి | మీనం | ఫాల్గుణ |

| తెలుగు | ఇంగ్లీషు | అరవము | మళయాళము | కన్నడము |
|---|---|---|---|---|
| 80 పెద్దచిక్కుడు కాయ | బీన్ | అవరైక్కాయ్ | అవరె | అవరె |
| 81 ఆదివారము | సన్ డే | ఞాయరు | ఞాయర్ | ఆదిత్తవార్ |
| 82 సోమ | మన్ డే | తిజ్గళ్ | తింగల్ | సోమవార్ |
| 83 మంగళ | ట్యూసడే | శెవ్వాయ్ | చొవ్వా | మంగళవార్ |
| 84 బుధవారం | వెన్సుడే | బుదన్ | బుధన్ | బుధవార్ |
| 85 గురువారం | తర్స్ డే | వ్యాళన్ | వ్యాయం | బృహస్పతి వార |
| 86 శుక్రి | ఫ్రైడే | వెళ్లి | వెంళ్లి | శుక్రవార |
| 87 శనివారం | సాటర్ డే | శని | శని | శనివార |

## క్రియలు

| | | | | |
|---|---|---|---|---|
| 1 చేయు | డూ | శెయ్ | జోలి, పని | మాడు |
| 2 వెళ్లు | గో | పో | పోకుక | పోగు |
| 3 నడచు | వాక్ | నడ | నడకుక | నడి |
| 4 పరుగెత్తు | రన్ | ఓడు | ఓడుక | ఓడు |
| 5 తిను | ఈట్ | తిన్ | తిన్నుక | తిన్ను |
| 6 కొను | బై | వాంగు | వాంజక | ఖరీదిమాడు |
| 7 అమ్ముట | సెల్ | విర్పనై | విక్కుక | మారువుదు |
| 8 ఇచ్చుట | గివ్ | కొడు | కొడుకుక | కొడువదు |
| 9 చూచుట | సీ | పార్ | నూకుక | నోడువుదు |
| 10 పరుండు | స్లీప్ | పడుక్కుం | కెడకుక | మలగికో |
| 11 లేచు | గెటప్ | ఎళున్దిరు | ఎడుంన్నేల్కుక | ఏళు |
| 12 వండు | కుక్ | శమై | వెప్పానని | అడిగెమాడు |
| 13 శనగపప్పు | రెడ్ గ్రామ్ ధాల్ | కడలైపరుప్పు | కడళపరప్పు | కడలెబేళె |

| తెలుగు | ఇంగ్లీషు | అరవము | మళయాళము | కన్నడము |
|---|---|---|---|---|
| 14 మినపప్పు | బ్లాక్ గ్రామ్ | ఉళుత్తం పరుప్పు | ఉళివం పరప్పు | ఉద్దినబేళె |
| 15 పెసర పప్పు | గ్రీన్ గ్రామ్ | పైతంపరుప్పు | పైతంపరప్పు | హెసరుబేళె |
| 16 శనగలు | రెడ్ గ్రామ్ | కడలై | కడలై | కడలె |
| 17 గోధుమ | వీట్ | గోధుమై | గోధమై | గోధి |
| 18 వేరుశనగ | గ్రౌండునట్ | నెలంగ్కడలై | నెలగడలై | నెలగడలె |
| 19 మర మరాలు | ఫ్లాఫిడ్ రైస్ | పొరి | పొరి | ముండక్కి |
| 20. బటానీలు | | బటాణి | బటానీ | బటాణి |
| 21 చెక్కరాలు | | మురుక్కు | మృక్ | చెక్కలీ |
| 22. జీడిపప్పు | క్యాషునట్ | ముంద్రిరు పరుప్పు | అండిపరుపు | గేరుబీజ |
| 23. పాత బియ్యం | ఓల్డురైస్ | పళైయఅరిశి | పళిఅరి | హాళెఅక్కి |
| 24. క్రొత్త బియ్యం | న్యూరైస్ | పుదుఅరిశి | పుదుఅరి | హొసఅక్కి |
| 25. ఉప్పుడు బియ్యం | | పుళుంగల్ అరిశి | పుళుంగళరి | కుచ్చిగెఅక్కి |
| 26. పచ్చి బియ్యం | | పచ్చరశి | పచ్చిఅరి | బెళ్తిలెగెఅక్కి |



# నానాభాషావాక్యములు

1 తెలుగు - తమదియేయూరు?
కన్నడము - తమ్మఊరుయావదు?
అరవము - ఉఙ్గళ్ ఊరు ఎదు?
మలయాళము - నీంగళోడెరాజ్యంఎవిడె?
హిందీ - ఆప్ కా క్యా గాఁవ్ హై?

2 తె - ఇది యేయూరు?
క - ఇదుయావవూరు?
అ - ఇదు ఎన్న ఊర్?
మ - ఈనాడఏద?
హిం - యహ్ క్యా గాఁవ్ హై?

3 తె - దేవాలయ మెంత దూరమున్నది?
క - దేవస్థానముఎష్టుదక్లిదె?
అ - కోవిల్ ఎవ్వళవు దూరత్తిల్ ఇరుక్కిరదు?
మ - అంబలత్తిలేక్ ఎత్రవళి ఉండ?
హిం - మందిర్ కిత్ నా దూర హై?

4 తె - దేవాలయమునకు దారియేది?
క - దేవస్థానక్కె దారియావుదు?
అ - కోయిలుక్కు వళిఏద?
మ - అంబలత్కు వళి ఏద?
హిం - మందిర్‌కో జానేకేలియే రాస్తా క్యా హై?

5 తె - స్వామిదర్శన మెప్పుడగును?
క - దేవర దర్శనవు యావాగా ఆగబహుదు?
అ - స్వామి దర్శనం ఎప్పోదు?
మ - స్వామి దర్శనం ఎప్పో?
హిం - భగవాన్‌కా దర్శన్ కబ్ హోగా?

6 తె - ఇప్పు డెన్ని గంటలైనది?
క - ఈగ ఎష్టు ఘంటె?
అ - ఇప్పో మణి ఎన్న?
మ - ఇప్పో ఎత్ర మణి?
హిం - అబ్ కిత్ నే బజే హై?

7 తె - మార్కెట్టు ఎక్కడ? దారి యేది?
క - మార్కెట్టు ఎల్లిదె? దారి యావదు?
అ - మార్కెట్ ఎఙ్గే ఇరుక్కు? వళి ఎప్పడి?
మ - మార్కెట్టు ఎవిడె? వళి ఎదె?
హిం - మార్కెట్ కహాఁ హై? ఉసకా రాస్తా క్యా హై?

8 తె - స్నానమునకు నది గలదా? లేక చెరువు గలదా?
క - స్నానక్కె నది యిదెయా? యిల్లవే కెరె యిదియా?
అ - స్నానత్తిర్కు నది అల్లదు కుళం ఇరుక్కా?
మ - కుళిక్క్యాంపోళె ఉండో? కుళం ఉండో
హిం - క్యా నహానే కేలియే నదీ హై? యా తాలాబ్ హై?

9 తె - బావి యెంతదూరములో నున్నది?
క - భావిగె ఎష్టు దూర విదె?
అ - కిణరు ఎవళవు దూరత్తిల్ ఇరుక్కిరదు?
మ - కిణర్ ఎత్రవళి ఉండ?
హిం - కువాఁ కిత్ నే దూర్ పర్ హై?

10 తె - ఏ సత్రములో దిగుట మంచిది?
క - యావ సత్రదల్లి యిళియువదు బళ్ళేదు?
అ - ఎన్దసత్తిరత్తిల్ ఇరఙ్గువదు నల్లదు?
మ - ఏదు సత్రం నల్లద యివడె?
హిం - కిస్ ముసాఫిర్ ఖానే మేఁ రహనా అచ్ఛా హై?

11 తె - సత్రము ఎంతదూరములో ఉన్నది?
క - సత్రవు ఎష్టు దూరదల్లిదె?

అ - సత్రం ఎవ్వళవు దూరిత్తిల్ ఇరుక్కు?
మ - సత్రత్తిన నళి యెత్ర?
హిం - ముసాఫిర్ ఖానా కిత్ నే దూర్ పర్ హై?

12 తె - బండిబాడుగ ఎంత? కూలి ఎంత?
క - బండిబాడిగెఎష్టు? కూలి ఎష్టు?
అ - వణ్డిశత్తం ఎవ్వళవు? కూలి ఎవ్వళవు?
మ - వండికె ఎంద కూలి? కూలి ఏత్ర?
హిం - గాడీకాకిరాయా కిత్ నా హై?

13 తె - వంటచెరుకు అమ్ము దుకాణంఏది?
క - కట్టిగె సిక్కు అంగడి యావుదు?
అ - విరగు దొడ్డి ఎంగె?
మ - విరగకడె ఎవిడె?
హిం - రసోఈకే లక్ డే బేచ్ నేకా దుకాన్ కహాఁ హై?

14 తె - బియ్యము, పప్పు, అమ్మఅంగడియెక్కడ కలదు?
క - అక్కి, బేళె, మారువ అంగడి ఎల్లిదె?
అ - అరిశి, పరుప్పు కడైఎంగె?
మ - అరి, పరిప్ప విల్కున్నకడె ఎవిడె?
హిం - చావల్ దాల్ బేచ్ నేకా దుకాన్ కహాఁ హై?

15 తె - కూరలు, పెరుగు ఎచ్చటఅమ్ముదురు?
క - తరకారి, మొసరు ఎల్లిమారుత్తారె?
అ - కాయ్ కరి, తైర్ ఎఙ్గేకిడైక్కుం?
మ - పచ్చకరి, తైరెఎవిడె విల్కున్ను?
హిం - తర్ కారియా ఔర్ దహీ కహాఁమిల్ తీ హై?

16 తె - వెల ఎంత?
స - బెలె ఎష్టు?
అ - విలై ఎన్న లేక ఎన్న విలై?

మ - ఎల ఎత్రె?
హిం - దామ్‌కిత్‌నా హై?

17 తె - ఈసత్రములో ఎన్నిదినము లుండవచ్చును?
క - ఈసత్రదల్లి ఎష్టు దినగళి రబహుదు?
అ - ఇన్ద సత్తిరత్తిల్ ఎత్తైనాళ్ తఙ్గలాం?
మ - ఈసత్రత్తిల్ ఏత్రదివసం తామసిక్కాం?
హిం - ఇస ముసాఫిర్‌ఖానామేఁ కిత్‌నే దిన్‌తక్ ఠహర్‌సక్‌తేహై?

18 తె - ఈక్షేత్రములో చూడదగిన విశేషములేవి?
క - ఈక్షేత్రదల్లి నోడబేకాద విశేషగళేను?
అ - ఇన్ద క్షేత్రత్తిల్ పార్క్కవేండియ విశేషఙ్గళ్ ఎన్నై?
మ - ఈక్షేత్రత్తిల్ కాణవేండద విశేషంఎంద?
హిం - ఇస్ క్షేత్రమేఁ దేఖ్‌నేలాయక్ చీజేఁ క్యాహై?

19 తె - చుట్టుపట్లు చూడదగిన ముఖ్యప్రదేశములు గలవా?
క - సుత్తుపక్కదల్లి నోడబేకాద ముఖ్యప్రదేశగళుయివెయా?
అ - శుట్రుప్పక్కఙ్గళిల్ పార్క్కత్తగుంద స్థలంగళ్ ఇరుక్కా?
మ - చుట్టుపాడ కాణవేండద ముఖ్యస్థలంగళ్ ఉండో?
హిం - క్యా ఆస్‌పాస్‌మేఁ దేఖ్‌నేలాయక ముఖ్యప్రదేశ్ హైఁ?

20 తె - ఈప్రాంతములో గొప్పమహాత్ములు గలరా?
క - ఈప్రాంత్యదల్లి దొడ్డమహాత్మరు గళిదారా?
అ - ఇన్ద పక్కఙ్గళిల్ మహాత్మాక్కళ్ యారావదు ఇరుక్కిఱార్గళా?
మ - ఈస్థలత్తు వలయ మహాన్ ఉండో?
హిం - క్యా ఇస్‌ప్రాంత్ మేఁ బడే మహాన్‌లోగ్ హై?

21 తె - ఈప్రాంతములో ఆశ్రమములుగలవా?
క - ఈప్రాంత్యదల్లి ఆశ్రమగళు యివెయా?
అ - ఇన్దప్రాంతత్తిల్ ఆశ్రమఙ్గళ్ ఇరుక్కిన్ఱనవా?
మ - ఈస్థలత్తు వలయ మఠం ఉండో?
హిం - క్యా ఇస్‌ప్రాంత్ మేఁ ఆశ్రమ్ హైఁ?

**22** తె - తమ అడ్రెస్సు ఏమి?
క - తమ్మ అడ్రెస్సు ఏను?
అ - ఉంగళ్ విలాసమ్ ఎన్న?
మ - నంజళుడే మేల్ వాలసం ఎందాగున్న?
హిం - ఆప్‌కా పతా క్యాహై?

**23** తె - టిక్కెట్టు ఎంత?
క - టిక్కెట్టుఎంత?
అ - టికెట్ ఎవ్వళవు?
మ - టిక్కెట్టు ఎత్ర?
హిం - టిక్కెట్ కా దామ్ కిత్‌నాహై?

**24** తె - మరుగుదొడ్డి ఎచ్చటకలదు?
క - కక్కసు ఎల్లిదె?
అ - కక్కసు ఎఙ్గేయిరుక్కు?
మ - కక్కూస ఎవిడె?
హిం - పాయిఖానా కహాఁహై?

**25** తె - స్నాన మెచ్చట చేయవలయును?
క - స్నాన వెల్లిమాడలేకు?
అ - స్నానం వెజ్జే శెయ్యవేణుమ్?
మ - కుళి క్కాం ఎవిడె?
హిం - కహాఁ నహానాహై?

**26** తె - మంచి బ్రాహ్మణ భోజనహోటలు ఎచ్చట గలదు?
క - బిళ్ళె బ్రాహ్మణర ఊటద హోటలు ఎల్లిదె?
అ - నల్ల బ్రాహ్మణ శాప్పాడు హోటల్ ఎంగే యిరుక్కు?
మ - నల్లద బ్రాహ్మణరుడె భోజనం హోటల్ ఎవిడె?
హిం - బ్రాహ్మణ్ కా అచ్ఛా భోజనహోటల్ కహాఁహై?

**27** తె - భోజనము పూటకు ఎంత?
క - ఊట ఒందక్కెఏను?

అ - ఒరువళై శాప్పాటుక్కు ఎవ్వళవు?
మ - ఒరు ఊణిన్ను ఎత్ర?
హిం - భోజన్ కైసే దేతేహై?

28 తె - ఒక్క రూపాయి చిల్లర ఈయండి?
క - ఒందు రూపాయి చిల్లరకోడి?
అ - ఒరురూపాయ్‌కు చిల్లరై కొడుంగో?
మ - ఒరు రూపా చిల్లరతరు?
హిం - ఏక్ రూప్‌యేకా చిల్లర్ దీజియే?

29 తె - ఈవూరిలో ఆధ్యాత్మిక పరిచారసంఘమున్నదా?
క - ఈవూరనల్లి ఆధ్యాత్మిక పరిచార సంఘవిదెయా?
అ - ఇన్దఊరిల్ ఆధ్యాత్మిక పరిచారసంఘం ఏదావదు ఇరుక్కిరదా?
మ - ఈ నాటిల్ ఆధ్యాత్మిక పరిచారసంఘం ఉండో?
హిం - క్యా ఇస్ గాఁవ్ మే ఆధ్యాత్మిక పరిచారక్ సంఘ హై?

30 తె - కొండ పైకి దారి యేది?
క - బెట్టద మ్యాలిగె దారిహ్యాగె?
అ - మలైయేల్ పోగ వళి ఎదు?
మ - మలెక్కు మేలె వళిఏద?
హిం - పహాడ్ పర్ జానేకా రాస్తా క్యాహై?

31 తె - బస్సుస్టాండుకు దారి యేది?
క - బస్సుస్టాండుకు దారి యావదు?
అ - బస్‌స్టాండిర్కు పోగ వళి యెదు?
మ - బస్సుస్టాండక్కు వళిఏద?
హిం - బస్‌స్టాండ్ కా రాస్తా కహాఁ హై?

32 తె - గారిమమునకు చార్జియెంత?
క - గారిమక్కె చార్జియెష్టు?
అ - గారిమత్తిర్కు చార్జి ఎవ్వళవు?

మ - గ్రామత్ లేక చార్జిఎత్ర?
హిం - గావ్ జానేకేలియే కిత్ నా చార్జ్ హై?

33 తె......మందికి బస్సులో సీటుగలదా?
క.......మందిగె బస్సినల్లి సీటు యిదెయా?
అ......పేరుకు బస్సిల్ ఇడం ఇరుక్కా?
మ......ఆళ్క్కు బస్సిలె సీటు ఉండో?
హిం......లోగోంకో బస్ మే జగహ్?

34 తె........ఇచ్చటికి ఎన్ని మైళ్ళదూరము?
క........గ్రామవు యిల్లిగె ఎష్టు మైలుదూరము?
అ.......గ్రామం ఇజ్జను ఎవ్వళవు దూరం
హిం......గాంవ్ యహాసే కిత్ నే మేల్ దూర్ పర్ హై?

35 తె-అచ్చటకు బస్సులుగలవా? సత్రములుగలవా? హోటళ్లుగలవా?
క - అల్లిగె బస్సుయిదెయా? సత్రిగళివెయా? హోటలుగళి వెయా?
అ-అవ్విడత్తిక్కు బస్ పోగిరాదా? సత్రంగళ్ ఇరుక్కా? హోటల్ గళ్ ఇరుక్కా
మ - అవ్విడెకె బస్సుఉండో? సత్రంఉండో? హోటల్ ఉండో?
హిం - క్యావహాం మోటార్ గాడీ హై? ఔర్ ముసాఫిర్ ఖానే హై?
ఔర్ హోటల్ హైం?

36 తె - దేవాలయములో ప్రసాదములు అమ్ముదురా?
క - దేవస్థానదల్లి ప్రసాదవన్ను మారుత్తారో?
అ - కోయిలిల్ ప్రసాదం విలైక్కు కిడైక్కుమా?
మ - అంబలత్తిత్ ప్రసాదం విల్కున్ ఉండో?
హిం - క్యా మందిర్ మేం ప్రసాద్ బేచ్ తే హై?

37 తె - ఈదారి ఎచ్చటికిపోవును?
క - ఈదారి ఎల్లిగెహోగుత్తదే?
అ - ఇన్దప్పాదై ఎజ్గే పోగిరదు?
మ - ఈవిళి ఎవిడె పోగున్న దాణ?
హిం - యహ్ సడక్ కహాం జాతీ హై?

38 తె - ఇచ్చట దొంగభయము కలదా?
క - యిల్లి కళ్ళర భయ విదెయా?
అ - ఇంగే తిరుట్టుభయం ఉండా?
మ - యివిడె కళ్ళన్ భయముండో?
హిం - క్యాయహాఁ చోరోఁకాడర్ హై?

39 తె - ఇచ్చట క్రూరమృగముల భయముగలదా?
క - యిల్లి క్రూరమృగగళ భయవిదెయా?
అ - ఇంగే దుష్టమృగంగళ్ భయముండా?
మ - యివిడె క్రూరమృగంగళ్ భయముండో?
హిం - క్యాయహాఁ జంగలీజాన్వరోఁకాడర్ హైఁ?

40 తె - తీర్థవిధులు పెట్టు మంచి బ్రాహ్మణులుగలరా?
క - తీర్థవిధిగళన్ను మాడి సువాబస్తె బ్రాహ్మణరు యిద్దారా?
అ - తీర్థశడఙ్గుగళ్ శెయ్య నల్లపురోహితర్ ఇరుక్కిరారా?
మ - తీర్థవిధిగళ్ చెయ్యన్న నల్లబ్రాహ్మణార్గళ్ ఉండో?
హిం-జో బ్రాహ్మణ్ తీర్థవిదులోఁ కోరక్ఖ్ తే హై? వే కహాఁమిల్ తే హై?

41 తె - అన్న శ్రాద్ధమునకు ఎంత?
క - అన్నశ్రాద్ధక్కె ఎష్టు?
అ - అన్నశ్రాద్ధం శెయ్యవదర్కు ఎవ్వళవు ఆగుం?
మ - అన్న శ్రాద్ధత్తినె ఎత్ర?
హిం - అన్నశ్రాద్ధకో కిత్ నా హై?

42 తె - హిరణ్య శ్రాద్ధమునకు ఎంత
క - హిరణ్యశ్రాద్ధక్కె ఎష్టు?
అ - హిరణ్యశ్రాద్ధం శెయ్యవదర్కు ఎవ్వళవు?
మ - హిరణ్యశ్రాద్ధక్కినె ఎత్ర?
హిం - హిరణ్యశ్రాద్ధకో కిత్ నా హై?

43 తె - సంకల్పము చేయించువారెవరు?
క - సంకల్ప వన్ను మాడిసువవరు యారు?
అ - సంకల్పం శెయేదు వైక్కిరవర్ ఎంగేయిరుక్కిరార్?
మ - సంకల్పం పూళుది ఆర!
హిం - సంకల్ప కౌన్ కరాతే హై?



# యాత్రచేయునపుడు సామాను లుంచుకొను విధానము

యాత్రికు బయలుదేరుటకు ముందీపుస్తకములో సూచించినసామాను లన్నియు సేకరించి సాధారణముగా ఒకే పెద్దమూటగా కట్టుటయు లేక ఒకే పెట్టెలో గజిబిజిగా వేయుటయు మనము జూచువిషయమే. అట్లువేసిన సామానుమూటను మనము క్రిక్కిరిసియుండు రైలుపెట్టెలో నేమూలనో పెట్టుకొని మన మొకమూలకూర్చుండి ప్రయాణముచేతుము. ఒక్కొక్కప్పుడు 2, లేక 3 దినములుగూడ రైలుదిగకుండ కూర్చుండి ప్రయాణముచేయవలసియుండును. అట్టిసమయములలో ప్రతిక్షణము మనమూటలో నున్న ఒక్కొక్కవస్తువుతో పనికలుగుచుండును. మూటవిప్పుదమన్న జనులు క్రిక్కిరిసి యుండుటచే మూటనుండిగాని పెట్టెనుండిగాని తడవతడవకు సామానులుతీయుటకు వీలుండదు. అనగా చెంబుకావలెనన్న మూటవిప్పి మరల కట్టవలెను. కొంతదూరముపోయినతరువాత చిల్లర కావలసివచ్చును. మరల మూట విప్పవలయును. ఇంకకొంతదూరము పోయిన తరువాత తుండుగుడ్డ, పండ్లపొడి, అద్దము, దువ్వెన, మొదలగునవి అనేకవిధములైన వస్తువులు తడవ తడవకు అవసరము కలుగుచుండును. అవసరము కలిగినపుడెల్ల తీయుట మనకు విసుగుగానుండును. ప్రక్కనున్నవారు విసుగుకొనుచుందురు. సాధ్యపడినను హడావడిలో కొన్నివస్తువులు బయట పడిపోవచ్చును. లేదా దొంగలు మనపెట్టెలలోని వస్తువులను గుర్తించి కాపలావేసి వాని నప

హరింప జూతురు. ఇట్టియిబ్బందులు కలుగకుండుటకై మనమొత్తము సామానులను ముఖ్యముగ 3 భాగములు చేయవలసియుండును. (1) మనశరీరముపై ధరించుసామానులు (2) చిన్న చేతిసంచిలో లేక 3 దినముల ప్రయాణములో పుకావలసిన సామానులు. (3) బసచేసిన తావులలో ఉపయోగించుకొను సామానులు. పై సామానులు బహుజాగ్రత్తగ ఆలోచించి కడు తేలికగ నుండి, కొద్దిస్థలము నాక్రమించునవిగనుండి, యాత్రికుడు సామానంతయు తానే మోయునంత తేలికవై యుండవలెను. యాత్రిలో మనసామానులు మనమే మోసికొనుచు అభిమానమును చంపుకొనవలెను. ఒక్కొక్కప్పుడు బండ్లు, కూలీలు దొరకని సమయమునగాని, మనముభరింపలేని చార్జీలు బండ్లవారు చేయునప్పుడును మనసామాను మనము సులభముగా మోసికొని పోవునంత సులువుగ (తేలికగ) నుండవలెను. అట్లుచేయుట సాధ్యమా ? తప్పకసాధ్యము. అనుభవములేనివారు మాత్రమేసాధ్యము కాదని బండెడు సామానులు మోసికొని పోవుదురు.

## (1) శరీరముపై ధరించుసామానులు :—

కౌపీనము, దానిపై ప్రయాణపు మాపునకు ఆగుడోవతి, దానికి లోపలనడుమునకు డబ్బులసంచి (నోట్లుపెట్టినసంచి) దానిపై ముఖము తుడుచుకొనుటకు మొదలైనవానికి పనికివచ్చునట్లు ఒక కొల్లాయిగుడ్డ, జేబుగల బనియను, దానిపై లోపల జేబులు మూతగలిగి పిన్నీసులు పెట్టియుండు జేబులుగల చొక్కా, దానిపై Waist (వెస్టు) కోటులోపల జేబులలో రూ 10-0-0 చిల్లర (ఇదినిత్యకృత్యములో వాడుకొనుటకు పైజేబీలో ఒకకలము పెన్సిల్, నోటుపుస్తకము, ముఖముప్పు లేక పండ్లపొడి నాల్కబద్ద (Tongue cleaner) బొట్టుసామాను, చిన్న అద్దము, దువ్వెన, టిక్కెట్టు, ఇవిఅన్నియు జేబులలోనుంచి ఉదయము పనికాగానే చేతి సంచిలోవేసి యుంచుకొనవలెను. మన్నెంముల్లు, చాకు, దూది మఫ్లర్, గొడుగు, చెప్పులు (అవసరమైన) గ్రంథము, జపమాల మొదలగునవి చేతి సంచియందుంచవలయును. చేతిలోరైల్వేగైడు, 'యాత్రామార్గదర్శి' రెండును సిద్ధముగనుంచి ముందుప్లానులు వేసికొనుచుండవలెను.

(2) చిన్న చేతిసంచిలో 2 లేక 3 దినముల ప్రయాణములోపు కావలసిన సామానులు:- ఇదియు నెప్పుడును యాత్రికునిచేత నుండవలెను. ఇందు, చెంబు, కాన్వాస్‌బకెట్టు త్రాడు, గ్లాసు, ఉద్ధరిణె, పైన, 1వ దానిలోనిగైడు, బొట్టుసామాను పండ్లపొడి, మొదలైనవియిందు చేరుచుండును, బాటరీలైటు, అగ్గిపెట్టె, ఇత్తడిప్రమిద, వత్తులు, నూనెసీసా (గట్టిబిరడాగల చిన్నసీసా లేక డబ్బా దేవతార్చన లేక పటము, పండ్లు లేక ఫలాహారము, ఒక చిన్నగొంగళి లేక మైనముపట్టా (పండుకొనుటకు), కార్డ్లు, కవర్లు, పట్టుబట్ట, చిన్నతాళము, గొలుసు, (మన యితర సామానులను కలుపుచు రైలుబల్లకుగాని కూర్చుండుసీటుకోడుకుగాని తాళమువేసిన దొంగభయములేక రాత్రులంతుకూడ నిర్భయముగ నిద్రించవచ్చును,) Visiting cards ఉండును.

(3) బసచేసిన తావులలో నుపయోగించు సామానులు:- ఇది గట్టిగా బిగించి ఒక మూటగగాని పెట్టెయందుగాని యుంచవచ్చును. అనగా నిందు పైనుదహరించిన సామానులుగాక మిగిలినవన్నియు నిందుండును. ఇది బస చేసిన సత్రములయందు మాత్రమే విప్పనవసరము కలుగునట్లుండవలెను.

విమానములలో ప్రయాణముచేయువారు పైసామానులను మరింత తేలికచేసికొనవలెను. మొత్తమొక హోల్డాల్‌లో సరిపోవునట్లు చూచుకొనవలెను.

☞ తీసికొని వెళ్ళవలసిన సామానులజాబితా వేరొకచోట గాంచనగును.

## వస్తువులజాబితా

యాత్రచేయదలచినవారు తమతో చాలతేలికయైన సామానులనే తీసికొనివెళ్ళవలెను. జాగ్రత్తగ నాలోచించి నూతనమార్గముల తెలిసికొని ఒకేవస్తువయ్యు చాలపనుల కుపకరించుదానిని సేకరించవలెను. ఎవరిసామానులువారు మోయునంతవిగ నుండవలెను. పెద్ద స్టేషనులలో ప్లాటుఫార

